ట్టియూరిలో వేంచేసియున్న స్థితిని, ఈ పెరియాళ్వార్లకు ప్రకాశింపజేయగ సేవించిన వారై తిరుప్పల్లాండునందును వణ్ణమాడమునందును శెల్వనంబితో సమ్బంధమును గలిగించుకొనియు కృష్ణావతారమునకాధారస్థలమగుటచేతను దామోదరియానతిచ్చిన దేశమగుటచేతను తిరుక్కోట్టియూరిలో దివ్యహృదయము ప్రవేశించియచ్చట వేంచేసియుండు స్వామియొక్క కల్యాణ గుణముల ననుభవించి యాయనుభవముచే గలిగిన సంతోషాతిశయమువలన కరణత్రయముచేతను వానితో సంబంధములేక సంచరించు పాపాత్ములను నిందించియు, ఆత్మగుణములును నాచార్యప్రేమయుగలిగి యాయాచార్యులు సంతోషించువిషయమని (తిరితందాగిలుమ్) అనునట్లువానియందు ప్రావణ్యముగలిగి వానిననుభవించుచుండు మహాత్ములనుశ్లాఘించి యాతిరుమొళియందు నానతిచ్చుచున్నారు. తిరుమంగయాళ్వార్లు పెరియాళ్వార్లు వీరుభయులుమాత్రమే తిరుక్కోట్టియూరు విషయమై యొక్కొక్క తిరుమొళి సాయించిన వారైయున్నారు.

౧. నానకారియమ్శొల్లిలాదవర్ నాడొఱుమ్విరున్దోమ్బువార్,
తేవకారియమ్ శెయ్దు వేదంపయిన్ఱువాళ్ తిరుక్కోట్టియూర్,
మూవర్ కారియముమ్తిరుత్తుమ్ముదల్వనై చ్చిన్దియాద,ప్పా
ప్పావకారికళై ప్పడై త్తవనెజ్ఞనమ్పడై త్తాన్ కొలో.

టీక. నానకారియమ్-నాలుకతో చేయగూడనిపనిని (అనగాయసత్యములను,) శొల్లిలాదవర్ - ఒకప్పుడును వచింపని శ్రీవైష్ణవులు, (అచ్చటనిత్యవాసముచేయువారిని) విరుందు - నాడారగించ వచ్చిన శ్రీవైష్ణవులనువలె, నాడొఱుమ్ - ప్రతిదినమును, ఓంబువార్ - ఆదరించుకొనుచు, తేవకారియమ్ శెయ్దు - భగవదారాధనము చేసికొనుచు, వేదం - వేదవేద్యుడగుసర్వేశ్వరుని, పయిన్ఱు- సదాఅనుసంధించుకొనుచు, వాళ్- నిత్యవాసముచేయునట్టి, తిరుక్కోట్టియూర్ - శ్రీగోష్ఠీపురమునందు, మూవర్ - బ్రహ్మరుద్రుడు ఇంద్రుడు అనుమూవురికియొక్క, కారియముమ్ - మధుకైటభులయొద్దనుండి వేదములను దెచ్చియిప్పించుట, కపాలవిమోచనము చేయుట, మహాబలియొద్దనుండి స్వర్గాదిప్రభుత్వమును దీసిఇప్పించుటయనగు మూడుకార్యములను, తిరుత్తుమ్ - దిద్దుపాటుచేసిన, ముదల్వనై , జగత్కారణభూతుని, శిందియాద - అనుసంధింపని, అప్పావకారిగళై - అట్టిపాపాత్ములను, పడైత్తవన్ - సృష్టించినవాడు, ఎజ్ఞనమ్ - ఎందుకొఱకై, పడైత్తాన్ కొలో - సృష్టించినవాడాయెనో.

తా.— సత్యవంతులగు శ్రీవైష్ణవులు భగవత్ భాగవత సమారాధనం బొనర్చుచు నివసించునట్టి తిరుక్కోట్టియూరునందు బ్రహ్మరుద్రేంద్రాదుల యభీష్టములనెఱవేర్చుచు వేంచేసియున్న జగత్కారణభూతుని చింతింపనియట్టి పాపాత్ములను ఏలసృష్టించినో యనియానతిచ్చుచున్నారు.

౨. కుల్ నమిన్ఱిక్కుణం పెరుక్కి కుక్కు గుక్కళుక్కనుకూలరాయ్,
శెల్ నమొన్ఱుమిలాదవణ్ కైయినార్ కళ్ వాళ్ తిరుక్కోట్టియూర్
తుళ్ ళియేళులగుండ తూమణివణ్ణనై త్తొళాదవర్,
పెళ్ ళ తాయర్ వయిఱ్ ఱినై ప్పెరునోయ్ శెయ్ వాన్ పిఱన్దార్ కళే

టీక. కుల్ నమొన్ఱి - శాస్త్రమందువిధించినదానినిఁజేయకుండుట, విధింపనిదానిఁ జేయుచుండుట యనెడుదోషములులేక, కుణం- శమాదిగుణములను, పెరుక్కి- వృద్ధిపొందించి, కురుక్కళుక్కు- తమయాచార్యులకు, అనుకూలరాయ్ - ఇష్టులై, ఒన్ఱుమ్- కొంచెమైనను, శెల్ నమ్ - ఓర్వలేనితనము, ఇలాద - లేనివారగు, వణ్ కైయినార్ కళ్ -మిక్కియాదార్యముగలవారు, వాళ్ - నిత్యవాసముచేయునట్టి, తిరుక్కోట్టియూర్ - గోష్ఠీపురమునందు, ఏళులగుమ్ - సమస్తలోకములను, (నశింపకుండునట్లు) తుళ్ ళి చేర్చిపట్టి, ఉండ - ఆరగించిన, తూమణివణ్ణనై - పరిశుద్ధమగు నీలరత్నమువంటి దేహముగలవానిని, తొళాదవర్ - సేవించిస్తుతింపనివారు ( ఎందుకొఱకైపుట్టినారనగా) పెళ్ ళ తాయర్ - తమ్మునగనిన తల్లులయొక్క, వైఱ్ ఱినై - కడుపులను, పెరునోయ్ శెయ్ వాన్ - మిక్కిలినొప్పించుటకొఱకుగాను, పిఱన్దార్ కళ్ - పుట్టినవారేగాని వేరుగారు.

తా.—సకలవిధద్రోహరహితులై శమదమాదిగుణవర్ధకులై యాచార్యపరతంత్రులై అసూయారహితులును మిగులనుదారులునగు మహాత్ములువసించునట్టి శ్రీగోష్ఠీపురమందు సర్వేశ్వరునిసేవించి స్తుతింపనివారు మాతృగర్భము చెఱుపబుట్టిన వారని యానతిచ్చుచున్నారు.

౩. వణ్ణనన్మణియుమ్మరతకముమ్మళు త్తినిఱ్ఱు లెఱ్ఱుమ్,
తిణ్ణై శూళ్ తిరుక్కోట్టియూర్ తిరుమాలవన్ఱిరునామజ్గళ్,
ఎణ్ణక్కణ్డవిరల్ కళాలెళుత్తై ప్పళుదుమెణ్ణగిలాదుపోయ్,
ఉణ్ణక్కణ్డతమ్మూత్తైవాయ్ క్కుక్కవళమున్దుగిన్ఱార్ కళే.

టీక. నల్ - మంచి, వణ్ణమ్ - కాన్తికలిగిన, మణియుం - కెంపులును, మరకమమ్ - పచ్చలును, అళుత్తి - పనితరముగ చెక్కినందున, నిఱ్ఱెలెళుమ్ - కాంతిఫలించుచుండు, తిణ్ణై - అరుగులచే, శూళ్ - చుట్టబడిన, తిరుక్కోట్టియూర్ - తిరుక్కోట్టియూరిలోవేంచేసియున్న, తిరుమాలవన్ - శ్రియఃపతియొక్క, తిరునామంగళ్ - దివ్యనామములను, ఎణ్ణ - ఎంచుటకు, కణ్డ - సృష్టింపబడిన, విరల్ గళాల్ - వ్రేళ్ళ

ఇరైప్పొళుదుమ్ - ఒకక్షణకాలమును, ఎణ్ణగిలాదు - లెక్కింపక, పోయ్ - దేహసంరక్షణార్థమైపోయి, ఉణ్ణక్కణ్డ - భుజింపజూచిన, తం - తమయొక్క, ఊత్తై - అపరిశుద్ధమగు, వాయ్ క్కు - నోటియందు, కవళం - (కబళమును) అన్నపుముద్దలను, ఉన్దుకిన్ఱార్గళ్ - త్రోయుచున్నారు.

తా.—నవరత్నఖచితములగు యిండ్లుగల శ్రీగోష్ఠీపురమందలి స్వామియొక్కతిరునామములను క్షణకాలమైనను వాడొసంగినచేతి వ్రేళ్ళతో లెక్కింపక శరీరపోషణమునకైసంచరించియట్టివ్రేళ్ళతో ఉదరమునింపించుకొనుచున్నారు.

౪. ఉరకమెల్లణైయాన్ కైయిలుఱై శఙ్గమ్ పోల్ మడవన్నఙ్గళ్,
నిరైకణమ్ పరన్దేఱుమ్ శెఙ్గమలవయల్ తిరుక్కోట్టియూర్,
నరకనాశనై నావిఱ్కొణ్డు ఉరైయాద మానిడశాదియర్,
పరుగునీరుముడుక్కుమ్ కూఱైయుమ్ పావమ్ శెయ్ దన దాన్ కొలో.

టీక. ఉరకం - ఆదిశేషుని, మెల్ - మెత్తనైన, అణైయాన్ - శయ్యగాగలవానియొక్క, కైయిల్ - చేతియందు, ఉఱై - వసించెడు, శఙ్గంపోల్ - శ్రీపాంచజన్యమువలె తెల్లనై, మడవన్నఙ్గళ్ - సొగసుగలహంసలైనవి, నిరైకణం - గుంపులుగవచ్చి, పరన్దేఱుం - వ్యాపించియుండు, శెఙ్గమలం - ఎఱ్ఱదామరపుష్పములుగల, వయల్ - మళ్ళతోగూడిన, తిరుక్కోట్టియూర్ - తిరుక్కోట్టియూరిలో, (పూర్వజన్మానుగుణముగవచ్చునట్టి) నరకః - నరకమును, నాశనై - నశింపజేయువానిని, నావిఱ్కొణ్డు - జిహ్వయందు గ్రహించి, ఉరైయాద - ఉచ్చరింపనివారైన, మానిడశాదియర్ - లభింపనరుదైనమనుష్యజన్మమునబుట్టినవారలు, పరుగు - పానముశేసెడు, నీరుం - జలమును, ఉడుక్కుం - ధరించునట్టి, కూఱైయుం - వస్త్రమును, పావంశెయ్దనదాన్ కొలో - పాపముజేసినవియో !! యని.

తా —అనంతశయనుడగు స్వామియొక్క పాంచజన్యమువంటి తెల్లనిహంసగణములుగల మళ్ళచేచుట్టబడి యుండు శ్రీగోష్ఠీపురమునందలి నరకాంతకుడగు స్వామిని నాలుకతోననుసంధింపనిజనులు త్రాగునీరునుధరించు వస్త్రమును పాపంబొనర్చినదేమోయనిచింతించుచున్నారు.

౫. ఆమైయిన్ ముదుగత్తిడైక్కుదికొణ్డు తూమలర్ శాడిప్పోయ్,
తీమైశెయ్ దిళవాళైగళ్ విళైయాడునీర్ త్తిరుక్కోట్టియూర్,
నేమిశేర్ తడఙ్కైయినానై నినైప్పిలావలినెఞ్జుడై,
పూమిపారఙ్గళుణ్ణుమ్ శోఱ్ఱినై వాఙ్గిప్పుల్లైత్తిణిమినే.

టీక. ఇళ - వయస్సుచేచిన్నదగు, వాళైగళ్ - వాళైయనుగొప్పమత్స్యము, ఆమైయిళ్ - ముదుగత్తిడై - తాబేటివీపున, కుదికొణ్డు - పోయిదుమికియు, (సమీపము వికసించియుండు,) తూ - పరిశుద్ధమగు. మలర్ - తామరమొదలగు పుష్పములను శాడి - త్రోసికొని, పోయ్ - పోయి, తీమై శెయ్‌దు - నీచజంతువులను తరుము నట్టిదుష్కృత్యములజేసి, విళైయాడు - క్రీడించుచుండు, నీర్ - జలసమృద్ధిగల, తిరుక్కోట్టియూర్ - శ్రీగోష్ఠీపురమునందు, నేమి - సుదర్శనముతో, శేర్ - చేరియుండు తడం - విశాలమైన, కైయినానై - హస్తముగలవానిని, నినైప్పిలా - ఒకప్పుడును ధ్యానింపని, వలి - బలిష్ఠమైన, నెఞ్జుడై - మనస్సుగలవారై, పూమి - భూదేవిచేభరింగూడని, పాఱంగళ్ - భారమైయుండెడుపాపులగువారు, ఉణ్ణుం - భుజించెడు శోఱై - ప్రసాదమును, వాఙ్గి - పెరికి, పుల్లై - గడ్డినిగొని. తిణిమిన్ - తిజింపనిండు.

తా.— జలజంతువులతో నిండియుండు నీటిపుష్కలముగల శ్రీగోష్ఠీపురమునందు చక్రాయుధుని క్షణకాలమైనను జింతింపనికఠినహృదయముగల పాపాత్ములు భుజించెడు అన్నమును వారినోటనుండితీసి గడ్డిని తినిపింపుడు.

౬. పూదమైన్దొడువేళ్వియైన్దుపులన్గళైన్దుపొఱిగళాల్,
ఏదమొన్ఱుమిలాదవణ్గైయినార్గళ్ వాழ் తిరుక్కోట్టియూర్,
నాదనై నరశిఙ్గనై నవిన్ఱేత్తువార్గళుழక్కియ,
పాదదూళిపడుదలాల్ యివ్వులగంపాక్కియం శెయ్‌ద‌దే.

టీక. పూదమైన్దొడు - పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశమను పంచభూతమయమగు శరీరముచేతను, వేళ్వియైన్దు - స్వర్గాదులకుసాధనముగచేయుపఞ్చమహాయజ్ఞములచేతను, (పంచమహాయజ్ఞములు- వేదపాఠము, వైశ్వదేవాదిహోమము, అతిథిపూజ, పితృతర్పణము, భూతబలి - అనునివి,) పులన్గళైన్దు - శబ్ద, స్పర్శ, రూప, రసగన్ధములనుపఞ్చవిషయములచేతను, పొఱిగళాల్ - శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణములను పంచజ్ఞానేంద్రియములచేతను, ఏదమొన్ఱుమిలాద - దోషరహితులవారై, వణ్గైయినార్గళ్ - ఔదార్యవంతులుగానుండువారలు, వాழ் - నివాసము జేయు, తిరుక్కోట్టియూర్ - శ్రీగోష్ఠీపురమునకు, నాదనై - నాథుడును శుద్ధుడునగు నారాయణుడునైన, నరశిఙ్గనై - నృసింహస్వరూపముగా వేంచేసియుండువానిని, నవిన్ఱు - నోరారవచించి, ఏత్తువార్గళ్ - స్తోత్రము జేయువారలు, ఉழక్కియ - సంచరించుటచేగలిగిన, పాదదూళి - పాదరేణువు- పడుదలాల్ - పడుటచే, ఇ

లగం - సర్వేశ్వరుని చింతింపని కఠినచిత్తులు నివసించు యీలోకమైనది, పాక్కియంశె య్దదే - భాగ్యము జేసినది.

తా.—శరీరమందిచ్ఛ లేనివారును, కామ్యార్థముగ పంచమహాయజ్ఞములను జేయని వారును, శబ్దాదివిషయికములగు దోషములు లేనివారును భాగవత విషయమందీడుపడిన వారును నారాయణుని నామములయుచ్చరించుచు శ్రీగోష్ఠీపురమున నివసించువారిపాద ధూళిచే నీలోకము భాగ్యము జేసినది.

౭. కురున్దమొన్ఱొశిత్తానొడుశ్ఱెన్ఱుకూడియాడివిళ్హాచ్చెయ్దు,
తిరున్దునాన్మఱైయోర్ఇరాప్పగలేత్తివాళ్ తిరుక్కోట్టియూర్,
కరున్దడముగిల్వణ్ణనై క్కడైక్కొణ్డుకైతొழుంపత్తర్గళ్,
ఇరున్దవూరిలిరుక్కుమ్మానిడర్ఎత్తవజ్గళ్ శెయ్దార్కొలో.

టీ. తిరున్దు - (భగవత్ స్వరూపమునుయథావిధిగా) తెలియజేసెడు, నాన్మఱైయోర్ - ఋక్, యజుర్, సామ, అథర్వణము అను నాల్గువేదముల నర్థముతోనభ్యసించిన శ్రీవైష్ణవులు, ఒన్ఱు - అద్వితీయమగు, కురున్దం - వృక్షవిశేషమును, ఒశిత్తానొడుం - విఱిచిన కృష్ణునితో, శెన్ఱు - పోయి, కూడి - సమీపించి, ఆడి - వానిగుణముల లోప్రవేశించి, విళ్హాచ్చెయ్దు - సంతోషముగలవారై, ఇరాప్పగల్ - రేయుంబగళ్ళు, ఏత్తి-స్తోత్రముజేయుచు, వాళ్ - నివసించు, తిరుక్కోట్టియూర్ - శ్రీగోష్ఠీపురమునందు, కరు - నల్లగిల్లి, తడం - గొప్పదగు, ముగిల్ - మేఘమువలెనుండు, వణ్ణనై - తిరుమేనుగలవానిని, కడైక్కొణ్డు - తమదాస్యమునుముందిడుకొని, కైతొழుం - సేవించెడు, పత్తర్గళ్ - భక్తులు, ఇరున్ద - వర్తించు, ఊరిల్ - ఊరిలో, ఇరుక్కుం - వసించెడి, మానిడర్ - మనుష్యులు, ఎత్తవంగళ్ - ఎట్టితపంబులను, శెయ్దార్కొలో - చేసిరో.

తా.—భగవత్ప్రతిపాదక చతుర్వేదాధ్యయన పరులగు శ్రీవైష్ణవులు శ్రీకృష్ణానుభవముచే సంతోషించిన వారగుచు సదాసర్వేశ్వరుని స్తోత్రమొనర్చుచు నిత్యవాసముజేయునట్టిశ్రీగోష్ఠీపురమునందలి నీలమేఘనిభశ్యామునికి దాస్యంబొనర్చిసేవించెడు భాగవతులువసించునట్టి ప్రదేశమందు వర్తించెడువారు, ఎట్టితపంబొనర్చినవారోయని యానతిచ్చుచున్నారు.

౮. నళ్ళిర్ నళ్ళిల్లనయాశల్లనబినూనతుజగ్గనై నాడొఱుమ్,
తెళ్ళిన్దశెల్వనై చ్చేవగకొణ్డ శెజ్గణ్ మాల్ తిరుక్కోట్టియూర్,

కుళిర్న్దుత్తై గిన్డ్రకోవిన్దర్ కుణంపాడువార్ఘళ్ళనాట్టినుళ్,
విళైన్దతానియముమ్మిరాక్కదర్ మీదుకొళ్ళకిలార్ గళే.

టీక. వళిర్న్దశీలర్ - చక్కనిసద్గుణములుగలిగి, నయాశలర్ - ఎన్నడును తప్పనివారును, అబిమానం - సర్వేశ్వరునియనుభవించుటచేగలిగిన బలముచే, తుఙ్గై అధికులై, నాడోఱుం - ప్రతిదినము, తెళిన్ద - తేటగిల్లెడి, శెల్వనై - కైంకర్యసంప గలశెల్వనంబిని, శేవకర్ - దాసునిగా, కొణ్డ - కైకొనిన, మాల్ - పిరాట్టియ ప్రేమగలస్వామి వేంచేసియుండు, తిరుకోట్టియూర్ - శ్రీగోష్ఠీపురమున, కుళిర్న్ద మనస్సుచల్లబడి, ఉఱైకిన్ఱ-ఉండెడు, కోవిన్దర్-గోవిన్దునియొక్క, కుణం-కల్యాణ ములను, పాడువార్- గానముజేయువారలు, ఉళ్ళ-నివసించెడు, నాట్టినుళ్ - దేశమ విళైన్ద - పండిన, తానియముం - ధాన్యములనుగూడ, ఇరాక్కదర్ - రాక్షసు మీదుకొళ్ళకిలార్ గళ్ - అపహరింపరు.

తా.—సత్ స్వభావముగలిగినీతిసంపన్నులై భగవద్గుణానుభవబలముచే నధిక సారతమముగుకైంకర్యసంపదచే నొప్పుచున్న శెల్వనంబిని దాసునిగా నంగీకరించిన యఃపతినిత్యవాసం బొనర్చెడు శ్రీగోష్ఠీపురమందు సౌమ్యమనస్కులై నివసించుచు గో దునికల్యాణగుణముల గానమొనర్చువారు వసించు దేశమందలి ధాన్యములను రాక్షస పహరింపరు.

౯. కొమ్బినార్ పొళిల్ వాయ్ కుయిలినంకోవిన్దర్ కుణంపాడుశీర్,
శెమ్బొనార్ మదిళ్ శూళ్ శెళుఙ్గళనియుడై త్తిరుకోట్టియూర్,
నమ్బనై నరశిఙ్గనై నవిన్ఱేత్తువార్ గళై క్కణ్డక్కాల్,
ఎమ్బిరాన్ఱనశిన్నఙ్గళివరివర్ఎన్ఱాశై గళ్ తీర్వనే.

టీక. కొమ్బిన్ - కొమ్మలచే, ఆర్ - దట్టముగనుండు, పొళిల్ వాయ్- తో లలో, కుయిలినం-కోకిలగుంపు, కోవిన్దర్ - గోవిన్దుయొక్క, కుణం-గుణములను, పాడు పాడునట్టిదిగాను, శీర్ - గొప్పదైన, శెంపొన్ - మంచిబంగారుచేత, ఆర్ - కట్ట డిన, మదిళ్-ప్రాకారముచేత, శూళ్-చుట్టబడి, శెళుం-సారవంతమగు, కళని యుడై మళ్ళుగలిగిన, తిరుక్కోట్టియూర్ - శ్రీగోష్ఠీపురమునందు, నమ్బనై- ఆశ్రితులు "మన రక్షకుడు" అనినమ్మతగినట్టి, నరశిఙ్గనై - నరసింహావతారముజేసినవానిని, నవిన్ఱు - ప్ర మించి, ఏత్తువార్గళై-స్తోత్రముశేయువారిని, కణ్డక్కాల్ - చూచిన, ఇవరివర్ -వీరల ఎం - మాకు, పిరాన్ఱన - ఉపకారకుడగు సర్వేశ్వరునియొక్క, శిన్నఙ్గళ్ - గు తులుగలవారని, ఆశైగళ్ - ఆశలను, తీర్వనే-తీర్చుకొనుదును. (అనగావానిగురుతుల గలవారిని చూడగా వానిచూడవలయునను నాశను తీర్చుకొనుదుననుట ).

తా.—శ్రీగోవిందగుణానుభవంబుజేయుచుండు కోకిలగుంపు వసించునట్టి తోపులచేతను బంగారు ప్రాకారములచేతను బరివేష్టింపఁబడిమంచిమఱ్ఱిగల తిరుక్కోట్టియూరిలో, ఆశ్రితులకు విశ్వాసదాయకుఁడై నృసింహావతారం బొనర్చిన స్వామినిస్తుతించు వారిని సేవించినయెడ వీఁడుసర్వేశ్వరలక్షణంబులుగల వారని నాయభీష్టముల దీర్చుకొన్న వాఁడనగుదును.

౧౦. కాశిన్ వాయ్క్కరంవిఱ్కిలుంకరవాదుమాత్ర్ట్రిలిశోత్రిట్టు,
తేశవార్త్తైపడైక్కుంవణ్ కైయినార్కళ్ వాళ్ తిరుక్కోట్టియూర్,
కేశవాపురుడోత్తమాకిళర్శోదియాయ్కుఱళాఎన్ఱు,
పేశువారడియార్కళెన్దమ్మైవిఱ్కవుంపెఱువార్గళే.

టీక. కాశిన్ వాయ్ - ఒకబంగారునాణయమునకు, కరం - ఒకపిడికెడువడ్లు, విఱ్కిలుం - విక్రయించుకాలమందును, కరవాదు - తాముసంపాదించినసొత్తులనుదాచిపెట్టక,(తమ్ముఁ వెదకికొనివిందుకువచ్చినవార్లకు,) మాఱువిలి - ప్రత్యుపకారమునుగోరక, శోఱిట్టు - అన్నమునిడి, (అందుచేత) తేశవార్త్తై - ఖ్యాతిని, పడైక్కుం - పొందినవారై, వణ్ - ఉదారత్వముగల, కైయినార్గళ్ - ఈవినిగలవారలు, వాళ్ - వసించు, తిరుక్కోట్టియూర్ - శ్రీగోష్ఠీపురమున వేంచేసియుండువానిని, కేశవా - చక్కనివెండ్రుకలుగలవాఁడవా, పురుడోత్తమా - పురుషశ్రేష్ఠుఁడా, కిళర్ - మిక్కిలి, శోతియాయ్ - తేజస్సుగలవాఁడవా, కుఱళా - వామనావతారంబుజేసినవాఁడవా, ఎన్ఱు - అని, పేశువార్ - సంతసించువారలకు, అడియార్గళ్ - శేషభూతులగువారలు, ఎన్దమ్మై - మమ్ములను, విఱ్కవుంపెఱువార్గళ్ - అమ్ముట మొదలగు నిష్టవినియోగముజేసికొనుటకుఁదగిన వారగుదురు.

తా.—ఒకబంగరు కాసునకు పిడికెడువడ్లమ్మినను వెనుదీయక యభ్యాగతులకు మాఱుమేలు గోరకప్రసాదంబిడి ప్రసిద్ధిజెందిన సౌదార్యవంతులు లీవసించుతిరుక్కోట్టియూరిలో వేంచేసియుండు స్వామినిపలుదెఱగులకొనియాడునట్టి వారిదాసులు మమ్ముల క్రయవిక్రయాది యిష్టవినియోగంబుజేసికొనుట కర్హులనియాన తిచ్చుచున్నారు.

౧౧. శీతనీర్పుడైశూళ్ శెళుఙ్గళనియుడైత్తిరుక్కోట్టియూర్,
ఆదియానడియారైయుమడిమైయిన్ఱిత్తిరివారైయుమ్,
కోదిల్పట్టర్పిరాన్కుళిర్పుదువైమన్విట్టుచిత్తన్శొల్,
ఏదమిన్ఱియురైప్పవరిరుడీకేశనుక్కాళరే.

టీక. శీతం - చల్లని, నీర్ - నీటిచేత, పుడై - అన్ని దెసల, శూళ్ - చుట్టబడియుండు శెళుం - సారవంతమైన, కళని - మళ్ళను, ఉడై - కలిగిన, తిరుక్కోట్టియూర్ - శ్రీ క్షేత్రపురమునందు, ఆదియాన్ - కారణభూతుడగువానికి, అడియారైయుం - దాస్య శేయువారిని, అడిమైయిన్ది - వానిపాదములందు శేషవృత్తి జేయక, తిరివారైయుం విషయాంతరములందుదిరుగువారిని, కోదిల్ - దోషరహితులై, పట్టర్ - శ్రీవైష్ణవుల పిరాన్ - ఉపకారకుడై, కుళిర్ - సంసారతాపమును బోగొట్టు చల్లదనముగల, పు వై - శ్రీవిల్లిపుత్తూరుకు, మన్ - శిరస్సువంటివారగు, విట్టుచిత్తన్ - పెరియాళ్వార్ శొల్ - భక్తులనుస్తుతించి యితరులను నిందించి సాధించినయీపదిపాశురములను, మిన్ది - దోషరహితముగా, ఉరైప్పవర్ - అనుసంధించువారలు, ఇరుడీకేశనుక్కు ఇంద్రియనియామకుడగుహృషీకేశునికి, ఆళర్ - దాస్యముచేయునట్టి భాగ్యముబొందుదు

తా. — చల్లనితీర్థమును మంచిమళ్ళను గలతిరుక్కోట్టియూరిలో వేంచేసియు జగత్కారణభూతునికి దాస్యంబొనర్చువారిని, దాస్యంబొనర్పక విషయాసక్తులగువా పరిశుద్ధులును శ్రీవైష్ణవోపకారకులును సాంసారికతాపహరంబగు శైత్యముచేనొప్పు శ్రీవిల్లిపుత్తూర్ పెరియాళ్వార్లుస్తుతించియు నిందించియు నానతిచ్చిన యీపదిపాశుర లననుసన్ధించువారు, ఇంద్రియనియామకుడగు స్వామికి దాస్యంబొనర్చువారగుదురు.

అడివరవు - నావ, కుళన్దమ్, వణ్ణ, ఉరకమ్, ఆమై, పూదమ్, కురన్దమ్, న న్ద, కొమ్బిన్, కాళన్, శీతనీర్, ఆశై.

పెరియజీయర్ తిరువడిగళే శరణమ్.

శ్రీమతేరామానుజాయనమః.

## ముదలాయిరం ౫ పత్తు ౮ తిరుమొళి, శెన్నియోఙ్గు, తిరువేఙ్గడ ముడైయాన్ విషయము.

అవతారిక. ఈశ్వరుడు పరత్వవ్యూహవిభవాన్తర్యామ్యర్చావతారము వేంచేసియుండుట చేతనులను దిద్దుపాటుజేయుటకును, దిద్దుపాటైనవారిని నేలు టకేగదా. ఇదిపూర్ణముగ, తిరుమలలో నిన్నతిరుక్కోలముగ వేంచేసియున్న స్వామియ ప్రత్యక్షముగ నగుబడుచున్నది. కనుక, ఈజీవునికి ఈశ్వరుడు సౌహార్దము మొద నాత్మగుణములను జనింపజేసి యాచార్యసన్నిధిని జేర్చి విరోధియందరుచియును, ప్రా మందు రుచియునుబుట్టించి కార్యంబొనర్చును. ఆళ్వార్లకు ప్రథమమందే యివియన్ని ను గలుగునట్లుజేసి కార్యంబుజేయును. వీరలస్థితితర్వాత భగవదిచ్ఛచేత నేగదా. శరీరావసానమందువీనినన్నిటిని గలిగించి కార్యంబొనర్చును. అందువలను క్రమపద్ధ

ప్పియొకటియుగల్పింపడు. "ఊరవర్" ఇత్యాది నిత్యసూరులు పైబడి యనుభవించు ననుభవము నెడి యెరువును వేసి యాచార్యోపదేశజ్ఞానమను నీటినిగట్టిసజ్జముగు విత్తనమును జల్లికదాజనింపజేయునది. ఇట్లుదిద్దుపాటైన వీరినిగనివాడు సంతోషింప, వానిసంతోష మనుజూచివీరు సంతోషింపగ నీతకు మించిన పురుషార్థము వేటొకటిలేదని వీరుండగ "వీరికార్యమందు మనము మొదట ప్రవేశింపక పోతిమి, అనిపెరుమాళ్లు సంభ్రమించు నట్టిసంభ్రమమును ఆళ్వార్లుగని విరోధిసముదాయమంతయుపోయి లభింపవలసిన య పేక్షితములభించితిని ఇక దేవరవారేలత త్తఱపాటు జెందుచున్నారని వాని ఆయాసమును శమింపఁజేయుచున్నారు".

పా. ౧. శెన్ని యోజ్గుతణ్ణిరువేజ్గడముడైయా, ణ్గులగు -
దన్నైవాళ్లనిన్ఱనమ్బిదామోదరాశదిరా,
ఎన్నైయుమ్మెన్నుడైమైయుమ్మునశక్కరప్పాతీయొల్ శక్కొణ్డు,
నిన్నడళ్ళేపురిన్దిరున్దేనినియొన్తిరుక్కుఱిప్పే.

టీక. ఓజ్గు - ఆకాశమువరకుపెరిగియుండు, శెన్ని - శిరస్సులుగలిగి, తణ్ - చల్లదనముగల, తిరువేజ్గడం - తిరుమలను, ఉడైయాయ్ - వాసస్థానముగాగలవాడును, ఉలగుతన్నై - లోకులను, వాళ్లనిన్ఱ - ఉజ్జీవింపించు, నమ్బి-గుణపూర్తిగలవాడును, దామోదరా - యశోదచేగట్టబడినత్రాటిని కడుపునగలవాడును, శదిరా - ఆశ్రితులదోష ములను కన్నెత్తిచూడనట్టి చాతుర్యముగలవాడా, ఎన్నైయుం - నాయొక్క ఆత్మకును; ఎన్నుడైమైయైయుం - నాసొత్తగు దేహమునకును, ఉన - నీయొక్క, శక్కరప్పాతి యొల్ శక్కొణ్డు - శ్రీసుదర్శనలక్షణమునుధరించి, నిన్ - నీయొక్క, అరుళే - కృపనే, పురిన్దిరున్దేన్ - కోరియున్నాను, ఇని - ఇట్లైనపిమ్మట, తిరుక్కుఱిప్పు - హృదయాభి ప్రాయము, ఎన్ - ఏమి: (ఆనతీయవలయుననియనుచున్నారు.)

తా.—అత్యున్నతములగు శిఖరములును చల్లదనమునుగల తిరుమలయందు ఉభ యవిభూతుల నుజ్జీవింపజేయ వేంచేసియున్నవాడై కల్యాణగుణములుగలవాడును దా మోదరుడునునగు నాశ్రితదోషాంధుడగునో స్వామీ దాసునియాత్మాత్మీయములకు సుదర్శ నలక్షణములనిడి దేవరవారికృపనే యపేక్షించియున్నాను. గనుక మీమనోభావమును యానతీయవలయునని విన్నపించుచున్నారు.

అవ.— మొదటిపాశురమున "ఇనియొన్ తిరుకుఱిప్పే" అని నాకుశేయవలసిన దంతయు జేసియుండగ, ఇకతత్తఱపాటుజెందుట యెందుకన మీరన్నియు లభించితిరో మిమ్మనుసరించినకరము నికయున్నది, పైగ ప్రాప్తికాధారమగు పరభక్తిజనింపలేదే,

అర్చిరాది మొదలగు పైగనొనర్పవలయునంశములు చేసూడలేదేయను, తమకివియన్నియు
లిగినప్రకారమును, అనతిచ్చుచున్నారు.

౨. పఱవై యేఱుపరమ్పురుడా నీయెన్నై క్కైక్కొణ్డపిన్,
పిఱవియెన్నుఙ్కడలుమ్వత్తిప్పెరుమ్పదమాగిన్ఱదాల్,
ఇఱవుశెయ్యుమ్పావక్కాడుతీక్కొళీఇవేకిన్ఱదాల్,
అఱివై యెన్నుమముదవాఱుతలైప్పత్తివాయ్క్కొణ్డదే.

టీక. పఱవై - గరుత్మంతుని, ఏఱు - వాహనముగాకలిగిన, పరంపురుడా - పురుషశ్రేష్ఠుడా, నీ - సర్వరక్షకుడగునీవు, ఎన్నై - అనన్యగతిగలనన్ను, కైక్కొణ్డపిన్ - అంగీకరించినవెనుక, పిఱవియెన్నుం - మరుజన్మముగలసంసారమను, కడలుం - గొప్పసముద్రమును, వత్తి - శుష్కించి, పెరుంపదం- గొప్పపదవి, ఆగిన్ఱదు- పొ తిని, ఇఱవుశెయ్యుం- ఈయాత్మనునశింపజేయు, పావక్కాడు - పాపసమూహమ యడవి, తీక్కొళీఇ - అగ్నిపడి, వేగిన్ఱదు- కాలుచున్నది, అఱివెన్నుం - జ్ఞానమ అముదవాఱు - అమృతమనుయేఱు, వాయ్పత్తి-నోటివరకువచ్చి, తలైక్కొణ్డదే - తలనుమించిబోవుచున్నది.

తా.—గరుడవాహనారూఢుడగు పురుషోత్తముడా నీవు నన్నంగీకరించినవె సంసారసాగరమెండి గొప్పమహత్వము జెందినదగుటచే ఈయాత్మనాశకమగు పాప నము అగ్నితగిలి మండుచున్నది, జ్ఞానామృతమను నది, ఉన్నస్తకమైపోవుచున్నది.

అవతారిక.—మూడవపాశురము (ఎమ్మనా) క్రిందిపాట్టునందు "పిఱవియెన్ను కడలుంవత్తి" అనియు "ఇఱవుశెయ్యుం పావక్కాడుతీక్కొళ్ ఇవేకిన్ఱదాల్" అ యు మీయొక్క అపేక్షితము, లభించినట్లువచించితిరి ఒకనికి పురుషార్థమైనది - యొక్క విరోధిపోవుటమాత్రమేగాక తమతోసంబంధముగలవారికిని విరోధినివర్తి టయే; అట్లుమీరులభించితిరో? అనగ నాకుమాత్రమును నాసంబంధులకుమాత్రముగా వారువసించుదేశస్థులపాపమును పోయినదనుచున్నారు.

3. ఎమ్మనావెన్కులదెయ్వమేయెన్నుడై నాయగనే,
నిన్నుళేనాయ్ప్పెత్తనన్మైయివ్వులగినిల్లార్ పెఱువార్,
నమ్మన్పోల్వీక్తముక్కుమ్నాట్టిలుళ్ళపావమెల్లామ్,
శుమ్మెనాదేకైవిట్టోడిత్తూఱుగళ్ పాయ్న్దనవే.

టీక.—ఎమ్మనా - నాకురాజా, ఎన్ కులం - నాకులమునకు, దెయ్వమే - దేవతయయినవాడును, ఎన్నుడైనాయకనే - నాకునాథుడైనవాడా, నిన్ - నీయొ

అభిమానములో, ఉళ్లేనాయ్ - అన్తర్భూతుడై, పెట్ఱ- నేనుపొందిన, నన్మై- ప్రయోజనము, ఇవ్వులకినిల్ - ఈసంసారములో, ఆర్ పెఱువార్ - నిత్యులైననుబొందుదురా! పొందరు, నమ్మణ్ పోల - భూతప్రేతపిశాచములవలె, వీழ்త్తు-సంచరింపనివ్వక, అముక్కం - అణచునట్టి, నాట్టుళ్పావమెల్లాం-లోకమునసుండు (శాస్త్రమందువచించు) అన్నివిధపాపములు, శుమ్మెనాతు - ఊపిరివిడవక, కైవిట్టు - నిశ్శేషముగవిడిచి, ఓడి - పరుగెత్తి, తూఱుగళ్ - సంసారమను పొదరిండ్లలో, పాయ్న్దన- ప్రవేశించినది.

తా.— నాకురాజును కులదైవమును నాథుడునైనవాడవా నీయభిమానాన్తర్భూతుడనై నేనుబొందినప్రయోజనమును నిత్యసూరులైననులభింతురా. భూతప్రేతపిశాచములవలెంబడఁద్రోసి యణగఁద్రొక్కెడుపాపములన్నియు నూపిరివిడువక కొంచెమైనను లేక సంసారమనుపొదలలోఁబ్రవేశించినవి.

అవతారిక.— నాల్గవపాశురము - "ఇఱవుశెయ్యుంపావక్కాడుతీక్కొళివేక్కినదాల్" అని, తమపాపమును, "నాట్టుళ్పావమెల్లామ్" అని తమదేశనివాసుల పాపములును నశించినరీతియును, తమకు యమవశ్యత వదలినప్రకారమును ఆనతిచ్చిరి. ఈపాట్టునందు. దమయాజ్ఞప్రకారమునడచు స్థలమునందంతట యమునియాజ్ఞప్రవేశింపనియానతిచ్చుచున్నారు.

౪. కడల్కడైన్దముదఙ్గొణ్డుకలశత్తైనిఱైత్తాప్పోల్,
ఉడలురుగ్గివాయ్తిఱన్దుమడుత్తునై న్నిఱైత్తుక్కొణ్డేన్,
కొడుమైశెయ్యుజ్గూత్తముమ్మైక్కోలాడిక్కుఱుగప్పెఱా,
తడవరైత్తోళ్శక్కరపాణిశార్ఙ్గవిఱ్సేవగనే.

టీక.—తడం - పెద్ద, వరై - కొండవంటి, తోళ్ - భుజములుగలిగినవాడును, శక్కరం - సుదర్శనమును, పాణి - చేతధరించినవాడును, శార్ఙ్గం - శ్రీశార్ఙ్గమను, విల్ - ధనుస్సునుగల, శేవకనే - ఆశ్రితవిరోధినిరసనముజేయునట్టివాడవా, కడల్ - క్షీరాబ్ధిని, కడైన్దు - చిలికి, అముదం- అమృతమును, కొణ్డు- ఎత్తి, కలశత్తై - కలశములో, నిఱైత్తాప్పోల్ - నింపినట్లు, ఉడలురుగి - దేహముకరిగి, వాయ్తిఱందు - నోరు తెఱచి, మడుత్తు - రెండుచేతులనుగూర్చి, ఉన్నై -భోగ్యుడవునిన్ను, నిఱైత్తుక్కొండేన్ - వ్యాపింపజేసికొంటిని, (ఆయినవెనుక) కొడుమైశెయ్యుమ్ - కఠినముగాదండించుచున్న, కూత్తముమ్ - యముడును, యెన్ కోలాడి- నాయాజ్ఞాపరిపాలనముజరుగునంత దేశమువరకును, కుఱుగప్పెఱా - సమీపింపలేడు.

తా.—విశాలపర్వత సదృశంబులగు సుదర్శనపాంచజన్యములనుధరించిన శ్రీ
వంతుడగునో స్వామీ, సముద్రమథనంబొనర్చిఅమృతంబునుగొని కలశమందునింపించి
దేవరవారిని నాహృదయమందునింపించుకొంటిని కఠినుడగు యముడును మాప్రదేశంబు
సమీపింపజాలడు.

అవతారిక . అయిదవపాట్టు. (పొ౯) క్రింద, అమృతమును దృష్టాంతము
ఇందు స్వర్ణమును దృష్టాంతముగను జెప్పి నైచ్యానుసన్ధానము చేసి వీరువిశ్లేషింపజూ
ఈశ్వరుడు, మనమిరువురును ఏకతత్వమనునట్లు సంశ్లేషించినవెనుక, ఇదేమని సమా
పఱచగ కూడినవారై కృతజ్ఞతకుఁ డి స్తోత్రరూపముగ ఆత్మసమర్పణము జేయుచున్నా

౫. పొన్నైక్కొణ్డురైకల్ మీదేనిఅమెళ్ళవురైత్తాప్పోల్,
ఉన్నైక్కొణ్డెన్నావగమ్బాల్ మాశ్ త్తీర్త్తియురైత్తుక్కొణ్డేన్,
ఉన్నైక్కొణ్డెన్నుళ్ వైత్తేన్నైనుయుమ్మున్నిలిట్టేన్,
ఎన్నప్పావెన్నిరుడీకేశా వెన్నుయిర్ కావలనే.

టీక —ఎన్నప్పా - నాకుతండ్రియైనవాడై, ఎ౯యిరుడీకేశా - నాఇంద్రియ
లకు విషయభూతుడై, ఎ౯వుయిర్-నాకాత్మయై, కావలనే- అన్య శేషముగాకుండు
కాపాడువాడవా, పొన్నై - బంగారమును, నిఱమెళ్ల- కాంతినిజూచుటకు, ఉ
గల్ - ఒరజాతిలో, ఉరైత్తాప్పోల్ - ఒరసినట్లు, ఉన్నైక్కొణ్డు - నిన్నుగొ
ఎన్నావగంబాల్ - నానాలుకలో, మాశ్ త్తీర్ - వన్నె చెడునట్లు, ఉరైత్తు
క్కొణ్డేన్ - మాట్లాడుకొనుచుంటిని, ఉన్నైక్కొణ్డు - నీయొక్క యంగీకారమనుగ్రహి
ఎన్నుళ్ వైత్తేన్ - నాయనుభవమునకు విషయపఱచుకొంటిని, ఎన్నైయుమ్ - నా
త్మను, ఉన్నిల్ - నీపాదారవిందములలో, విట్టేన్ - సమర్పించితిననుచున్నారు.

తా.—నాకుతండ్రియు నాయింద్రియ నియామకుడును నాకాత్మయునై అన్య
షపడకుండునట్లు కాచిన యోస్వామీబంగారును వొరగల్లులోనొరసినట్లు నిన్ను నా
కయందువొరసికొంటిని ( నాచెడునాలికతోదూషించితిననుట ) నిన్ను నాయనుభ
నకు విషయపఱచుకొంటిని నాయాత్మను నీపాదారవిందములందు సమర్పించితిని.

అవతారిక.—ఆఱవపాట్టు (ఉన్నుడైయవిత్యాది) కడచినపాట్టునందు "ఉన్నై
క్కొణ్డెన్నుళ్ వైత్తేన్" అనియానతిచ్చిరి. ఈపాశురమందు తమయందుంచుకొన్న ప్ర
రమునానతిచ్చుచున్నారు.

౬. ఉన్నుడైయవిక్కిరమమొన్దొట్టియామ్ ఎల్లామ్,
ఎన్నుడైయనెఞ్జగమ్బాల్ శువర్ వళ్ళియెళుదిక్కొణ్డేన్,

మన్న డజ్ఞమ్ఝువలజ్గై కొణ్డవిరామనమ్బా,
ఎన్నిడై వన్దెమ్బెరుమానినియెఙ్గుప్పోగిన్ద దే.

టీక. ఉన్నడైయ - నీయొక్క, విక్కిరమమ్ అవతారచేష్టితములలో, ఒన్ఱు - ఒకటియు, ఒళియామల్ - తప్పక, ఎల్లాం - అంతయును, శువర్ వళి - గోడలోని చిత్రమువలె, ఎన్నుడైయ నెఞ్జగంపాల్ - నామనస్సునందు, ఎళుదికొణ్డేన్ - ప్రకాశించునట్లుచేసికొంటిని, మన్ - దుష్టక్షత్రియులు, అడంగ - ఉన్నస్థలములు తెలియక అణుగునట్లు, మళు - గొడ్డలిని, వలజ్గైకొణ్డ - కుడిహస్తమునందుధరించిన, ఇరామన్ - పరశురామావతారము జేసిన, నమ్బి - గుణపూర్ణుడై, ఎంబెరుమాన్ - నాకుపకారకుడైన వాడవా, ఎన్నిడై - శేషభూతుడగునాయొద్ద, వన్దు - ఏతెంచి, ఇని - ఇక, ఎంగుప్పోగిన్దదు - ఎక్కడికిబోచూచుచున్నావు

తా.—నీయతిమానుషచేష్టితములన్నియు నామనస్సునందు గోడయందు చిత్రమువలె నేర్పఱచుకొంటిని. పరశురామావతారంబొనర్చి దుష్టక్షత్రియశూన్యంబుజేసినగుణపరిపూర్ణుండగు నుపకారకుడైనవాడవా దాసునివద్దకేతెంచి ఇకయెచటికి వేంచేయజూచుచున్నావు.

అవతారిక.—ఏడవపాట్టు (పరుప్పదత్తుక్కయల్ పొఱిత్త) క్రిందిపాశురమునందు "ఎన్ నావకంపాల్ మాత్ ఇన్ఱియుమైత్తుకొణ్డేన్" అనునది వానిసహేతుకకృపచేతనే యనువిషయమును, ఈపాట్టునందానతిచ్చుచున్నారు.

౭. పరుప్పద త్తుక్కయల్ పొఱి త్తప్పాణ్డియర్ కులపతిపోల్,
తిరుప్పొలిన్ద శేవడియెన్ శెన్నియిన్మేల్ పొఱిత్తాయ్,
మరుప్పొశిత్తాయ్ మల్లడర్త్తాయెన్ఱెన్ఱున్ వాశగమే,
ఉరుప్పొలిన్దనావినేన్నై యునక్కుఱిత్తాక్కినై యే.

టీక. పరుప్పదత్తు-మహామేరువునందు, కయల్ - తనమకరధ్వజమును, పొఱిత్త-నాటిన, పాండియర్ కులపదిపోల్ - పాండ్యవంశపురాజువలె, తిరు - సొగసు, పొలిన్ద, మించియుండెడు, శేవడి - రమణీయమైనతిరువడిగళను, ఎన్ శెన్నియిన్ మేల్ - నాశిరస్సుమీదుగ, పొఱిత్తాయెన్ఱు - అలంకరించినవాడవాయనియు, మరుప్పు - కువలయాపీడముయొక్క దంతమును, ఒశిత్తాయెన్ఱు - విరిచినవాడవాయనియు, మల్ - చాణూరముష్టికులగుమల్లులను, అడర్త్తాయెన్ఱు - నిరసించినవాడవాయనియు, ఉన్ వాశగం - నీగుణములకు వాచకమగుతిరునామములను చెప్పుటచేత, ఉరుప్పొలిన్ద - కాయగాచిన

నావినేనై - నాలుకగలనన్ను, ఉనక్కు - దేవరవారికి, ఉరిత్తాక్కినైయే - అర్హునిగా నట్లుచేసితివేయని యీడుపడుచున్నారు.

తా.—మహామేరువునందు పెక్కము వేసిన పాండ్యరాజువలె అత్యంత సుందరమగు తిరువడిగళను నాశిరస్సుననలంకరించిన వాడవా కువలయాపీడము యొక్క దంతము లనువిరిచి చాణూరముష్టికులు,అను మల్లులనిరసించిన వాడవా నీకల్యాణగుణ వాచకము లగు తిరునామముల యనుసన్ధానముచేకాయగాచిన నాలుకగల నన్ను నీకర్హమగు నట్లు జేసికొంటివిగదాయని యీడుపడుచున్నారు.

అవతారిక.—ఎనిమిదవపాట్టు, (అనన్దళ్ పాలుం) అద్వేషముపక్రమించి పరభక్తిపర్యంతముగ మధ్యనుండు ఆత్మగుణములను జనింపజేసి అనంతరము పరజ్ఞానము గలిగించి విరోధినిబోగొట్టి మానససంశ్లేషముమాత్రముగాక బాహ్యసంశ్లేషమగునట్లు జేసినాడనిక్రిందిపాశురమున జెప్పిరి. వానినేసత్తుగాగొనిభగవదనుభవమే యాత్రగానున్న వారలుగదాయనియు వారియతిశయమును వీరు అనాదికాలముగ నిత్యసంసారియై యితరవిషయములతోగలసివర్తించినవారుగదాయనియు వీరితక్కువయును వీరిహృదయమునందు బహిరుండునట్లు వాడనుభవింప జేసిన ప్రకారమును, ఈపాట్టునందానతిచ్చుచున్నారు.

ఉ. అనన్దన్బాలుఙ్గరుడన్బాలుమైదునొయ్ దాగవై, త్తేన్
మనన్దనుళ్వన్దువైగ్గివాழ்చ్చెయ్ దాయెమ్బిరాన్,
నినైన్దెన్నుళ్ళేనిన్రునెక్కుక్కణ్గళ్ అశుమ్బొழுగ,
నినైన్దిరున్దేశిరమన్దీర్ న్దేన్నేమినెడియవనే.

టీక. నేమి - సుదర్శనమునుచేతియందుధరించిన, నెడియవనే - సర్వాధికుడైనవాడై, ఎమ్బిరాన్ - దాసునికుపకారకుడైనవాడా, అనన్దన్బాలుం - ఆదిశేషునియందును, గరుడన్బాలుం - పెరియతిరువడియందును, ఐదునొయ్ తాకవైత్తు - స్నేహము అతిస్వల్పముగానునిచి, ఎన్ మనన్దన్నుళ్ - నామనస్సునందు, వన్దు - ఒకకారణములేకవచ్చి, వైకి - పొందియుండి, వాழ்చ్చెయ్ తాయ్ - నన్ను ఉజ్జీవింపజేసినావే ఇటువంటినిన్ను, ఎన్నుళ్ - నామనస్సున, నినైన్దునిన్రు - తలచియుండి, నెక్కు మనస్సుకరగి, కణ్గళ్ - కండ్లయందు, అశుమ్బొழுక - ఆనన్దబాష్పములుపారునట్లు నినైన్దిరున్దు - నీవుజేసినవుపకారపరంపరలను అనుసన్ధించుకొనియుండి, శిరమం - నా యొక్క శ్రమయంతయు, తీర్ న్దేన్ - తీరునటుల బొందితిని.

తా.—చక్రాయుధుడును పరాత్పరుడును దాసునికుపకారకుడునైన యో స్వామీ, అనన్తగరుత్మన్తులందు ప్రేమసుదక్కువపఱిచి దాసునిహృదయమునందు నిలిచి దాసుని

యుజ్జీవింపజేసితివి. ఇట్టినిన్నుదలచి నామనస్సుకరిగి నేత్రములనానంద బాష్పములు స్రవింప నీవొనర్చిన యుపకారపరంపరలను అనుసన్ధించి నాశ్రమయంతయు దొలగినది.

అవతారిక.—తొమ్మిదవపాట్టు- (పనిక్కడలిత్యాది). ఈక్రిందిపాశురమున "అవర్గళ్ పాలుంకరుడర్గళ్ పాలుమ్" అని - తన్ననుభవించువారలు ఒకవిభూతిగా (పరమపదము)నుండియు వారలనువిడిచి నన్ను అపేక్షించి నారని; ఈపాట్టున నివాసస్థానములు అనేకములుండియు వానిని యుపేక్షించి తన్ను వాసస్థానముగ గైకొనినప్రకారమును తెలియజేయుచున్నారు.

౯. పనిక్కడలిల్ పళ్ళికోళ్ళైప్పళగవిట్టోడివన్దెన్,
మనక్కడలిల్ వాళవల్లమాయమణాళనమ్బి,
తనిక్కడ లేతనిచ్చుడరేతనియులగ్గేయెన్రెన్రు,
ఉనక్కిడమాయిరుక్కవెన్నైయునక్కురిత్తాక్కినైయే.

టీక.—పని - చల్లదనమేస్వభావముగాగల, కడలిల్ - క్షీరాబ్ధియందు, పళ్ళికోళ్ళై - శయనించుటను, పళగవిట్టు - మరచి, ఓడివన్దు - అతిత్వరగాపరుగిడివచ్చి, ఎన్ మనక్కడలిల్ - నామనస్సనుసముద్రమునందు, వాళవల్ల - నిత్యవాసముచేయువాడై, మాయన్ - ఆశ్చర్యశక్తికలవాడై, మణాళన్ - పెరియపిరాట్టికివల్లభుడైనవాడును, నమ్బి - గుణపూర్తిగలవాడా, తనిక్కడల్ - అద్వితీయమగుక్షీరాబ్ధి, తనిచ్చుడర్ - అద్వితీయమగుసూర్యమండలము, తనియులగు - అద్వితీయమగుపరమపదము, ఎన్రెన్రు - అనిచెప్పబడుప్రదేశములు; ఉనక్కిడమాయిరుక్క - నీకుస్థానముగానుండ, ఎన్నై - నాస్వరూపమును నీస్వరూపమును తెలియనివాడగునన్ను, ఉనక్కు - అవాప్తసమస్తకాముడగునీకు, ఉరిత్తాక్కినైయే - ఒకస్థలములేనివానివలె నామనస్సును నీకు వాసస్థానముగా జేసికొంటివే!

తా.—క్షీరాబ్ధిశయనంబు విడిచిపరుగిడివచ్చి నాహృదయమను సముద్రమందు నిత్యవాసంబొనర్చువాడును, ఆశ్చర్యశక్తియుక్తుడును లక్ష్మీవల్లభుడును కల్యాణగుణపరిపూర్ణుడగునోస్వామీ క్షీరసాగరము సూర్యమండలము పరమపదము మొదలగు సాటిలేని వాసస్థానములుండగ స్వరూపజ్ఞానములేనినన్ను సర్వవిధపరిపూర్ణుడగునీకు వాసస్థలముగ జేసికొంటివేయనియాడుచున్నారు.

అవతారిక.—పదవపాశురము— (తడవరైయిత్యాది)-ఈక్రిందిపాశురమున తనకు సంతోషకరములగుస్థానములతో సమానముగ తమతిరుమేను నపేక్షించినాడనిరి; ఈపాశురమున వానినివిడిచి తమ్ము నేయపేక్షించిన సంగతి తెలియజేయుచున్నారు.

౧౦. తడవరై వాయ్ మిళిర్ న్దమిన్ను మ్ తవళ నెడుఙ్గొడిపోల్,
శుడరొళియాయ్ నెఞ్జినుళ్ళే తోన్ఱుమెన్ శోదినమ్బీ,
వడతడముమ్ వైగున్దముమ్ మదిట్టువరావదియుమ్,
ఇడవగైగళిగళ్ న్దిట్టెన్పాలిడవగై కొణ్డనైయే.

టీక. తడం - విశాలమగు, వరైవాయ్ - మలయపర్వతమున, మిళిర్ న్దు - కా
తితోగూడి, మిన్నుం - ప్రకాశించు, తవళం - తెల్లని, నెడు - పెద్ద, కొడిపోల్
పెక్కెమువలె(అందటికి తెలియునట్లు) శుడరొళియాయ్ - జ్యోతిప్రకాశమై,
నెఞ్జినుళ్ళే - నాహృదయకమలమందు, తోన్ఱుం - సేవసాయించు, శోతినమ్బీ -
స్సుచేపూర్ణుడైనవాడవా, వడతడమం - ఉత్తరదిక్కునసుండు క్షీరాబ్ధియు, వైకున్దమ
శ్రీవైకుంఠమును, మదిళ్ - ప్రాకారముచే జుట్టబడిన, తువరావతియుం - శ్రీద్వా
యునగు, ఇడవగైగళ్ - ఇట్టిస్థలములనంతయు, ఇకళ్ న్దిట్టు - వదలి, ఇడవగై - ఇట్టి
లందుజేయు నాదరణములనన్నిటిని, ఎన్పాల్ - నాప్రక్క, కొణ్డనైయే - చేసికటాక్షించి

తా.—విశాలమగుమలయపర్వతమున బ్రకాశించు ధ్వజమువలె తేజోరూపమై
హృదయకమలమందు సేవసాదించు నిండు తేజస్సైనవాడవా క్షీరాబ్ధి శ్రీవైకుంఠము ద్వా
మొదలగుస్థలములందలి ప్రేమయంతయునాయందు జేసితివేయని వ్యామగ్ధులగుచున్నా

అవతారిక.—పదునొకండవపాశురము సమాప్తియందు,(వేయర్ తఙ్గళ్)ఈ
మొళినభ్యసించిన వారికి ఫలము,తమవలె ఆనన్యార్హ శేషభూతులగునట్లు లభించు
యానతిచ్చుచున్నారు.

౧౧. వేయర్ తఙ్గళ్ కులత్తుదిత్త విట్టుశిత్తన్ మనత్తే,
కోయిల్ కొణ్డ కోవలనై క్కొడుజ్గుళిర్ ముగిల్వణ్ణనై,
ఆయరేఱ్ఱై యమరర్ కోవై యన్దణర్ దమముదత్తినై,
చ్చాయైపోలప్పాడవల్లార్ తామమణుక్కర్ గళే.

టీక. వేయర్ తంగళ్ - బ్రాహ్మణులయొక్క, కులత్తు - కులమున, ఉదిత్త
తిరువవతరించిన, విట్టుశిత్తన్ - పెరియాళ్వార్లయొక్క, మనత్తే - మనస్సును, కోయి
కొణ్డ - ఆలయముగగ్రైకొనిన, కోవలనై - గోపాలుడై, కొడుజ్గుళిర్ - చక్కనై, కుళి
చల్లగానుండునట్టి, ముగిల్ - మేఘమువంటి, వణ్ణనై - కాన్తిగలవాడును, ఆయ
గొల్లలతో కలిసిమెలగుటచే, ఏఱ్ఱై - వృషభమువలె బలిష్ఠుడైయుండు, అమ
కోవై - నిత్యసూరులకధిపతియై, అన్దణర్ తం - సనకాదులకు, అముతత్తినై - మిక్కి

భోగ్యుడగువాని, పాడవల్లార్ తాం - ప్రీతిపూర్వకముగ గానము చేయుఁగువారలు, శాయై పోల - నీఁవలె, ఆణుక్కర్ గళ్ - అ న్తరంగ కైఙ్కర్యము శేయగలుగుదురు.

తా.—బ్రాహ్మణకులోద్భవులగు పెరియాழ்వార్లహృదయమును వాసస్థలంబుగ గైకొని గోపాలుడును శైత్యమేఘవదుడును గోపజనానువర్తనముచే వృషభమువలె బలాతిశయసంపన్నుడై నిత్యసూరులకధిపతియై సనకాదులకు నిరతిశయభోగ్య భూతుడగు వానిని ప్రేమపరవశులై గానమొనర్చువారు సర్వేశ్వరుని క న్తరంగులగుదురని.

అడివరవు - శెన్ని, పరవై, ఎమ్మనా, కడల్, పోక్క, ఉక్క, పరుప్పతం, అనన్దకాపని, తడవరై, వేయర్.

పెరియాழ்వార్ తిరువడిగళే శరణమ్.

పెరియవాచ్చాన్పిళ్లై తిరువడిగళే శరణమ్

జీయర్ తిరువడిగళే శరణమ్.

పెరియాழ்వార్ తిరుమొழிసంపూర్ణము.

---

శ్రీమతేరామానుజాయనమః.

## శ్రీతొండరడిప్పొడియాழ்వార్ వైభవము.

కోదణ్డే జ్యేష్ఠనక్షత్రే మండంగుడిపురోద్భవమ్,
చోళోర్వ్యాంవనమాలాంశం భక్తపద్రేణుమాశ్రయే॥

ఈ యాழ்వార్లు తిరుమండంగుడియనుగ్రామమందు, కలియుగాది ౨౮౧౪- అగు ప్రభవసం ॥ మార్గశీ, జ్యేష్ఠానక్షత్రమందు శ్రీవైజయంతీవనమాలికాంశా సంభూతులై శ్రీవైష్ణవ, శోత్రియరులకు (ముందుజుట్టువారికి) పుత్రులై తిరువవతరించిరి.

శ్రియఃపతియొక్క విశేషకటాక్షముచే జ్ఞానభక్తివైరాగ్యములుగల వీరికి, వీరి తండ్రిగారు విప్రనారాయణులను తిరునామమిడి కాలముతప్పక చౌలోపనయనాదులఁ జేయించి, వేద వేదాంగాది సకలశాస్త్రముల నభ్యసింపఁజేసిరి. వీరును సమస్తశాస్త్రసంపన్నులై, తలిదండ్రులును తదితరులగునందఱును సంతోషింపదగిన సద్గుణములుగలవారై, ఉభయకావేరీమధ్యప్రదేశమందు, ఆదిశేషశయనుడగు శ్రీరంగనాథుని సేవింప నపేక్షగలిగి శ్రీరంగక్షేత్రమునకు వేంచేసి కన్నులారగని సేవింప పెరియపెరుమాళ్లును తమపరమకృపచే, కుழలழగర్, వాయழகర్, ఇత్యాది, తమ రూపసౌందర్యాదుల జూపివీరిని తమవిషయమందు

మిగులభక్తియుక్తులగునట్లు విశేష కటాక్షంబొనర్చినవారైరి. విప్రనారాయణులను రంగనాథులకు దాస్యంబొనర్పవలయునని తులసికైంకర్యమందు ప్రేమించి శ్రీపుండరీక శ్రీగజేంద్రులు, పెరియాళ్వార్లు, మొదలగు వీరివలె ప్రతిదినమును తిరుమాలైమొదలగునవి గట్టి శ్రీరంగనాథులకు సమర్పించుచు శ్రీనందనవనము చేసికొనియుండిరి.

ఇట్లుండునట్టివీరు "అవశ్యమనుభోక్తవ్యమైన, కర్మశేషముచే దేవదేవి యను వేశ్యయొక్కవలలోదగిలి" వర్ణాశ్రమధర్మములను భగవత్కైంకర్యమును బోగొట్టి కొంతకాలము విషయాంతరప్రవణులైయుండిరి. తర్వాత కర్మశేషము నశింపగానే విషయాంతరమందలి రుచిని యతినీచమనిత్యజించి సర్వపాపప్రాయశ్చిత్తార్థముగ భగవద్భాగవత శ్రీపాదతీర్థమును స్వీకరించి పరిశుద్ధులై భక్తాంఘ్రిరేణు (తొండరడిప్పొడి) అనుదానినే నిరూపకమగు తిరునామముగలవారై, పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తియుక్తులై ఉన్మత్తకమై పెరియపెరుమాళ్ళే సర్వవిధబంధువని తిరుమంత్రానుసంధానముచే ధ్యానించి యా మంత్రవైభవమును చర్చచేసి యానందించి తిరుమంత్రార్థనిష్ఠులై తమకు పెరుమాళ్ళను అనుగ్రహించిన తదీయశేషత్వమనుప్రార్థించి ఇట్టియర్థవిశేషంబులను సకలచేతనులు తెలిసికొని యుజ్జీవించునట్లు, పెరియపెరుమాళ్లు శ్రోతగను తాము వక్తయునై, తిరుమాలై తిరుప్పళ్లియెళుచ్చి. అను దివ్యప్రబంధములను ఆనతిచ్చి కరుణచే లోకమును సుఖింపజేసినవారైరి.

తొండరడిప్పొడియాళ్వార్ తిరువడిగళేశరణమ్.

శ్రీమతేరామానుజాయనమః.

## తిరుప్పళ్లియెళుచ్చి ప్రబంధమునకు

## తిరుమాలైయాణ్డార్ సాదించిన తనియన్.

తమేవమత్వాపరవాసుదేవం రఙ్గేశయంరాజవదర్హణీయమ్।
ప్రాబోధకీంయోకృతసూక్తిమాలాం భక్తాఙ్ఘ్రిరేణుంభగవన్తమీడే॥

టీక. రాజవదర్హణీయం-మహారాజువలె పూజ్యుడై శ్రీరంగమను రాజధానిలో నివసించియుండు (అనగా రాజాధిరాజగు చక్రవర్తి త్తిరుమగనారను నామాంతరముగల శ్రీవైష్ణవులచే నారాధ్యుడైయుండుటచేత), రంగేశయం - అట్టిశ్రీరంగనాథుని, తంపరవాసుదేవంఏవ - శ్రుతులచేప్రసిద్ధుడగు ఆపరమపదవాసునిగానే, మత్వా - ఏకభావముగ తలచి,ప్రాబోధకీం - శయనించినవారిని లేపునట్టి తిరుప్పళ్లియెళుచ్చియను ప్రబంధమను సూక్తిమాలాం - వాఙ్మాలిక (తిరుమాలైప్రబంధమును దీనియందంతర్భూతము), యః

ధరిచేత, అక్రుత - చేయబడినదో, భగవన్తం - తదీయశేషత్వాది జ్ఞానసంపదగల, భక్తా ఙ్ఘ్రిరేణుం - భక్తులపాదధూళియను తిరునామముగల తొండరడిప్పొడియాళ్వార్లను, వన్దే - మనోవాక్కాయముల చేతను నమస్కరించుచున్నాను

తా.—శ్రీరంగనాథులయందు కేవలమర్చాప్రతిపత్తిజేయక సాక్షాత్ పరమపద నాథుడేయని భావించి మేలుకొలుపుటయను తిరుప్పళ్లియెழுచ్చి ప్రబంధమును అనతిచ్చిన తొండరడిప్పొడియాళ్వారులను త్రికరణశుద్ధిగ స్తోత్రముచేయుచున్నాను

మణ్డఙ్గుడియెన్బర్ మామఱైయోర్ మన్నియశీర్,
త్తొణ్డరడిప్పొడితొన్నగరమ్, వణ్డు
తిణర్త్తవయల్ తెన్నరఙ్గత్తమ్మానై, ప్పళ్ళి
యుణర్త్తుమ్బిరానుదిత్తవూర్.

టీక. వణ్డు - తుమ్మెదలచేత, తిణర్త - దట్టమై, వయల్ - మళ్లచే చుట్టబడి యుండు, తెన్నరఙ్గత్తమ్మానై - దక్షిణదిక్కుననుండు శ్రీరంగమునకు నిర్వాహకుడైన వా ని, పళ్లి - శయ్యనుండి, ఉణర్త్తుం - మేల్కొలిపిన, పిరాన్ - పరమోపకారకులైన, తొండరడిప్పొడి - పూజ్యులగు తొండరడిప్పొడియాళ్వార్లు, ఉదిత్తవూర్ - అవతరిం చిన దివ్యదేశము, తొన్నగరం - ప్రాచీన నగరమగు, మణ్డఙ్గుడి - మణ్డంగుడియని, మామ ఱైయోర్ - బ్రాహ్మణశ్రేష్ఠులు, ఎన్బర్ - అనివచింతురు.

తా.—శ్రీరంగనాథుని తిరుపళ్లియెழுచ్చి ప్రబన్ధముచే మేలుకొలిపిన శ్రీతొండర డిప్పొడియాళ్వార్ల యవతారస్థలమును మండంగుడియని బ్రాహ్మణోత్తములు వచింతురు.

అవ. ౧-పాట్టు. సూర్యుడు తనస్వరూపసిద్ధికొఱకు దీపమైవచ్చి యుదయించిన వాడు. వెలుపలిచీకటిని పోగొట్టుటకు సూర్యుడుదయింపగా, లోచీకటియగు నజ్ఞాన మును పోగొట్టుటకు మాసూర్యుడగు మీరు మేల్కొనగూడదా! ఆదిత్యు డుదయగిరియం దు పొందియున్నాడు, చీకటితొలగుచున్నది,పూజార్హములగు పుష్పములు వికసించుచు న్నవి,పూజనీయులగు మిమ్ములపూజించువారందఱు తాము తమకించిత్కారములతోవచ్చి యున్నారు.వీని నన్నిటిని గైకొనుటకు దేవరవారు ప్రబుద్ధులై విశేష కటాక్షంబొసర్పవ లె మా ప్రయునని యానతిచ్చుచున్నారు.

౧. కదిరవన్ గుణదిశైచ్చిగరమ్వన్దణైన్దాన్
కనైయిరుళగన్దదుకాలైయమ్బొழுదాయ్,
మదువిరిన్దొழுగినమామలరెల్లామ్
వానవరరశర్ గళ్ వన్దువన్దీణ్డి,

ఎదిర్ దిశై నిఱైన్దనరివరొడుమ్పుగున్ద
విరుజ్గళిఱ్ఱిట్టముమ్పిడి యొదుమురశుమ్,
అదిర్ తలిలలై కడల్ పోన్ఱుళదెజ్గుమ్
అరజ్గత్తమ్మాపళ్ళియెళున్దరుళాయే.

టీక. కదిరవన్ - సూర్యుడైనవాడు, కుణదిశై - తూర్పుదిక్కున, శిఖర ఉదయగిరియందు, వన్దణైన్దాన్ - వచ్చిచేరియున్నాడు, కనవిరుళ్ - రాత్రియం యిలచినచీకటి, అగన్ఱదు - నిశ్శేషముగాపోయినవి, తిరువారాధనము చేయ సుప్ర పగూడిన, అం - చక్కనగు, కాలైప్పొళుదుఆయ్ - ఉదయకాలమురాగ, మ గొప్ప, మలరెల్లాం - పుష్పములన్నియు, విరిన్దు - వికసించి, మదుఒళుగిన - తే హించుచున్నది, వానవర్ - దేవతలును, అరశర్కళ్ - రాజులును, వన్దువన్దు - కొకరు "నేనుముందు నేనుముందు" అనివచ్చి, ఈణ్డి - సమూహముగా, ఎదిర్ మీరు కటాక్షించు దక్షిణదిక్కున, నిఱైన్దనర్ - నిండినిలచియున్నారు, ఇవరొడు గున్ద - వీరలతో వీరి వాహనములగు, ఇరుం - గొప్ప, కళిఱ్ - మొగయేనుగుల, మం - గుంపును, పిడియొడు - ఆడఏనుగులగుంపును, మురశుం - భేరివాద్యమ అదిర్తలిల్ - శబ్దించునపుడు, ఎజ్గుం - అన్నిదిక్కులందును, అలై - అల కడల్ పోన్ఱుళదు - సముద్రఘోషమువలె యుండెను,అందుచేత, అరజ్గత్తమ్మా - శ్రీ మునకు నిర్వాహకుడగునీవు!, పళ్ళియెళున్దరుళాయే - పడకవిడిచిలేచి కటాక్షిం యుననుచున్నారు.

తా.—శ్రీరంగనాథా! తూర్పున సూర్యుడుదయించెను, దట్టమగు చీకటి తయుపోయినది.భగవదారాధనకు ననుకూలమగు మంచి యుదయవేళలో పువ్వులు తేనె స్రవించుచున్నది దేవతలును రాజులును గుంపులుగ తమతమ వాహనముల ములయొక్కయు వాద్యములయొక్కయు ధ్వనులు అంతటను సముద్రఘోషమ ఘోషింపగ సేవార్థులైవచ్చి యెదురుగ నిండియున్నారు,కాబట్టి దేవరవారు మేలు వీరలకు సేవ కృపచేసి కైంకర్యమ్ము నంగీకరింపవలయుననిభావము.

అవ. ౭-పాట్టు. మొల్లలపరిమళముతో తూర్పుగాలివీచుచున్నది.తామరపు నిద్రించు హంసలజంటలు బ...ములు దేరినవి. శ్రీగజేంద్రాళ్వానుయొక్క ...టకు వచ్చితివి; వీడుటయు...దెలియక యతిత్వరగా వచ్చి రక్షించిన దేవర యొట్లు?ఇంద్రియములు,అన...మొసళ్ళనోటబడియుండు సంసారులరక్షించు ...ంచుమా యనుచున్నారు.

౨. కొళుజ్గొడిముల్లైయిన్ కొళుమలరణవి
కూర్న్దదుకుణదిశై మారుదమిదువో,
ఎళున్దన మలరణైప్పళ్ళికొళ్ళన్నమ్
ఈన్పనినన్నైన్దదమిరుఞ్జిఱగుదఱి,
విళుజ్గియముదలైయిన్ పిలమ్బురై పేళ్ వాయ్
వెళ్ళెయిఱువదన్ విడత్తినుక్కనుజ్గి,
అళుజ్గియవానైయినరున్దుయర్ కెడుత్త
అరజ్గత్తమ్మాపళ్ళియెళున్దరుళాయే.

టీక. కుణదిశైమారుతం - ఉదయమునవచ్చు తూర్పుగాలియయినది, కొళుం - చక్కగాపెరిగిన, కొడి - తీగెలుగల, ముల్లైయిన్ - మొల్లలయొక్క, కొళుమలర్ - పుష్పించినమంచివాసనను, అణవి - గ్రహించి, కూర్న్దదు - వీచుచున్నది, మలరణై - తామరపుష్పములు అనుపడకయందు, పళ్ళికొళ్ - నిద్రించు, అన్నం - హంసజంటలైనవి, ఈన్ - వర్షమువలెగుతియు, పనినన్నైన్ద - మంచుచే తడిసిన, తం - తమయొక్క, ఇరుం - చక్కని, శిఱగు - రెక్కలను, ఉదఱి - విదిలించుకొని, ఎళున్దన - నిద్రలేచినవి, విళుజ్గియ - మేలుకొనిన, ముదలైయిన్ - మొసలియొక్క, పిలంబురై - బిలద్వారమునకుతగిన, పేళ్ వాయ్ - పెద్దనోటనుండు, వెళ్లెయిఱు - తెల్లనికోరపండ్లచేనొక్కిన, అదన్ - ఆమొసలియొక్క, విడత్తినుక్కు - పంటివిషమునకు, అనుజ్గి అళు... - మిక్కిలిబాధజెందిన, ఆనైయిన్ - శ్రీగజేన్ద్రాళ్వానుయొక్క, అరున్తుయర్ - ...ను, కెడుత్త - పోగొట్టిన, అరజ్గత్తమ్మాపళ్ళియెళున్దరుళాయే - శ్రీరంగధా...లుకొనుమా.

తా.—శ్రీరంగధామా! మొల్లలదివ్యపరిమళముతో, ఉదయపు తూర్పుగాలివీచుచున్నది. తామరపుష్పములందు నిద్రించుహంసమిథునములు, ఱుక్కలలోని మంచును విదిలించుకొనుచునిద్రలేచినవి. మొసలియొక్కబిలమువంటి నోటదగిలి శ్రమపడుచున్న గజేంద్రాళ్వానుయొక్క మహద్దుఃఖమును బోగొట్టిన స్వామీ! మేల్కొనుమ యనుచున్నారు.

అవతారిక.—మూడవపాశురము (శుడరొళి) సూర్యునికిరణములు సర్వత్రవ్యాపించినవి నక్షత్రా...టాతియగు చంద్రుడును ప్రకాశహీనుడాయెను తోపులనుండి పుష్పవాసనలతో, ఉద...న్నతపగాలివీచుచున్నది. సు...ర్శనమును ధరించుటచేనైన హస్త...ర్యముతో కరుణచేసి...ను వృంచవలయుననుచున్నారు. మొదటిపాట్టునందు తూర్పున:

యగిరిలోవచ్చి సన్నిహితుడాయెనుఅనిరి. ఈపాశురమందు తన తేజస్సును అంతటవ్యా
పశ జేయుచువచ్చియుదయించి నాడనుచున్నారు.

3. శుడరొళిపరన్దనశూழ்త్తిశై యెల్లామ్
తున్నియతారకై మిన్నొళిశురుఙ్గి,
ప్పడరొళిపశుత్తనన్పనిమదియివనో
పాయిరుళగన్దదుపై మ్పొழிల్కముగిన్,
మడలిడైక్కీఱివణ్పాళై గళ్ నాఱి
వైకఱైకూర్న్దదుమారుదమిదువో,
అడలొళితిగழ்దరుతిగిరియన్దడక్కై
అరఙ్గత్తమ్మా! పళ్ళియెழுన్దరుళాయే.

టీక. శూழ్త్తిశైయెల్లాం-చుట్టుకొన్న దిక్కులంతయు, శుడరొళి-సూర్యుని కి
ములైనవి, పరన్దన - వ్యాపించినవి, తున్నియ - ఆకాశమునదట్టముగనుండు, తారకై
నక్షత్రములయొక్క, మిన్నొళి - మిక్కుటమగు తేజస్సైనది, శురుఙ్గి - తగ్గినదియాగ
పడరొళి - మిక్కిలిప్రకాశముగల, పనిమది చల్లనిచంద్రుడును, పశుత్తనన్ - ప్రకా
నుడాయెను, పా-వ్యాపించియుండు, ఇరుళ్-అంధకారమైనది, అకన్దదు- విడిచిపోయి
వైకఱైమారుతం - ఉదయపుగాలి, పై- పచ్చగానుండు, పొழிల్ - తోటలలోను
కముగిన్ - పోకచెట్లయొక్క, మడలిడైక్కీఱి - మట్టలువీడివికసించుటచే, వణ్
చక్కని, పాళైకళ్ - పాళెలు, నాఱ - పరిమళింప, (దానివాసననుగొని,)
న్దదు - వీచెను, అడల్ - బలిష్ఠమగు, ఒళితిగழ்తరు - తేజస్సుప్రకాశించెడు,
శ్రీసుదర్శనాழ్వానుకలవాడై, అం- అందమైన, తడం - చక్రత్తాழ்వానును
నంత, కై - చేతుల్లుగల, అరంగత్తమ్మా! పళ్ళియెழுందరుళాయే - శ్రీరంగధాము
మేలుకొనుమా.

తా.—శ్రీరంగధామా! సూర్యప్రకాశము అంతటను వ్యాపించినది.నక్షత్ర
శముసంకుచితమై చంద్రునివెలుగును తగ్గినది చీకటిపోయినది. తోపులలోపోకచెట్ల
మొగ్గలు వికసింపగా, ఆవాసనతోగూడి యుదయపుగాలివీచుచున్నది. అ
శంబగు సుదర్శనంబును ధరించుటకు దగిన విశాలహస్తముగలస్వామీ! యొక్క
ననుచున్నారు. రక్షించిన దేవర
సంసారులరక్షించు

సూక్తము అవతారిక.—నాల్గవపాశురము ( మేట్టిళమేదిగళ్ )
ప్పటకై విడుమనపుడును జేర్చునప్పడును, గొల్లలూదు,

శెయ్ - దాసవృత్తిచేయు, కోయిల్ - శ్రీరంగమునసుండు, ఎమ్బెరుమాన్ - నన్నే లినవాడగుస్వామీ! పళ్ళియెళుందరుళాయే - పడకవిడిచిలేచి కటాక్షింపవలయు.

తా.—సర్వస్వామియును శ్రీవిభీషణాళ్వార్ యొక్క కైంకర్యమునంగీకరించుచు శ్రీరంగస్థలమందునివసించు అస్మత్స్వామీ! పూదోటలలోనిపక్షులు మేల్కాంచిశబ్దించుచున్నవి, రాత్రిగడచినది, ఆరాధనసమయమైనది, సముద్రఘోషమంతట వ్యాపించినది తుమ్మెదలు ఝుంకారంబొనర్చుచున్నవి. పలుదెఱఁగులగు పుష్పమాలికలను మీపాదారవిన్దములలో సమర్పించుటకొఱకు దేవతలువచ్చి నిలిచియున్నారు కనుక కరుణించి మేల్కాంచవలయుననుచున్నారు.

అవ.—౬ - పాట్టు.—( ఇరవియర్ ) దేవసేనాపతియగు సుబ్రహ్మణ్యునితోడ జగన్నిర్వాహకులగు సకలదేవతలును సపరికరులై తమ యభీష్టసిద్ధికిగాను ఆశ్రయింప వచ్చియున్నారు. దేవరవారునిద్ర మేల్కొనిదయయుంచి విశేషకటాక్షము చేయవలయు ననుచున్నారు.

౬. ఇరవియర్ మణినెడున్దేరొడుమివరో
ఇఱైయవర్ పదినొరువిడైయరుమివరో,
మరువియమయిలిననఱుముగనివనో
మరుదరుమ్వశుక్కళుమ్వన్దువన్దీణ్ణి
పురవియోడాడలుమ్పాడలుమ్తేరుమ్
కుమరతణ్ణమ్ పుగున్దీణ్ణియ వెళ్ళమ్,
అరువరైయనైయనిన్కోయిల్ మున్నివరో
అరఙ్గత్తమ్మాపళ్ళియెళున్దరుళాయే.

టీక, మణి - విలక్షణమై, నెడు - గొప్పదగు, తేరొడు - రథములు కలిగిన, ఇరవియర్ - ద్వాదశాదిత్యులును, ఇఱైయవర్ - నిర్వాహకులగు, పదినొరువిడైయరుం - ఏ...కాదశరుద్రులును, మరువియ - ఎప్పుడును ...డిచి దిగని, ...లిననఱ - నెమలివాహను ...ల్లిగల, అఱుముగన్ - ఆరుముఖములుగల ...బ్రహ్మణ్యుడును, మరుదరుం - న... పుర ...మ్మిది వాయుగణములును, వశుక్కళుం - ...ష్టవసువులును, వన్దువన్దు - ఒం... యా...ళ్, ...నను ముందనివచ్చి, ఈణ్ణి - దట్టముగ, (వీరల ...హనములైన,) పురవియోడు - ...ము) ...డట, తేరుం - రథములును, పాడలుం - పాట... ...లను, ఆడలుం - ఆటలునై... ...ర్థ ... పుగున్దు - సుబ్రహ్మణ్యునితోకూడవచ్చి, ...ణ్ణియవెళ్లం - దట్టముగాను... ...న ...చేరాహమయినది, అరువరై - గొప్పమేరు ప... ...తమునకు. అ... - ...చున్నారు.

దు, కోయిల్ - కోవెలయందు, నిన్ఱన - మీయెదుట మీప్రథమ కటాక్షము ... వచ్చినిలిచియున్నది, కాబట్టి, అరంగత్తమ్మా - శ్రీరంగమునకు నిర్వాహకః శ్రైనవా... ఇవర్ - వీరలను కటాక్షించుటకు, పళ్ళియెழున్దరుళాయే - శయ్యనుండి లేచి కరుణింపు...

తా.—శ్రీరంగధామా! మహద్ధికులగు ద్వాదశాదిత్యులును ఏకాదశరుద్రులు... మయూరవాహనుడగు సుబ్రహ్మణ్యుడును మరుద్గణములును, అష్టవసువులును, వారి... రధములు గుఱ్ఱములు మొదలగు వాహనములతోను గాన నాట్యములతోను సుబ్రహ్మ... సమేతముగావచ్చిన సేనాసమూహము మహామేరు పర్వత సంకాశంబగు కోవెలయం... దేవరవారి కటాక్షమును నిరీక్షించుచు నిలుచుచున్నది. వీరల ననుగ్రహించుటకై ... చేసి మేల్కొనవలయుననుచున్నారు.

అవ — ౭ - పాట్టు, —(అన్దరమిత్యాది)మునుపటి పాశురమున దేవసేనాప... వాహన పరివారములతో వచ్చినట్లానతిచ్చి, ఈ పాశురమున దేవాధిపతియగు ఇంద్రు... తనవాహనపరివారములతో వచ్చినట్లు విన్నపించుచున్నారు.(మీయాజ్ఞను గైకొనియ... టకనుట).

౭. అన్దరత్తమరర్ గళ్ కూట్టఙ్గళివైయో
అసున్దవమునివరుమరుదరుమివరో,
ఇన్దిరనానైయున్ తానుమ్ వన్దివనో
ఎమ్బెరుమానునకోయిలిన్ వాశల్,
శున్దరర్ నెరుక్క విచ్చాదరర్ నూక్క
ఇయక్కరుమ్ మయఙ్గినర్ తిరువడితొழువాన్,
అన్దరమ్ పారిడమిల్లైమత్తిదువో
అరఙ్గత్తమ్మాపళ్ళియెழున్దరుళాయే

టీక. ఎంబెరుమాన్ - మాకు స్వామియైన, ఉన కోయిల్లిన వాశల్ - మీ... పువాకిట, ఇన్దిరన్ ... ానుం - దేవతలకధిపతియగు ఇంద్రుడును, ఆనైయుం -... శమును‌ఃమగు ఐరావతమును, వన్దు - వచ్చియుండుటగాక, అన్దరత్తమరర్గళ్ - అ... మొగ్గలు దేవతులును, కూట్టఙ్గళ్ - వీరల పరివారమును, అసుం - ఒకరిచేతను ... శంబగు స్స, తవం - తపస్సుగల, మునివరుం - సనకాది మహర్షులును, మరుదరు... ననుచున్నాణములును, శున్దరర్ - గంధర్వులును, నెరుక్క - క్రిక్కిరిసియుండగ, ... సహాత్తిపి అవిద్యాధరులును, నూక్క - క్రోయగా, ఇయక్కర్ - యక్షులు, తిరువడి... ప్రటకై విడుఒకపుఉతిరువడిక్కన్న తొ‌ఃచుటకు, మయఙ్గినర్ - మోహించియున్న...

మాలెను, కూడైయుం - బుట్టను, తోళ్ - భుజమునందవలి తీసుకుచు వచ్చిన - యెత్తు వచ్చిన, తొణ్డరడిప్పొడియెన్నుం - తొండరడిప్పొడియను నామముగల - దాసుని, అళియనెన్రు - స్నేహితుడని, అరుళి - కృపచేసి, ఉన్నడియార్క్కు - దేవరవారి దాసభూతులకు, ఆళ్ పడుత్తాయ్ - సేవపడచుటకు, పళ్ళియెళున్దరుళాయే - శయ్యనుండి లేచికృపచే కటాక్షించుమా.

తా.—ఉభయ కావేరీమధ్య ప్రదేశమున శయనించియుండు శ్రీరంగనాథా! తామరలు వికసించినవి. సూర్యుడుదయించెను. సన్నని నడుములుగల యబలలు స్నానము లొనర్చి తీరంబారోహించిరి. దేవరవారు ధరింపదగిన తిరుత్తుళాయిపుష్పములుండు బుట్టను భుజమున ధరించుకొని సన్నిధికివచ్చియుండు తొణ్డరడిప్పొడియను దాసుని యందు స్నేహముభావతో కృపయుంచి దేవరవారి దాసవర్గమునకు దాసునిగాజేయుటకు శయ్య నుండిలేచి కటాక్షింప వలయుననుచున్నారు.

అడివరవు - కదిర్, తాళ్రు, సుదర్, మేట్టు, ప్పాలమ్బి, ఇరవి, అన్దరం, విళ్, ఏదమ్, కడి,

తొండరడిప్పొడియాళ్వార్ తిరువడిగళే శరణమ్.

పెరియవాచ్చాంబిళ్ళై తిరువడిగళే శరణమ్.

తిరుప్పళ్ళి యెళుచ్చి సంపూర్ణము.

శ్రీమతేరామానుజాయనమః.

# తి రు పా్ప వై.

## శ్రీ ఆండాళ్ ప్రభావము.

టీక. పెరియాళ్వార్లు శ్రీవిల్లిపుత్తూరిలో నందవనంబును జక్కబఱచి తిరుత్తుళాయి పువాకిటుల్లలు మొదలగు పుష్పవృక్షములనిడి వానినెత్తిమాలికలగట్టి శ్రీవటపత్రశాయి యచ్చటి పెరుమాళ్లకు సమర్పించుచువచ్చిరి. ఈప్రకారము ఎప్పటివలె మొగ్గలతుళాయి బుష్పముల నెత్తు నవసరంబున నందవనంబున నొకతిరుత్తుళాయిచెట్టు క్రింద శంబగుమయంబయి యతిసుందరంబగు నొక బాలకన్యకను జూచి మిక్కిలి యానందించుచు తమతిరుమాళిగకు దీసుకవచ్చి నామకరణాదు లొనర్చిరి. కలియుగవర్షము నళ్ళ సంవత్సరమందు కర్కాటకమాసము శుక్లపక్ష చతుర్దశి మంగళవారము పూర్వఫల్గునీ నక్షత్రముతో కూడియున్న భూ(మి) అంశమున ఆండాళనియు గోదాదేవియనియు తిరునామములు

న్యకను పెరియాళ్వార్లు పుత్రికావాత్సల్యముచేత మిక్కిలిగారాబము నర్చి యనుగ్ర
నకచక్రవర్తివలె పోషించుచుండిరి. పెరియాళ్వార్లు ప్రతిదినము ర్చి తమ సౌంద
ర్చి బుట్టలోనునిచి తామునిత్యానుష్ఠానముల నెఱవేర్చుకొని పుష్పములన సౌజన్యలగు
ముకిసమర్పించి తీర్థ శ్రీశఠకోప ప్రసాదములను స్వీకరించుచు వచ్చుచుండిరి. న తానును వా
వాడు పుష్పమాలికలగట్టి బుట్టయందుంచి పెరియాళ్వార్లు అనుష్ఠానాదు భూర్తుడైయున్న
గవారిపుత్రికయగు ఆండాళ్ ఆమాలికలనెత్తి తానుధరించి అద్దములో మాళిగలలోనుం
స్థలోఅనిచెప్పెదరు ) చూచుకొని శ్రీరంగనాథునికి నేను దగుదునో య వర్షార్థముగ నో
రాలెలనుతీసియథాప్రకారముగ నుంచుచుండెను. ఈప్రకారముగనొక
మాలికలనలంకరించుకొని అద్దములోచూచుచుండు సమయమున పెరియాళ్వారలయునని యపే
జూచి యిట్లుచేయదగునాయని మిక్కిలికోపించి నాటిదినమున పెరుమాళ్ళకును సమ్మతించిన
మర్పించుటను మానుకొనిరి. నాటిరాత్రివీరి స్వప్నమున పెరుమాళ్లు వేంచేసి కోవ గోపిక
స్వారే నేడు పుష్పములను యేలనాకుసమర్పించనైతివి " అనియడుగ విష్ణు మనమంద
నాటిదినమున జరిగిన వృత్తాంతమును విన్నపించిరి. మాకొమార్తె యట్లు ) యా సడు
టచేతనే ఆపుష్పములకు వాసన యతిశయించి నాకు మిక్కిలిప్రీతిగానుఋ తమతమ
ండాళ్ చాత్తుకొని కళంజినపుష్పములనే నాకుసమర్పించుమన పెరియాళ్వార్ స్వప్నట్లు
యుచుతనమనంబున ఈమె భూదేవియో నీళాదేవియో, లేక శ్రీమహాలక్ష్మిదేవియో
యనితలచి ఆశ్చర్యపడుచుండిరి.

దేహాత్మాభిమానులకును ఆత్మస్వరూపజ్ఞానముగల ఋషులకును పర్వతమునకును
రమాణువునకును గలిగినంత తారతమ్యముగలదు. ఋషులకును ఆళ్వార్లకును అంత హె
చ్చుతక్కువగలదు. ఆళ్వార్లకును పెరియాళ్వార్లకును అంత తారతమ్యముగలదు. పెరి
యాళ్వార్లకును తత్పుత్రికయగు ఆండాళమ్మగారికిని అంత తారతమ్యముగలదు. ఎట్లనగా,
" అనాదిమాయయాసుప్తః " అన్నట్లు సంసారమందు నిద్రించుచున్నవారిని, స్వామి
యగుసర్వేశ్వరుడు లేపితన్ను చూపగ ఆళ్వార్లు సేవించినవారైరి. ఈ యాణ్డాళ్ తామే
పోయి సర్వేశ్వరుని లేపి తమకోదవను విన్నపించుకొన్నవారగుటచేత, వారికన్నను విల
క్షణురాలు. "బాల్యాత్ప్రభృతిసుస్నిగ్ధః" అన్నట్లు పసితనమునుండి భగవద్గుణాను
భవమునందు ప్రవేశముగలవారైరి. పురుషుడు పురుషుని స్నేహించుటకన్నను స్త్రీ పుర
షుని స్నేహించుట అతిసులభముగదా. ఈశ్వరునియందు పరమభక్తిగల, ఆండాళ్,
యిచ్చిన, తిరుప్పావై ప్రబంధమునకు అభిప్రాయ మేమనగ, " (మార్గళీనీరాట్టము)
సస్నానవ్రతవ్యాజముతో, ఈశ్వరసన్నిధికిబోయి నీకు శేషంబగు ఈ యాత్మయనర్థ
మగునట్లు స్వరూపానురూపమగు కైంకర్యమును కృపచేసి యది యీ యాత్మ రక్షణ
మునకు శాశ్వతముగ జరుగునట్లు కటాక్షింపవలయునని అపేక్షించుచున్నారు.

టీక.— అన్ఱు - తనలోకమును బలిచక్రవర్తియపహరింప దేవతలు శ్రమపడుచున్ననాడు. ఇవ్వులకమ్ - ఈలోకమును, అళందాయ్ - రెండడుగులతో కొలుచుకొన్నవానియొక్క, అడి - శ్రీపాదములకు, పోత్ర్రి - మంగళమగుగాక, అంగు - సీతాదేవిని యెడబాపజేసిన నీచుడగు రావణుడున్నస్థలమున, శెన్ఱు - పోయి, తెన్నిలంగై - ప్రాగ్రసైనకోటగల లంకానగరమందుండు (దుష్టరాక్షసులను) శెత్ఱాయ్ - నిరసించిన దేవరవారియొక్క. తిఱల్ . భుజబలమునకు, పోత్ర్రి - మంగళముగలుగవలయు, శకటం - శకటాసురుని, పొన్ఱ - కట్లువీడి రూపునశించునట్లు, ఉదైత్తాయ్ - తన్ని సంహరించినవానియొక్క, పుకళ్ - పొగడ్తకు, పోత్ర్రి - మంగళముగలుగవలయు. కన్ఱు - దూడరూపమైవచ్చిన రాక్షసుని, కుణిలా - బంతికట్టినకఱ్ఱగాగొని, (వెలగపండు రూపముగనున్న రాక్షసునిమీదుగ) ఎఱిందాయ్ - పాదమును వెనుకనుంచుకొని విసిరివేసిన, కళ్ల్ - అట్టిశ్రీపాదమునకు, పోత్ర్రి - మంగళముగలువవలయు. (ఇంద్రుడు కలివలననైన కోపముతో తాళ్ళవానకురిపింపగా గొల్లలకును పశువులకును కొంచెమైన బాధకలుగకుండునట్లు) కున్ఱు - గోవర్ధన పర్వతమును, కుడైయా - గొడుగుగా,ఎడుత్తాయ్ - ఎత్తిరక్షించిన, కుణమ్ - మంచిగుణమునకు, పోత్ర్రి - మంగళము కలుగవలయును, పకై - శత్రువులను, వెన్ఱుకెడుక్కుమ్ - వేఱుతోనశింపజేయునట్టి, నిన్ - దేవరవారియొక్క, కైయిల్ - చేతనుండు, వేల్-బల్లెమునకు, పోత్ర్రి - మంగళము కలుగవలయును, ఎన్ఱెన్ఱు - ఈయాప్రకారములుగ, ఉన్ శేవగమే - దేవరవారి వీర చరిత్రమునే, ఏత్తి - స్తోత్రము చేసి, పఱైకొళ్వాన్ - నిన్ను అనుభవించుటకొఱకు, ఇన్ఱ్ యామ్ - బాధువులచే బహుకాలను శ్రమపడుచున్న మేము, ఇన్ఱు - బంధువులయొక్కయు ఊరివారియొక్కయు సమ్మతముగలిగిననేడు, వందోమ్ - మిమ్ములయెడబాసిజీవింపలేక వచ్చితిమి, ఇరంగు - కృపచేయువలయును. ఏలోరెంబావాయ్.—

తా.— ఆనాడు దేవతలనిమిత్తమై ఈలోకమును గొలిచిన శ్రీపాదములకు మంగళము అగుగాక, లంకానగరమునకు దండెత్తివెడలి రాక్షసుల సంహరించినబలమునకు మంగళము అగుగాక, శకటాసురుని తన్ని నశింపజేసిన కీర్తికి మంగళమగుగాక, దూడగావచ్చిన రాక్షసుని వెలగపండురూపముగావచ్చిన మఱియొక రాక్షసునిమీదు విసిరివేయునపుడు పొంకముగానుంచుకొన్న శ్రీపాదము మంగళముగా నుండుగాక, (గొల్లలు) ఇంద్రునికి ఇదివఱకు పెట్టుచున్న పొంగలిని, శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతమునకు ఉంచుమని గొల్లలకు ఆజ్ఞచేయగా వారట్లు చేయుటచే, దేవేంద్రుడు తనయాగమును శ్రీకృష్ణుడు తప్పించెనుగదా అనుకోపముచే వ్రేపల్లెలోని గొల్లలకును పశువులకు దుర్దశ మగబడ[illegible]నవలయునని చాలదినములు శిలావర్షమును కురిపింపగ శ్రీకృష్ణుడు [illegible] పెరుకొన్నందుచే అతనికి కోపముగలిగి యిట్లు వర్షింపించు

చున్నాడు. ఇపుడు ఆయింద్రునియందు మనము క్రోధముంచగూడదు, ...
ఆపదను మనము తొలగద్రోసి కొండముఅని,గోవర్ధనమును గొడుగుగా ...
అట్టి గుణవిశేషమునకు మంగళము కలుగవలయును. శత్రునాశకమగు దేవరవా...
క్షేమముగానుండవలయును. అని యీప్రకారముగ దేవరవారి పరాక్రమమున...
పురుషార్థమును లభించుటకు నేడు మేమువచ్చితిమి. కృపచేయుము అనుచున్నా...

స్వాప.— (అన్రిత్యాది) ప్రకృతిసంబంధమును బట్టిగలిగిన అజ్ఞానము లో... ఆక్రమించినయాదినము, అహంకారమునకు వశమైన యీలోకమును అహం... నుండిమరలించి తనశ్రీపాదములచే కొలిచితనయధీనము చేసికొనిన వాడవా! నీ... విందములకు మంగళాశాసనము. (శెన్రంగిత్యాది). ఈలోకమును అహంకారమ... తిరుగునట్లుచేసినదిగాక ఆయహంకారము జనించుస్థలమునకు బోయిప్రకృతిసంబ... నిర్వహించునట్టి యహంకారమును నశింపజేసినవాడవా? నీయొక్క శత్రువులను... రించునట్టి సామర్థ్యము క్షేమముగానుండవలయును. (కన్రుకుణిలాయిత్యాది) లో... ఎగరవేయుకఱ్ఱగా ఎగరవేసి నశింపజేసినవాడవా, వంచబడిననీపాదమునకు ... మగుగాక. ఇదివఱకు విరోధులవిషయమందుచేయు అంశము చెప్పబడినది; ... కూలులువిరోధించిన యెడచేయునట్టి అంశము చెప్పబడుచున్నది. (కున్రిత్యాది) ... డుఱాళ్ళవానకురిపించినపుడు కొండను గొడుగుగానెత్తిగొల్లలను పశువులనుగా... అజ్ఞానకార్యమైన అహంకారము ఈ యధికారికిసామాన్య విషయమునందాశ... జేయుటకు బదులుగావైదికమైకైంకర్య రూపమైనవిషయమునందు ఆసక్తినిగలుగ... విషయమందు ప్రపత్తిచేసినవారికి రక్షకుడు అగునట్టిప్రకారమును చెప్పుచున్నది... ఇట్లుఆశ్రితరక్షకుడైనవాడవా ? నీయొక్క శీలగుణమునకు మంగళాశాసనము. (... గైకెడుక్కుమిత్యాది) అహంకారమును గెలిచి ఆవిషయమందు రుచినిభో... శ్రీసుదర్శనము క్షేమముగానుండ వలయును. (ఎన్రైన్రిత్యాది) ఇట్లుమంగళా... చేయుటయే జీవనమైనీయొక్క వీరచారిత్ర్యమును స్తోత్రముచేసి పురుషార్థము... టకుగాను సత్వగుణముతలయెత్తిన నేడు దేవరవారిచేతిని యెదురుచూచుచుం... వచ్చితిమి. నీవుకృప చేయవలయును. ‹‹ ఏత్తిప్పఱైకొళ్వాన్ ” అనుచోట... నకనంతరము పురుషార్థలాభమగుటచేతను స్తుతింపనపుడు పురుషార్థములేక... చేతనుస్తుతించుటయే పురుషార్థమనుట. ‹‹ ఇరంగు ” అనికృపయే సా... ‹‹ వందోమ్ ” అనిరుచికార్యమును చెప్పుచున్నది.

అ.—శ్రీ - పా - మీకుగావలసినది ఏమనిన; ఏదైన ... నీ వేషా గొట్టిమావ్యసనమంతయునశింపజేసి అంగీకరింపవలయు...

౨౫. ఒరు_త్తిమగనాయ్ప్పిఱన్దోరిరవిల్,
ఒరు_త్తిమగనాయొళిత్తువళర,
_త్తరిక్కిలానాగిత్తాన్ తీజ్గునినైన్ద,
కరుత్తైప్పిళ్లైప్పిత్తుక్కఞ్జన్ వయిత్త్రిల్,
నెరుప్పెన్న నిన్ద నెడుమాలే, యున్నై
యరు_త్తిత్తువన్దోమ్పఱైతరుదియాగిల్,
తిరు_త్తక్కశెల్వముమ్ శేవగముమ్యామ్పాడి,
వరు_త్తము_న్తీర్న్దుమగిళ్న్దేలోరెమ్బావాయ్.

టీ — ఒరు_త్తి - సమానములేని దేవకీదేవికి, మగనాయ్పిఱన్దు - బిడ్డయైయవ[...]తరించి, ఓరిరవిల్ - అదేరాత్రియందు, (శ్రీకృష్ణునియొక్క బాలచేష్టితములనంతయు [...]అనుభవించుటచేత) ఒరు_త్తి - ఈమెకు రెండవదిలేదు అని చెప్పదగిన యశోదాదేవికి, [...]మగనాయ్ - కొమారుడుగా, (కంసునివిషదృష్టితగలకుండునట్లు) ఒళిత్తువళర - దాగి [...]పెరుగుచురాగా, (తనకు తెలియకవీడు పెరుగుచుండుటనువిని) త్తాన్ - వెనుకపడ[...]పోవుపాటు నెఱుగనితాను, తరిక్కిలానాగి - సహింపనివాడై, (ఏవిధముచేనైనను వీనిని [...]చంపవలయునని) తీ-గునినైంద - చెడుగునుతలచియుండిన, కంజన్ కరుత్తై - కంసుని [...]తలంపును, పిళ్లైప్పిత్తు - వ్యర్థమగునట్లుచేసి, వయిత్త్రిల్ - వానిగర్భమందు, నెరుప్పె[...]న్న - నిప్పుమంటఅనునట్లు, నిన్ద - నిలిచినవాడై, నెడుమాలే - ఆశ్రితులయందుఅధిక[...]వ్యామోహముగలవాడవా, ఉన్నైఅరు_త్తిత్తు - నీయొద్దపురుషార్థమును ప్రార్థించి, వం[...]దోమ్ - వచ్చిఆశ్రయించితిమి, పఱైతరుదియాగిల్ - మాయొక్కఉద్దేశ్యముచేయువాడ[...]వైతివేని, తిరు_త్తక్కశెల్వముం - తాయార్లుకోరదగిన సంపత్తును, శేవగముమ్ - దానిని [...]కాపాడునట్టివీర్యమునున్ను, యాంపాడి - నీనామమును సంకీర్తనముచేయుటకు లభిం[...]చినిమేముప్రీతితో గానముచేసి, వరు_త్తముంతీర్ందు - నిన్నుగొడబాసిపడిన శ్రమము [...]తొలగి, మగిళ్ందు - సంతోషించినవారము గావలయును. ఏలోరెంబావాయ్.—

తా.— శ్రీకృష్ణుడు దేవకీదేవకికి బిడ్డయైయవతరించి అదేరాత్రిలో యశోదా[...]దేవికిపుత్రుడైరహస్యముగ పెరుగుచుండగ కంసుడు ఓర్వజాలనివాడై శ్రీకృష్ణునిచంప [...]దలచి) [...]గియున్న చెడుతలంపును వ్యర్థముచేసి వానికడుపునందు నిప్పుమంటవలెనుండు [...]వాడవు ఉంచ[...]శ్రితులయందు అధికవ్యామోహమునుగలవాడవా? నిన్ను పురుషార్థము కొఱ[...]కుమును శ్రీకృష్ణ[...]యాశ్రయించితిమి, పురుషార్థమును కృపచేయువాడవైతివేని శ్రీమహా[...]లక్ష్మి[...]నుక్షమగ[...]గను, ఆసంపదకురక్షకమగు వీర్యమును మేము ప్రీతితో గానముచేసి [...] [...]ట్టి[...]డి. [...]గలిగిన శ్రమముతీరి సంతోషింతుముఅనుచున్నారు.

స్వాప.—(ఒరు త్తియిత్యాది) తిరువష్టాక్షరిమంత్రమునందు ప్రతిపాదింపబడు గుణములు, విగ్రహము, విభూతి, మొదలగువీనితోఁగూడినవాడై అవతరించి, (విత్యాది) లోకులురెుఱుగనిఅద్వితీయకాలమందు, వాసుదేవద్వాదశాక్షరీమంత్రపాద్యుడై, (ఒళిత్తువళర) గుణవిగ్రహవిభూతులచే సంకోచించి స్వరూపమాత్రముచే పెరుగుచుండగ. (తరిక్కిలానాగి) స్వరూపమాత్రముచే ఈశ్వరసద్భావమునపనివాడై, (తానిత్యాది) ఎల్లప్పుడుమంగళాశాసనము చేయవలసినవిషయమందువలన ఒకఉపద్రవము గలిగి చెడుగును తలంచుటయేకాక తానే ద్వేషముతలంచిప్రాయమును వ్యర్థముచేసిన అహంకారముయొక్క గర్భమందు నిష్పరగులమైమండి వానిసమీపమందునిలిచినతనకు శేషభూతులగు చేతనుల విషయమందు అతివ్యామోహముగలవాడవా. (ఉన్నైఅరుత్తిత్తు...పఱై - యాగిల్) సాధారణ (తిరుత్తక్క - శేవకముమ్) శ్రీమహాలక్ష్మికి తగినస్వరూపగుణ విగ్రహ విభూతి గూడినవాడైయున్న సంపదను వీరచరితమును (యాంపాడి) అదేధారకముగపాడి త్తమిత్యాది) శ్రమమంతయుతీరిఆనందింపగలవారము.

అవ.—౨౯ పా. మీకు అపేక్షితమేమనిన; నోమునకు కావలసిన ఉపకరణలను అపేక్షించుచున్నారు, కృష్ణసంశ్లేష మందాశగలిగినవీరు, ఈయుపకరణ అపేక్షించుటకు మూలముఏమనిన. ఆసంశ్లేషమునకు అనుకూలమైననోమును ప్రచుటచేతను శ్రీకృష్ణుని చక్కగాసేవించుటకును వానితిరునామములను నోరారటకును కారణమగుటచేతను, గొల్లలయందలి ఉపకారస్మృతిచేతను నోమునకు ములను ప్రార్థించుకొనుచున్నారు.

౨౯. మాలేమణివణ్ణామార్గళ్ణినీరాడువాన్,
మేలైయార్ శెయ్వనగళ్ వేణ్డువనకేట్టియేల్,
ఞాలత్తైయెల్లామ్నడుఙ్గమురల్వన,
పాలన్నవణ్ణత్తునిన్పాఞ్చశన్నియమే,
పోల్వనశఙ్గఙ్గళ్ పోయ్ప్పాడుడైయనవే,
శాలప్పెరుమ్పఱైయే పల్లాణ్డిశైప్పారే,
కోలవిళక్కే కొడియేవితానమే,
ఆలినిలైయాయరుళేలోరెమ్బావాయ్.

టీ.— మాలే - ఆశ్రితవిషయమందు వ్యామోహముగలవాడా ఇంద్రనీలమువంటితిరుమేను గలవాడవా, మార్గళినీరాడువాన్

స్నానముచేయుటకు, మేలైయార్ - పెద్దలు, శెయ్వనకళ్ - చేయుకార్యములు, వేం
డువన - వలయునవి, కేట్టియేల్ - వింటివేని, ఞాలత్తైయెల్లామ్ - భూమియెల్లను,
నడుంగ - అదురునట్లు, మురల్వన - ఘోషించునట్టి, పాలన్నవణ్ణత్తు - పాలతోసమాన
మగుచాయగల, ఉన్ - నీయొక్క, పాంజశన్నియమేపోల్వన - శ్రీపాంచజన్యమనుశం
ఖమునంటి, శంగంగళ్ - శంఖములు, పోయ్ప్పాడుడైయనవే - విస్తారముగలయవియై,
శాలప్పెరుం - మిక్కిలిపెద్దదైన, పఱైయే - వాద్యవిశేషమును, పల్లాండిశైప్పారే -
మంగళాశాసనముపాడువారును, కోలవిళక్కే - మంగళదీపమును, కొడి - ధ్వజమును,
వితానమే- మేలుకట్టును, ఆలినిలైయాయ్ - వటపత్రశాయియగుసర్వేశ్వరా, అరుళ్-
కృపచేయుమా. ఏలోరెంబావాయ్.—

తా.— తన్నాశ్రయించినవారియందు అధికప్రేమగలవాడై నీలమణివంటి తిరు
మేనుగలవాడు, లేకముంగోంగునందు ముడివేసికొను రత్నమువలె సులభుడైనవాడా.
అనిసంబోధింపగ ( మీరుద్దేశించిన కార్యంబు చెప్పుడు అనినచెప్పుచున్నారు ) మార్గశిర
మాసస్నానంబుచేయుటకు పెద్దలుచేయుకార్యములు వింటివేని, భూమియదురునట్లుశబ్దిం
పు తెల్లని శ్రీపాంచజన్యమువంటి శంఖములును మిక్కిలి గొప్పదియగువాద్య విశేషమును
మంగళాశాసనము చేయువారును మంగళదీపమును ధ్వజమును మేలుకట్టు, మొదలగునవి
ప్రార్థింపగా, స్వామి ఆలకించి, పాంచజన్యమువంటిశంఖములు అనేకములులేవు, పాం
చజన్యమేపుచ్చుకొనుడుఅనియు తనయొద్దనుండు వాద్యవిశేషమును, మంగళాశాసన
మునకు పెరియాళ్వార్లవంటివారు అనేకులు చిక్కరుకనుక వారినిన్ని, మంగళదీపము
కు నీళాదేవినిన్ని, ధ్వజమునకు గరుత్మంతుని మేలుకట్టుకు పీతాంబరమునుపుచ్చుకొనుడు
అనిస్వామిఅనతీయగా గోపికలు, ఇవిఒక్కొక్కటికాదు అనేకములు కావలయునని
మనుగగా, స్వామికాని కార్యము ఎట్లు అగునుఅనిన, నీకుశక్యముగాని కార్యముగలదా
చిన్న దేహమును ధరించిసమస్తలోకములను అట్టిదేహమందుంచుకొని ఒకమఱ్ఱియాకుపై
యనించిన అట్టిఅఘటితఘటనాసామర్థ్యముగల వటపత్రశాయీ, నీవల్లకానికార్యము
ఏమిఉన్నది. మాయభీష్టమును కృపచేయుమా అని.

స్వాప.— ఈపాట్టునందు భగవత్సంశ్లేషమునకు వలసిన ఉపకరణములను ప్రా
ర్థించుకొనుచున్నారు.

(మాలేమణివణ్ణా: సర్వాధికుడై సర్వసులభుడైనవాడవా, అనుట. ఆశ్రితవ్యా
మోహాత్ కష్టే ... హస్తాభ్యధిక మనోహరమైన విగ్రహమును గలవాడవా. (మార్గళినీరా
డువాన్ప్పాడి ... ) ధర్మార్థులకు సాధనముగను, నిష్కాములకు నిత్యముగను, ప్రప
త్తిప్రతికూల ... కైంకర్యముగను ఉండును. కాబట్టి ప్రపన్నాధికారులకు చెప్ప
... జ్ఞానవత్కృత్యమైన ఆకారముచే అనుష్ఠింపకుండుటయేగాని, కేవలుల

అనుష్ఠానము విడువదగినదిఅనిభావము. అందుకు ప్రమాణ మేమనిన; (మేలైయార్ పనగళ్) ప్రమాణములలో మొదటిదియగు శిష్టాచారము అనిన. దానికి కా యేమనగా. జాగ్రత్తతో వింటివేనిచెప్పుచున్నామనిన, అయిన, ఇదియు మీవా వినుచున్నాను. చెప్పుడనిన చెప్పుచున్నారు. (ఞాలమిత్యాదిచే) అనన్యార్హ జ్ఞానముగావలయుననుట. శంఖధ్వని, ఓంకారమని లోకమందు ప్రసిద్ధిజెందియు ఓంకారముయొక్క అర్థము అనన్యార్హ శేషత్వమగుటచే, లక్షణమునుబట్టి శే మునుచెప్పుచున్నది. (శాలప్పెరుంపఱైయే) భగవదనన్యార్హ శేషత్వవిరోధి స్వాతంత్ర్యమును శేషత్వచిహ్నమగు కైంకర్యమునందు స్వాధీనకర్తృత్వభోక్తృ లను నివర్తింపజేయునదియై, మధ్యనుండు నమశ్శబ్దార్థమైన పారతంత్ర్య జ్ఞాన నను అంశము చెప్పుచున్నది. (పల్లాండిశైప్పారే) సత్సహవాసముగావలయును. విళక్కే) భగవదనన్యార్హ శేషత్వమును వానికి మిక్కిలి యిష్టమగునట్లు చేసెడు శేషత్వజ్ఞానమును కావలయును, (కొడియే) క్రిందువచించిన శేషత్వలక్షణము ర్యముకావలయును. (వితానమే) ఆకైంకర్యమందు భోక్తృత్వ నివృత్తియును యును. లేనిదానిని గలుగజేయనగునా అనిన. (ఆలినిలైయాయ్) ముందు గలుగజేసినవాడవు గావా (అరుళ్) కృప ఉన్నయెడల చేయనాటంకములేదు.

అవ.—౨౭-పా. నోమునోచినయెడల వానివలన లభింపనగు పురుష వచించుచున్నారు.

పాశు. ౨౭. కూడారై వెల్లుమ్శీర్గోవిన్దా, వున్దన్నై
ప్పాడిప్పఱైకొణ్డియామ్పెఱుశమ్మానమ్,
నాడుపుగళుమ్పరిశినాల్నన్ఱాగ,
చ్చూడగమేతోళ్వళై యేతోడేశెవిప్పూవే,
పాడగమేయెన్ఱనైయప్పల్కలనుమ్యామణివోమ్,
ఆడైయుడుప్పోమదన్పిన్నేపాల్శోఱు,
మూడనెయ్ పెయ్దుముళఙ్గైవళివార,
క్కూడియిరున్దుకుళిర్న్దేలోరెమ్బావా

టీ.—కూడారై - శత్రువులను, వెల్లుం - జయించున లుగల, గోవిందా - గోవులనానందింపజేయువాడవా, ఉన్దన్ స్తోత్రముచేసి, పఱైకొండు - ప్రాప్యమును లభించి, యాం - నట్టి, శమ్మానం - బహుమానములు, నాడు - లోకమువారు,

శినాల్ - సన్మానముచే, నన్రాక - బాగుగా, శూడగమే - చేతికి ధరించుఆభరణమును, తోళ్ వళైయే - భుజమునధరించు ఆభరణమును, తోడే - చెవినిధరించు ఆభరణమును, శెవిప్పూవే - కర్ణపుష్పమును, పాడగమే - పాదమునకాభరణము, ఎన్రనైయ - అనిచె ప్పబడు, పల్ కలనుమ్ - అనేకాభరణములను, యామణివోం - మేముధరింపగలవారము, ఆడైయుడుప్పోం - మంచివస్త్రములను ధరింపగలవారము, అదన్ పిన్నే - వానివెనుక, పాల్ శోఱు - పాలలోప్రసాదము, మూడ - మునుగునట్లు, నెయ్ పెయ్దు - నేయి యుంచి, ముళ్ళంగై వళివార - మోచేతియందు గారునట్లు, కూడియిరున్దు - అందఱును గూడియుండి, కుళిర్ందు - సుఖింపవలయును. ఏలోరెంబావాయ్.—

తా.—కూడనివారిని గెలుచునట్టి సుగుణసంపదగల గోరక్షకుడా! నీకల్యాణగుణములను గానముచేసి నోముకువలసిన యుపకరణములను లభించి (పొందవలసినపురుషార్థమునుపొంది) మేములభించెడి సన్మానములు లోకులుపొగడునట్టి ప్రకారమున, లెస్సగా హస్తాభరణము దండకడియములు, కమ్మలు కర్ణపుష్పములు, పాదాభరణము మొదలగు అనేకాభరణములను మంచివస్త్రములను ధరింతుము, దానివెనుక పాలన్నము మునుగునట్లు నేయియుంచి మోచేతివఱకు స్రవించునట్లు దేవరవారితో అందఱుగూడియుండి సుఖింపవలయు.

స్వాప,—(కూడారై వెల్లుంశీర్) సర్వేశ్వరుడు, ఈచేతనులకు కరణకళేబరములు సకలశాస్త్రములను ఇచ్చియు మేము లోబడము అనియున్నవారిని తనయొక్క శౌర్యాదిగుణములచేతను శీలాదిగుణములచేతను జయించునేగాని విడువడు, వింటి పిడిని జూపి రావణునిజయించెను. స్వవిక్రమైః - రంజనీయస్య= తనపరాక్రమాది గుణములచే శత్రువులనుగూడ, ఆనందింపజేయువాడు. అనియున ఆచార్యులు అనతిస్తురు. తనరూప సౌందర్యాదులనుజూపి గోపీమారులను జయించెను. స్వరూపరూపగుణ విభూతులచేత సర్వస్మాత్పరుడగు తనయొక్క వైలక్షణ్యమునుజూపి ఆళ్వార్లనుజయించెను. వీటిలో దేనికిని యీడుపడని మనవంటివారిని ఆళ్వార్లసంబంధమును నెపముగాగొని జయించు (గోవిందా) సర్వసులభుడైనవాడవా. (ఉన్దన్నైప్పాడి) సర్వస్మాత్పరుడై సర్వసులభుడైననిన్ను అనుభవించుటచే గలిగిన ప్రీతి పురికొల్పుటచే గానముచేసి, (పఱైకొండు) పురుషార్థమునులభించి. (యాం - పెరుశమ్మానం...నన్రాగ) లోకులు తమయభిప్రా [illegible] ముచే, నీచేతిని యెదురుచూచెడు మేములభించునట్టి బహుమా [illegible] హస్తాభరణమే (తోళ్ వళైయే) చక్రాంకితమే (తోడే) తిరు [illegible] (శెవిప్పూవే) ద్వయమే. (పాడగమే) చరమశ్లోకమే. ఇవి స్వరూపజ్ఞాన [illegible] పేక్షితములై భగవత్సంబంధ సూచకములై ఉండు [illegible] జ్ఞానవ[illegible] లభింపరు అనిన, మీపుణ్యమేదియో వివరించునట్టి ప్రణవా

కారమునుసూచించునదియగుటచే తిరుమంత్రమును చెప్పుచున్నది. ( శెవిప్పు
భోగరూపమగుటచే భోగమునిచ్చునట్టి ద్వయమును చెప్పుచున్నది. ( పా
ఆశ్రయణరూపమగుటచే ఉపాయాంతర నివృత్తిరూపమగు చరమశ్లోకమును
న్నది. ఈ మూడు రహస్యములచేతను జ్ఞానభక్తివైరాగ్యములనుచెప్పుచున్నది. అ
తిరుమన్త్రము ఆత్మస్వరూప యాధాత్మ్యజ్ఞానపరము అగుటచేతను, ద్వయమ
ఉత్తరఖండమందు చెప్పబడు కైంకర్యమునకు పూర్వభావియగుభక్తిప్రధానమగుట
చరమశ్లోకము త్యాజ్యాంశమందు వైరాగ్యప్రధానమగుటచేతను, జ్ఞానభక్తి వైరా
ను చెప్పుచున్నది, (ఎన్ఱునైయ) అనిచెప్పబడు, (పల్ కలనుమ్) జ్ఞానభక్తి వైరా
మూడును ఒక్కొక్కటియే విషయభేదముచే అనేకముగానుండునవిగదా; కా
కలనుం) అనుచున్నారు. (యామణివోం) నీతోకూడని సమయమందు ఇవియు
అక్కఱలేకుండిన మేము. ఇప్పుడు ధరింపగలవారము. (ఆడైయుడుప్పోమ్)
జ్ఞానమగు వస్త్రమును ధరింతుము (అదన్ పిన్నే) దానికిమీదు (పాల్ శోఱు)
ర్యమైనది (మూడనెయ్ పెయ్దు) తెలియకుండునట్లు, పారతంత్ర్యమును ప్ర
(కూడియిరుందు కుళిర్ందు) భోక్తయగు నీతో భోగ్యమగు మేము సంబంధిం
యెడబాయుటవలని వ్యసనమంతయు తీరునట్లు లభించితిమి, ఇదిగదా మేము
లో లభించినసమ్మానము.

అవ. — ౨౮-పా.- మొదటిపాశురమున ‹‹నారాయణనే నమక్కేపఱైతరు
అనిసంగ్రహముగజెప్పిన ప్రాప్య ప్రాపకములను ఈరెండుపాశురములచే విశ
న్నారు. అందులో. ఈపాశురమందు లోకసమ్మతమునకై నోము అని ఒక వే
కొని ప్రవేశించితిమి. మాయొక్క ఉద్దేశ్యమది కాదు. నీపాదారవిందములయం
కర్యమేయనియు అట్టికైంకర్యరూప పురుషార్థము సిద్ధించుటకుకర్మ యోగజ్ఞాన
సాధనములు ఒకటియు తమయందులేదనియు, నీతోటిసంబంధమును ముందు
నీవే ఉపాయముకావలయునని ఆపేక్షించి దీనిని క్షమింపవలయునని. ప్రా
పురుషార్థమును ప్రార్థించి ముగించుచున్నారు.

౨౮. కఱవైగళ్ పిన్ శెన్ఱుకానమ్ శేర్ న్దుణ్బోమ్
అఱివొన్ఱుమిల్లాద వాయ్క్కులత్తున్ఱన్నై
ప్పిఱవిపెఱున్దనై పుణ్ణియమ్ నామ్ముడైయోమ్
కుఱైవొన్ఱుమిల్లాద గోవిందా ...
కుఱైయొన్ఱుమిల్లాద, నాడు - లోకమువారు ...

డుఱవేల్ నమక్కిఙ్గొళిక్కవొళియాదు,
అఱియాదపిళ్ళైగళోమన్బినా, లున్దన్నై చ్
చ్చిఱుపేరళైత్తనవుమ్శీఱియరుళాదే,
ఇఱైవానీతారాయ్పఱై యేలోరెమ్బావాయ్.

టీక.—కఱవైకళ్ - పశువులయొక్క, పిన్ శెన్ఱు - వెంబడిపోయి, కానం - అడవిని, శేర్ందు - ప్రవేశించి, ఉణ్బోం - జీవించువారము. అఱివు - జ్ఞానము, ఒన్ఱుమ్ ఇల్లాద - కొంచెమైనను లేని, ఆయ్కులం - గొల్లకులమునందు, ఉన్దన్నై - దేవరవారి యొక్క, పిఱవిపెఱున్దనై - జన్మముగలుగునట్లులభించిన, పుణ్ణియం - ఉపాయమును, నామ్ - మేము, ఉడైయోమ్ - కలవారము, కుఱైవు - కొదవ, ఒన్ఱుమిల్లాద - కొంచెమైనను లేకుండెడు, గోవిందా - గోవిందుడైనవాడవా, ఉన్దన్నోడు - నీతో, ఉఱవు - సంబంధము, నమక్కు - నీకును మాకును, ఇంగు - ఇక్కడ, ఒళిక్క ఒళి యాదు - తొలగద్రోసికొనజూచినను తొలగదు, అఱియాద - తెలివిలేని, పిళ్ళైక ళోం - ఆడుబిడ్డలము, అన్బినాల్ - ప్రేమచే, ఉన్దన్నై - దేవరవారిని, శిఱుపేర్ - పేరుచే, అళైత్తనవుం - పిలిచినందులకు, శీఱియరుళాదే - కోపించుకొనక, ఇఱైవా - స్వామీ, పఱై - ప్రాప్యమును, నీతారాయ్ - నీవు కృపచేయవలయును, ఏలోరెంబావాయ్.—

తా.—పశువులవెంబడి అడవినిచేరి జీవించువారము, తెలివియేమియులేని గొల్ల కులమునందు దేవరయొక్క జన్మముగలుగునట్టి పుణ్యముగలవారము అగుదుము. ఏవిధ ముచేతను కొంచెమైనను కొదవలేని గోపాలుడా! దేవరతో సంబంధము తొలగద్రోసి కొనజూచినను తొలగునదికాదు, తెలివిలేని బిడ్డలము, ప్రేమమున దేవరవారినితక్కు వగా పిలుచుట మొదలైనవానినిగుఱించి కోపముంచక సర్వస్వామియైనవాడవా! మా యిష్టపురుషార్థమును కృపచేయవలయును అనుచున్నారు.

స్వాప.—(కఱవైకళిత్యాది) జ్ఞానహీనులైన సంసారులను అనుసరించి సంసార మును ప్రాప్యముగాబట్టి దేహపోషణమే కాలక్షేపముగానుంచుకొనియుంటిమి. ఇదిదా [illegible] పొందుటకు మేము చేసినకర్మానుష్ఠానము. (అఱివొన్ఱుమిల్లాద) జ్ఞానమును జ్ఞాన [illegible] లేని (ఆయ్కులం) ఇతర ఉపాయములు లేనందుచే దోష [illegible] ఉపవారము మేము. దీనిచే - జన్మవృత్తాదులచే తక్కువైన వారమని [illegible] ప్రయోజనపురుషార్థమును విడిచిపెట్టవలసినది దానో అనగా - పుణ్యములేని [illegible] జ్ఞానవ[illegible] లభింపరు అనిన, మీపుణ్యమేదియని యడుగగా (ఉన్ద

న్నై యిత్యాది) మాకులమందు అవతరించిన నిన్నే పుణ్యముగ వేరుసాధనములేని
గలవారమైతిమి (కుఱైవొన్ఱుమిల్లాద) ఏవిషయమందును కొదవలేక దేవరవా
పుడు దాసుల కొదవనిమిత్తమై విచారమేమియున్నది అనిన, (లేనివారికొదవ
వారు పూర్తిచేయవలయును అనునిర్బంధమేమియున్నది అనగా) అదియా (గో
ఉన్ఱన్నోడు ఉఱవు) మాకులమందు అవతరించిన అశరణ్య శరణ్యుడగు నీతో సం
కులులేని మాకుగలిగియుండు సంబంధ నిర్బంధముఅనిన ; అది ఒక కొడుము
తీరుచున్నది అనగా (ఉఱవేల్ నమక్కింగొళిక్క ఒళియాదు) నీతోమాకుండు వచ్చి
ధమును విచారించినయెడల, ఏదేనియొక కారణమును పట్టివచ్చినది కాదు. మనయొర
క్కయు స్వరూపమైయుండుటచేతను అదియు నిత్యమైయుండుటచేతను సర్వనము
పన్నుడగువానిచేతను పోగొట్టనలవి కాదు, ఇరువురును సంకేతముచేసికొనినను
నలవి కాదు, సంబంధము జ్ఞానరూపము అగుటచే దీనికి మరుపు ఇక్కడ కలుగకొఅవ
స్వరూపజ్ఞానము గలిగినవెనుక కలుగదు (అఱియాద...ఇఱైవా...శిఱియరు...
జ్ఞుడై సర్వస్వాత్పరుడై ప్రేమపరవశుడైన నీవుకోపింపక కరుణింపవలయును. ...
వను కలుగునట్టి అనర్థము నీదేగదా. కాబట్టి (నీతారాయ్) సర్వేశ్వరుడు ...
కున్నయెడచాలునుగదా. ఈచేతనుడు పురుషార్థము లభించుటకు భగవద్విషయ...
షములేకుండుటయేగదా కావలసినది. (ఇఱైవా) పరమపదవాసులకు స్వామి...
చికాదు. గొల్లకులమందు అవతరించిన మనస్వామి అనుచున్నారు.

అవ.— ౨౯ పా.—క్రిందిపాశురమందు ఉపాయస్వరూపము చెప్పి, ...
నందు తమకు ఉద్దేశ్యము కైంకర్యమని ప్రబంధతాత్పర్యమును చెప్పి నిగమించు
రు. ఇందు ప్రాప్యరుచినిన్ని ప్రాప్యముఇట్టిదనియు దానినివాఁడే యిప్పించ
అనునదియును తమకు ప్రాప్యమందలి త్వరయును తెలియజేయుచున్నారు. ...
మొழிలో "ఎమ్మావీడు" నందు ప్రాప్యమును నిష్కర్షించి దానిలో చరమదళ
మును "నెడుమాఱ్కడిమై" యందు అనుభవించిముగించినది. ఈగ్రంధమందు
చరమదళయగు అర్థమును అనుభవించి అదిస్థిరముగానుండుటకును, దానిని కా
వృద్ధిబొందించుటకును ప్రాప్యమును చెప్పిముగించుచున్నారు.

౨౯. శిఱ్ఱఞ్శిఱుకాలేవన్దున్నైచ్చేవి, త్తున్
పొఱ్ఱామరై యడియేపోఱ్ఱుమ్పొరుళ్ ...
పెఱ్ఱమ్మేయ్ త్తుణ్ణుమ్కులత్తిల్ప్పిఱన్ద, శ్రీ...
కుఱ్ఱేవలెఙ్గళైక్కొళ్ళామఱ్పోగాదు, ...

ఇఱ్ఱైప్పఱైకొళ్వానన్ఱుకాణ్ గోవిన్దా,
ఎఱ్ఱైక్కుమేళ్ళేళ్ పిఱవిక్కుమ్, ఉన్దన్నో
డుఱ్ఱోమేయావోమునక్కేనామాళ్చెయ్ వోమ్,
మఱ్ఱైనఙ్గామఙ్గళ్ మాఱ్ఱేలోరెమ్బావాయ్.

టీక.— శిఱ్ఱఞ్చిఱుకాలే - మిక్కిలి ప్రాతఃకాలమందు, వందు - అంటలును వచ్చి, ఉన్నై - దేవరవారిని, శేవిత్తు - సేవించి, ఉన - నీయొక్క, పొఱ్ఱామరై - బంగారదగినతామరవలెనుండు. అడియే - పాదారవిందములను, పోఱ్ఱుమ్ - మంగళాశాసనముచేసెడు, పొరుళ్ - అభిప్రాయమును, కేళాయ్ - వినుమా, పెఱ్ఱమ్ - పశువులను, మేయ్త్తు - రక్షించి, ఉణ్ణుం - భుజించెడు, కులత్తిల్ - వంశమందు, పిఱంద - అవతరించిన, నీ - నీవు, కుఱ్ఱేవల్ - అంతరంగకైంకర్యములందు, ఎంగళై - దాసభూతులగుమమ్మును, కొళ్ళామల్ - అంగీకరింపక, పోగాదు - పోకూడదు, ఇఱ్ఱైప్పఱైకొళ్వాన్ - నేడువాద్యవిశేషమును పుచ్చుకొనిపోవువారు, అన్ఱుకాణ్ - కాదుసుమా, గోవిందా - గోవిందుడైనవాడా, ఎఱ్ఱైక్కుం - సర్వకాలములందును, ఏళ్ళేళ్ పిఱవిక్కుం - ఏడేడుజన్మములకును, ఉన్దన్నోడు - దేవరవారితో, ఉఱ్ఱోమేయావోమ్ - నీకే శేషభూతులమైయుండగలవారము. ఉనక్కే - దేవరవారికే, నామ్ - మేము, ఆళ్ శెయ్వోమ్ - దాస్యముచేయగలవారము, మఱ్ఱై - ఇతరమైన, నం - మాయొక్క, కామంగళ్ - అభీష్టములను, మాఱ్ఱు - తప్పిపోవునట్లుచేయవలయును, ఏలోరెంబావాయ్.—

తా॥ అత్యంత ప్రాతఃకాలమునవచ్చి దేవరవారిని సేవించి బంగారు తామరపువ్వువంటి తిరువడిగళుకు మంగళాశాసనముచేయు నభిప్రాయమువినుమా, పశువులను మేపి భుజించుకులంబునబుట్టిననీవుఅంతరంగకైంకర్యములను మావలనఅంగీకరింపకపోగూడదు. నేడు ఒకప్రయోజనమును గొనిపోవుటకు వచ్చినవారము కాము. మనోభావము తెలిసికొనకులమందుబుట్టినందున తెలివి తక్కువైనవాడవా? ఎప్పటికిని ఏడేడుజన్మములకును దేవరవారిసంబధులమేయగుదుము. దేవరవారికే కైంకర్యముచేయుదుము. ఇతరములగు మా కోరికలను తొలగింపుము అని.

మగ వ్యాఖ్యా॥ (శిఱ్ఱమిత్యాది) మిగుల సాత్విక కాలమగు ప్రాతఃకాలమందు దేవర ... బాసి సహింపలేకవచ్చి. (సన్నిధికివచ్చుట అతిశయమనితలచియుండు) దేవ ... (ఉన పొఱ్ఱామరైయిత్యాది) దేవరవారి తిరువడిగళను మంగళాశాసన ... ప్రయోజనమునువినుడు. పెఱ్ఱమ్ మేయ్త్తుణ్ణుంకులం, అని జ్ఞానజన్మము ... ది. జ్ఞానవంతులు, కారుణ్యమును ప్రధానముగగలవారై. ఇతరులయొక్క

కష్టములను సహింపక ఇతరులు ఉజ్జీవించునట్లు చేయుచుందురు. "పాల్ కొనప్పట్టబడిన యేపోల్ మంపారుల్ శేళాయ్" అనినవారుతామే, "ఉన్ తేవలంగళై కొళ్ళాకుళో గాదు" అని కైంకర్యమును ప్రార్థించుటచేత, కైంకర్యమున్ను మంగళాశాసనము ఆనతి అగుటచేతను, మంగళాశాసనమునకు ఫలముగ వాడు ఇప్పించవలసినదియు మీకు మాలి కొనవలసినదియు మంగళాశాసనమే అనినట్లైనది. "శిర్ ఱంశిఱుకాలే - పోల్ సుమియ ళ్ శేళాయ్" అనుటచే, రజస్తమోగుణములచే కలతనొంది మేము దేహసంబంధ పట్టివచ్చిన దృష్టఫలములను, దాసులగుమాయొక్క కోరికచేతను, హితపరుడగు టకును ఇచ్చుటకును కర్తగానుండవలసినదిలేదని యగుచున్నది.

30.— పా. అవ— గ్రన్థసమాప్తియందు ఈప్రబంధమును నేర్చువారు లక్ష్మీచేతను సర్వేశ్వరునిచేతను సర్వకాలములందును అంగీకరింపబడుదురు అనుచు నేర్చినవారికి అనుష్ఠించినవారితోను అనుకారముచేసిన వారితోను సమమైనఫల చును అనుట. దూడనుబోగొట్టుకొన్న పశువు, చర్మపుదూడయందును కనికరించు భగవత్సన్నిధియందు ఈపాశురములను అనుసంధింపగా మనకుఫలించును అని ఆనతిత్తురు.

30. వఙ్గక్కడల్ కడైన్దమాదవనై క్కేశవనై,
తిఙ్గళ్ తిరుముగత్తుచ్చేయిழైయార్ శెన్ఱిఱైఞ్జి,
అఙ్గప్పఱైకొణ్డవాత్తై, యణిపుదువై
పైఙ్గమలత్తణ్డెరియల్ పట్టర్ పిరాన్ కోదైశొన్న,
శఙ్గత్తమిழ్మాలై ముప్పదుమ్ దప్పామే,
ఇఙ్గిప్పరిశురైప్పారీరిరణ్డుమాల్వరైత్తోళ్,
శెఙ్గట్తిరుముగత్తుచ్చెల్వ త్తిరుమాలాల్,
ఎఙ్గుమ్ తిరువరుళ్ పెత్తిన్బుఱువరెమ్బావాయ్.

టీక॥ వఙ్గక్కడల్ - ఓడలుగలసముద్రమును, కడైన్ద - చిలికిన, మాదవనై - శ్రియఃపతిని, కేశవనై - కేశినిసంహరించినశ్రీకృష్ణుని, తింగళ్ - చంద్రునివంటి గత్తు - తిరుముఖమండలముగల, శేయిழైయార్ - లక్షణమైన ఆభరణములుగల శెన్ఱు - వచ్చి, ఇఱైఞ్జి - స్తోత్రముచేసి, అంగు - తిరువాయిప్పాడియందు ప్రాప్యమును, కొండ - లభించిన, ఆత్తై - ప్రకారమును, అణిపుదువై - అలంకారమైన శ్రీవిల్లిపుత్తూరిలో, పైఙ్ - కోరదగిన, కమలత్తు - తామర

బడిన, తణ్ - శ్రమహరమగు, తెరియల్ - మాలికనుగల, పట్టర్ పిరాణ్ - బ్రాహ్మ
ణోత్తములైన పెరియాళ్వార్లయొక్క, కోదై - పుత్రికయగు ఆండాళమ్మగారు, శొన్న -
అనతిచ్చిన, శంగత్తమిళ్ - సంఘమగు ద్రావిడభాషయై, మాలై - పాశురరూపమగు
మాలికయైన, ముప్పదుం - ముప్పదిపాశురములను, తప్పామే - తప్పక, ఇంగు - ఈభూ
మియందు, ఇప్పరిశు - ఈప్రకారమును, ఉరైప్పార్ - అనుసంధించువారు, ఈరిరండు -
నాలుగైన, మాల్ - విస్తారమైన, వరై - పర్వతములవలెనుండు, తోళ్ - భుజములను,
ఈ - ఎట్టివైయుండు, కణ్ - నేత్రములను, తిరుముగత్తు - తిరుముఖమునుగల, శెల్వ -
సువిభూతినాయకుడైన, తిరుమాలాల్ - శ్రియఃపతిచే, ఎంగుం - సర్వప్రదేశముల
యందును, తిరువరుళ్ - ఉపమానములేని అధికమైనకృపను, పెత్తు - లభించి, ఇన్బ
ఱువర్ - ఆనందముతోగూడినవారైయుందురు.

తా॥ ఓడలతోగూడిన సముద్రమును మథనముచేసిన శ్రీవల్లభుని కేశినిసంహరించి
స్వామిని చంద్రశ్రీముఖులైన విలక్షణాభరణములుగల గోపిమారులుపోయి స్తోత్రముచేసి
వ్రేపల్లెయందు నోముకుకావలసిన అంగములను(పురుషార్థమునులభించిన)ప్రకారమును,
అలంకారమైన శ్రీవిల్లిపుత్తూరిలో రమణీయమగు చల్లనిమాలికగల పెరియాళ్వార్లకొమా
ర్తె అనతిచ్చిన (సంఘముగానున్న ద్రవిడమాలిక) ద్రవిడవిద్వాంసులసమూహములుఅంగీ
కరించియున్న, లేక వ్రేపల్లెలోని గోపికలుగుంపులుగుంపులుగా అనుభవించిన ప్రబంధ
మనందలి ముప్పదిపాశురములలో ఒకటినిన్ని విడువక ఈకాలమనలేక ఈసంసారమున
పఠించువారు నాలుగు విశాలపర్వతములతో సమానములగుభుజములును ఎఱ్ఱనికన్నులును
గల శ్రీముఖముగల ఉభయవిభూతినాయకుడగు శ్రియఃపతిచేత ఇహపరములగు ఉభ
యవిభూతులందును సాదృశ్యములేని పరమకృపను లభించి ఆనందించువారు అగుదురు
అనుచున్నారు.

స్వాప॥ (వంగమిత్యాది) ఓడలకు చలనముకలుగకుండునట్లు పాలసముద్రమును
చిలికి, శ్రీమహాలక్ష్మినిలభించునట్లు చేతనులు పరిగ్రహించియుండు శరీరమునకు కష్టముకలు
గకుండునట్లు, సంసారమను మహాసముద్రమును తనసంకల్పమనెడు మందరపర్వతమును
నాటి, కృపయనుత్రాటిచేచుట్టి కటాక్షమగుచేతులతోచిలికి, శ్రీమహాలక్ష్మికన్నను ప్రేమ
నయమగు ఆత్మవస్తువును లభించినవాడు.దీనిచేఈశరీరముతోనుండునపుడు(సన్తమేనంత
విదుః=ఒకచేతనుడు ఆస్తికుడైనయెడల జ్ఞానవంతులు అట్టివానిని సత్పురుషునిగాతె
లిసికొందురు) అట్టి సత్పురుషునిగాజేసినవానిని అనిభావము. (కేశవనై) కేశినిరసించి
నట్లు ఆత్మవస్తువును అనుభవించునపుడు ఆయనుభవవిరోధియై ఈచేతనునికిజనించు భో
క్తృత్వాదులను నివర్తకుడగువానిని. (తింగళిత్యాది) (భవతిపుమాన్ జగతోస్య సౌమ్య
రూపః - భగవత్కటాక్ష పాత్రభూతుడు ఈలోకమునకు శాంతమైనరూపముగలవాడు

అగును) అన్నట్లు చంద్రునివంటిముఖముగలవారై భగవద్విషయమునందు జ్ఞానభ
గ్యములుగలవారై, అనన్యార్హులైన భాగవతులుసహింపజాలక వాడున్న స్థలమునకు
పూజించి ద్వాపరయుగమందు లోకులకు "పఱై" అని నెపముమాత్రమై తమకు
శ్యమగు కైంకర్యమును పరిగ్రహించినపద్ధతిని భూమికి ఆభరణమగు శ్రీవిల్లిపుత్తూ
దు వేంచేసియుండు పెరియాళ్వార్లకొమార్తె ఆండాళమ్మగారు అనతిచ్చిన మ
భోగ్యమై శిరస్సుతోవహింపదగినదియై శ్లాఘ్యమైన ఈప్రబంధమును ఒకపాశురమ
అనుసంధించువారు, శ్రియఃపతిచే.(ఉభయవిభూతులందు)=ఇహపరములందుగలి
మునకు విచ్ఛేదముకలుగకుండునట్లు సర్వేశ్వరుని పరమకృపనులభించి ఆనందని
యుందురు.

శుద్ధసత్వం దొడ్డాచార్యర్ తిరువడిగళేశరణమ్.

---

శ్రీమతేరామానుజాయనమః.

## శ్రీవానమామలై స్వామి యానతిచ్చిన స్వాపదేశసంగ్రహము.

తిరుప్పావై మొదటిఅయిదుపాశురములచేతను ప్రపన్న నిష్ఠాక్రమమును ప్ర
నికిపొందబడు సర్వేశ్వరుడు మిక్కిలి సులభుడగుటకు మూలమైనవాని యవ
యొక్కదారినిలేక సారాంశమును చెప్పుచున్నది. పైపదిపాశురములనుప్రపత్తికి
కావలసినది యగు వాక్యగురుపరంపరయొక్క క్రమమును చెప్పి భగవద్విష
ప్రయత్నపడువారును సంపూర్ణముగ ప్రవేశించియుండు వారును తారతమ్య
ఉద్దేశ్యులు అనువిషయమును చెప్పుచున్నది. అదెట్లనగా! "పిళ్ళాయెళుందిరా
అనుటచే భగవద్విషయమందు క్రొత్తగా ప్రేరేపించు లేక ప్రవేశింపజేయు "
రుభ్యోనమః = మాయాచార్యులకొఱకు దండము సమర్పించుచున్నాను,
చెప్పబడుచున్నది.తర్వాత నాయగప్పెణ్పిళ్ళాయ్ అనుటచే తనఆచార్యులకును
దగినవారగుటచే "అస్మత్పరమగురుభ్యోనమః అనుప్రకారమును చెప్పుచున్నది.
కులముడైయపావాయ్ అని అందఱిచేతను కొనియాడబడునట్లు ఉండుటచే "
నగర్" అనుపట్టణమునందు సుఖించునట్టివారికి తల్లియైన ఆండాళమ్మగారికి అన్న
"శ్రీమతేరామానుజాయనమః" అను నర్థమును చెప్పుచున్నది. ఇదియును
నువలెను అనుసన్ధింపదగినది. నోఱ్ఱుచ్చువర్గమ్ పుకుకిన్ఱ వమ్మనాయ్ అను
పాయముచే ప్రాప్యవైలక్షణ్యజ్ఞానమును గలవారై దానిచే ఉడైయవరులకు
గానుండు "శ్రీపరాంకుశదాసాయనమః" అనునర్థమును చెప్పుచున్నది కోవలర్
కొడి అనుటచే శ్రీకృష్ణభక్తితోగూడిన శ్రీనాథమునుల వంశమందవతరించిన
మునమునయేనమః" అనునర్థము చెప్పుచున్నది. నల్ఱచ్చెల్వంతంగాయ్ అనుట

లకొమార్తెయొక్క వయఃకాలముపూర్ణమైనవెనుకఅడుసునందు తాము మెట్టైపరుండి తమమీదు ఆచార్యపుత్రిని నడచునట్లుచేసియు "మనత్తుక్కినియానైప్పాడవుమ్ అనుట చేత శ్రీరామమిశ్రాయనమః " అనునర్థము చెప్పుచున్నది. పోదరిక్కణ్ణినాయ్ పంగ యక్కణ్ణానైప్పాడఅనుటచే శ్రీపుండరీకాక్షాయనమః అనునర్థముచెప్పుచున్నది. నావు డైయాయ్ అనుటచేద్రవిడవేదమును దేవగానమందు పాడిప్రసిద్ధికిదెచ్చిన నాలుకయొ క్కశక్తిగలవారగుటచే శ్రీమన్నాథమునయేనమః " అనునర్థము చెప్పుచున్నది. ఎల్లేయి ళంగిళియే అనుటచే ‹‹ శుకముఖాదమృత ద్రవసంయుతం "=శ్రీశుకులవారి వాక్స్ప ర్శమువలన అమృతరసముతో గూడుకొన్నది అనునట్లును" "ఉరునరుట్కముళొణ్బళ్తు త్తదు= సర్వేశ్వరుని యనుగ్రహముచే పోకచెట్లయొక్క సుందరమైన పండువలెనున్న, అళ్వార్ల తిరుప్పనళిమునుండి (నిన్కీర్త్తిక్కనియెన్నుంకవిగళ్ = నీయొక్కయశస్సును ప్రతిపాదించెడు ఫలమువలె మిక్కిలిభోగ్యమైన కవనములు) (మొళిపట్టోడుంకవి యముదమ్ = శబ్దరూపమై తిరువాయిమొళియనెడియమృతము ప్రవహింపగా)దానిచే (అణిమళ్లైకిళి మొళియాళ్= సుందరమైముద్దుమాటలగుచిలుకమాటలవంటి మాటలుగల) వారిని అనుసరించుటచేత " శ్రీమతే శఠకోపాయనమః " అనునర్థము చెప్పుచున్నది. నాయగనాయ్ అనియారంభించి ఆపైఅయిదు పాశురములచే, ‹‹ శ్రీమతేవిష్వక్సేనాయ నమః, శ్రీయైనమః, శ్రీధరాయనమః, అనునర్థములను - ఆచేత్తియందు పురుషకారపూ ర్వకముగ ఆశ్రయించునపుడు మహిమాతిశయములను చెప్పుచున్నది. ఇంకను ఈప్రబంధ మురహస్యార్థమును ప్రతిపాదించునదిగానుండును. అందులో, ద్వయయోజనయును పైగయోజింపబడినది. అనంతరము పాశురములన్నిటిచేతను ప్రతిపాదించినప్రకారముగ శేషకటాక్షలక్ష్యమగుపద్ధతిని అపేక్షించుప్రకారమును, వీఱ్ఱిరుందేళాలగుమ్ అను తిరువాయిమొళియందువలె దివ్యసింహాసనమందు గొప్పసభగావేంచేసియుండు ప్రకార మును ‹‹ పోఱ్ఱ్ అనిచేత్తికిమంగళాశాసనము చేయుప్రకారమును తమయాచకత్వమును కైంకర్యోపకరణములను యాచించువిధమును అందఱును ఒకనితోగూడియుండి సంతో షించుప్రకారమును ఫలమునకు తగినట్టుసాధనములు తమదిగాకవానిదైయుండు ప్రకార మును కైంకర్యవేషమును స్త్రీలనుశేషు విధమును కైంకర్యమునంగీకరించువాడగు శ్రియః పతికటాక్షము చేతకైంకర్యమును లభించి సుఖించు ప్రకారమును చెప్పిసమాప్తిబొందిం చుట. కాబట్టి గురుపరంపరావివరణపూర్వకముగ ద్వయవివరణమైనయీప్రబంధమే ప్రపన్నునికి ఎల్లప్పుడు అనుసంధింపదగినదైయినది ‹‹ జ్ఞాతవ్యంగురుపరంపరైయుం ద్వయముంఆనియున్నదిగదా. ఇదిగురుపరంపరావివరణము. ఈప్రబంధముచే ద్వయము సంగ్రహమైన తిరుమన్త్రియోజన సూచింపఁబడుచున్నది. ‹‹ నమోనారాయణాయ ...న్బర్ " అనిగదావీరుసాయించినది. ఈప్రబంధమందు ఊళిముదల్వన్ పఱ్ఱినాపత

అని శేషత్వప్రతిసంబన్ధియైన శేషిత్వమునున్న-నామ్అనియు, యామ్ అనియు, మః
చేచెప్పబడువాడును ప్రకృతికి వేరైనవాడునైభగవచ్ఛేష భూతుడైయుండెడి ఆ
క్క-స్వరూపమును చెప్పుటచేతప్రణవార్థము సంగ్రహింపబడినదైయునది. తూయో
వన్దునామ్, తూయోమాయోవన్దోమ్, అభిమానబంగమాయ్, మలర్ త్తైనంకామంగళ్ మః
అనుటచేనమః పదముయొక్క అర్థమును, కదిర్మదియంబోల్ ముగత్తాన్ నారా
అనియు; నారాయణన్ మూర్తిఅనియు, ఓంగియులగళంద ఉత్తమన్ పేర్ అః
టచేనారాయణశబ్దార్థమును, ఉఱవేల్ నమక్కింగొళిక్క వొళ్ళియాదు అనుటచే,
సర్వవిధబంధుత్వమును, ఎల్లైక్కు మేళ్ పిఱవిక్కు ముందనోన్ డుమ్ ళో మేః
మునక్కేనామాళ్ చెయ్వోం, అనుటచేచతుర్థ్యర్థమును సంగ్రహింపబడినది. ఇదిః
త్రవివరణము.

కఱవైకళ్ పిన్ శెన్ఱు ఇత్యాదులచేతను శెయ్యాదన శెయ్యోం! ఉన్నైయః
వందోమ్, శిఱ్ఱుమ్శిఱు కాలేవన్దున్నై చ్చేవిత్తుఅనియు నారాయణన్ అనియు
నాముడైయోంఅనియు. మాయనైమన్ను వడమదురై మైందనైఅనిఆరంభించి తీః
తూశాకుంఅనియు ఎంగళ్ మేల్ శాపమిళిందు అనియు, వరుత్తముంతీర్ందు మః
అనియు, చెప్పుటచేచరమశ్లోకార్థము సంగ్రహింపబడినది నారాయణన్ అః
పాఱ్కడలుళ్ పైయత్తుయిన్ఱ పరమన్ అనియు ఓంగి యులగళందవుత్తమన్ అః
శ్రీకృష్ణావతారమునకు మూలమగుమార్గమునుక్రమముగా చెప్పియిట్టివాడు మా
న్ను, ఇత్యాదిప్రకారముగ కృష్ణుడైవచ్చియవతరించి ఒరుత్తిమగనాయ్ పిఱం
లోరుత్తిమగనాయొళిత్తు" అని చెప్పుచున్న సమయమందు "పేయ్ములైనఞ్జుణ్డు
కడంకలక్కళియ క్కాలోచ్చి" అనిపూతనాశకట నిరాకరణము చెప్పిదానిపైగ
దరన్ అనివెన్నదొంగలించుటచే కట్టుటకు కొట్టుటకునుసులభుడైయున్నప్రకా
చెప్పి, మధురలోమల్లులను సంహరించి బలిష్ఠమగు కువలయాపీడమను యేనుగును
చినవిధమును చెప్పి, తర్వాత తాన్ తీంగునినైందుకరుత్తైప్పిఴైప్పిత్త కంజన్ వయిః
అనికంసునిగర్భమందు నిప్పైవానిని సంహరించిన వఱకు ఆనతిచ్చినదిగదా, ఇః
శ్లోకవివరణము.

ఇందు, మొదటిపాశురముచేత పిళ్ళాయొళుందిరాయ్ అనిపిళ్ళై పేః
పాయ్గైయాళ్వార్లను. అరెట్లనకృష్ణానుభవమునకు దేశకులాటచేతను ఈ మేః
చూడికొడుత్తరూపమునకు "వైయంతగళియిత్యాది శుడరాళియానడిక్కే శూః
శొన్నాలైఅనియు, మాలుంకరుంకడలే యెన్నోళ్ ప్రాయ్ ఇత్యాదిచే అంగః
ఆదరించిమాట్లాడియు" నప్పిన్నపిరాట్టిని పొందుటకు వృషభములను జయింఛిః
షించుట చేతను ఇందు పేయ్ములైనంజుండు అనుదానిని పూతనయొక్క విషః

ముగభుజించినాడనియు కళ్ళచ్చగడఁకలక్కఁటీయక్కాలోచ్చి అనివీరత్వమును చెప్పి యుమొట్టమొదటభగవద్విషయమందు ప్రవేశించినవారగుటచేతను పిళ్లైప్పెణ్ అను నదిపాయ్గైయాళ్వార్లను అనుట.

రెండవపాశురమందు పేయ్ప్పెణ్ణే అనునది పేయాళ్వార్లను. అదెట్లనగా తిరుక్కండేన్ ఇత్యాదిచేనాయకుని యొక్క వైభవమును సూచింపించుటచేతను మఱియును “కోవలనాయాని రైకళ్ళైయ్త్తుక్కుళులాదిన” అనికృష్ణగుణచేష్టితములను మాటాడుటచేతను నప్పిన్నైపిరాట్టికిగానువాడు వృషభములమీదువ్యాపరించిన ప్రకారమును ఆనతిచ్చుటచేతను పేయ్ప్పెణ్ణే అనునది పేయాళ్వార్లను అని భావము.

మూడవపాశురమందు “కోదుకులముడైయ పావాయ్” అనునది భూదత్తాళ్వార్లను. అదెక్కడనిన, శ్రీత్వాపత్తికి అనుగుణముగ అన్బేదకళియిత్యాదిచే “భక్తిని అనుసంధించి “పెరుంతమిళ్ణనల్లేన్ పెరుగు అనిన యనంతరము “పెరుగుమదవేళ్ణమ్ అనివానియొక్క అతిమానుష చేష్టితమునున్ను జాత్యుచితధర్మమునున్ను అనుసంధించి యు నప్పిన్నపిరాట్టిని లభించుటకు వృషభములనుజయించిన ప్రకారమును వచించుటచేతను “కోదుకులముడైయ పావాయ్” అనునది భూదత్తాళ్వార్లను అని యేర్పడుచున్నది. కాఁబట్టి మూవురును జ్ఞానదర్శనమును పొందినదశలలో కూడికదా ఉండునది.

నాలుగవ పాశురమందు “మామాన్ మగళే” అనునది వీరికి వెనుకటివారగుతిరుమళిశై యాళ్వార్లను, అదెట్లనిన. మహీసారక్షేత్రమగు తిరుమళిశైయందు (భార్గవోదీర్ఘసత్రేణ వాసుదేవం సనాతనం। అభిపూజ్యయథా న్యాయం = భృగుమహర్షిపురాతనుడగు వాసుదేవుని దీర్ఘసత్రమను యాగముతో, శాస్త్రోక్తముగ ఆరాధించునట్లు, యజ్ఞము చేయుచుండు కాలమందు భార్గవపత్ని గర్భిణియై తిరుమళిశైప్పిరానును కనుకొ్కనుటచే, “భార్గవీలోకజననీ” అనునట్టి శ్రీమహాలక్ష్మితోఁగూడ జనించిన భార్గవపుత్రులగుటచేతను (అన్లైప్పన్ తిరువేంగడత్తానైక్కాణ విళ్లైప్పన్ తిరుక్కడల్ కూప) అని శ్రీత్వభావనగా సంభాషించుటచేతను జ్ఞానదీప ప్రకాశమును ఎన్నదిక్కు విళ్లైల్లాముండ్లోవిలై; ఞానమాకి ఞాయిరాకి, ఆయనాకి యాయర్ మంగైయైతోళ్ విరుంబినాయ్” అనియు కృష్ణగుణచేష్టితములను నప్పిన్నైపిరాట్టి పురుషకారవైభవమునుచెప్పి ఇందు “మామామన్ మాదవన్ వైకుంద్దన్ అనుదానిని మాదవనై అనియు వైకుందచ్చెల్వనార్ అనియు సంభాషించుటచేతను “భార్గవుడును భార్గవియు భృగువుకు ఖ్యాతియందు సోదరులుగ సంభవించుటచేతను లోకమాతయగుశ్రీమహాలక్ష్మితోడ జనించినవారు లోకమునకంతయు మామగారగుటకు ఆటంకములేదు. తిరుమళిశైయాళ్వార్ల ఆభార్గవులకు పుత్రులగుటచే “మామాన్ మగళే” అనుటకు బాధకలేదు. అట్లియుగాక యశోదాదేవికి వెనుకజనించిన శ్రీకుంభులకొమార్తైయగునప్పి

నైనపిరాట్టియొక్క ఉనికిగలవా రౌటకరగుటచే మామాఙ్ మకళ్ అనిచెప్పినట్లు
చ్చును.

అయిదవపాశురమందు అమ్మనాయ్ అనునది కులశేఖర పెరుమాళ్ళను,
నిన కులశేఖరుడగుటచేతను "అల్లిమలర్ తిరుమంగై కేళ్వన్దన్నై నయందిళ వా
మార్ కళల్లి ప్పాళుదినిలేమత్తూడియెల్ కి యురైత్తవురైయద నై = చిన్నగొల్లపడు
తామరపువ్వును జన్మస్థానముగాగల శ్రీమహాలక్ష్మికి భర్తయగు శ్రీకృష్ణుని అ
యర్ధరాత్రియందు కలహించి (దానిచే) ఈడుపడి= (లోబడి) పచించినమాటల
భావనతో సంభాషించుటచేతను "ఏఱడర్తదుమ్ = వృషభములను ఒకేసారిగ
చినదియు" అనే శేల్వోన్తానడిమై త్తిఱమల్లాల్ =వృషభములను ఏడింటిని నిరసిం
వేంగడముడైయాన్ విషయమందు కైంకర్యముచేయుటతప్ప అనిచెప్పిన్నపిరాట్టి
యముగ వ్యాపరించిన వ్యాపారమునకు ఓడియు "ఆలినీళ్ కరుంబన్నవన్" అ
ధించి విశేషించి కృష్ణగుణచేష్టితములను అనుసంధించి యనుభవించుటచేతను,
ధమందు, నాళ్ ఐత్తుళాయి ముడినారాయణన్ అనుదానిని (వంకుకిందు న
య్ మాలైయుళ్ అవరై పెరుంతిరుమార్వనై = తుమ్మెదలు త్రొవ్వునట్టి మంచి
తాయ్మాలికను ధరించిన కొండవలె విశాలమైన వక్షస్థలముగలవానిని) అని
రాయణుని "నలంతికళ్ నారణ్ = మేలు అభివృద్ధియగుచుండు నారా
అని యానతిచ్చుటచేతను వీరికి శ్రీరంగయాత్రయందు నిత్యానుభవము జరుగు
నచేతను "నోళ్ ఉచ్చువర్కుం పుకుకిన్దవమ్మనాయ్, అనునది ప్రపన్నకులశేఖరుల
ళ్వారాళ్వార్లను అనుచున్నారు.

ఆఱవపాశురమందు, కోవలర్ దంపాట్కోడియే అనునది పెరియాళ్
ఎట్లనిన. చూడికొడుత్తనాచ్చియారువలె గోపజన్మమును ప్రతిష్ఠింప జేసిన
చేతను "కన్నియరోడెంగళ్ నంబి క్కరియపిరా ట్టావిళైయాట్టై = నీలవర్ణుడగు
మి గోపకన్యకలతోటి యాటను, అనునట్లు కణ్ణ కేశవన్నంబి పిఱందనిల్
రంభించి పండవన్ శెయ్ద కిరీడైయెల్లాం అనునట్లు కృష్ణగుణచేష్టితములను
ధించి తామానతిచ్చిన ప్రబంధమునందు విశేషించి యనుభవించుటచేతను,
వైయందు "ముకిల్ వణ్ణన్ అనుదానిని" "విట్టుచిత్తన్ మనత్తే కోయిల్ కొ
కోట్టాంకులిర్ ముగిల్ వణ్ణనై అని శెన్నియోంగు కడపటిపాశురమందు ఆనతిచ్చు
కోవలర్ తంపాట్కోడియే అనునది పెరియాళ్వార్లను అనుట.

ఏడవపాశురమందు నల్ చ్చెల్వంతంగాయ్ అనునది తొండరడిప్పొడి
ను. అదెట్లనిన, శ్రీత్వమునకనుగుణముగ "తన్నాలాదరం పెరుగవైత్త

లెనక్కురుగు మాలోయనియు పనియరుంపుతిరుమాలో అని తిరుమాలై ప్రబంధమందు తమభక్తిని సంభాషించుచు మన్నైక్కన్దమునేందుమైందనే; అని కళ్ళినమ్మేయ్త్తవెం దైకళ్ళిలైక్కుళ్ ఉళ్ళతిరుమాలై పాడుటచేతను కవళమాల్యానై క్కొన్దకణ్ణనై అనుటచేతను శ్రీమాలాకారులవలెఁ (శెణ్బకమల్లికైయొడు శెంగళునీరివాట్చి యెణ్బగర్ పూవుంకొణర్ందు) అని పలుదెఱగులగు పుష్పములు తెచ్చి సమర్పింప, దానిచేగలిగిన కైంకర్య శ్రీగల పెరియాళ్వార్లకు వెనుకటివారై వారికైంకర్యశ్రీని అనుసరించుటవలన వారికి సహోదరులనునట్లై (తిరుప్పళ్ళియెళుచ్చి) మేల్కొలుపులవిషయమందు విష్ణుచిత్తులసీభృత్యులను ఒకటిగాఁజేర్చి యనుసంధించుటచేతను "నల్చ్చెల్వంతంగాయ్ అనునది తొండరడిప్పొడియాళ్వార్లను అనుట. వీరును "శినత్తినాల్ తెన్నిలంగైక్కోమానై చ్చెఱ్ఱమనత్తుక్కినియానై, అనిన దానిని, ఇలంగైయర్ కులత్తై వాట్టియ వరిశిలై వానవరేఱే, అనియు "శెరువిలేయరక్కర్కోనై చ్చెఱ్ఱనం శేవకనార్ అని యానతిచ్చిరిగదా.

ఎనిమిదవపాశురమందు కోదరిక్కణ్ణినాయ్ అనునది తిరుప్పాణి యాళ్వార్లను అదెట్లనిన, తొండరడిప్పొడియార్తో సమానముగ "అడియార్కెన్నై యాట్పడుత్త విమలన్ అనియు ఎన్కణ్ణినుళ్ళన, అనియు కొండల్వణ్ణనై అనియారంభించి, యెన్నముదినైక్కండకణ్గళ్ అనుటచేతను. తదీయులకు ప్రేమగాఁజేయు భగవదనుభవమేగదా వీరిది. స్త్రీభావముచే గలిగినభక్తి అతిశయమై మొదటినుండి కడవఱకు పేశైయుండును. ఈపాశురమందు "పొల్లావరక్కనై కిళ్ళిక్కళైందానై అనుదానిని వీరును "శదిరమామదిళ్ శూళిలంగైక్కిఱైవన్ తలైపత్తుదిరవోట్టి యోర్వెంగణైయుయ్ త్తవన్ అని యానతిచ్చిరిగదా.

తొమ్మిదవపాశురమందు "యెంగళై మున్నమెళుప్పువాన్ వాయ్పేశుం నంగాయ్ అనునది నమ్మాళ్వార్లను. అదెట్లనిన "తిరుమాలుక్కురియ తొండర్ తొండర్ తొండర్ కోడకోపన్ అనినవిధమగు శేషత్వపూర్తిగలవారై "అవనడియార్ననిమాక్కలవి యిన్బమేనాళుంవాయ్క్క నంగట్కే" అనునట్లు భాగవతసమృద్ధిని సేవించుటయందు వృద్ధిపొందిన మనోరథముగలవారై "అన్యాపదేశమందును అడిచ్చియోమ్ అనుటచేతను, "శూట్టునన్ మాలైకళ్ "అనియారంభించి "అడలాయర్తం కొంబినుక్కే" యనినప్పిన్నై కిరాట్టికిగాను వృషభములను సంహరించిన వ్యాపారమును సంభాషించియు "పిన్నై కొంబనైత్తోళ్ మగిళ్ పీడుడై మున్నైయమరర్ ముళుముదల్తానే, యెన్నైనిగిళ్ న్నైనన్నెంజం తన్నైయకల్విక్క త్తానుంగిల్లాన్ అనియు "వేయ్ మలిపురై పిన్నైక్కు మణాళనై యిత్యాది చేతను "వాళ్ కెండై యొణ్కణ్ మడప్పిన్నై తన్

కేళ్ళ్వాయ్ తాళ్ కంచుకొండర్ తలైమేల్పునైందదేనే, ఆళ్ కిష్టా నాట్టియానారా
యుడైయమ్" అనియు యెరుత్తేళ్ తెళ్ళిచ్చిరైయినార్. ఇత్యాదులచేతను బహు
లుగ వారిపురుషకారవైభవమును ఆదరించి. ఎత్తిఱం అని "పిఱందవాఱు
తిరువాయ్మొళియందు కృష్ణచేష్టితములకు లోబడి "కురవైయాయ్చ్చియర్
వాయిమొళియందు అత్యంతవినయముతో అనుభవించియు ఎల్లాంకణ్ణన్ అనియు
డప్పోదువీర్ అనుదానిని "కణ్ణన్ కళ్ళలినైనణ్ణుమ్మనము డైయార్ అనుటచేతను
కారులను "ఎన్నెంజినాల్ నోక్కి-క్కాణీర్ అని జ్ఞాపకపఱచియు, ఈతిరుప్పా
"నాణాదాయ్నావుడైయాయ్" అనినదానిని "నాణుంనిరైవు మెనక్కింగిల్లై అని
డైయాయ్ అనుదానిని ఎన్నాఅనియు, నావియలాలిశైమాలైకళ్ అనివచి
"ఎంగళైమున్న మెళుప్పువాన్ వాయ్పేశుంనంగాయ్ అనునది నమ్మాళ్వార్లను
శురమందు "శంగొడుశక్కరమేందుంతడక్కైయ్యన్ పంగయక్కణ్ణానైప్పాడ" అ
పంగయక్కణ్ణనైయే. పంగయక్కణ్ణనెన్గో" అనియు "వీవిల్ కాలమిశై మాలై
అనియు ఆనతిచ్చిరిగదా.

పదవపాశురమందు యెల్లేయిళంగిళియే అనునది తిరుమంగైయాళ్వార్లను
నిన. "అడిగళడియేనినైయు మడియవర్కళ్ తమ్మడియాన్ " అని శేషత్వము
సీమాభూమియందు నిలుచుటచేతను స్త్రీత్వమునకనుగుణముగ "పేరాళన్ పేరోదు
అనియు "కడిమామలర్పావైయొప్పాళ్" అని లక్ష్మీసామ్యమును గలవారైయు
సంభాషించుటచేతను తదీయులను అనుభవించుటయందు ఆసక్తిగలవారై యా
చేతనునప్పిన్నైపిరాట్టి పురుషకారమును ఆదినుండియంతమువఱకు ప్రస్తావించియు
డప్పోదువీర్ అనినదానిని "పాల్ నామశైక్కయం నీరాడవప్పోనాళ్" అనియు కృ
చేష్టితములందు వ్యామోహముతో అనుభవించుటచేతను, ఇళంకిళియే అనునది
గైయాళ్వార్లను అనిభావము.

ఈవిధముగ, ఈపదిపాశురములకును గుణసామ్యముచేతను గౌరవింప
చేతను పదిగోపిమార్లను మేల్కొలుపునట్టి ముఖాంతరముగ ఆళ్వార్లను పదు
కొని ఆళ్వార్లకొమార్తె ఆండాళమ్మగారు అనుసంధించునట్లు నిశ్చయించినవారై

ఇట్లుభక్తులైముక్తులైయుండు ఆళ్వారాదులనుఅనంతరము నిత్యకైంకర్య
సక్తిగలనిత్యులను నిత్యానపాయినియగు శ్రీమహాలక్ష్మిని మేలుకొలిపి వీరినిముందు
నిత్యముక్తానుభావ్యుడగు సర్వేశ్వరుని ఆశ్రయించు ప్రకారము చెప్పబడుచున్న

ఇట్లుగురుపరంపరాపూర్వకమగుద్వయమునందుపురుషార్థమును ప్రతిపా
గదాతిరుప్పావైప్రబంధమునందానతిచ్చుచున్నారు. కాబట్టియేగదా,

ఈతిరుప్పావై ప్రబంధమును నిత్యానుసంధానముగ ఆదరించుకొనుచువచ్చిరి. కనుకనే ఆండాళమ్మగారికి దాసభూతులగు సమస్తమైనవారికిని నిత్యానుసంధేయముగా నుండుట సం౹ పగాయమైయున్నది.

## శ్రీవానమామలై స్వామి తిరువడిగళేశరణమ్.

రవు.—మార్గళి, వైయమ్, ఓంగి, ఆళి, మాయన్, పుళ్లు, కీళు, కీళ్వానం, నోట్రు, కట్రు, కనైత్తు, పుళ్లు, ఉంగళ్, ఎల్లే, నాయగన్, అంబరమ్, ఒరుత్తి, ముప్పదు, ఏట్ర, అంగణ్, మారి, అన్ఱి, ఒరుత్తి, మాలే, కూడార్, గ్గిళిల్ఱమ్, వంగమ్, తై.

ప్రతిపదటీకాతాత్పర్య స్వాపదేశ సహితమైన తిరుప్పావై ప్రబంధము సంపూర్ణము.

## ఆండాళ్ తిరువడిగళేశరణమ్.

### పెరియవాచ్చాంబిళ్లై తిరువడిగళేశరణమ్.

---

...హామం
... అలది, మణినీర్ -

శ్రీమతేరామానుజాయనమః.

...నక

నాచ్చియార్ తిరుమొళియందలి ౬ - తి - వారణమాయిరమ్.

## తిరుక్కణ్ణమఙ్గై యాణ్డాన్ ఆనతిచ్చినతనియన్.

అల్లినాళ్ తామరై మేలారణఙ్గినిన్తుణైవి,
మల్లినాడాణ్డమడమయిల్ — మెల్లియలాళ్,
ఆయర్ కులవేన్దనాకత్తాళ్, తెన్పుతువై
వేయర్ పయన్దవిళక్కు,

టీక. (ఆండాళమ్మగారు) అల్లినాళ్ తామరై మేల్ = అల్లితామరపువ్వుమీదు వాసముచేయు, ఆరణంగిన్ = పెరియపిరాట్టికి, ఇన్తుణైవి = ఇష్టమైనచెలియలును, మల్లినాడు = అడవితోచేరినప్రదేశమును, ఆండ = ఏలుచున్న, మడమయిల్ = ...నిసమృద్ధమైన వెంట... కలపూవ్వు... గూడు నెమలివలెనుండునదియు, మెల్లియలాళ్ = ... ఆగత్తాళ్ = అట్టిమృదుస్వభావ మృదుస్వభావముగలదియును, ఆయర్ కులవేన్ద... యనకు నిర్వాహకుడగు శ్రీకృ... ...గుటచే స్వామిని యెడబాసియుండలేక యాదవకులమ... ...యాదుబిడ్డ ...యై వక్షస్స్థానా శ్రయించినదియు, తెన్పుదువై - దక్షి... దలైనవానిచే అలంకరించి ... శ్రీ... = బ్రాహ్మణవంశమందవతరించిన ... రత్నమయమగుదీపమువంటివా...

కోదై - ఆణ్డాళు, ఆయనుక్కు - గొల్లకులమందవతరించిన శ్రీకృష్ణునికి, ఆగ - ... స్వార్థ్యరాలుగ, తాన్ కణ్డ కనావినై - తానుకనినకలను, శొల్ - ఆనతిచ్చినదిన తూయ - పరిశుద్ధమగు, తమిళ్ మాలై - ద్రావిడభాషారూపమాలికయగు, ఈరైన్దు పదిపాశురములను, వల్లవర్ - అనుసన్ధింపగలవారలు, వాయుం - తమమనస్సుకు ... పైన, నల్ - విలక్షణులగు, మక్కళై - పుత్రులను (శిష్యులను) పెట్రు - ... మగిళ్వరే - ఆనన్దింపగలవారగుదురు.

తా.—శ్రీవైష్ణవులచే కొనియాడబడు శ్రీవిల్లిపుత్తూరుకు నిర్వాహకులగు పెరి ... ళ్వార్లపుత్రికయగు, అండాళమ్మగారు యాదవకులమందవతరించిన శ్రీకృష్ణునికేధర్మ ... యగునట్లుతానుకనిన స్వప్నమును ఆనతిచ్చినదియై పరిశుద్ధమైనద్రావిడప్రబంధమ ... యగుపదిపాశురములను అనుసంధింపగలవారలు తమకిష్టమగువిలక్షణులగు పుత్ర ... శిష్యులను లభించి ఆనందింపగలవారలగుదురు. [ఈమెతో సమానవయస్సుగల పడుచ ... ఈప్రబంధమును అభ్యసించిరేని శ్రీకృష్ణునివంటి వరునిలభింపగలుగుదురు. పురుష ... అభ్యసించిరేని పెరియాళ్వార్లవలె భగవత్ప్రియులైనపుత్రులను లభించిసంతోషిం ... వారలగుదురు.]

ఆండాళ్ తిరువడిగళేశరణమ్.

పెరియవాచ్చాంబిళ్లైతిరువడిగళేశరణమ్.

అడివరవు—వారణమ్, నాళై, ఇన్దిరన్, నాన్ శ్రీశై, కదిర్, మత్తళం, వా ... ఇమ్మై; నరిశిళై, కుంగుమమ్, ఆయన్, కరుప్పూరమ్.

---

నాయ్చ్చియార్ తిరుమొళి. నా - తి - మొ. ౬ - ౭. పాశురములు.

౬. నాఱునఱుమ్పొళిల్ మాలిరుంశోలై నమ్బిక్కునాన్,
నూఱుతడావిల్ వెణ్ణెయ్ వాయ్ నేర్న్దుపరావివైత్తేన్,
నూఱుతడానిఱైన్దఅక్కారవడిశిల్ శొన్నేన్,
ఏఱుతిరువుడైయాన్ ఇన్ఱువన్దివైకొళ్ళుజ్గోలో.

టీక. నాఱు - పరిమళమువీచుచుండెడు, నఱుం - మంచి, పొళిల్ - తో ... చేచుట్టబడిన, మాలిరుంశోలై - దక్షిణమధురకు సమీపమందుండు తిరుమాలిరుం ... యనుదివ్యదేశమున వేంచేసియుండు, నమ్బిక్కు - పూర్ణుడగుసుందరభుజములుగలస్వా ... నాన్ - దాసురాలగునేను, నూఱుతడావిల్ - నూరుగంగాళములలో, వెణ్ణెయ్ - వెన్నను, వాయ్ - నోటిచేత, నేర్న్దు - చెప్పి, పరావివైత్తేన్ - ... (మఱియు) నూఱుతడానిఱైన్ద - నూరుగంగాళములునిండుగ, అక్కార ...

నపాయస రూపముగనుండు రసరూపప్రసాదమును సమర్పించునట్లుగ, శొన్నేన్ - నో రారచెప్పితిని, ఏఱు - పైగవృద్ధిబొందెడు, తిరువుడైయాన్ - సంపత్తుగలసర్వేశ్వరుడు, వన్దు - నాయొద్దకువేంచేసి, ఇవై - పైచెప్పినవాటిని, ఇన్రుకొళ్లుఙ్గొలో - ఇప్పుడుఆర గించునో! అనుచున్నారు.

తా.— పరిమళగంధమువీచెడు మంచితోటలు చుట్టునుగలిగియుండునదియు దక్షిణమధురకు సమీపమందున్నదియునగు తిరుమాలిరుంజోలైలో వేంచేసియుండుకల్యా ణగుణపరిపూర్ణుడగు సుందరబాహుస్వామికి దాసురాలగు నేను నూఱుగంగాళములవె న్నయు నూఱుగంగాళములనిండుగ దివ్యామృతరూపమగు పాయసమును (అక్కా రవడిసెలను) వాగ్దానము చేసితిని. పైపైనభివృద్ధిజెందుచుండు సంపదగల సర్వేశ్వ రుడుదాసురాలి ప్రార్థనను అంగీకరించి ఇపుడే వేంచేసి ఆరగించునా! అనుచున్నారు.

౭. ఇన్రువన్దిత్తనైయుమముదు శెయ్దిడప్పెఱిల్, నాన్
ఒన్రునూత్తాయిరమాగక్కొడుత్తుప్పిన్నుమాళుం శెయ్వన్,
తెన్రల్ మణఙ్గమழுంతిరుమాలిరుంశోలైతన్నుళ్,
నిన్రపిరానడియేన్మనత్తేవన్దునేర్పడిలే,

టీక. తెన్రల్ - దక్షిణపుగాలియైనది, మణంకమழும் - పరిమళముగొనివచ్చి వీచుచుండు, తిరుమాలిరుంశోలైతన్నుళ్ నిన్ర - తిరుమాలిరుంశోలైయందు వేంచేసియుండు, పిరాన్ - ఉపకారకుడైనస్వామి, ఇన్రు - నేడు, వన్దు - నాయద్దకువేంచేసి, ఇత్తనైయుం- వెన్నయు, అక్కారవడిశిలునగువీనిని, అముదుశెయ్దిడప్పెఱిల్ - ఆరగించినట్లులభిం చిన, నాన్ - నేను, ఒన్రు - ఒకగంగాళమునకు, నూత్తాయిరమాగ - నూఱువేలు గంగాళములుగ, కొడుత్తు - సమర్పించునదిగాక, అడియేన్ - దాసురాలగునాయొక్క, మనత్తు - మనస్సున, వన్దునేర్పడిల్ - వచ్చికూడినట్టయిన, పిన్నుం - అంతకుమీదు, ఆళుంశెయ్వన్ - కాలతత్వముండువఱకును (ఆచంద్రార్కము) దాస్యమునుగూడ జేయుదును.

తా.— మలయమారుతము పరిమళముతో విసురుచుండు తిరుమాలింజోలైలో వేంచేసియున్న యుపకారకుడగు సుందరబాహుస్వామి నేడు వేంచేసి వెన్నయుఅక్కా రవడిశిలునగువీనిని ఆరగించినయెడ దాసురాలగు నేను ఒకటికినూఱువేలు గంగాళములుగ సమర్పించుటయేగాక దాసురాలగు నాహృదయమందు వచ్చిసమీపించినట్లైన మఱియు కాలతత్వమండు ప[illegible]తమును యావదాత్మభావిగదాస్యముగూడ చేయుచుందును.

ఆండాళ్ తిరువడిగళేశరణమ్,
పెరియవాచ్చాంబిళ్లైతిరువడిగళేశరణమ్.

---

శ్రీమతేరామానుజాయనమః.

## శ్రీకులశేఖరాళ్వార్ వైభవము.

## పెరుమాళ్ తిరుమొழி.

కుంభేపునర్వస్సౌజాతం కేరళే*చోళపట్టణే,
కౌస్తుభాంశంధరాధీశంకులశేఖరమాశ్రయే.

ఈయాళ్వార్లు కొల్లినగరమందు - కలి ౨౮ - వ దిర్యైన పరాభవ
మాశిమాసం, శుక్లపక్షమ్ ద్వాదశి శుక్రవారము పునర్వసు నక్షత్రమందు శ్రీకౌస్తు
భులై చంద్రవంశపురాజగు దృఢవ్రతులకు పుత్రులై తిరువవతరించిరి.

వీరురథగజ తురగపదాతియను చతురంగబలముతో విరోధులనంతయు
పాఱదోలి, ఏకచ్ఛత్రాధిపతిగా బలహీనులను బలవంతులుబాధింపకుండునట్లు
యుదారులై రాజ్యభారము వహించుచుండు సమయమందు తాము స్వతంత్రు
నియంతయనియు అభిమానించి యుండిరి. ఈవిధమునసుండు వీరిని శ్రియఃపతియు
యవిభూతినిర్వాహకుడును సర్వనియామకుడగు శ్రీమన్నారాయణుడు తననిర్హేతు
కకృపచే, వీరిరాజసతామసగుణములుయణగి సత్వగుణము తలయెత్తునటుల కటా
తమస్వరూపరూపగుణవిభూతులనంతయు చక్కగా సేవింపజేయగా వానినంతయు
ద్భక్తిరూపమగు జ్ఞానముచేసేవించియీవిభూతి సంసారి చేతనులు దేహమేయా
భ్రమిసి దేహభోగమును అనుభవించి సర్వేశ్వరుని స్మరింపక విషయాదులందుసం
టయు ఆచేతనులమధ్యతాముండుటయును కనుగొని,ఏనుగుమీదునుండి రాజ్య
డు సుఖరూపమైన రాజభోగమంతయువీరికి అగ్నివలెతోచగా సహింపజాలక
ణాళ్వార్ సకలభోగములను సవాసనగవిడిచి సర్వలోకశరణ్యుడగు పెరుమాళ్లన
యించినట్లు, వీరునుఅల్పసుఖములందాశ విడిచి శ్రీరంగమహానగరమందు ఆదిశేష
శయనించియుండు శ్రీరంగనాథుని కన్నులార సేవింపవలయునను ఆశతో.కో
టిశ్రీవైష్ణవసమూహమును సేవించియనుభవించుట యెప్పుడోఅని శ్రీరంగయాత్ర
ప్రతిదినమును ఆశగలవారై అక్కడనిత్యవాసముచేసి, గంగానది మొదలగుతీర్థము
మేలైనస్వామిపుష్కరిణినిగలదియైపరమహర్షులు మొదలగు మహాత్ములునిత్యవాసము
తిరువేంగడమను తిరుమలయందు, మృగాదిజన్మములు చెట్టుచేమ ... లైన పుట్టు
గ్రహించి వాసముచేయనాశించి, ఇట్లుతదితరదివ్యదేశముల కని ... కి సేంచేసి య
చ్చట సేవించి, వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథపుత్రుడై ... యవతరింపగ అ
ములు ఇతిహాసశ్రేష్ఠమైన శ్రీరామాయణముగ ప్రకాశించినదవ్వ ... ముల ... యత దానినే

* కోళ అని పాఠాన్తరము.

నుంచుకొనిరి. అట్టిశ్రీరామాయణకాలక్షేప సమయమందు "చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణాం | ఏకశ్చరామోధర్మాత్మాకథంయుద్ధంభవిష్యతి ॥ =భయంకరులగు రాక్షసులు పదునాలుగువేలమంది, ధర్మస్వరూపియగు శ్రీరాములు ఒకరు, యుద్ధము ఎట్లుగాజరుగగలదో అని వాల్మీకిమహర్షి వ్యసనపడుచున్నారు. అనుటనువిని ఈ యాపదను పెరుమాళ్లకు ఏమిహానికలుగునో - స్వామికిసహాయమెవ్వరునులేరే అని తాము చతురంగబలముతో పెరుమాళ్లకు సహాయముగా వేంచేసిరి, మంత్రులు దీనికి సదుపాయమును కొందఱిని ఎదురుగపంపి పెరుమాళ్ళు ఆపదునాలుగువేల దుష్టరాక్షసులను తామొక్కరే సంహరించిమరలి వేంచేసిరి. అని తెలియపఱచగా. అదివిని కులశేఖరాళ్వార్లుమిగుల సంతోషించి యూరికి వేంచేసిరి. మంత్రులు మనరాజుకు శ్రీవైష్ణవసహవాసముచే ఇంతటికష్టము గలిగినది.

వారిసహవాసమును తొలగింపవలెనని తలచి, యీయాళ్వార్లయొక్క గృహారాధన పెరుమాళ్లయొక్క నవరత్నశోభితమైయుండు హారమును, దాచియుంచి, వీరికిఅంతరంగులగు శ్రీవైష్ణవులు అపహరించిరని వారిమీదనిందమోపగా; అందుకు ఆళ్వార్లు వారు అపహరింపరనిశపథముచేసి, పాముఉన్నకొడుమునందుచేయి యుంచి జయించిరి. మంత్రులు చూచివెఱచి తమదోషమును విన్నపించి, ఆదండను వీరిముందుంచిదండము సమర్పించిరి.

అనంతరము ఆళ్వార్లు భగవద్విముఖులమధ్యనుండు స్థితిని ఓర్వజాలక తమకుమారునికి రాజ్యాభిషేకంబొనర్చి, రాజ్యభారమును వారియందుంచి పరమవిరక్తులై తమకంతరంగులగు శ్రీవైష్ణవసహవాసముతో శ్రీరంగధామమునకు వేంచేసి, శ్రీరంగధామునికన్నులార సేవించి నోరారస్తుతించి యనుభవించి, ఆయనుభవముచేగలిగిన యధికప్రీతిచే, భగవద్భాగవతవైభవమును అందఱును గుర్తెఱిగియుజ్జీవించునట్లు ముకుందమాలయును, పెరుమాళ్ తిరుమొழிఅనుదివ్యప్రబంధమును ఆనతిచ్చిలోకమును సుఖింపజేసిరి.

## ముదలాయిరమ్, పెరుమాళ్ తిరుమొழிలో, నాలాంతిరుమొழி.

అవ.-౧-పా ప్రకృతిపురుషవివేకముగల మనుష్యజన్మమైనను, పైగ, పరరక్షణమునకు తగిన క్షత్రియజన్మమువలదు. తిరుమలలో నేను తిర్యక్కుజనింపదగును అనుచున్నారు.

౧. ఊనేఱు శెల్వత్తుడఱ్పిఱవియాన్ వేణ్డేన్,
ఆనేఱ్ఱేழ் వెన్ఱానడిమై తిఱుమలైయిల్,
కానేఱుశంగమిడత్తాన్ కాణేఱిడత్తుక్
కోనేరివాழுంకురుకాయ్ప్పిఱప్పేనే.

టీక. ఊన్ - వానిని కోషింపని [illegible] నేను, ఆన్ ఏఱుఏழ் - ఏడు వృషభములను, వెన్ఱాన్ - (నప్పిన్నపిరాట్టికై) [illegible] దినతిరువేఙ్గడముడైయాన్ విష

యమందు, అడిమైత్తిఱంఅల్లాల్ - కైంకర్యముచేయుటకంటె, ఊళ్ఏఱు - మగమాంసము పెరిగెడు, శెల్వం - అనిత్యమగు సంపదతో గూడిన, ఉడల్ - మనుష్యజన్మమును, వేణ్డేన్ - ఇష్టపడను, అనిన "అయిననీవుకోరియుండునది ఏ... తూళ్ఏఱు - శేషత్వముచే వంగియుండెడు, శఙ్గం - శ్రీపాంచజన్యమును, ... తన్ - ఎడమహస్తమునగలవానియొక్క, వేఙ్గడత్తు - తిరుమలయందలి, కోనే... మ్కరిణియందు, వాழுం - వసించెడు, కురుకుఅయ్ప్పిఱప్పేనే - నీటికోడిగా పుట్టుదును.

తా.—భగవత్కటాక్షముచే స్వరూపజ్ఞానమును బొందిన దాసుడగు నేను దేవినిమిత్తమైవృషభములను ఏడింటినిజయించిన తిరువేంగముడైయానుకు కైం... చేయునదితప్పకండ పెరుగునట్టి నిలుకడలేని సంపదగల మనుష్యజన్మమును నేను ఇష్ట... మతియేమనిన; శేషత్వజ్ఞానముగల శ్రీపాంచజన్యమును ఎడమచేతియందు ధరించిన స్వామియొక్క తిరుమలయందలి స్వామిపుష్కరిణియందు నీటికోడిగానైనను పు... అనుచున్నారు.

అవ.—౨పా. ఈలోకమునందలి సుఖానుభవముకంటెను, స్వర్గసుఖా... అతిశయమైయుండునుగదా, అట్టిసుఖము లభించెనేని ఏమిచేయుదురనిన, అట... క్రిందుతోలగ జేసికొనిన భూలోకసుఖానుభవమగు రెండునులభించినను నా... ములేదనుచున్నారు.

ప్ర-అ

౨. ఆనాద శెల్వత్తరమ్బై యర్ కళ్ దట్ చూழ்,
వానాళుమ్ శెల్వముమ్మణ్ణరశుమ్ యాన్ వేణ్డేన్,
తేనార్ పూఞ్జోలై త్తిరువేఙ్గడచ్చునైయిల్,
మీనాయ్ప్పిఱక్కుంవిదియుడైయేనావేనే.

టీక. ఆనాద- నశింపని, శెల్వత్తు - యౌవనమను సంపత్తుగల, అరమ్బైయర్ - రంభ మొదలగుఅప్సరసలు, తన్ - తన్ను, చూழ் - చుట్టుకొనియుండగ, వాన... శెల్వముమ్ - స్వర్గమునుఏలుటఅను సంపదయు, మణ్ణరశుమ్ - భూలోకమున్... యాన్ వేణ్డేన్ - నేనుకోరను, తేన్ ఆర్ - తేనెచేనిండియుండు, పూ... - ... జోలై - తోటలచేచుట్టబడిన, తిరువేఙ్గడం - తిరుమలయందుండెడు, ... - (మీ... లయందు, మీనాయ్ప్పిఱక్కుం-మత్స్యముగానైననుజనింపదగిన, విదియుడై - ... విధినిగలవాడనుగానగుదును.

తా.—ఏకరీతిగనుండు యౌవనముగల రంభాది అప్సరస్త్రీలు తన్ను ... యుండగస్వర్గలోకమునుయేలునట్టిసంపదయైనను భూలోకము నేలుట... నైనను నేను ...

నిండియుండు పూఁదోటలుగల తిరుమలయందలి దొనలయందు మత్స్యముగా
దగిన ప్రాప్తముగలవాడను గావలయును అనుచున్నారు.

పా. అ.—పారతంత్ర్యజ్ఞానముగల మనుష్యజన్మము లభించెనేని, ఉపయోగిం
చున్నారు.

పిన్నిట్టశడైయానుం పిరమనుమిన్దిరనుమ్,
తున్నిట్టుప్పుగలరియ వైకున్దనీళ్ వాశల్,
మిన్వట్టచ్చుడరాళి వేఙ్గడకోన్దానుమిళ్ళుమ్,
పొన్వట్టిల్ పిడిత్తుడనే పుగప్పెఱువేనావేనే.

క. పిన్నిట్ట - అల్లికగల (చిక్కుబడ్డ), శడైయానుం - జడలుగలరుద్రుడును,
- బ్రహ్మయు, ఇన్దిరనుం - ఇంద్రుడును, (ముందుగబోవలయునను యిచ్ఛ
ట్టు - ఒకరినొకరు త్రొక్కిటిసి, పుగల్ అరియ - ప్రవేశింపగూడనట్టి, వైగు
మపదమునకు సమానమైన, నీళ్ - ఖ్యాతికలిగిన, వాశల్ - ద్వారమునం
- మెఱుపులను, వట్టం - చుట్టబడియుండునట్లు, శుడర్ - తేజస్సుగలిగియుం
- సుదర్శనాళ్వానును ధరించిన, వేఙ్గడకోన్దాన్ - తిరువేఙ్గడముడైయాను,
- కుప్పళించి ఉమియునట్టి, పొన్ - బంగారముచే చేయబడిన, వట్టిల్ - పా
త్తు - చేతనెత్తుకొని, ఉడనే పుగప్పెఱువేనావేనే - గర్భగృహమునందు
స్వామి సమీపమున నిలుచునంతటి భాగ్యమును పొందగలవాడనుగావ

.—జటామండలధారియగు రుద్రుడును, బ్రహ్మయు ఇంద్రుడును ముందుముం
పవలయును అనునాశచే త్రొక్కిటిసి, ప్రవేశింపగూడని పరమపదమునకు సమా
ముగల ద్వారమునందు మెఱుపులనే గుండ్రముగా చేయబడినదో అనునట్టి
చక్రత్తాళ్వారును ధరించియుండు తిరువేంగడముడైయాను ఉమియునట్టి పా
ని గర్భగృహమందుచొచ్చి, స్వామి సాన్నిధ్యమందు నిలుచునంతటి
ను గావలయును.

అ.—మనుష్యదేహము - రాజైనవానికిని మొకటియే, కనుక అట్టిదేహ
, తిరువేంగడముడైయానుకు వినియోగపడునట్లు తిరుమలలో స్థావర
లును అనుచున్నారు.

వేఙ్గైయులవుతేణ్ పాణ్డలుళ్,
డులుపూమోక్కళ్ములైకళ్ కాణ్బదఱుక్క,

పణ్పగరుంవణ్ణినజ్గళ్ పణ్ పాడుం వేజ్గడత్తు,
శెణ్బగమాయ్ నిఱ్కుం తిరువుడై యేనావేనే.

టీక. ఒణ్ - చక్కని, పవళం - పగడములను, వేలై - గట్టునతెచ్చి ... త్రోసెడు, తణ్ - చల్లని, పాఱ్కడలుళ్ - క్షీరాబ్ధియందు, కణ్తుయిలుం - ... నిద్రజేయు, మాయోన్ - ఆశ్చర్యభూతుడగు తిరువేంగడముడైయానుయొక్క, ... ణైగళ్ - తిరువడిగళను, కాణ్బదఱ్కు - సేవించుటకొఱకు, పగరుం - ... నట్టి, పణ్ - రాగమునకు, (అనుగుణముగ) వణ్ణినజ్గళ్ - తుమ్మెదలైనవి, పణ్ ... రాగములనుపాడెడి, వేజ్గడత్తు - తిరుమలయందు, శెణ్బగమాయ్ నిఱ్కుం - సంపెంగై నిలుచునట్టి, తిరువుడైయేనావేనే - భాగ్యము పొందువాడుగానైనను అగుదునే

తా.- మంచిపగడములనుగట్టునశేర్చునట్టిదియుక్రమనుపోగొట్టునట్టిదియునగు సముద్రమందు, జగత్ రక్షణార్థముగ శయనించియుండు ఆశ్చర్యభూతుడగు తిరువేంగడ ముడైయానుయొక్క శ్రీపాదారవిందములను సేవించుటకొఱకు, తాము గానముచేయు మునకనుకూలముగ తుమ్మెదలైనవి, గానము చేయు తిరుమలయందు సంపంగిచెట్టు గలుగునట్టి భాగ్యముగలవాడ నగుదునా, అనుచున్నారు.

అవ.—అయిదవపాశురమందు పరిమళములేని తంబకము అను చెట్టుగా కలిగిన చాలును అనుచున్నారు.

౫. కమ్బమదయానై, క్కళుత్తగత్తిన్ మేలిరున్దు,
ఇన్బమరుమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్,
ఎమ్బెరుమానీశనెఱ్పిల్ వేజ్గడమలైమేల్,
తమ్బగమాయ్ నిఱ్కుం తవముడైయేనావేనే.

టీక. కమ్బం - చూచినవారలందఱిని వణకునట్లుచేయు, మదం - యానై - ఏనుగుయొక్క, కళుత్తకత్తిన్ మేల్ - మెడమీదు, ఇరున్దు - ... అను పెద్దరీకముతోచునట్లుండి, ఇన్బఅమరుం - సకలభోగములను ... శెల్వముం - సంపత్తును, ఇవ్వరశుం - ఈరాజ్యపరిపాలనమును, యాన్ ... భూతుడనునట్టి జ్ఞానముకలిగిన) నేను, వేణ్డేన్ - కోరను, ఎమ్బెరుమా... కారకుడైన, ఈశన్ - సర్వేశ్వరునియొక్క, ఎఱ్పిల్ - అందమైన, వేజ్గ... తిరుపతికొండమీదు, తమ్బకమాయ్ నిఱ్కుం - తంబకవృక్షముగానిలుచు... నావేనే - తపస్సునుగలవాడనుగా నగుదును.

లను, అఱైక్కిన్ఱేన్-(దాసునిరక్షింపగోరి) పిలుచుచున్నాను, ఎన్నే-రక్షింపక
చుటకు కారణమేమి అనుచున్నారు.

తా.—ఇంద్రుడు వర్షింపజేసిన వర్షమునకు గొల్లలు గోవులు బాధనొంది
దగ్గఱ చేరికందినయొకకొండనెత్తి, యవిశ్రమపడకుండునట్లుగాపాడినదార్ఢ్య
డవా! మధురజలముగల యేటివలె నుండువాడవా లేడికండ్లవంటి కన్నులుగల
వలలోదగులుకొని తత్తఱపడుచున్న నన్నుకటాక్షింపకున్నావే. జగత్కారణభూ
శ్రీరంగధామా! దాసునిరక్షింపగోరి మిమ్మును పిలుచుచున్నాను. రక్షింపక
చేయుటకుగారణమేమి అనుచున్నారు.

3౭. పా. అ.—ఇట్లు పిలుచుచుండగను, స్వామి, శోకింపవలదని
దుచే, తమ్ము వినాగ నాకొకబంధువున్నారా, ఇతరపురుషార్థము నపేక్షించు
యున్నారా, ఆర్తధ్వనివినియు, నిద్రించువిశేషముజూడగ వీరిహృదయము,
కఠినమైనదోఅని చింతించుచున్నారు.

3౭. తెళివిలాక్కలఙ్గల్ నీర్ శూழ் తిరువరఙ్గత్తుళోఙ్గుమ్,
ఒళియుళార్ తామేయన్ఱే తన్దైయుంతాయుమావార్,
ఎళియదోరరుళుమన్ఱే యెన్దిరత్తెమ్బిరానార్,
"అళియన్ నమ్పైయల్" ఎన్నార్ అమ్మవో! కొడియవా

టీక, తన్దైయుంతాయుమావార్ - మేలుచేయుతండ్రియు ప్రియమునుచేయు
యును అయినవారు, తెళివిలా - తేటనొందుట కవకాశములేక పైపైగ ప్రవహించు
చే, కలంగల్ నీర్ శూழ்-కలిసియుండుతీర్థముగల కావేటిచేచుట్టబడిన, తిరువరంగత్తు
కోవెలలో (పరమపదమునుండి యిక్కడికివచ్చినవెనుక) ఓంగుం - అతిశయించు
ఒళియుళార్ - తేజస్సుగల, తామేయన్ఱే - స్వామియేగదా, ఎన్ తిఱత్తు - నా
విషయమునజేయునది, ఎళియదోరరుళన్ఱే - ఒకతూరి చల్లగ కటాక్షించుటయే
ఎమ్బిరానార్ - దాసునికుపకారకుడగువాడు, "నంపైయల్ - మనబాలుడగు
నం అళియన్ - మనకృపకుదగినవాడు" ఎన్నార్ - అని ఒకమాట చెప్పినవారు
అమ్మ ఓ!- దాసుని ఆర్తధ్వనివినియు నిద్రజేయుచున్నారే! (ఓయమ్మ)!
వాశే - (వీరిస్వభావమో?) మిక్కిలి కఠినముగానున్నదే అనుచున్నారు.

తా.—హితపరుడగు తండ్రియు ప్రియకారియగుతల్లియును, తేటనొంద
నట్లు పైపైగ ప్రవాహమువచ్చుటచే కలిసియుండు కావేటిచే చుట్టబడిన శ్రీరంగము
పరమపదమునుండియిక్కడికి వేంచేసిన వెనుక అధికరించిన తేజస్సుగల స్వామియే

అట్టి తేజోవంతుడగుస్వామి, నావిషయమునచల్లగ ఒకతూరి కటాక్షించుటయేగదా కోరునది, ఉపకారకుడగు నాస్వామి, "మనపిల్లవాడగు వీను మనకృపకుపాత్రుడు" అనినవారుకారు - ఓయమ్మా! వీరి స్వభావము మిగులకఠినము. అనుచున్నారు.

౩౭. పా - అ.— (మేంపొరుళ్) మహాభారతమునకు చరమశ్లోకమువలె ఈ ప్రబంధమునకు ఈపాశురమైయున్నది. (మహాభారతమనునది = శ్రుతిసాగరము) సర్వేశ్వరుడు క్షీరాబ్ధిని మథనము చేసి దేవతలకు అమృతము నిప్పించెను. శ్రీవేదవ్యాస భగవానులు, వేదములను మథనముచేసి సర్వాహ్లాదకరమగు మహాభారతమును సంసారులకు ఆత్మోజ్జీవనముకొఱకై ఇప్పించిరి. దేవతల కీశ్వరుడు ఇప్పించిన యమృతము బంధకము, శ్రీవేదవ్యాసులు సంసారులకిప్పించిన మహాభారతము, సంసార విమోచనమునకు కారణమైనదిగదా. అట్టి మహాభారతమును శ్రీభగవద్గీతయైనది, అసార మనిపించినది, దానిలో సారమైనది చరమశ్లోకము. దీనిని చెప్పుటకై క్రిందువిస్తరించినది. దీనికిపైగ "ఇదం తేనాతపస్కాయ" అనియారంభించి, ఈచరమశ్లోకముయొక్క గౌరవమునుచెప్పుచున్నది, ఆవిధముననే, ఈపాట్టుయొక్క అవతారికకొఱకైగదా ఈప్రబంధముగలిగినది దీనికిపైగ మిగతప్రబంధమును ఈపాశురమందు చెప్పబడు అర్థమునందు నిష్ఠగలవారియొక్క మహిమను చెప్పుచున్నది, చరమశ్లోకము ప్రపత్తిని విధించునదిగానుండును, దానియందు రుచిగలవారియొక్క అనుసంధానమైయుండును ద్వయము. ఈపాశురము ద్వయార్థమునున్ను, ద్వయనిష్ఠులవిషయమందు ఈశ్వరునికి గలిగెడుసంతోషమును చెప్పుచున్నది.

౩౭. మేంపొరుళ్ పోగవిట్టు మెయ్మ్మైయైమిగవుణర్న్దు,
ఆంబరిశఱిన్దుకొణ్డు ఐమ్బులనగత్తడక్కి,
కాంబఱత్తలైశిరైత్తు ఉన్కడైత్తలైయిరున్దు, వాఴుమ్
శోంబరైయుగత్తిపోలుం శూఴ్పునలరఙ్గత్తానే!

టీక. శూఴ్పునలరఙ్గత్తానే - కావేటిచేచుట్టబడియుండు శ్రీరంగమునందుబవ్వళించినవాడవా, మేంపొరుళ్ - మేలైన ప్రాకృతపదార్థములను, పోగవిట్టు - నిశ్శేషముగబోగొట్టి, మెయ్మ్మైయై - ఆత్మవస్తువును, మిగవుణర్న్దు - ఉన్నరీతిని దెలిసికొని, ఆంబరిశు - చేతనునికి కైఙ్కర్యమేపురుషార్థమని, అఱిన్దుకొణ్డు - తెలిసికొని, ఐమ్బులన్ - పంచేన్ద్రియములను, అగత్తడక్కి - విషయాంతరములందు పోనీయక తనలోపల నేయుంచి, కాంబఱ - ఉపాయాంతరములందు తమకుండు సంబన్ధమును సమూలముగపోనిచ్చి, తలైశిరైత్తు - తమవద్దనుండు పాపములనుతొలగించి, ఉన్ తలైక్కడై - నీసన్నిధియందు, లేక మీముంగిటియందు, ఇరున్దు - దృఢముగనుండి, వాఴుం - వాసము చేయువారై,

శోంబరై - తమయొక్క మేలునందు తాము ప్రయత్నపడనివారలనుగూర్చి, ఉ
లుమ్ - సంతోషించువాడవుగదా.

తా.—కావేటిచేచుట్టబడియుండు శ్రీరంగమందు శయనించినవాడవా! ...
మగు ప్రాకృతవస్తువులను సవాసనగ బోగొట్టి, ఆత్మవస్తువిట్టిదని చక్కగా
ఈచేతనునికి కైంకర్యమేఫలమని గుర్తెఱిగి, పంచేంద్రియములను ఇతరవిషయ
పోనీయక తనవశమందుంచుకొని, ఇతరోపాయములను సవాసనగవిడిచి తమ
త్యములను నశింపజేసి, నీసాన్నిధ్యమందు స్థిరముగనుండి వసించుచు, తమ క్షే
గూర్చి తాము చింతింపకఁడు వారలవిషయమందు సంతోషించువాడవుగదా,
చున్నారు.

ఆ. పా - ఆ,—పైగ, ఆరుపాశురములును, ఈజ్ఞానముగలవారియొక్క
కులమును చెప్పుచున్నది. వీరికి, †"పయిలుంశుడరొళి, నెడుమాఱ్కడిమై" పం
జన్మవృత్తాదులచే తక్కువయైయున్నవారైనను, ఇట్టిజ్ఞానముగలవారుగానున్నయెడ
శ్యులనుచున్నారు. ఈపాశురముచే, ఎంతతక్కువ కులములందుజన్మించినవారైనను
మందు నిష్ఠగలవారు అయిరేని తిరుత్తుழాయితో సమానముగ, ఈశ్వరునికి
పబడినవారు అగుదురు. అనుచున్నారు.

౬౯. అడిమైయిల్ కుడిమైయిల్లా అయల్ శదుప్పేదిమారిల్,
కుడిమైయిల్ కడైమైపట్ట కుక్కరిల్ పిఱప్పరేలుమ్,
ముడియినిల్ తుళబంవైత్తాయ్ మెయ్కழ்ఱకన్బుశెయ
అడియరైయుగత్తిపోలుం అరఙ్గమానగరుళానే!

టీక. ముడియినిల్ - శిరస్సున, తుళపం - తిరుత్తుழాయిమాలికను,
య్ - ధరించినవాడగు, అరఙ్గమానగరుళానే - శ్రీరంగమున శయనించి యు
మీ, అడిమైయిల్ కుడిమైయిల్లా - సర్వేశ్వరుడగు నీకు దాస్యముచేయుటయే
ర్థమని తలంచనివారై, అయల్-దానికి ఇతరముగ, శదుప్పేదిమారిల్ - ఋక్
మ అథర్వణమను నాల్గువేదములను అధ్యయనము చేసినవారికంటెను, కుడిమై
దాస్యమునందు, కడైమైపట్ట - ప్రాప్తిగలవారలై, కుక్కరిల్ - పంచమ
తక్కువకులమందు, పిఱప్పరేలుం - జనించిన వారైనను, మెయ్కழ்ఱ
యుండు నీ శ్రీపాదములయందు, అన్బుశెయ్యుం - అంతరంగవృత్తిచేయు,
దాసభూతులను, ఉగత్తిపోలుం - ప్రేమించువాడవుకదా నీవు.

తా.—శిరస్సున తులసీమాలికను ధరించియుండు శ్రీరంగశాయీ! ...
దాస్యమొనర్చుట పురుషార్థమని తలపక దానినివదలి, నాలుగువేదములను ...

† తి - వా - మొ. ౩, ప, ౭, తి, ౮ ప. ౧౧౦ - తి.

కన్నను దేవరవారికి దాస్యమొనర్చునట్టివారు పంచములకంటె తక్కువకులస్థులైనను సమీపించిన నీతిరువడిగళందు, అంతరంగకైంకర్యముచేయు దాసవర్గమును ప్రేమించువాడవుగదా నీవు అనుచున్నారు.

౪౦. పా - అవ—తక్కువకులమమాత్రమేగాక, ఎంతతక్కువ నడవడికగలవారను "మేంబొరుళ్"-యందుచెప్పిన జ్ఞాననిష్ఠగలవారైరేని, వారు పైకర్మఫలమునుఅనుభవింపవలసినదిలేదు - అనుచున్నారు.

౪౦. తిరుమఱుమార్వ! నిన్నై చ్చిన్దైయుళ్ తిగழవైత్తు,
మరువియమన త్తరాగిల్ మానిలత్తుయిర్గళెల్లామ్,
వెరువుఱక్కొన్ఱుశుట్టిట్టీట్టియవినైయరేలుమ్,
అరువినైప్పయనతుయ్యార్ అరఙ్గమానగరుళానే!

టీక.—తిరు - శ్రీమహాలక్ష్మిని, మఱు - శ్రీవత్సమనుమచ్చను, మార్వ - వక్షస్థలమునగలవాడై, అరఙ్గమానగరుళానే - శ్రీరంగశాయీ, మానిలత్తుయిర్గళెల్లాం - ఈగొప్పభూమియందుండువారందఱును, వెరువుఱ - ప్రపంచమంతయువడకునట్లు, కొన్ఱు - చంపియు, శుట్టిట్టు - దహించియు, (ఈప్రకారములచే) ఈట్టియ - సంపాదించిన, వినైయరేలుం - పాపముగలవారైనను, నిన్నై - శ్రియఃపతియగునిన్ను, శిన్దైయుళ్ - తమమనస్సున, తిగழవైత్తు-ప్రకాశించునట్లుంచి (రక్షింపించుటకు పిరాట్టియనియు, రక్షించుటకునీవనియు, దీనినితెలియపఱచుటకు ఆచార్యుడుతప్ప ఇతరులు కారనియు ఇట్లుతెలిసి యుజ్జీవించుటకు తాననియు, అనుసన్ధించి) మరువియమనత్తరాగిల్ - దృఢమైన అధ్యవసాయముగలవారైయుండిరేని, అరువినైప్పయనతుయ్యార్ - (అట్టివారలు) మహాపాతకములయొక్క ఫలమును - అనుభవింపరు.

తా.—శ్రీమహాలక్ష్మిని శ్రీవత్సమను మచ్చను వక్షమునగల శ్రీరంగశాయీ! ఈ మహాపృథ్వియందుండువారందఱును, లోకమంతయువడకునట్లు, చంపియు, కాల్చియు ఈవిధముల నార్జించినపాపములుగలవారైనను, శ్రియఃపతియగు నిన్ను తమహృదయమందుంచి, లేక (పిరాట్టిపురుషకారభూతురాలు, రక్షకుడునీవు, ఈజ్ఞానమునుగలుగ జేయువారు ఆచార్యులు, తెలిసికొని యుజ్జీవింపవలసినవాడు తానుఅని యధ్యవసించి) దృఢముగనుండిరేని అట్టివారలు ఘోరపాతకఫలములను అనుభవింపరు అనుచున్నారు.

౪౧. పా - అవ.—వీరలకు జన్మవృత్తాదులచేగలుగు కొఱతలేకుండుట మాత్రమేగాదు, తమతో సంబంధించిన సంసారులకును తమయంగీకారముచే పరిశుద్ధత్వముగలుగునంతటి అతిశయముగలవారు - అనుచున్నారు.

౪౧. వానుళ్ళారఱియలాగ్గావానవా! ఎన్బరాగిల్,
తేనులాన్తుళపమాలై శెన్నియా! ఎన్బరాగిల్,
ఊనమాయినకళ్ శెయ్యుమూనకారకర్గళేలుమ్,
పోనగం శెయ్ద శేడం తరువరేల్ పునిదమన్రే.

టీక.—ఊనమాయినగళ్ శెయ్యుం - తాముయితరులనుచంపుటయేగా, కారకర్గళేలుం - ఇతరులచే హింసింపజేయువారైనను, వానుళ్ళార్ - బ్ర అఱియలాగా - ఇటువంటిదని విభాగించి తెలిసికొనజాలని, వానవా - పరమ దువేంచేసియుండువాడవా, ఎన్బరాగిల్ - అనివచించువారై, తేన్ ఉలాం. వించుచుండు, తుళపమాలై - తిరుత్తుళాయిమాలికను, శెన్నియా - శిరస్సు వాడవా, ఎన్బరాగిల్ - అనివచించువారలైన, పోనగం శెయ్ద శేడం - అట్టివా గించి మిగిలినప్రసాదమును, తరువరేల్ - కృపచేసిసాదించిరేని, అన్రే - అప్పుడే మిక్కిలి పరిశుద్ధులగుదురు.

తా.—తాముగా ఇతరులను చంపుటయేగాక, ఇతరులనుగొని చం నను, బ్రహ్మాదులచేతను తెలిసికొనుటకు దుర్లభుతగు పరమపదనాథా! అని స్రవించుచుండు తులసీమాలికను శిరమునధరించినవాడవా! అనియు వచించు అట్టివారారగించిన శేషమును కృపచేనొసగిరేని, అప్పుడేమిగుల పావనులగుదురు.

౪౨ - పా - అవ.—జన్మవృత్తాదులచే తక్కువవారైయున్నను, ఈజ్ఞా వారు, జన్మవృత్తాదులచేతను, ఈజ్ఞానముచేతనుఅధికులైయుండువారికి, సర్వే సమానముగ పూజ్యులై, జ్ఞానాదిప్రతిగ్రహ వ్యవహారములకు తగినవారు అను

౪౨. పళుదిలావొళుగలాఱ్ఱు ప్పలశదుప్పేదిమార్గళ్,
ఇళ్ళికుల త్తవర్గళేను మెమ్మడియార్గళాగిల్,
తొళుమినీర్ కొడుమిన్ కొళ్ళిన్ నెన్రునిన్నోడు మొక్క
వళిపడవరుళినాయ్ పోల్, మదిళ్ తిరువరఙ్గత్తానే!

టీక.—మదిళ్ - ప్రాకారములచే చుట్టబడిన, తిరువరఙ్గత్తానే - శ్రీరం శయనించినవాడవా, ఒళుగల్ - బ్రహ్మామొదలు తమవఱకు దీర్ఘముగవచ్చి పరంపరలో, పళుదిలా - దోషములేనివారలై, పలశదుప్పేదిమార్గళ్ - నా అభ్యసించినవారలారా, ఎమ్మడియార్గళాగిల్ - "మాదాసులు" అని అభిమానిం డువారలు, ఇళ్ళికుల త్తవర్గళేను - మిక్కిలి హీనజన్మమునపుట్టినవారలైనను,

రలు, తొழుమిన్ - వారలను సేవింపుడు, కొడుమినెన్ఱు - మీవద్దనుండు విశేషార్థముల నవారలకు ఉపదేశింపుడు అనియు, కొళ్ళినెన్ఱు - వారివద్ద విశేషార్థములుండిన విని కృతార్థులుకండు, అనియు, నిన్నోడు మొక్క (నిన్ను మించిన పూజనీయులు లేనందున) నీకు సమానముగనైనను, వழిపడ - వారలను ఆరాధించి సద్గతికిపోవునట్లు, అరుళి నాయ్ కృపచేసినవాడవైతివి.

తా.—సప్తప్రాకారావృతమగు శ్రీరంగమందు ఆశ్రితులనిమిత్తమై శయనించిన వాడవా! "బ్రహ్మసృష్టి మొదలుకొని పరంపరగ దోషములు లేనివారై, నాల్గు వేదములను అధ్యయనము చేసియుండువారలారా, మాదాసులు మిగుల నీచకులస్థులైనను, మీరు అట్టి వారిని సేవింపుడు, మీకు దెలిసినవిశేషార్థములను వారలకు ఉపదేశింపుడు, వారికి దెలిసి నవిశేషార్థములను మీరువిని కృతార్థులు కండు, నాతో సమానముగవారిని ఆరాధించి సద్గతికిపొందు" అనియు కృపతో ఆనతిచ్చినవాడవైతివి. (ఇది భగవద్వచనము.)

(భక్తిరష్టవిధాహ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేపివర్తతే। సవిప్రేన్ద్రో మునిశ్శ్రీమాన్ సయతిస్సచపండితః। తస్మైదేయంతతో గ్రాహ్యం సచపూజ్యోయథాహ్యహం)

౪౩. పా - అ. క్రిందుచెప్పిన జన్మవృత్తాదులకుపైగ జ్ఞానాధికులు నైన వీరు, జన్మవృత్తాదులు లేక ఈజ్ఞానముగలవారిని భగవదనుగ్రహముచే గలిగిన వైలక్షణ్యమును యోచింపక, కర్మనిబంధనమైన తక్కువకులమునే తలచి తక్కువగ భావించిరేని, ఆక్షణ మునవారలే చండాలురు. అనుచున్నారు.

౪౩. అమరవోరంగమాఱుం, వేదమోర్నాన్గుమోది,
తమర్గళిల్ తలైవరాయ, శాదియన్దణర్గళేనుం,
నుమర్గళై ప్పழிప్పరాగిల్, నొడిప్పదోర్ళవిల్, ఆఙ్గే,
అవర్గళ్ తాంపులైయర్ పోలు మరంగమానగరుళానే.

టీక. అరంగమానగరుళానే, శ్రీరంగధాముడా, ఓర్ - అసమానమగు, అంగ మారుం - వేదములకు అంగములగు (శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము) (శిక్షయందు వేదముయొక్క స్వరము మొదలైన వానిలక్షణములు చెప్ప బడును. వ్యాకరణమునందు శబ్దలక్షణము చెప్పబడును. ఛందస్సునందు శ్లోకలక్షణములు వివరింపబడును. నిరుక్తమునందు వేదమంత్రోక్తశబ్దములకు అవయవార్థములతోడ అర్థము చెప్పబడును. జ్యోతిషమునందు వేదముచే విధింపబడిన కర్మములకు ఉచితములైన కాలములను ఎఱుగదగినమార్గము చెప్పబడును. కల్పమునందు యాగాదిక్రియలను చేయవలసినరీతులు బోధింపబడియుండును.) ఓర్ - అద్వితీయమగు, వేదంనాన్గుం - నాలు

గు వేదములు (ఋుక్, యజుస్, సామ, అధర్వణ) ములను, అమర - సాఙ్గ ఓది - అధ్యయనముచేసి, తమర్ గళిల్ తలైవరాయ - దాసభూతులలో శ్రే శాది అందణర్గళేనుం-బ్రాహ్మణజాతియందు వుద్భవించినవారలైనను, నుమర్గ వారియొక్క భక్తులను, పళిప్పరాగిల్ - వారలయొక్క జన్మవృత్తాదులను జూచి తుశేని, అంగే - అక్కడనే, నొడిప్పదోరళవిల్ - ఆక్షణమునందే, అవర్ గళ్ వారలే, పులైయర్ పోలుం - చండాలురు అవుదురు.

తా.—శ్రీరంగధామా! అద్వితీయమగు వేదములను వేదాంగములను సా ముగ అధ్యయనముచేసి దాసవర్గములో శ్రేష్ఠులై బ్రాహ్మణకులమందు జనించిన వా దేవరవారిభక్తులను వారిజన్మము, నడవడి మొదలగు వానినిజూచి దూషింతురే డనే ఆక్షణమునందే వారలే చండాలురు అవుదురు అనుచున్నారు.

౪౪. పా - అ.—క్రిందు ప్రతిపాదించిన యర్థములు సంభవించు న బ్రహ్మాదులకును లభింపనరుదైన పురుషార్థమును, తిర్యక్ జాతిలో జనించిన వా లభించినవెనుక చెప్పవలసినదేమియున్నదియని, అన్యాపదేశముచే స్వలాభము ముగించుచున్నారు.

౪౪. పెణ్ణులాంశడై యినానుం పిరమనుమునై ఎక్కాణ్బాన్,
ఎణ్ణిలావూళ్లియూళ్లి తవంశెయ్ దార్ వెళ్గినిఱ్ప,
విణ్ణుళార్ వియప్పవందు ఆనైక్కన్ఱరుళై యీన్ద,
కణ్ణుఱా, వునై యెన్నో కళై కణాక్కరుదుమాఱే.

టీక. పెణ్ - గంగాదేవి, ఉలాం - సంచరించెడు, శడైయినానుం - గలరుద్రుడును, పిరమనుం - బ్రహ్మయు, ఉనై ఎక్కాణ్ బాన్ - సర్వేశ్వరు ఇట్టివాడని విశదీకరించిచూచుటకు, ఎణ్ణిలా ఊళ్లియూళ్లి - లెక్కింపశక్యము కకల్పములు, తవఞ్జెయ్దార్ - తపస్సుచేసినవారు, వెళ్గినిఱ్ప - నిన్నుచూ చెందియుండగా, విణ్ణుళార్ - నిత్యసూరులు, వియప్ప - ఆశ్చర్యపడునట్లు ఇచటికివచ్చి, ఆనైక్కు - గజేంద్రాళ్వానుకు, అన్ఱరుళైయీంద - ఆనాడు చికృపచేసిన, కణ్ణుఱా - నిర్దయుడగువాడా, (గజేంద్రునివలె తొండరడిప్పొడి ర్లను విషయాంతరములనుండి మరలించి రక్షింపనందుచే వచించినమాట) ఉన్నై వాడగు నిన్ను, కళైకణా - రక్షకముగా, కరుదుమాఱు - తలచుప్రకారము ఎట్లు?.

తా.—గంగాధరుడును జటామండలధారియునగు రుద్రుడును, బ్రహ్మ వారిని, విమర్శించిచూచుటకు, అసంఖ్యాకములగు ననేకకల్పములు

నీసేవకలుగమిచేలజ్జ నొందియుండగా, నిత్యసూరులు ఆశ్చర్యపడునట్లు వచ్చి, ఆనాడు గజేంద్రుని విషయమున కరుణించినట్లు (దాసునివిషయమును) కరుణింపనివాడవా ! (ఇచ్చట విషయాంతరపరుడగునన్ను త్వరగా మరలించి రక్షింపలేదే అని) ఇట్లు ఆశ్రిత పక్షపాతియగునిన్ను రక్షకుడుగా ఎట్లు తలపనగును, అనుచున్నారు.

౪౫. పా - అ. గ్రంథసమాప్తియందు, కువలయాపీడమను కంసుని యేనుగును నశింపజేసినట్లు, తమయొక్క ప్రతిబంధకమును, పోగొట్టిన విధమునుజెప్పి, శ్రీరంగ నాథులయొక్క ప్రీతియే తమకు ప్రయోజనమని, నిగమించుచున్నారు.

శ్రీ ౪౫. వళవెళ్ళుంతవళమాడ, మదురైమానగరంతన్నుళ్,
కవళమాలియానైకొన్ఱ, కణ్ణనై అరఙ్గమాలై,
తుళవత్తొండాయతోల్శీర్, త్తొండరడిప్పొడిశొల్,
ఇళైయపున్ కవిదైయేలు, మెంబిరార్కినియవాఱే.

టీక. వళవెళ్ళుం - మిక్కిలి అందముగల, తవళం - మిక్కిలి తెల్లగానుండు, మాడం - మేడలుగల, మదురైమానగరంతన్నుళ్ - శ్రీమధురానగరమునందు, కవళం - మదించిన, మాల్ - గొప్పదగు, యానైకొన్ఱ - కువలయాపీడమను ఏనుగును చంపిన, కణ్ణనై-ఆశ్రితసులభుడగు కృష్ణుడైన, అరంగమాలై-శ్రీరంగమునందుండు ఆశ్రితవ్యామోహుని, తుళబత్తొండాయ-తిరుత్తుళాయ్ అళ్వానుకు దాస్యముచేయువారై,తోల్శీర్-స్వాభావికమగు భగవత్ శేషత్వముయొక్క యెల్లయందుండువారైన, తొండరడిప్పొడి - శ్రీతొండరడిప్పొడియాళ్వార్లు, శొల్ - పాడించిన, (తిరుమాలైయనుప్రబంధము) ఇళైయ - చిన్నపదములుగలవియు, పున్ కవిదైయేలుం - కవిత్వమునందు దోషములు గలదిగానుండినను, ఎంబిరాఱ్కు - నాకుపకారకుడగు పెరియపెరుమాళ్ళకు, ఇనియవాఱె - ఇంపుగానుండుట యేమిఆశ్చర్యము?.

తా.—మిగుల సుందరమైధవళముగానుండు మేడలుగల, ఉత్తరమధురానగరమున మదించియున్న, గొప్పదగు కువలయాపీడమను చంపిన ఆశ్రితసులభుడగుశ్రీకృష్ణుడు శ్రీరంగధామమందు ఆశ్రితవ్యామోహముచే శయనించియుండు విధమును సేవించి, తిరుత్తుళాయ్ ఆళ్వానుకు దాస్యమొనర్చువారై స్వాభావికమగు భగవచ్ఛేషత్వకాష్ఠయందుండువారైనతొండరడిప్పొడియాళ్వార్లు, ఆనతిచ్చిన తిరుమాలైయను ప్రబంధము, చిన్న పదములు గలిగి దోషయుక్తమగు కవిత్వముగానుండినను,నాకుపకారకుడగు శ్రీరంగధామునికి ఇంపుగానుండు విధము ఏమియని. (ఈడుపడు)=లోబడుచున్నారు.

అడివరవు.—కావల్, పచ్చై, వేదం, మొయ్త్త, పెండిర్, మఱం- పులై, వెప్పు, నుళ్ను, నాట్టినాన్, ఒఱు, నమనుం, ఎళ్, గంధు, మెయ్,ఊదు,విరుంబి,

ఇనిదు, కుడదిశై, పాయ్, పణి, పేశు, కంగై, వెళ్ళం, కుళిత్తు, పోదెల్లాం, ఉంబర్, ఢూర్, మనం, తవం, ఆర్తు, మెయ్, ఉళ్ళం, తావి, మళై, తెళి, రుళ్., అడిమై, తిరు, వాన్, పళుదిలా, అమర, పెణ్, వళవెళుం, కదిర్.

తిరుమాలై సంపూర్ణమ్.

శ్రీతొండరడిప్పొడి యాళ్వార్ తిరువడికళేశరణమ్.

పెరియవాచ్చాంబిళ్లై తిరువడికళే శరణమ్.

జీయ్యర్ తిరువడిగళే శరణమ్.



శ్రీమతేరామానుజాయనమః.

## తిరుప్పాణాళ్వార్ వైభవమును, ప్రబంధావతారికయు.

శ్లో॥ అథతత్రకులే న్తిమేరమారమణోరక్షితలాంఛనాంశజః।సమజాయతపాణ్ స్సుకవిః కార్తికమాసివైధభే॥ అను దివ్యసూరిచరిత్ర వచనప్రకారము తిరుప్పాణ్ ర్లు, కలి. ౨౭౬౨, దుర్మతినామ సం॥ వృశ్చికమాసం, రోహిణీనక్షత్రమున ఉఱైయూ రిలో అన్త్యజకులమునందు, శ్రీవత్సాంశజులై యవతరించిరి. వీరు హస్తమునందు ధరించి పెరియపెరుమాళ్లను గానముచేయుచుండగ శ్రీలోకసారంగ మహామునీం ప్నమున పెరుమాళ్లు పైయాళ్వార్లను నీచులనిభావింపక మీరు మీభుజములందు పించుకొనిరండని యానతిచ్చిరి, అట్లు వారు వేంచేపించుకొని వచ్చునపుడు, అమలనాదిప్పిరాన్ ప్రబంధము.

ప్రణవమువలె మిగుల సంగ్రహముగను, వేదము, వేదోపబృహ్మణమైన రతమువలె అతివిస్తరమునుగాక పదిపాశురములై, సంగ్రహముగను సర్వాధి సులభముగ గ్రహింపదగియుండును, శ్రీరామాయణ మహాభారతములలో థావ్యతిరిక్తకథలను సహితముచెప్పచున్నది. తిరువాయ్మొళి, ఇట్టికొటితలు అన్యాపదేశ స్వాపదేశములు, సామానాధికరణ్యానిర్ణాయకము, త్రిమూర్తి తన్నిషేధనిర్ణయము, మొదలగు క్రమములు కలిగియుండును. తిరునెడున్దాండ గనున్నను, అట్టిదియె. తిరుమాలై ప్రబంధములో అట్టి క్రమలేకపోయినను లాభ ప్రియాప్రియములను ప్రతిపాదించియుండును. తిరుప్పల్లాండుకు ఇట్టి లేకపోయినను త్రివిధాధికారియొక్క గుణాగుణములను ప్రతిపాదించుచు లనున్ను గలిగియుండును. పరత్వవ్యూహ విభవములను ప్రతిపాదింపక అర్చా గ అవతరించిన శ్రీరంగశాయియగు పెరియపెరుమాళ్ళను, గర్భగృహమండ

స్తంభము యొద్దనిలిచి నోరారస్తోత్రముచేసినది ఈప్రబంధముచేత నగుటచే, సకలప్రబంధములలో-ఈప్రబంధమతివిలక్షణమైయున్నది. ఈతిరుప్పాణాళ్వార్లు “తులంగళాయవీరిరండిలొన్ఱిలు మ్ఱిఅన్ఱిలేన్” అనునట్లు తమ్మును నాలుగువర్ణములకు వెలుపటివారినిగ తలచియుందురు. శ్రీరంగనాథులగు పెరియపెరుమాళ్ళను అట్లే తలచియుండిరి. నిత్యసూరులు నాలుగువర్ణములలో చేరినవారుకారుగదా. ఆళ్వారాదులు రెండుగట్లను ఆశ్రయించినవారని శ్రీతొండరడిప్పొడియాళ్వార్లయొక్క భావము, వారికంటెను వీరు పరోపదేశమును, పరులను నిరసించుటయును, అనుభవవిరోధమని, పెరియపెరుమాళ్ళయొక్క తిరువడిగళుకు తమశిరమును బాగగునట్లు, ఆశ్రీరంగధాములనే యనుభవించుచున్నారు. “భావోనాన్యత్రగచ్ఛతి” శ్రీరామావతారముతప్ప, అన్యమందు నాహృదయము మరలదు” అనిన (తిరువడి) ఆంజనేయులవలె వీరును పెరియపెరుమాళ్ళనుతప్ప ఇతరమునుగుర్తెలుగని ప్రకారమును శ్రీవైకుంఠము, క్షీరాబ్ధి, సంతోషించి వేంచేసియుండు నూటయెనిమిది దివ్యదేశములన్నియును పెరియపెరుమాళ్ళే అయినట్లు ఆసమస్తదివ్యదేశములందలి సౌందర్యగుణ చేష్టితములన్నియు పెరియపెరుమాళ్ళయందు సేవింపవచ్చును, పెరియపెరుమాళ్ళయొక్క సౌందర్యమును, ఐశ్వర్యమును, పరమపదమందు సంకోచించి యుండును, సర్వేశ్వరుడనిన, ఇష్టములేనివారును సేవించి యనుభవించునట్లుండుటచేత సౌలభ్యముచేగలుగు మహిమాతిశయము, ఇచ్చటనైయుండును. ఈయాళ్వార్లు తమకు, ప్రాప్యులును, ప్రాపకులును, రుచినిజనింపచేసినవారును, విరోధినివర్తకులును, పెరియపెరుమాళ్లే అనితలచియున్నారు, ఇతర విషయములందు, అరుచియును, భగవద్విషయమందు ద్వేషములేమియు గలిగినంతమాత్రముననే, పెరియపెరుమాళ్ళు తమయొక్క స్వరూప రూపగుణ విభూతులను ఆగుపఱచగానేవించి, అనుభవించి ప్రీతులగుచున్నారు. “ఆనయైనం హరిశ్రేష్ఠ”అని, సుగ్రీవమహారాజును ముందుంచి, శ్రీవిభీషణాళ్వానును కృపతోపిలిచినట్లు “ఉఱకడత్తైయిరుందవాళుంశోంబర్”=తమక్షేమమునువదలి నీసన్నిధిని నిత్యకైంకర్యముచేయుచు వసించువారైన” శ్రీలోకసారంగమహామునులనుపిలిచి “(నమ్పాడువానై)”= మమ్మగానముచేయువారిని, పిలుచుకొనిరండనిన; వారును వెడలి, తిరుప్పాణాళ్వార్లను, (అరుళిప్పాడ్)=శ్రీరంగధాములు పిలుచుచున్నారనిన; వీరును “అడియేనడియేన్ పాణన్”=దాసుడను దాసుడను, పాణన్ అనువాడను అని వెనుదీయగా, వదలక, భుజముమీద వేంచేపించుకొనిపోవునపుడు, మార్గమునందు తొమ్మిదిపాశురములనుపాడి భగవత్సన్నిధానమందు పదవపాశురమును విజ్ఞాపనముచేసి ముగించుచున్నారు.

---

పెరియనంబిగారు అనతిచ్చినతనియన్,

శ్లో॥ ఆపాదచూడమనుభూయహరింశయానమ్,
మధ్యేకవేరదుహితుర్ముదితాన్తరాత్మా,
అద్రష్టతాంనయనయోర్విషయాంతరాణాం,
యోనిశ్చికాయమనవై మునివాహనన్తమ్.

టీక.—కవేర - కవేరమహర్షియొక్క, దుహితుః - కుమార్తెయగు కావేరి యొక్క, మధ్యే - నడుమ, శయానం - శయనించియుండెడు, హరిం - పెరుమాళ్ళను, ఆపాదచూడం-పాదాదికేశాంతముగ, అనుభూయ-అనుభవించి, ముదితాన్తరాత్మా - సంతోషించినమనస్సునగలవారై, నయనయోః-నేత్రములకు, విషయాంతరాణాం - ఇతరవిషయములలో, అద్రుష్టతాం-చూపులేమిని, యః - ఎవరు, నిశ్చికాయ - నిశ్చయించుకొనిరో, తంమునివాహనం - ఆశ్రీలోకసారంగమహామునీంద్రులను వాహనముగా గలిగిన తిరుప్పాణి ఆళ్వార్లను, మనవై - సేవించుచున్నాడను.

తా.—ఏతిరుప్పాణాళ్వార్లు తాము ఉభయకావేరీమధ్యమందు శయనించియుండు శ్రీరంగధాములయొక్క పాదారవిందములు మొదలుకొని శిరమువఱకు దివ్యవిగ్రహమును అనుభవించి సంతుష్టులై - ఇతరవిషయములందు దృష్టియుంచకుండ నిశ్చయించుకొనిరో; శ్రీలోకసారంగమహామునీంద్రులను వాహనముగాగలిగిన తిరుప్పాణియాళ్వార్లను త్రికరణశుద్ధిగ సేవించుచున్నాడను.

తిరుమలైనంబిగారుసాదించినది.

కాట్టవేకణ్డపాదమ్ కమలన్నల్లాడైయున్ది,
తేట్టరుమ్ముదరబన్దమ్ తిరుమార్వుకణ్డంశెవ్వాయ్,
వాట్టమిల్ కణ్గళ్ మేని మునియేత్తినిపుగున్దు,
పాట్టినాల్ కణ్డువాళుమ్, పాణర్ తాళ్ పరవినోమే.

టీక.—కాట్టవే- శ్రీలోకసారంగమహామునీంద్రులు తాముభుజముపైనెక్కించుకొని చూపగానే, కణ్డ - సేవించిన, కమలపాదం - పాదారవిందములను, నల్లాడై - పీతాంబరమును, ఉంది - బ్రహ్మకుపుత్పత్తిస్థానమైనబొడ్డును, తేట్టరు - వెలపొడుసు మణులచేచెక్కబడిన). ఉదరబందం - బంగారుపట్టెమొలత్రాడును, తిరుమార్వు - లక్ష్మిదేవికి కేళీగృహమగు వక్షస్థలమును, కణ్డం - కణ్ఠమును,

ఎఱ్ఱని యధరమును, వాట్టమిల్ - వాడనటువంటి తామరకుసమానమైన, కణ్ణళ్ - నేత్రములను, మేని - ఇట్టి సౌందర్యముగల దివ్యమంగళవిగ్రహమును, మునియేఱి - మునివాహనులై, తనిపుకున్దు - తాను ఒంటరిగా లోపలప్రవేశించి, పాట్టినాల్ - ద్రావిడ పాశురములచే, కణ్డువాళ్లుం - అనుభవించియుజ్జీవించు, పాణర్ - తిరుప్పాణాళ్వారులయొక్క, తాళ్ - శ్రీపాదములను, పరవినోమే - స్తోత్రముచేసినవారమైతిమి.

తా.—శ్రీలోకసారంగమహామునులు, పెరియపెరుమాళ్ళను సేవింపఁజేయగ సేవింపఁబడిన పాదారవిందములను, మంచిపీతాంబరమును, బ్రహ్మకు పుట్టుచోటగు బొడ్డును, మనోజ్ఞమై రత్నఖచితమగు బంగారు పట్టెమొలత్రాటిని, లక్ష్మీనివాసస్థలమగు వక్షమును, కంఠమును ఎఱ్ఱనియధరమును, వాడని తామరవంటి నేత్రములను, ఇట్టిసుందరమైన దివ్యమంగళవిగ్రహమును, మునివాహనులై ఒంటరిగ లోగప్రవేశించి, ద్రవిడప్రబన్ధముచే అనుభవించియుజ్జీవించు తిరుప్పాణాళ్వార్ల శ్రీపాదములను నమస్కరించిన వారమైతిమి.

అవతారిక.—పెరియపెరుమాళ్ల తిరువడిగళు సౌందర్యము తమపైబడి తమ్మను దాసునిగాఁజేసికొన్నది అనుచున్నారు,

౧. ॐ అమలనాదిపిరానడియార్క్కెన్నై యాట్పడుత్త.
విమలన్, విణ్ణవర్కోన్ విరైయార్పొழிల్వేఙ్గడవన్,
నిమలన్నిన్మలన్నీదివానవన్నీళ్మదిళ్అరఙ్గత్తమ్మాన్, తిరు
క్కమలపాదమ్వన్దెన్కణ్ణినుళ్ళనవొక్కిన్ఱదే.

టీక.—అమలన్ - పరిశుద్ధుడై, ఆది - జగత్కారణభూతుడై, పిరాన్ - నానోపకారకుడై, ఎన్నై - సంసారపరవశుడగునన్ను, అడియార్క్కు - తనదాసులకు, ఆళ్పడుత్త - దాసభూతునిగాజేసిన, విమలన్ - దోషరహితుడును, విణ్ణవర్కోన్ - నిత్యసూరులకుస్వామిగానుండువాడు,(లీలావిభూతియందుండువారలనుయేలుకొనుటకు) విరైయార్ - పరిమళముచేనిండిన, పొழிల్ - తోపులుగల, వేంగడవన్ - తిరుపతికొండయందువసించువాడై, నిమలన్ - కళంకములేనివాడును, నిన్మలన్ - హేయగుణములేనివాడును, నీతివానవన్ - శేషశేషీభావమును తప్పనిపరమపదమునందు నుండువాడును, నీళ్మదిళ్ - పొడవైనప్రాకారములుగల, అరఙ్గత్తు - శ్రీరంగమునకయనిందుండు, అమ్మాన్ - సర్వస్వామియైనవానియొక్క, తిరు - పెరియపిరాట్టిచేప్రీతిపట్టదగిన, కమలపాదం - తామరలవంటితిరువడిగళు, వన్దు - వచ్చి, ఎన్కణ్ణినుళ్ళన - నాకండ్లకువిషయముగా, ఒక్కిన్ఱతే - ప్రత్యక్షసమానాకారముగానున్నదే! నాకండ్లకు విషయమయ్యెను మునుపటియునికికిహానిలేకున్నది. లేకసంసారులనుజూచుటకుసదగియుండునో, లేక, ఈలాభముఆస్వామికిని తగియుండునో; అనుచున్నారు.

తా.— దోషరహితుడును జగత్కారణభూతుడును నాకుపకారకుడున్నై వశుడగునన్ను తనదాసానుదాసునిగ జేసిన పరిశుద్ధుడును నిత్యసూరి నిర్వాహ స్వామి, ఈవిభూతివారి నేలుకొనుటకు సుగంధపరిపూర్ణమగు తోపులగల యందు నిన్నతిరుక్కోవలముగా నుండువాడై, అకళంకుడును హేయగుణప్రతిభ స్వరూపజ్ఞానముగల పరమపదమందుండు వాడును, దీర్ఘప్రాకారములుగల మందుశయనించియుండు సర్వేశ్వరునియొక్క, శ్రీమహాలక్ష్మి భయముతో స్ప ట్టదగినపాదారవిందములు వచ్చినాకండ్లకు విషయమై, ప్రత్యక్షసమానాకారము

౧. పా-అ— మొదటిపాశురమందు వాడనుసరించి వచ్చినవిధము ఈపాశురమందు, తాముపైఁబడినవిధమును ఆనతిచ్చుచున్నారు.

౨. ఉవన్దవుళ్ళత్తినాయ్ యులగమళన్దణ్డముఱ,
నివర్న్దనీణ్ముడియనన్ఱునేర్న్దనిశాశరర్ౘై,
క్కవర్న్దవెఙ్గణైక్కాకుత్తన్ కడియార్పొழిల్అరఙ్గత్తమ్మా
చ్చివన్దవాడైయిన్మేల్ శెన్ఱదామ్ఎనశిన్దనైయే.

టీక.—ఉవన్దఉళ్ళత్తనాయ్ - నన్నుఏలుకొనుటచే మిక్కిలి సంతోషముగ వాడై, ఉలగమళన్దు - మూడులోకములనుకొలిచి, అణ్డముఱ - బ్రహ్మాండకటాహము ఒఱియునట్లు, నివర్న్ద - పెరిగినవాడై, నీళ్ముడియన్ - ఉన్నతమైనకిరీట దును, అన్ఱు - దండకారణ్యమునందుండునపుడు, నేర్న్ద - ఎదిరించిన, నిశాశర ఖరదూషణాదిరాక్షసులప్రాణములను, కవర్న్ద - గ్రహించిన, వెంగణై - క్రూర ములుగల, కాకుత్తన్ - కకుత్స్థవంశోద్భవుడైనవాడగు, కడియార్ - పరి యించిన, పొழిల్ - తోపులచేచుట్టబడిన, అరంగత్తు - శ్రీరంగమునను, అమ్మాన్ నిర్వాహకుడైనవానియొక్క, అరై - నడుమునధరించియుండు, శివన్దవాడై ఎఱ్ఱనిపీతాంబరముపై, ఎన్శిన్దనై - నామనస్సు, శెన్ఱదామ్ - ప్రవేశించినది ఏ - ఏమిఆశ్చర్యము.

తా.—నన్నేలుకొనుటచే సంతోషించినవాడై త్రిలోకములను కొలిచి బ్ర ణ్డావరణమువఱకు పెరిగినరాజాధిరాజ సూచకమగు కిరీటముగలవాడై, దం దుండునపుడు ఎదిర్చిన ఖరదూషణాదులను సంహరించిన క్రూరబాణములుగల మూర్తియును, సుగంధపరిపూర్ణమగుతోపులచే చుట్టబడిన శ్రీరంగమందు యుండు సర్వస్వామియైనవానియొక్క మొలలోధరించియుండు, ఎఱ్ఱనిపీతాం నాకలంపు ప్రవేశించినదైనది. ఏమి ఆశ్చర్యమనుచున్నారు.

౩-పా-అ.-పీతాంబరముయొక్క సౌందర్యమునాభీకమలమందువీచినదనుచున్నారు.

3. ఓం మన్దిపాయ్ వడవేఙ్గడమామలై, వానవర్గళ్,
శన్దిశెయ్యనిన్ఱానరఙ్గత్తరవిననణైయాన్,
అన్దిపోల్ నిఱత్తాడైయుమదన్మేలయనైప్పడైత్తదోరెழி,
ళున్దిమేలదన్ఱోవడియేనుళ్ళత్తిన్నుయిరే.

టీక.—( పనసపండ్లు వేళ్ళుమొదలుకొనికొమ్మల పర్యంతముపండియుండుటచే ) మంది - మొగకోతులైనవి, పాయ్ - ఒకకొమ్మనుండిమఱియొకకొమ్మకు యెడతెగకదాటుచుండెడు, వడ - ద్రావిడదేశమునకు వుత్తరపుటెల్లయగు, వేంగడం - తిరువేంగడమను, మామలై - ఉన్నతమును విశాలమునుగల తిరుమలయందు, వానవర్గళ్ - నిత్యసూరులు, శన్దిశెయ్యనిన్ఱాన్ - పుష్పాదులచే ఆరాధించునట్లు నిన్ఱతిరుక్కోలముగానుండువాడును, అరంగత్తు - శ్రీరంగమున, అరవిననణైయాన్ - ఆదిశేషునిమీదశయనించియుండుస్వామియొక్క, అన్దిపోల్ - సాయంకాలపుయెఱ్ఱని మబ్బువంటి, నిఱత్తాడైయుం - కాన్తిగలపీతాంబరమును, అదన్మేల్ - అందుకుపైగ, అయనైప్పడైత్తదు - బ్రహ్మకు ఉత్పత్తిస్థానమైన, ఓరెழிల్ - అందముగల, ఉందిమేలదన్ఱో - తిరునాభీకమలముమీదుగదా, అడియేనుళ్ళత్తు - దాసునిమనస్సునందుండు, ఇన్నుయిర్ - ఇంపైనప్రాణముండుట, ఏ - ఏమిఆశ్చర్యము.

తా.—పనసచెట్లు, అడుగునుండి పైవఱకు పండియుండుటచే, మొగకోతులు కొమ్మలనుండి కొమ్మలకుప్రాకుచుండు, ద్రవిడదేశమునకుత్తరపు టెల్లయగు, తిరువేంగడమను గొప్పపర్వతమునందు, నిత్యసూరులు పుష్పములను గొని యారాధించునట్లు, నిలువురూపమున వేంచేసియుండు వాడును శ్రీరంగధామమున అనంతుడను శయ్యమీదపవ్వళించియుండు స్వామియొక్క, సాయంసంధ్యలోని ఎఱ్ఱనిరంగుగల పీతాంబరమును, దానికిపైగ, బ్రహ్మనుజనింపచేసినయందమైన నాభీకమలముమీదుగదా, దాసునిహృదయాంతర్వర్తియగుజీవుడున్నాడు. ఏమి ఆశ్చర్యమనుచున్నారు.

౪-పా-అ.— తిరునాభీకమలముతో చేరిన, ఉదరబంధనమును అనుభవించుచున్నారు.

౪. శదిరమామదిళ్శూழ்లిలఙ్గైక్కిఱైవన్ఱలైప
త్తుదిరవోట్టి, యోర్వెఙ్గణైయుయ్త్తవన్నోదవణ్ణన్,
మదురమావణ్డుపాడమామయిలాడరఙ్గత్తమ్మాన్, తిరువయిత్ఱ్ -
ఱుదరబన్దనమెన్నుళ్ళత్తుళ్ నిన్ఱులాగిన్ఱదే.

టీక.—శదురం - నలుచౌకమై, మామదిల్ - ఉన్నతములైన ప్రాకారములచే చుట్టబడిన, ఇలజ్గైక్కు - లంకానగరమునకు, ఇఱైవన్ - రాజగురావణుని, మొదటినాటియుద్ధమునందే వెనుకకుతిరిగిపరుగెత్తునట్లుచేసి (మరుయుద్ధమున) పత్తు - వానిపదితలలను, ఉదిర - తాటిపండ్లవలెరాలునట్లు, ఓర్ - అద్వితీయమైన, వెంగణై - క్రూరమైనబ్రహ్మాస్త్రమును, ఉయ్త్తవన్ - ప్రయోగించినవాడును, వణ్ణన్ - సముద్రమువంటిచల్లనిరూపముగలిగినవాడును, వండు - తుమ్మెదలైన్నీ, మా - ఇంపుగా, పాడ - గానముచేయగా, (అందుకుదగినట్లు) మా - గొప్పనెమ్మళ్లు గల, మయిల్ - నెమళ్ళు, ఆడు - నర్తనముచేయుచుండెడు, అరంగత్తు - శ్రీరంగమునందు శయనించియుండు, అమ్మాన్ - పరమశేషిగానుండు, అఝగియమణవాళనిని గాత్ర తిరువయిఱ్ ఉదిరబంధనం - బ్రహ్మనుకనినందుచే కడుపుమీదధరించినదట్టి, ఎన్నాళ్ త్తుళ్ - నామనస్సునందు, నిన్ఱు - స్థిరముగా, ఉలాగిన్ఱదే - సంచరించుచున్నదే.

తా.—నలుచదరములగు ఉన్నతప్రాకారావృతమైన లంకానగరమునకు రాజగురావణునితలజీవి, వానిపదితలలను పడునట్లు ఒకక్రూరమైన బ్రహ్మాస్త్రమును ప్రయోగించినవాడై, సముద్రచ్ఛాయగలవాడును, తుమ్మెదలు మధురముగా గానముచేయగ (దగినట్లు) గొప్పనెమళ్ళు, నాట్యముచేయుచుండు శ్రీరంగధామమందు శయనించి శేషిగానుండు సుందరకల్యాణ పురుషునియొక్క, బ్రహ్మను కనిన యుదరమునందు బ్రహ్మచే ధరింపజేయపడిన దట్టియైనది, నాహృదయమందు ఎల్లప్పుడును విహరించుచున్నదే, ఆని యీడుపడుచున్నారు.

ళ. పా - అ.—నాకు ఆశ్రయణీయురాలగు శ్రీమహాలక్ష్మి వసించెడు వక్షస్థలముసుమా, నన్ను స్వరూపానురూపమగు కైంకర్యమునందు ఆసక్తిగల వానిగా చేసినది అనుచున్నారు.

౫. పారమాయపళ్ళవినైప్పత్ఱఱుత్తు, త్తైనై త్తన్

వారమాక్కివైత్తాన్, వైత్తదన్ఱియెన్నుళ్ పుగున్దాన్,

కోరమాతవమ్సెయ్దనన్గొలటియే నరజ్గత్తమ్మాన్, తిరు

వారమార్బదన్ఱోవడియేనై యాట్కొణ్డదే.

టీక.— పారమాయ - మిక్కిలిభారమైన, పళ్ళువినై - అనాది కాలముగా ఆర్జించిన పాపమును, పత్తఱుత్తు - నిశ్శేషముగాపోగొట్టి, ఎన్నై - దాసభూతుడగుటకు స్థానమగునన్ను, తన్ - తనవిషయమందు, వారమాక్కి వైత్తాన్ - పక్షముగా

ట్లు చేసెను, వైత్తదన్తి - అట్లు చేసినదిగాక, ఎన్నుళ్ - దాసుని హృదయమునందు, పుకున్దాన్ - ప్రవేశించెను, (ఇట్లు ప్రవేశించుటకు ఆధారముగ) కోరం - ఇంద్రియములను శ్రమపఱచి చేయదగిన, మాతవం - మహాతపస్సును, శెయ్దనన్ కొల్ - చేసినో, అఱియేన్ - తెలిసికొనలేను, అరంగత్తు - శ్రీరంగమున శయనించి యుండు, అమ్మాన్ - సర్వస్వామియగు సుందరకల్యాణపురుషునియొక్క, తిరు - శ్రీమహాలక్ష్మిని, ఆరం - ముత్యాలహారమునున్ను ధరించిన, మార్పదన్రో - వక్షస్థలమేగదా, అడియేనై - హాపసౌందర్యములందు మునిగినదాసుని, ఆళ్ కొణ్డదు - శేషపఱచుకొనినది.

తా.— మిగులభారమైన బహుకాలార్జితపాపములను సవాసనగ పోగొట్టి, పాత్ముడగు దాసుని, తనవిషయమందు పక్షముగలిగి యుండునట్లు చేసికొనెను. అదియె కాక దాసునియందుప్రవేశించెను (దీనికి ఆధారముగ) చాలశ్రమపడి గొప్పతపమును సితినో గుర్తెఱుగను, శ్రీరంగశాయియగు స్వామియొక్క, శ్రీదేవిని, హారమునున్న రించియుండు వక్షస్థలమేగదా, దాసుని శేషపఱచుకొన్నది అనుచున్నారు.

౬. పా. అ.—సర్వలోకములను, ఆరగించిన కంఠముయొక్క సౌందర్యము న్నుజ్జీవింపజేసినది అనుచున్నారు. వక్షస్థలసౌదర్యము, కంఠమం దారోపితమైనది, నియుగావచ్చును.

౬. తుణ్డవెణ్బిఱైయన్తుయర్ తీర్తవ, నఞ్జిఱైయ
వణ్డువాழ్ పొழిల్ శూழరఙ్గనగర్ మేయవప్పన్,
అణ్డరణ్డపగిరణ్డత్తొరుమానిలమెழుమాల్వరై, ముఱ్ఱుమ్
ముణ్డకణ్డజణ్డీరడియేనై యుయ్యక్కొణ్డదే.

టీక. తుణ్డం - కళామాత్రమగు, వెణ్ - తెల్లగానుండు, పిఱైయన్ - చంని మూడవనాటి కళను జడలయందు గలిగినరుద్రునియొక్క, తుయర్ - భిక్షమెత్త సినపాతకమును, తీర్తవన్ - పోగొట్టినవాడును, అంజిఱైయ - చక్కని ఱెక్కలు , వండు - తుమ్మెదలు, వాழ் - వసించెడు, పొழిల్ శూழ் - తోటలచేచుట్టబడిన, రంగనగర్ - శ్రీరంగమునందు, మేయ - పవ్వళించియుండెడు, అప్పన్ - లంద్రియ వానియొక్క, అండర్ - అణ్డములోనుండు చేతనులుగల, అణ్డమ్-అణ్డమును, బహిర ఇతర అణ్డములను, ఒరు - అద్వితీయమగు, మానిలం-మహాభూమిని, (భూమియందు) ఎழు - ఏడువిధములగు, మాల్వరై - కులపర్వతములను, ముఱ్ఱుం-ఒకటియు వక సమస్తమును, ఉండ - భుజించిన, కణ్డం - శ్రీకణ్ఠము, అడియేనై-దాసుని, య్యక్కొణ్డదు- సంసారమునందు చిక్కుకొనకుండునట్లు చేసినది, కణ్డీర్-చూచితిరా.

తా.—చంద్రశేఖరుడగు రుద్రునియొక్క భిక్షాటనరూపమగు దుఃఖము
ట్టినవాడును, మంచిరెక్కలుగల తుమ్మెదలు వసించెడు తోటలచేచుట్టబడిన
ధామమందు శయనించియుండు తండ్రియైనవానియొక్క బ్రహ్మాండములోనుండు
గలఅండమును ఇతరాండములను మహాభూమిని సప్తకుల పర్వతములను మరియు
మును భుజించిన శ్రీకంఠమునుమా, దాసుని యుజ్జీవించునట్లు చేసినది అను

౭ పా - అ. స్వామియధరము లోబఱచుకొన్న ప్రకారమును
చున్నారు.

౭. కైయినార్శురిశఙ్గనల్లాழியర్ నీళ్వరైపోల్ -
మెయ్యనార్, తుళబవిరైయార్, కమழ్నీణ్ముడియెమ్ -
మైయనా, రణియరఙ్గనార్అరవి న్నణైమిశైమేయమాయనార్
శెయ్యవాయయ్యోవెన్నైచ్చిన్దైకవర్న్దదువే.

టీక. కైయ్యిల్ - శ్రీహస్తములందు, ఆర్ - సౌందర్యమునిండి, శు-
సుడిగల- శఙ్గు - శ్రీపాంచజన్యమును, కనల్ - శత్రువులమీద అగ్నిజ్వాలను
ఆழியర్ - శ్రీసుదర్శనమునుగలవారై, వరైపోల్ - పర్వతమువలె, నీళ్ - గొ
సౌందర్యమునుగల, మెయ్యనార్ - తిరుమేనుగలవారై, కమழ్ విరైయార్ -
లిపరిమళముచే నిండియుండు, తుళబం - తిరుత్తుழாయ్ మాలికచే అలంకరింప
ముడి - ఉన్నతమైన కిరీటముగల, ఎం అయ్యనార్ - దాసునికి తండ్రివంటి
అణి - ఆభరణమువంటివాడైన, అరంగనార్ - శ్రీరంగధాముడును, అరవి
తిరువనంతాழ్వానను పడకయందు, మేయ - శయనించియుండెడు, మాయనా
ర్యగుణ చేష్టితుడగు పెరియపెరుమాళ్లయొక్క, శెయ్యవాయ్ - ఎఱ్ఱని అ
ఎన్నై - (స్త్రీలయొక్క అధరపానమునందు యీడుపడిన) దాసునియొక్క
మనస్సును, కవర్న్దదు- తమప్రక్కకు గ్రహించుకొనినది, అయ్యో - ఏమిఆ

తా.—శ్రీహస్తములందు సుందరమగు దక్షిణావర్తశంఖమును,శత్రువుల
చునట్టి చక్రత్తాళ్వానుధరించినవాడును, పర్వతమువలె గొప్పదై సుందరమైన
నుగలవాడును, మిగులపరిమళించుచున్న తిరుత్తుழாయ్ మాలికచే నలంకృతమై
తమైన శిరముగలిగి నాకు తండ్రివంటివాడును, భూమికాభరణస్థానమగు శ్రీరం
మునందు, ఆదిశేషునిమీదు శయనించియుండు ఆశ్చర్యభూతుడగు పెరియపెరు
క్క ఎఱ్ఱని యధరమైనది, స్త్రీలయధరములందాసక్తిగల నామనస్సును
మునందు. ఈడుపఱచుకొన్నది. అని ఆశ్చర్యపడుచున్నారు.

౮. పా - అ.—నేత్రములు నన్ను వశపఱచుకొన్నది అనుచున్నారు.

౮. పరియనాగివన్దవవుణన్నుడల్ కీణ్డ, వమర -
ర్కరియవాదిప్పిరాన్నరఙ్గత్తమల౯ముగత్తు,
క్కరియవాగిప్పుడైపరన్దుమిళిర్న్దు,శెవ్వరియోడి, నీణ్డవ
ప్పెరియవాయకణ్గళెన్నై ౡప్పేదైమైశెయ్దనవే.

టీక. పరియనాగి - (వరజలముచే) బలిసిన శరీరముగలవాడై, వంద - (ప్రహ్లాదునిహింసించుటకు) వచ్చిన, అవుణ౯ - హిరణ్యకశిపునియొక్క, ఉడల్ - శరీరమును, కీణ్డ - ఛేదించిన వాడును, అమరర్కు - బ్రహ్మాది దేవతలకు, అరియ - సమీపింపగూడనివాడును, అదిప్పిరా౯ - ఆదికారణభూతుడును, ముందుండి యుపకరించువాడునగు, అరంగత్తమల౯ - శ్రీరంగధాముడునగు స్వామియొక్క, ముకత్తు - తిరుముఖమండలమందు, కరియవాకి - నల్లగిలి, పుడైపరన్దు - విశాలమై, మిళిర్న్దు - చలించి, శెవ్వరియోడి - వాత్సల్యముచే యెఱ్ఱగిల్లి, నీణ్డ - చెవులవఱకు పెరిగిన, అప్పెరియవాయ - అట్టిగొప్పదగు, కణ్గళ్ - తిరునేత్రములు, ఎన్నై - రాతివలె కఠినచిత్తుడగునన్ను, పేదమైశెయ్దన - తనయందు పక్షముగానుండునట్లు చేసికొనెను.

తా.—వరబలముచే బలిష్ఠుడై ప్రహ్లాదుని హింసింపవచ్చిన హిరణ్యకశిపుని దేహమును ఛేదించి, బ్రహ్మాది దేవతలకు సమీపింపగూడనివాడును ఆది పురుషుడును తానే ముందుండి యుపకరించువాడునగు శ్రీరంగధామమందు శయనించియుండు స్వామియొక్క తిరుముఖమందు నల్లనై విశాలమై కర్ణాంతమువఱకు వృద్ధినొంది ప్రకాశించు యట్టిగొప్ప నేత్రములు కఠినచిత్తుడగు నన్ను తనయందు ప్రేమగలవానినిగాఁ జేసికొనెనని.

౯. పా. అ - నగరక్షయకరమైన యుద్ధమువలె, తిరుమేనుయొక్క కాంతియై అన్నిటినిగూడ కొనివచ్చి నాహృదయమును చూఱగొనెను అనుచున్నారు.

౯. ఆలమామరత్తినిలై మేల్ఒరుపాలగనాయ్,
ఞాలమేళ్ముముణ్డానరఙ్గత్తరవినణైయా౯,
కోలమామణియారముమ్ముత్తుత్తామము, ముడివిల్లదోరెழిల్,
నీలమేనియయ్యోనిత్తైకొణ్డదెన్నెఞ్జినైయే.

టీ. మా - పెద్దదగు, ఆలమరత్తినిలైమేల్ - మఱ్ఱివృక్షముయొక్క చిన్న యాకుమీద, ఒరు - అసమానమగు, పాలగనాయ్ - బిడ్డడై, ఞాలమేళుం - సప్తలోక

ములను, ఉండాన్ - భుజించి యుదరమందిడుకొనిన, అరంగత్తు - శ్రీరంగ
విన్నైయాన్ - ఆదిశేషునిమీద పవ్వళించియుండుస్వామియొక్క, కోలం - శ్రే
మామణి - గొప్పవెలగల రత్నములచే చెక్కబడ్డ, ఆరముం - హారమును, ము
ముం - ముత్యాలహారములు ప్రకాశించెడు, ముడివిల్లతు - అంతములేని, ప్రే
మానమగు, ఎళిల్ - సౌందర్యముగల, నీలమేని - నీలవర్ణమగుతిరుమేను, నె
యే - నామనస్సులోగలిగిన,నిఱైకొండదు - సత్తువనుపళపళచుకొన్నది,ఆయ్యో
ఆశ్చర్యము.

తా.—ఒకచిన్న మఱ్ఱియాకుమీద నొకబిడ్డడై జగత్తునంతయు ప్రళ
నయుదరమందుంచుకొన్న,శ్రీరంగమందుఅనంతునిమీదశయనించియుండుస్వా
రమ్యమై గొప్పరత్నఖచితమగు హారమును ముత్యాలహారమును, అంతమున
లేనిసౌందర్యముగల నీలవర్ణమగు తిరుమేను అయినది, నాహృదయమందలి
నంతయు నశింపజేసినది అని యాశ్చర్యపడుచున్నారు.

౧౦. పా - అ.—ఇదంతయు జ్ఞానసాక్షాత్కారము. పైగ లోకసా
మునుల భుజములమీదు వచ్చిప్రవేశించి విజ్ఞాపనము చేయుచున్నారు. గ్రంథసమా
పెరియపెరుమాళ్ళయొక్క సౌందర్యమును సేవించిన నేత్రములు వేఱొకటి
అనుచున్నారు.

౧౦. కొణ్డల్వణ్ణనై క్కోవలనాయ్ వెణ్ణె
యుణ్డవాయ, నెన్నుళ్ళఙ్గవర్ న్దానై,
అణ్డర్ కోనణియరఙ్గ, నెన్నముదనై
క్కణ్డకణ్గళ్, మత్తొన్ఱినై క్కాణావే.

టీక.—కొండల్ - నీటినిద్రాగిన మేఘమువంటి, వణ్ణనై - చాయగల
కోవలనాయ్ - గొల్లకులమునందవతరించి,వెణ్ణెయుండ- వెన్నను అరగించిన
పగడమువంటినోరుగలవాడును, ఎన్నుళ్ళం - (చాతుర్యమును యానమును
మ్మిన) నామనస్సును, కవర్ న్దానై - అపహరించినవాడును, అండర్ కోన్ -
ర్వర్తులగు ఆత్మవర్గములకు నిర్వాహకుడును, అణి - సంసారమునకాభరణమై
గన్ - శ్రీరంగధామమందు శయనించియుండు- ఎన్నముదినై - నా కమృతమై
మభోగ్యుడగువానిని, కణ్డకణ్గళ్ - సేవింప లభించిన నేత్రములు, మత్తొన్ఱినై
ణావే - వేఱొకవస్తువును చూడవు.

తా. నీలమేఘ నిభ శ్యాముడును, గొల్లకులమందవతరించి వెన్న నారగించిన తిరుప్పవళముగలవాడును, సామర్ధ్యమును యవ్వనమును గలస్త్రీలనునమ్మిన నాహృదయమును అపహరించినవాడును, బ్రహ్మాండనిర్వాహకుడును, సంసారమున కాభరణమైన శ్రీరంగక్షేత్రమందు శయనించియుండు నాకమృతతుల్యుడగువానిని సేవించిన నేత్రములు, తదితరములనొకటిని, చూడవు అని యానతిచ్చుచున్నారు,

అడివరవు. అమలన్, ఉవన్ద, మన్ది, శదిరమ్, పారమ్, తుణ్డమ్, కై, పరి, అలమ్ కొణ్డల్ కణ్ణి.

## తిరుప్పాణాళ్వార్ తిరువడిగళేశరణమ్.

## పెరియవాచ్చాంబిళ్లై తిరువడిగళేశరణమ్.

## జీయర్ తిరువడిగళేశరణమ్.

## అమలనాదిపిరాన్ ముగిసెను.

శ్రీమతేరామానుజాయనమః.

# శ్రీమధురకవియాళ్వార్ వైభవము.

---

శ్రీమధురకవియాళ్వార్లు సర్వేశ్వరుడు సమృద్ధమగు సంపదతో శయనించియుండు తిరుక్కోళూరిలో, శ్రీమంతముగ జెప్పబడు చైత్రమాసమందు శ్రీకుముదగణేశాంశులగు శ్రీమధురకవులు సూర్యోదయమునకు అరుణోదయముముందు బడినరీతిగ, వకుళభూషణ భాస్కరోదయమునకు అరుణోదయమువలె ముందే అవతరించిరి. (గణేశః కుముదోనామ్నా కవిర్మధురసంజ్ఞికః । చైత్రేమాసికు భేచిత్ర తారకాయామజాయత) అని దివ్యసూరిచరితయందు జెప్పఁబడినదిగదా. తర్వాత వీరికి తత్తత్కాలములందు, చౌలోపనయనాదులనుచేసి పదునాలుగు విద్యలను అధికరింపించిరి. అట్లధికరించినవారై (అయోధ్యామధురామాయా కాశీకాంచీహ్యవన్తికా।పుణ్యాద్వారవతీచైవ సప్తైతేముక్తిదాయకాః) అని మోక్షప్రదముగఁజెప్పఁబడిన తిరువయోధ్యమొదలగు దివ్యదేశములను సేవించుటకు వెంచేసిరి. అట్లు సేవించుచువచ్చుచున్న మధురకవులు శ్రీనమ్మాళ్వార్ల వైభవములను అప్పుడప్పుడు వినుచువచ్చుటయేగాక, ఒకనాటిరాత్రి దక్షిణదిక్కునందు ఒక అప్రాకృతదివ్యతేజస్సునుజూచి ఇది యేమియనిభ్రమిసి ఏవియైనను గ్రామనగరములు కాలుచున్నవో, దావాగ్నియో, అని తమమనస్సున సందేహించి నాటిదినము శయనించిరి. తర్వాతను రెండుమూడుదినములు ఇవ్విధమున నేచూచి, ఇది యప్రాకృతదివ్యతేజస్సుగానున్నది. దీనికి కారణము పరీక్షింపవలయునని పగలంగయునిద్రించి రాత్రి ఆతేజస్సునే

గులుతుపట్టి అతిత్వరతో పుణ్యక్షేత్రములను సేవించుచూ తిరునగరికేంచేసి జ్ఞాన
ణముగ తేజస్సు అగుపడనందున ఈ తేజస్సు ఈనగరమందేయుండవలయునని
వచ్చి తింత్రిణీవృక్షముక్రింద (పద్మాసనోపవిష్టం వరపదయుగళేనివిష్టచైతన్య
త్వబోధముద్రం పరమాచార్యం పరాంకుశంవందే) అన్నట్టు సుజ్ఞానఘనపరిపూ
చెట్టుయొక్క నీడయందు, నేత్రములుమూసికొని పదహారుకళలతోగూడిన చ
పదహారుసంవత్సరముల వయస్సుగలవారై పద్మాసనోపవిష్టులై పరతత్వమున
జ్ఞానముద్రతోగూడినవారై పరమాచార్యులగు శ్రీపరాంకుశులనుసేవించి †"
యిఱ్ఱిలే శెత్తియదుపిఱందాల్ ఎత్తైత్తిన్ఱెంగేకిడక్కుమ్=అచిత్తులో జీవా
పడియున్నపుడు దేనిని అనుభవించి యెక్కడపడియుండును." అనిన, "అ
కిడక్కుం=శరీరగతమగు సుఖదుఃఖాదులను అనుభవించుచు శరీరమునే ఆశ్రయ
యుండును. అని యాళ్వార్లు ప్రసాదింపగ శ్రీమధురకవులునువిని, వీరు స
న్నారు. ఈమహానుభావులను అనువర్తించి యుజ్జీవింపవలయుననితలచి మిక్కి
ష్టులై ఆళ్వార్ల శ్రీపాదపద్మములందు సాష్టాంగప్రణామముగ సేవించి "మేవి
న్నడిమెయ్మ్మైయే" అని యాశ్రయించి కృతార్థులై, (గురుపాదాంబుజ
గురోర్నామసదాజపేత్) అన్నట్లు మనోవాక్కాయికములచే, ఆళ్వార్లను
భవించుచు ఆళ్వార్లకు ప్రథమశిష్యులైన శ్రీమధురకవులు ప్రపన్నజనకూటస్థ
చార్యులయొక్క వైభవమును, చరమార్థమగు "కణ్ణినుణ్ శిఱుత్తాంబు" అన
బంధము" ప్రసాదించి పంచమోపాయనిష్ఠులగు ముముక్షువులకు ఉపకరించి
చార్యులగు శ్రీపరాంకుశుల వైభవమును సకలమైనవారికి తెలియునటుల ప్రకా
లోకమును సుఖింపఁజేసిరి.

### శ్రీనాథమునులు సాదించినతనియన్.

శ్లో॥ అవిదితవిషయాన్తరశ్శఠారే,
రుపనిషదాముపగానమాత్రభోగః
అపిచగుణవశాత్తదేకశేషీ,
మధురకవిర్హృదయేమమావిరస్తు.

టీక.—అవిదితవిషయాన్తరః - ఇతరవిషయములను గుర్తెఱుగనివా
శేః - నమ్మాళ్వార్లయొక్క, ఉపనిషదాం - ఉపనిషత్సారమగు నాలుగు ప్ర
యొక్క, ఉపగానమాత్ర - దేవగానముపాడుటయే, భోగః - సుఖాను
వారును, అపిచ - మఱియు, గుణవశాత్ - ఆళ్వారులయొక్క వాత్సల్య

† ఈప్రకృతియందలి జీవునికి జ్ఞానముదయించెనేని ప్రకృతికిలోబడి
త్రిగుణానుభవముతో కాలయాపనముచేయునని భావము.

...స్వాధీనపఱచుకొనుటవలన, తదేకశేషీ - : వారికే శేషభూతుడగు, మధురకవిః - మధురకవియాళ్వార్లు, మమహృదయే - దాసునిహృదయమునందు, ఆవిరస్తు - ఆవిర్భవించియుండురుగాక.

తా.—నమ్మాళ్వార్లయొక్క ద్రవిడోపనిషత్తులగు నాలుగు దివ్యప్రబంధములయొక్క గానముచేసుఖముగననుభవించుచు, తదితరవిషయముల నెఱుగక, మఱియు ...ళ్వార్లకల్యాణగుణములయందీడుపడుటచే వారికే శేషభూతుడగు మధురకవియాళ్వా...దాసుని హృదయమందు ఆవిర్భవించియుండురుగాక.

వేఱొన్ఱుంనానఱియేన్ వేదంతమిళ్ శెయ్ద,
మాఱన్ శఠకోపన్ వణ్ కురుగూర్—ఏఱెజ్గళ్,
వాళ్ వామెణ్ణేత్తుంమదురకవియార్, ఎమ్మై
ఆళ్వారవరేయరణ్.

టీక. వణ్ - ఔదార్యపురుషులువర్తించునట్టి, కురుగూరేళ్ - ఆళ్వార్ తిరునగరికినిర్వాహకులగు, శడకోపన్ - శఠకోపులుఅను, వేదం - సంస్కృతవేదమును, తమిళ్ శెయ్త - ద్రావిడవేదముగాసాధించిన, ఏఱ్ - సౌందర్యముగల, మాఱన్ - అనుపేరుగలఆళ్వార్లుతప్ప, వేఱొన్ఱుం - మఱియొకటియు, నానఱియేన్ - నేనెఱుగను, ఎజ్గళ్ - మాకు, వాళ్వు - సుఖోజ్జీవనము, అమెన్ఱు - వారేయని, ఏత్తుం - స్తోత్రముచేయు, మదురకవియార్ - మధురకవియాళ్వార్లు, ఎమ్మై - మనలను, ఆళ్వార్ - పాలించువారు, అవరే - వారే, అరణ్ - రక్షకము.

తా.—ఉదారులునివసించునట్టి ఆళ్వార్ తిరునగరికి నిర్వాహకులగు, సంస్కృతమును ద్రవిడవేదముగ సాధించిన, శఠకోపులు, మాఱన్, అనునామములుగల సుందరులగు నమ్మాళ్వార్లనుతప్ప వేఱొకటియును నేనుగుర్తెఱుగను. మాకుసుఖోజ్జీవనము వారేయని స్తోత్రముచేయు మధురకవియాళ్వార్లుమమ్మునేలుకొన్నవారు.వారేరక్షకము.

## కణ్ణినుణ్ శిఱుత్తాంబు, అవతారిక.

“త్రైగుణ్యవిషయా వేదాః” అనునట్లు, సాత్వికరాజసతామసపురుషులయొక్క ...కారానుగుణముగ ఐశ్వర్యాది సకలపురుషార్థములను విధించునట్టి వేదమర్యాదయందు ...ర్షులునిలిచిరి. అట్టి మహర్షులలో మొదటివారైన శ్రీపరాశరభగవానులు గృహస్థులకు ప్రజాపతిలోకము, సన్న్యాసులకు బ్రహ్మలోకము, కేవలులకు ఆత్మప్రాప్తిని యుపదేశించి, స్థిరముగ సత్వగుణముగలవారికి భగవత్ప్రాప్తిని ఉపదేశించినవారైరి. ఈమహా...ంటెను ఆళ్వార్లకు నత్యంతాతిశయముగలదు. ఎట్లనిన, వేదతాత్పర్యమై ఉత్తమ

పురుషార్థమైన భగవత్ప్రాప్తియందు నిష్ఠగలవారై పరులకు ఉపదేశించునప్పుడు శాస్త్రసిద్ధమైన ఐశ్వర్యాదులను త్యాజ్యముగ ఉపదేశించువారలుగదా, ఈవిషయార్థముయొక్క యెల్లయగు తదీయశేషత్వమందు శ్రీమధురకవులు నిలిచినవారై యతిశయముగలిగిన విధమెట్లనిన; నమ్మాళ్వార్లు భగవదనుభవముచేయునప్పుడు పురుషార్థసీమాభూమియై అభిమతమైన తదీయశేషత్వమును ఆశ్రయించిరి. ఈ పరిగృహీతమైనయర్థమే సాత్వికులకు పరిగ్రహింపదగినది అను విషయము, శ్రీ రతసారమగు శ్రీసహస్రనామాధ్యాయమునందుఁ జెప్పబడినదిగదా. శ్రీభీష్మాచార్యాదిని సకలధర్మములనువినిన ధర్మపుత్రుడు, "కోధర్మస్సర్వధర్మాణాం భవతఃపరమః = సకలధర్మములలో మీకు మిగులయిష్టమైన ధర్మమేది" అని, యడుగగ "ఏష మే సర్వధర్మాణాం ధర్మోధికతమోమతః = అన్నిధర్మములలో నాకు మిగులయిష్టమైన ధర్మము" భాగవతాముఅపేక్షతో గ్రహించిన యర్థవిశేషమును ఉపదేశించిరిగదా. (త్రిపురాదేవిమహారాజపత్నిని) ప్రబలప్రమాణముండుటచేతనా, శ్రీమన్నారాయణుడే ఆశ్రయణీయుడని మీరాశ్రయించినది అని యడుగగ, అదేమియుగాదు, ఎంబెరుమానార్లు "... ల్ మాలైయిల్ దేవతై = ఈశాన్యదిక్కు దేవతయగు రుద్రుని"యాశ్రయించినను మాకుప్రాప్యమగును అనిరి. ఆన్యాయముచే ఆళ్వార్లు తమకు రక్షకముగదలచిన తదీయశేషత్వమునే తమకు పురుషార్థముగ అధ్యవసించుచున్నారు. మఱియు లక్ష్మణభరతశత్రుఘ్నులలో శ్రీశత్రుఘ్నాళ్వార్ యొక్క అధ్యవసాయముకంటె అట్టి శ్రీశత్రుఘ్నాళ్వానును శ్రీమధురకవియాళ్వార్లు అనుసరించినవారైయు ఇచ్చటతమకు దివ్యజ్ఞానమునుగలుగజేసిన మహోపకారకులగు ఆళ్వార్లను ఆశ్రయించుచున్నారు.

౧. కణ్ణినుణ్ శిఱుత్తాంబినాల్
కట్టుణ్ణప్పణ్ణియ పెరుమాయ, నెన్నప్పనిల్,
నణ్ణిత్తెన్నురుగూర్,నమ్బియెన్ఱక్కాల్,
అణ్ణిక్కుమముదూఱుమెన్నావుక్కే.

టీక.—కణ్ణి - ముళ్లుగల, నుణ్ - సన్ననైన, శిఱుత్తాంబినాల్ - చిన్న... కట్టుణ్ణప్పణ్ణియ - కట్టుబడునట్లుచేసికొనిన, పెరుమాయన్ - ఆశ్చర్యభూతుడైన ఎన్నప్పనిల్ - నాకుస్వామియగుసర్వేశ్వరునికంటె, నణ్ణి-ప్రీతిపూర్వకముగనాశ్రయించి, తెన్ కురుగూర్ - దక్షిణదిక్కునసుండు ఆళ్వారుతిరునగరికి, నంబియెన్ఱక్కాల్ - నిర్వాహకులగునమ్మాళ్వార్ల తిరునామమునసుసంధించిన, ఎన్నావుక్కే - నా నాలుకకే, అణ్ణిక్కుం - రుచించును, అముదు - అమృతము, ఊఱుం - ఎడతెగకవూరును

తా.—ముళ్ళుగలిగిన సన్నమైనచిన్నత్రాటిచే బద్ధముకలుగునట్లు చేసికొనిన, నిరతిశయాశ్చర్యయుక్తుడై నాకుస్వామియగు సర్వేశ్వరునికంటె, ప్రీతితో నాశ్రయించి దక్షిణదిశయందుండు ఆళ్వార్ తిరునగరికి నిర్వాహకులగు నమ్మాళ్వార్ల తిరువామంబను సంధించిన నానాలుకకే రుచించును. ఎడతెగకఅమృతమూరుచుండును.

అ.—మొదటిపాశురమందు “ ఆళ్వార్లు ” అనినతమకురసించుప్రకారమును చెప్పిరి. ఈపాశురమందు వారిప్రబంధమే దేహయాత్రయగునట్లు ధారకమైనవిధమును అనతిచ్చుచున్నారు.

౨. నావినాల్ నవిన్ట్రిన్బమెయ్దినేన్,
మేవినేనవన్పొన్నడిమెయ్మ్మైయే,
తేవుమత్తఱియేన్ కురుగూర్ నమ్బి,
పావినిన్నిశై పాడి త్తిరివనే.

టీక. నవిత్తు - (భగవద్విషయమందు ఉపకారకులను) స్తోత్రముచేయునట్టి, నావినాల్ - నాలుకచే, ఇన్బమ్ - నరతిశయానందమును, ఎయిదినేన్ - (స్తోత్రము చేసినందున) పొందితిని, అవన్ పొన్నడి - ఆళ్వార్లస్పృహణీయమైన తిరువడిగళను, మేవినేన్-ఆశ్రయించితిని, మెయ్మ్మైయే-సత్యముగ, మత్తు-ఆళ్వార్లనతప్ప వేఱొక, తేవు - దేవతను, అఱియేన్ - ఎఱుగను, కురుకూర్ - తిరునగరికి, నంబి - నిర్వాహకులగుఆళ్వార్లయొక్క, పావిన్ - తిరువాయ్మొళిని, లేకకణ్ణినుణ్ శిఱుత్తాంబును, ఇన్ - ఇంపైన, ఇశై - రాగముతో, పాడి - గానముచేయుచు, తిరివన్ - తిరుగుచుందును.

తా.—మనస్సహకారములేకయే, భగవద్విషయమందుపకారకులను స్తుతించునాలుకచే, నిరతిశయానందరూపపురుషార్థమును పొందితిని,ఆళ్వార్ల రమ్యమైన శ్రీపాదారవిందములను ఆశ్రయించితిని.సత్యముగ ఆళ్వార్లనతప్ప మఱియొకదేవతను గుర్తెఱుగను. తిరునగరియందలి కల్యాణగుణపరిపూర్ణులగు ఆళ్వార్లానతిచ్చిన తిరువాయిమొళిని లేక ఆళ్వార్లవిషయమగు కణ్ణినుణ్ శిఱుత్తాంబును, ఇంపైనగానముగ పాడుచుసంచరించుచుందును.

అవ.— ఆళ్వార్లనతప్ప వేఱొకదేవతను ఎఱుగను అనియితరపురుషార్థములతోడ. భగవద్విషయమును త్యజింతురోఅనిన; ఆళ్వార్లు సంతోషించిన విషయమగుటచే శ్రియఃపతిని సేవింతును అనుచున్నారు.

3. తిరితన్దాగిలుమ్ తేవపిరానుడై,
కరియకోలత్తిరువురుక్కాణ్బన్నాన్,

పెరియవణ్గురుగూర్ నగర్ నమ్బిక్కా-
ళురియనా, యడియేన్పెత్ఱనన్మైయే.

టీక.—తిరితన్దాగిలుం - మరలుకొనినయైన, తేవపిరాను డై - నిత్యసూరి పతియగు ఈశ్వరునియొక్క, కరియ- నీలమేఘశ్యామముగాను, కోలం- సుందరము, తిరు - లక్ష్మీసహితముగనుండు, ఉరు - తిరుమేనును, నాన్ - భగవద్విషయము చిననేను, కాణ్బన్ - సేవింతును, పెరియవణ్ - మిక్కిలిఅవుదార్యముగలవారు, కురుకూర్ నగర్ - ఆళ్వార్ తిరునగరియందవతరించిన, నంబిక్కు - నమ్మాళ్వార్, ఆళురియనాయ్ - శేషభూతుడగు, అడియేన్ - దాసుడు, పెత్త - లభించిన భగవల్లాభము, ఏ - ఏమిఆశ్చర్యము,

తా.— ఆళ్వార్లసన్నిధినుండి మరలుకొనినయైనను, నిత్యసూరి నిర్వాహక స్వామియొక్క, నీలమేఘతుల్యమైసుందరమై లక్ష్మీసహితమగుతిరుమేనును తక్కు మునువిడిచిననేను సేవింతును. మిక్కిలియుదారులై ఆళ్వార్ తిరునగరియందవత నమ్మాళ్వార్లకు తగినశేషభూతుడగు దాసుడు, లభించిన భగవల్లాభము ఏమిఆశ్చ

౮. పా. అ.—నాలుగవపాశురమందు ‹‹ ఎన్నప్పనిల్ ” అనియుళ్ల విషయమును ‹‹ ఆళ్వార్లుసంతోషించిరని యపేక్షించుటకు మూలమేమనిన; నాదు ఆయోగ్యతను చూడకనన్నంగీకరించిన సౌలభ్యగుణమును అనుసంధించినయెడల, సంతోషించిన విషయమును నేనువిడుతునో అనగా ; మాయయోగ్యతయేమి జూడకవారు అంగీకరించిన విధమెట్లనిన; ఆనతిచ్చుచున్నారు.

౮. నన్మైయాల్ మిక్క నాన్మఱైయాళర్ గళ్,
పున్మైయాగక్కరుదువరాదలిల్,
అన్నైయాయత్తనాయెన్నైయాణ్డిడుమ్
తన్మైయాన్, శడకోపనెన్నమ్బియే.

టీక.—నన్మైయాల్ మిక్క - అపకారులకును, ఉపకరించియుండు ము ములతిశయించినవారును, నాల్ మఱై - చతుర్వేదములకు, ఆళర్ గళ్ - వలెచిక్కుతీర్చునట్టివారలు, పున్మైయాగ - నీచముగా, కరుదువర్ - తలతురు గనుక, అన్నైయాయ్ - తల్లియై, అత్తనాయ్ - తండ్రియై, ఎన్నై - ఆండిడుం - ఏలుకొన్నట్టి, తన్ మైయాన్ - స్వభావముగలవారైన, శఠకోప ప్యమునుపోగొట్టినఆళ్వార్లు, ఎన్ నంబియే - నాకొఱతనుతీర్చినపూర్ణులే.

తా.—అపకారులకు సహితము ఉపకరించుసుగుణాతిశయము గలిగి, చతుర్వేదములయందు వేదవ్యాసులవంటి సామర్థ్యముగలపెద్దలు దాసుని నీచముగ భావింతురు. కనుక దాసునికి తల్లియైతండ్రియై ఏలుకొనునట్టి స్వభావమునుగలవారునైనయాళ్వార్లు,దాసుని దుష్టస్వభావమును బోగొట్టి కోరికలను పూర్తిచేసినవారు అనియానతిచ్చుచున్నారు.

౪. పా. అ.— మిమ్మునీచముగను మీకు ఆళ్వార్లు సర్వప్రకారముల చేతను ఉపకారకులుగను వచించితిరి. మీయొక్క నీచత్వమును ఆళ్వార్లుమీకొనర్చిన మేలును వచింపుడనిన; ఆనతిచ్చుచున్నారు.

౫. నమ్బినేన్ పిఱర్ నన్పొరుళ్ తన్నై యుమ్,
నమ్బినేన్ మడవారైయుమున్నెలామ్,
శెమ్పొన్మాడ త్తిరుక్కురుగూర్ నమ్బి
క్కన్బనా, యడియేన్ శది ర్తేనిన్తే.

టీక — మున్నెలాం - అనాదికాలమంతయు, పిఱర్ - ఈశ్వరునియొక్క, నన్పొరుళ్ తన్నైయుం - విలక్షణమైన ఆత్మవస్తువును, నంబినేన్ - మనదని ఆశించినమ్మియుంటిని, మడవారైయుం - పాతివ్రత్యాదులుగల పరస్త్రీలను, నంబినేన్ - ఆశించి నమ్మియుంటిని, శెంపొన్ - మేలైనబంగారముచేకట్టబడ్డ, మాడం - మేడలుగల, తిరుక్కురుగూర్ - తిరునగరిలోవేంచేసియుండు, నంబిక్కు - సర్వగుణపరిపూర్ణులగుఆళ్వారులకు, అన్బనాయ్ - శేషభూతుడై, అడియేన్ - దాసుడు, ఇన్తే - ఆళ్వార్లకు శేషపడినఈదినమే, శదిర్తేన్ - సమర్థుడనైతిని.

తా. పూర్వము ఈశ్వరునిదియగు మంచియాత్మవస్తువును, మనకు సొంతమనినమ్మియుంటిని. పతివ్రతలగు పరస్త్రీలను ఆశించినమ్మితిని. మంచిబంగారు మేడలుగల తిరునగరిలో వేంచేసియుండు గుణపరిపూర్ణులగు ఆళ్వార్లకు శేషపడి దాసుడు నేటిదినమే చతురుడనైతిని.

౬-పా. అ. ఆళ్వార్లు ఇపుడంగీకరించినను, మీకు అనాదికాలవాసనాబలిమివలన విషయములందు మరల అభిరుచికలిగినదియెట్లనిన, భగవత్కృపకు భ్రంశముసంభవించును, ఆళ్వార్ల కృపాతిశయము మరల విషయములకుపోనీయదు అనుచున్నారు.

౬. ఇన్తుతొట్టుమెళ్గుమైయుమెమ్పిరాన్,
నిన్తుతన్పుగళేత్తవరుళినాన్,
కున్తమాడ తిరుక్కురుగూర్ నమ్బి,
ఎన్తుమెన్నై యిగళ్వి లన్కాణ్మినే.

టీక. ఇన్రుతొట్టుం - నేటిమొదలు, ఎళుమైయుం - ఇకమీదికాలము, ఎమ్పిరాన్ - దాసునికి స్వామియైనవారు, నిన్రు - అధ్యవసాయముతోనిలచి, తమయొక్క, పుకర్ - కల్యాణగుణములను, ఏత్త - నేనుస్తోత్రముచేయునట్లు, అళినార్ - కృపచేసిరి, కున్రం - పర్వతములకుసమానమైన, మాడం - మేడలు, కుర్కూర్ నంబి - తిరునగరిలో వేంచేసియుండు ఆళ్వార్లు, ఎన్రుం-ఎన్నడును, నన్ను, ఇకళ్ విలక్ - అనాదరింపరు, కాణ్మినే - చూడుడీ.

తా. ఇదిమొదలు భవిష్యత్కాలమంతయు, దాసునికి ఉపకారకులగు ళ్వార్లు స్థిరముగ తమకల్యాణగుణములను, నేనుస్తుతించునటుల కృపచేసిరి. కొండ్ల వంటి మేడలుగల తిరునగరిలో వేంచేసియుండుఆళ్వార్లు, ఇకయెన్నడునునన్ను ఉపేక్షిం లలోవిడువరు అనుచున్నారు.

౬ - పా. అ. ఆళ్వార్లు తమ్మును నిర్హేతుకముగ అంగీకరించినదిచూచి, ఆళ్వార్ల అంగీకారమునకు, చేతనులందరు తగియుండియు,ఈయాళ్వార్లమహిమ పోగొట్టుకొనుచున్నారని, అందరికి దెలియునట్లువచించుచున్నాను. అనుచున్నారు.

౭. కణ్డుకొణ్డెన్నై క్కారిమారప్పిరాన్,
పణ్డైవల్వినై పారియరుళినాన్,
ఎణ్డిశైయుమఱియవియమ్బుగేన్,
ఒణ్డమిళ్ శ్శడగోపనరుళైయే.

టీక. ఎన్నై - సత్పురుషులచే అంగీకరింపదగనినన్ను, కణ్డుకొణ్డు - దోషములనుచూడక కటాక్షించి, కారిమారప్పిరాన్ - తమకుపకారకులగు ఆళ్వార్లు, పణ్డై - అనాదిసిద్ధమగు, వల్ వినై - బలిష్ఠమైనపాపమును, పారి - రూపమలేకుండ, అళినాన్ - తమ్మునుస్తుతించునట్లుకృపచేసిరి, ఒణ్ తమిళ్ - శ్లాఘ్యమగు ద్రావిడ ప్రబంధ మును ఆనతిచ్చిన, శడకోపన్ - ఆళ్వార్లయొక్క, అరుళైయే-కృపనే, ఎణ్డిశైయుం - అష్టదిక్కులనుండువారలు, అఱియ - తెలిసియుజ్జీవించునట్లు, ఇయమ్బుగేన్ - చెప్పు చున్నాను.

తా. సాత్వికులు అంగీకరింపనినన్ను దోషములందు దృష్టిలేకకటాక్షించి, ఉప కారకులగు ఆళ్వార్లు అనాదిసిద్ధమగు బలమైనపాపమును నశింపజేసి, తమ్మునుస్తుతించునట్లు కృపచేసిరి. శ్లాఘ్యమైనద్రావిడప్రబంధమును ఆనతిచ్చిన ఆళ్వార్లయొక్క కృపను ఎనిమిదై మైనదిక్కులలోనుండువారలు తెలిసి యుజ్జీవించునట్లు చెప్పుచున్నానని.

ర. పా. అ.—సకలదిక్కులందును ప్రసిద్ధపఱచుచున్నాను. అనుటకు కారణ మేమనిన; ఆళ్వార్లయొక్క కృప చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనుతత్వత్రయమునకంటెను అధికమైయుండుటచేత. అనుచున్నారు.

౮. అరుళ్ కొణ్డాడుమడియవరిన్బుఱ
అరుళినానవ్వరుమఱైయిన్పొరుళ్
అరుళ్ కొణ్డాయిరమిన్తమిழ్ పాడినాన్
అరుళ్ కణ్డీరివ్వులగినిల్ మిక్కదే.

టీక.—అడియవర్ - శేషభూతులు, ఇన్బుఱ - ఆనందనిర్భరులై, అరుళ్ - కృపను, కొండాడుం - కొనియాడునట్లు, అవ్వరు -అద్భుతమైన, మఱైయిన్ - వేద ముయొక్క, పొరుళ్ - రహస్యార్థమును, అరుళినాన్ - ప్రసాదించినారు, అరుళ్ కొణ్డు - ఈశ్వరకృపనుఅవలంబించి, ఆయిరం - వెయ్యిపాశురములై, ఇన్ - రసవంతముగాను, తమిழ் - తిరువాయిమొழிని, పాడినాన్ అరుళ్ - ఆనతిచ్చినఆழ்వారుల యొక్కకృప, ఇవ్వులగినిల్ - ఈలోకమునందు, మిక్కదే-మిక్కుటమైయుండుటను, కణ్డీర్ - చూచితిరా.

తా.—భక్తులు ఆనందనిర్భరులై కృపనుబొగడునట్లు అద్భుతమైన వేదరహస్యార్థమును కృపచేసిరి. భగవత్కృపనుగొని వేయిపాశురములను రసముగనుండునట్లు తిరువాయిమొழி ప్రబంధమును ప్రసాదించిన ఆళ్వార్లయొక్క కృప ఈలోకమందతిశయించియుండుటను చూచితిరా. అని.

ర. పా - అ. ఆళ్వార్లకృప లోకమందతిశయించినది. అనుటకు మూలమేమనిన; నాతక్కువస్థితినిజూడక, సకలవేదరహస్యార్థములను పాడి, దానిని నాకుపకరించిరి అనుచున్నారు. భగవద్విషయమందు ఆళ్వార్లుచేసిన నైచ్యానుసంధానమును ఆళ్వార్లవిషయమందు తామనుసంధించుచున్నారు.

౯. మిక్కవేదియర్, వేదత్తినుట్పొరుళ్,
నిఱ్కప్పాడియెన్నెఞ్జుళ్ నిఱుత్తినాన్,
తక్కశీర్చ్చడకోపనెన్నమ్బికాక్కు,
ట్పుక్కకాదలడిమైప్పయనన్తే.

టీక. మిక్కవేదియర్ - అతిశయించిన ముముక్షువులయొక్క, వేదత్తిన్ - వేదముయొక్క, ఉట్పొరుళ్ - గుహ్యమైనఅర్థమును, నిఱ్క - నిలుచునట్లు, పాడి-

ప్రపత్తివిషయముగా గానముచేసి, ఎన్నెఞ్జుళ్ - నామనస్సునందు, నిఱుత్తి
ను ప్రతిష్ఠితముగనిలిపెను, తక్క - తగిన, శీర్ - జ్ఞానాదిగుణ పూర్తిగల, శఠ
శఠకోపులును, ఎన్ నమ్బిక్కు - నాస్వామియునగు ఆళ్వార్లకు, ఆళ్ ప్ర
యించుటయందు కలిగిన, కాదల్ - ప్రేమ, అడిమై - దాస్యమునకు, ప
ప్రయోజనముగదా.

తా.—మిగుల వైదికులగు ముముక్షువులయొక్క వేదములలోని సా
ప్రపత్తివిషయముగ గానముచేసి నాహృదయమందు సుస్థిరముగనిలిపెను. శ
క్త్యాదిగుణపూర్తిగలిగి శఠులనుకోపించునట్టి నాకుస్వామియగు ఆళ్వార్లను ఆ
వలెనను ప్రేమ దాస్యమునకు ప్రయోజనముగదా.

౧౦. పా - అ. ఆళ్వార్లు తమకుపకరించిన ఉపకారమును గుఱించి
ధించుచున్నారు. ఆచార్యులు చేసిన యుపకారమునకు "కృత్స్నాంవా పృథివ
న్నత్తతుల్యం కథంచన" పంచాశత్కోటివిస్తీర్ణమైన భూమిసమర్పించినను స
దు" అని కదాశాస్త్రము - కాబట్టి ఈచేతనుడు తగిన ప్రత్యుపకారము చేయగద
భావము.

⁂ ౧౦. పయనన్ఱాగిలుమ్, పాఙ్గలరాగిలుమ్,
శెయల్ నన్ఱాగత్తిరుత్తి ప్పణికొళ్వాన్,
కుయిల్ నిన్ఱార్ పొళిల్ శూழ், కురుగూర్ నమ్బి,
ముయల్గిన్ఱేనున్ఱన్, మొయ్ కழల్కన్బైయే.

టీక. పయనన్ఱాగిలుం - ప్రయోజనములేకపోయినను, పాఙ్గలరాగిలు
కూలులు కాకపోయినను, శెయల్ - వ్యాపారమును, నన్ఱాగ - (అనుష్ఠాన
చక్కనగునట్లు, తిరుత్తి - శిక్షించి, పణికొళ్వాన్ - (భగవత్భాగవతకైంకర్య
అన్వయింపజేయుదురు, కుయిల్ - కోకిలలు, నిన్ఱు - నిలచి, ఆర్ - శబ్దించు
తోటలచే, శూழ் - చుట్టబడ్డ, కురుగూర్ - తిరునగరికి, నంబి - (నిర్వాహ
ఆళ్వార్లే, ఉన్ఱన్ - దేవరవారియొక్క, మొయ్ - శ్లాఘ్యమైన, కழల్
దములకు, అన్బైయే - ప్రీతినే, ముయల్గిన్ఱేన్ - యాచించుచున్నాను.

తా.—ఆళ్వార్లు నిష్ప్రయోజకులను, అననుకూలులను తాము
చే చక్కనిజ్ఞానానుష్ఠాన సంపత్తిగలుగునట్లు దిద్దుపాటుచేసి భగవద్భాగవతకైం
కర్య పరునిగ నంగీకరింతురు. కోకిలలు గానముచేయు రమ్యమైన తోటలుగల
తిరునగరియందలి గుణపరిపూర్ణులగు ఆళ్వార్లూ! దేవరవారి శ్లాఘ్యమైన శ్రీ
ప్రేమనే యాచించుచున్నాను.

రాశైనవాడవా ! ఎప్పుమ్ - ఒకప్పుడును, పుగఱ్కు - శత్రువులు ప్రవేశించుటకు, అరియ - దుర్లభుడగు, ఎన్దాయ్ - నాస్వామిరైయె, పుళ్ళిన్ - (నీయాశ్రిత విరోధియగు) బకాసురునియొక్క, వాయ్ - నోటిని, పిళన్దానే - చీల్చినవాడవా, అగప్ప-నీయం దుభక్తిలేని వారిని దగ్గఱ చేరనీయకుండుటకై, నీవైత్త - నీవుగలుగఁజేసి యుంచిన, మాయమ్ - అత్యాశ్చర్యమై, వల్ - బలిష్ఠమైన, ఐమ్బులన్గళామవై- పంచేన్ద్రియములగు వానిని, నన్గు - ఉన్నది యున్నట్టు చక్కగ, అఱిన్దనన్ - తెలిసికొంటిని, ఎన్నై యుమ్ - తెలిసి భయపడియుండునన్నును, అగప్పై- నిన్నెడబాయజేసి, అఱ-తప్పిం చుకొని రాకూడనిదిగనుండు, శేర్ నీల్ - శబ్దాదివిషయములనెడు బురదలో, వీళ్ త్తి కళ్దాయ్ - పడఁద్రోయుదువోయని భయపడుచున్నాను.

తా — వానమామలై దేవనాయక స్వామి, "మిమ్ము విశ్లేషింపజేసితివోయనిన" నీప్రాప్తికి విరోధియగు శబ్దాదివిషయములలో నుంచనిచ్చుట, విశ్లేషింపఁజేసినట్లుగదా? ఇట్లునీవు ప్రతికూలుల విషయమందుంచ నగునుగాని యనుకూలుల విషయమందుంచ దగదు కనుక, బకాసురుని నశింపఁజేసినట్లు నాప్రాప్తికి ప్రతిబన్ధకములను నశింపజేయ వలయునని.

౮. పుళ్ళిన్ వాయ్ పిళన్దాయ్ మరుదిడై పోయినాయెరుతేళ్ డర్త్త, ఎన్
కళ్ళమాయవనేకరుమాణిక్కచ్చుడరే,
తెళ్ళియార్ తిరునాన్మరైగళ్ వల్లార్ మలితణ్ శిరీవరమజ్ గై
ఉళ్ళిరున్ద వెన్దాయ్ అరుళాయుయ్యుమారెనక్కే.

టీక పుళ్ళిన్ వాయ్ పిళన్దాయ్ - (ఆశ్రితులప్రతిబన్ధకమును నశింపజేయుటకు గుఱుతుగ) బకాసురుని నశింపఁజేసినవాడవా ! మరుదిడైపోయినాయ్ - యమళార్జునములనునిరసించినవాడవై, ఏళ్ఱెరుదు - ఏడెద్దులను, అడర్త - చంపిన, కళ్ళమ్ - ఒకరిచేతను దెలిసికొనఁగూడని, ఎన్మాయవనే - నాకాశ్చర్యభూతుఁడై, కరుమాణిక్క - నీలరత్నముయొక్క, శుడరే - తేజస్సువలెనుండురూపసౌందర్యము గలవాడై, తెళ్ళియార్ - వాడే రక్షకుడను తెలివిగలవారై, తిరు - (శ్రియఃపతిని ప్రతిపాదించుట యను) శ్రీగల, నాల్ మఱైగళ్ వల్లార్ - నాలుగు వేదముల తాత్పర్యమును చక్కగ గ్రహించినవారలు, మలి - అతిశయించియుండు, తణ్ - సాంసారికతాపశ్రమహరమగు, శిరీవరమజ్ గైయుళ్ -వానమామలలో, ఇరున్ద - వేంచేసియున్న, ఎన్దాయ్ - ఉపకారకుఁడా! ఎనక్కు - నిన్నుదప్పరక్షకుడు లేనినాకు, ఉయ్యుమ్ - నీపాదారవిన్దములనాశ్రయించియుజ్జీవించునట్టి, ఆఱు - ప్రకారమును, అరుళాయ్ - కృపచేయువలయును.

తా.—నీయొక్క యతిమనోహరమగు దివ్యచేష్టితములచేతను నిరవధిక ముచేతను నన్నులోబఱచుకొనినవాడవా! సకలవేదతాత్పర్యజ్ఞానముగలి ఘులునే సాధనముగ నెంచియుండు దివ్యజనులచేనిండియున్న వానమామలలో యున్నయుపకారకా! దాసుడుజ్జీవించువిధమును కృపచేయుమని.

౧౦. ఆతేనక్కున్ని పాదమేశరణాగత్తన్దాక్రిన్దాయనక్కోర్కైమాఱునానొన్ఱిలేన్ఎనదావియుమునదే,
శేఱుకోల్ కరుమ్బుమ్ పెరుఞ్జెన్నెలుమలితణ్ శిరీవరమజ్గై
నాఱుపూన్దణ్ణుళాయ్ ముడియాయ్ తెయ్వనాయగనే.

టీక. శేఱుకోల్ - బురదగేలయందు, కరుమ్బున్ - చెఱుకును, పెరు శెన్నెలుమ్ - ఎఱ్ఱనివడ్లును, మలి - సమృద్ధమై, తణ్ - శ్రమహరమైన, శిరీవరమ వానమాలలో వేంచేసియున్నవాడవై, నాఱు - మిగులపరిమళించుచున్న, పూ మైన, తణ్ - శ్రమనుహరించునట్టి, తుళాయ్ - తిరుత్తుళాయ్‌మాలికచేనల బడిన, ముడియాయ్ - కిరీటముగలవాడవై, తెయ్వమ్-నిత్యసూరులకు, నాయ నిర్వాహకుడైనవాడవా! ఎనక్కు - నాకు - ఆఱు - ప్రాప్తికిమార్గము, నిన్నా నీపాదారవిన్దములనే, శరణాగ - ఉపాయముగ, తన్దొళిన్దాయ్ - కృపచేసితివి క్కు - ఇట్టియుపకారకుడవగునీకు, ఓర్ - ఒకవిధమైన, కైమాఱు - ప్రత్యుప నైనను, నాన్ - అకిఞ్చనుడగునేను, ఒన్ఱు - ఒకటియు, ఇలేన్ - చేయనివా న్నాను, ఎనదు-నాయొక్క, ఆవియుమ్ -ఆత్మయు, ఉనదు - మునునే నీదైయున్న

తా.—మిగులమనోజ్ఞమగు శ్రీవరమఙ్గలనగరమందు వేంచేసియున్న దేవనా మీ! ఫలసాధనములురెండును నీతిరువడిఘలేయను నిట్టిబుద్ధివిశేషమును దాసు తివి. (ఈజీవాత్మలక్షణమిదేయయియున్నది.) ఇట్టిమహోపకారమునకు దాసు చేయుదును. ఈజీవాత్మనుప్రత్యుపకారముకొఱకు సమర్పింపనగునోయనిన ఈ వస్తువునునీదైయున్నదికనుక వీనికిపస్వాతంత్ర్యముళేదని.

౧౧. తెయ్వనాయకనారణన్ తిరివిక్కిరమన్ అడియిణై మిశై,
కొయ్యాయ్‌కోల్ పూమ్బొళిల్‌శూழ్ కురుగూర్ శడకోపన్,
శెయ్దవాయిరత్తుళ్ ఇవై తణ్ శిరీవరమజ్గై మేయపత్తుడన్,
వైగల్ పాడవల్లార్ వానోర్‌కారావముదే.

టీక. తెయ్వమ్ - దేవతలకును నిత్యసూరులకును, నాయకన్ - నా తిరివిక్కిరమన్ - త్రివిక్రమస్వామియునగు, నారణన్ - శ్రీమన్నారాయణుని

అడియిణైమిశై - శ్రీపాదద్వయముమీద, కొయ్ కొళ్ - కోయదగినంతటిమిక్కుటమైన, పూ - పుష్పములుగల, శోలైల్ - తోటలచేత, శూళ్ - చుట్టబడిన, కురుగూర్ - ఆళ్వార్ తిరునగరికి నాథులైన, శడకోపన్ - నమ్మాళ్వార్లు, శెయ్ ద - ప్రసాదించిన, ఆయిరత్తుళ్ - వేయిపాశురములలో, తణ్ - చల్లనైన, తిరువరమంగై - శ్రీవరమంగై యనువానమామలను, మేయ - పొందిన, ఇవై పత్తు - ఈ పది పాశురములను, ఉడన్ - అర్థానుసన్ధానముతో, పాడవల్లార్ - అనుసన్ధించువారలు, వైగల్ - ఎల్లప్పుడును, వానోర్క్కు - పరమపదవాసులకు, ఆరా అముదు - వెగటులేని అమృతమువలె భోగ్యులగుదురు,

తా.—త్రివిక్రమావతారముచే సకలదేవాధిదేవత్వమును, ప్రకాశింపఁజేసిన శ్రీమన్నారాయణుని చరణారవిన్దములనుగూర్చి, నిత్యవసన్తముగనుండు తోటలతోఁగూడిన తిరునగరికి నిర్వాహకులగు ఆళ్వార్లు ప్రసాదించిన వేయిపాశురములలో వానమామలైవిషయమగు, నీతిరువాయ్ మొళ్ళిని, అర్థముతోననుసన్ధించువారు, నిత్యసూరులకెల్లప్పుడును, అస్పృష్టామృతమువలె భోగ్యభూతులగుదురు.

ఆళ్వార్ తిరువడిగళేశరణమ్. జీయర్ తిరువడిగళే శరణమ్.



శ్రీమతేరామానుజాయనమః.

## ౫ - పత్తు - ౮ - తిరువాయ్ మొళ్ళి.

మునుపటి తిరువాయ్ మొళ్ళిలో, ఫలసిద్ధి కానందుచే తిరుక్కుడన్దై (కుంభకోణము) ఆరావముదుస్వామివిషయమున ప్రపత్తిచేయుచున్నారు.

౧. ఆరావముదేయడియేనుడలమ్ నిన్పాల్ అన్పాయే,
నీరాయ్ అలైన్దు కరైయ ఉరుక్కుగిన్ఱ నెడుమాలే,
శీరార్ శెన్నెల్ కవరివీశుమ్ శెழுనీర్ త్తిరుక్కుడన్దై,
ఏరార్ కోలన్దిగழக్కిడన్దాయ్ కణ్డేనెమ్మానే.

టీక. ఎమ్మానే - దాసునికిస్వామియయినవాడును, ఆరా - నిరన్తరముఅనుభవించుచుండియువిసుగులేని, అముదే - అమృతమువలెభోగ్యభూతుడా, అడియేన్ - దాసుని యొక్క, ఉడలమ్ - శరీరమైనది, నిన్పాల్ - దేవరవారివిషయమునసుండు, అన్పాయే - ప్రేమచేత, నీరాయ్ - నీరై, అలైన్దు - వ్యాకులమునొంది, కరైయ - తగ్గునట్లు, ఉరుక్కుగిన్ఱ - కరిగించు, నెడుమాలే - దీర్ఘమగు ఆశ్రితవ్యామోహముగలస్వామీ, శీర్ - శారముచే, ఆర్ - మిక్కుటమైన, శెన్నెల్ - ఎఱ్ఱవరిఎన్నులు, కవరివీశుమ్ - చామరమువేయునట్లు, శెழு - సమృద్ధమైన, నీర్ - నీటినిగల, తిరుక్కుడన్దై - కుంభకోణ

ములో, ఆర్ - అధికమైన, ఏర్ - అందముగల, కోలమ్ - ఒప్పియుండునుని, ప్రకాశించునట్లు, కిడన్దాయ్ - శయనించినావు, కణ్డేన్ - సేవించి యనుభవింపఁ

తా.—ఎంత భుజించినను వెగటులేని యమృతమువలె నుండువాడవా! దలిప్రేమాతిశయముచే నాదేహము కృశించినీరగుచున్నది, జలసమృద్ధిగలతిరుక్కు ఆశ్రితవ్యామోహముచే ఉత్థానశయనముగ (సరుండిలేవబోవువిధముగ) సేవ చుచున్న నిన్ను సేవించితినిఅని.

౨. ఎమ్మానే యెన్ వెళ్ళై మూర్త్తియెన్నై యాళ్వానే,
ఎమ్మావురువుమ్ వేణ్డుమాత్త్రాలావాయెழిలేఱే,
శెమ్మాకమలమ్ శెழునీర్ మిశైక్కణ్మలరుమ్ తిరుక్కుడన్దై,
అమ్మామలర్క్కణ్వళర్గిన్ఱానే యెన్నాన్ శెయ్‌గేనే.

టీక.—ఎమ్మానే - దాసునికినాథుడా, ఎన్ - నాకుసత్వగుణమతిశయింప వెళ్ళై - పరిశుద్ధమైన, మూర్త్తి - ఆకారముగలవాడువై, ఎన్నై - దాసుని, ఆళ్ ఏలుకొనువాడా! ఎ - ఆశ్రితార్థముగను, మా - శ్లాఘ్యముగనుండు, ఉరువుమ్ - తారవిగ్రహములను, వేణ్డుమాత్త్రాల్ - ఇష్టప్రకారముగ, ఆవాయ్ - ఆర్తి వాడై, ఎழిల్ - ఆయావిగ్రహసౌందర్యముచే, ఏఱే - పరత్వముతోనుండువా శెమ్ - ఎఱ్ఱనై, మా - గొప్ప, కమలమ్ - తామరలు, శెழు - సమృద్ధమైన మిశై - జలముమీద, కణ్ - అంకటను, మలరుమ్ - వికసించునట్టి, తిరుక్కుడన్దై కోణములో, అమ్మా - అవిలక్షణమైన, మలర్ - తామరపుష్పమువలెనుండు, కణ్ త్రములు, వళర్గిన్ఱానే - వికసించినరీతిని శయనించియుండువాడవా! నాన్ ఎన్ శెయ్‌గేన్ - ఏమిచేయుదును.

తా.—నాస్వామీ! పరమభోగ్యమైన నీదివ్యమంగళవిగ్రహసేవను సాధిం నీదాసునిగ జేసికొన్నవాడవా! ఆశ్రితరక్షణార్థమై ఇష్టానుగుణముగ నవతరించునా కుంభకోణములో తామరలు వికసించినను నీనేత్రముల నెడి తామరలు వికసింపుట చేయుదునుఅని.

3. ఎన్నాన్ శెయ్‌గేన్ యారేకళైగణెన్నై యెన్ శెయ్‌గిన్ఱాయ్,
ఉన్నాలల్లాల్ యావరాలుమొన్ఱుమ్ కుఱైవేణ్డేన్,
కన్నార్ మదిళ్ శూழ் కుడన్దైక్కిడన్దాయడియేనరువాழ்నాళ్,
శెన్నాళెన్నాళన్నాళునదాళ్ పిడిత్తే శెలక్కాణే.

టీక. నాన్ - (పరతంత్రుడగు) నేను, ఎన్ - ఏప్రవృత్తిని (ఏవుపాయమును), శెయ్ గేన్ - చేయుదును, కళైగణ్ - రక్షకులు, యార్ - ఎవరు, ఎన్నై - అశక్తుడగువన్ను, ఎన్ శెయ్ గిన్ఱాయ్ - ఏమిచేయుదలంచియున్నావు, ఉన్నాలల్లాల్ - సర్వ రక్షకుడగునిన్నుతప్ప, యావరాలుమ్ - ఆరక్షకులగునితరులచేత, ఒన్ఱు - ఒక, కుఱై యుమ్ - కొఱతనునివర్త్తింపజేయుమని, వేణ్డేన్ - ఆపేక్షింపను, కన్ - పనులలో, అర్ -మించియుండు, మదిళ్ - తామ్రపుప్రాకారములచే, శూழ் - చుట్టబడిన, కుడన్దై - తిరుక్కుడన్దలో. కిడన్దాయ్ - శయనించియుండువాడవా, అడియేన్ - దాసునియొక్క, అరు - (అణుమాత్రపు) ఆత్మవస్తువు, వాழ் - ఉజ్జీవించు, నాళ్ - కాలము, శెల్ - అనువర్తించు, నాళ్ - కాలము, ఎ - ఎంత, నాళ్ - కాలమో, అన్నాళ్ - అకాలమంతయు, ఉన - నీయొక్క, తాళ్ - తిరువడిగళను, పిడిత్తే-పొందియే, శెల - నడచునట్లు, కాణ్ - కృపచేయవలయును.

తా. తిరుక్కుడందలో వేంచేసియుండుస్వామీ! నేనుచేసినదొకటియులేదు, నాకు నిన్నుదప్పగతిలేదు, నాయత్నముచే నేనునిన్నులభింపవలసినవానినిగనాచూచుచున్నావు? నీకృపచేత నీపాదములను పొందవలయునేగాని వేఱొక యుపాయముచేలభించిన నావశ్యకములేదు. ఈయాత్మకుయావత్కాలము నీతిరువడిగళ సంబన్ధముండునట్లు కటాక్షింపవలయు నని.

౮. శెలక్కాణ్గిత్తార్ కాణుమళవుమ్ శెల్లుజ్గీర్త్తియాయ్,
ఉలప్పిలానే యెల్లాపులగుముడై యవొరుమూర్త్తి,
నలత్తాల్ మిక్కార్ కుడన్దై క్కిడన్దాయునైక్కాణ్బాన్ నా
నలప్పాయ్, ఆగాశత్తై నోక్కి యழுవన్ తొழுవనే.

టీక. శెల - జ్ఞానముచాలదనిపైపైగ, కాణ్గిత్తార్ - చూచుటకుశక్తిగలవారలు' కాణుమళవుమ్ - చూచునంతవఱకు, శెల్లుమ్ - పోవునంటిటి, కీర్త్తియాయ్ - వైభవముగలవాడును, - ఉలప్పు - అంతము, ఇలానే - లేనివాడునై, ఎల్లావులగుమ్ - సమస్తలోకములును, ఉడైయ - శేషముగాగల (లోబడియున్న), ఒరు - అద్వితీయమగు, మూర్త్తి - పరేశ్వరుడా! నలత్తాల్ - నీయందలిప్రీతిచే, మిక్కార్ - అతిశయించిన వారలుండు, కుడన్దై-కుంభకోణములో, కిడన్దాయ్ - శయనించియుండువాడవా, ఉనై-నిన్ను, నాన్ - నేను, కాణ్బాన్ - సేవింపవలయునని, అలప్పాయ్- సేవింపమిచేగలిగిన త్వరవల్ల, ఆకాశత్తై - నీవువచ్చెంచుమార్గముగు ఆకాశవీధిని, నోక్కి - ఉద్దేశించి, అழுవన్ - శక్తిరహితులవలె దుఃఖపడి, తొழுవన్ - ప్రపత్తినిష్ఠులవలె ప్రపత్తిచేసెదను.

తా.— అన్తములేనిదై అతిశయమై అసంఖ్యేయములునగు కల్యాణ... పూర్ణుడా! సర్వాత్మలను నీసౌన్దర్యముచే శేషపఱచుకొనుసంతటి తిరుమేనుగల... భక్తులునివసించుతిరుక్కుడందలో శయనించియుండుస్వామీ! నేను నిన్ను... వింపనాతురముచే, శ్రీగజేన్ద్రాళ్వానును వచ్చికటాక్షించినట్లు నన్నుకటాక్షించు... ఆకాశమునుజూచి బాలునివలె యేడ్చెదను, విరక్తులవలె అంజలిచేసెదనని.

౫ అழுవర్ తొழுవర్ ఆడిక్కాణ్బర్ పాడియలఱ్ఱువర్,
తழுవల్వినైయాల్ పక్కమ్‌నోక్కినాణిక్కవిழ்న్దిరుప్పర్,
శెழுబణ్పణ్ణైక్కుడన్దైక్కిడన్దాయ్ శెన్దామరైక్కణ్ణా,
తొழுవనేనైయునదాళ్ శేరుమ్వగైయేశూழ்కణ్డాయ్.

టీక. అழுవర్ - కలవరముచేఏడ్తును, తొழுవర్ - తెలివిచేఅంజలిచేయు... ఆడి- భ్రమముచేనాట్యమాడి, కాణ్బర్ - చూతును, పాడి - పరవశుడైపాడి, అల... వర్ - ఆర్తిచేప్రలాపింతును, తழு - నన్నువిడువకుండు, వల్వినైయాల్ - ప్రబల... ములచే, పక్కమ్- వాడువచ్చుదిశలను, నోక్కి- చూచి, నాణి-ఇష్టసిద్ధికానందున... కవిழ்న్దిరుప్పన్ - బోరగిలపడియుందును, శెழு - సమృద్ధమై, ఒణ్ - చూడదగిన... నమ్ - జలభూములుగల, కుడన్దై - కుంభకోణమున, కిడన్దాయ్ - ఆశ్రితార్థము... నించియుండువాడవా, శెమ్ - ఎఱ్ఱని, తామరై - తామరపుష్పమువంటి, కణ్ణ- ... ములుగలవాడా, తొழுవనేనై- నీచుడగునన్ను, ఉన - ప్రాప్యుడైననీయొక్క... భోగ్యమైన శ్రీపాదములను, శేరుంవగై - చేరునట్లు, శూழ்కణ్డాయ్ - మంచియు... ముకృపచేయవలయును.

తా — ఏడ్చియు. అంజలిచేసియు, ఆడియు, పాడియు, ప్రలాపించిచూచి... నీసేవకనుబడలేదు. ఈలోకులునీవిషయమున గుణహానిని జెప్పుచున్నారే అనిల... పాపమనితలయెత్తక బోరగిలపడియున్నాను. జలసమృద్ధమైనవరిపొలములుగల తిరు... డన్దలోనుండుస్వామీ! మాతినుపడిగలుచేరు మంచియుపాయము కృప చేయవలయును.

౬. శూழ்కణ్డాయ్ ఎన్దొల్లైవినైయై యఱుత్తున్నడి శేరుమ్,
ఊழ்కణ్డిరున్దే, తూరాక్కుழிతూర్తెనై నాళ్ అగన్దిరుప్పర్,
వాழ்తొల్‌పుగழார్‌కుడన్దైక్కిడన్దాయ్ వానోర్‌కోమానే,
యాழ்నిశై యేయముదే యెన్నళవిల్లాప్పయ నేయరియేఱే.

టీక. వాழ் - భగవదనుభవమనుజీవనముచే, తొల్ - స్వాభావికమైన ... పుగழார் - కీర్తిగలవారలుండు, కుడన్దై - కుంభకోణములో, కిడన్దాయ్-శయనించు...

వా, వానోర్ - నిత్యసూరులకును, కోమానే - నిర్వాహకుడైనవాడా, యాళిన్ - వీణా వాదముయొక్క, ఇశైయే - ధ్వనివలెవినుటకుభోగ్యమై, అముదే - అమృతమువలెనాలుకకు ఇంపైనవాడును, అఱివిన్ పయనే - జ్ఞానఫలమైనందున మనస్సుకుభోగ్యమైనవాడై, అరియేఱే - శ్రేష్ఠమైనసింహమువంటివాడునునైన, ఉన్ - నీయొక్క- అడి - శ్రీపాదములను, శేరుమ్ - చేరి నీకే శేషమైయుండు, ఊళ్ - పురాతనసంగతి, కణ్డిరున్దే - తెలిసియుండియే, తూరా - నిండని, కుళి - దురాశయనుపల్లమును, తూర్త్తు - దుర్విషయాదులచేనిండించి, ఎనైనాళ్ - ఇంకనెంతకాలము, అగన్ఱు - నిన్నువదలి, ఇరుప్పన్ - ఉందును, ఎన్ - నాయొక్క, తొల్లైవినైయై - అనాదిపాపములను, అఱుత్తు-ఛేదించి, ఉన్నడి శేరుమ్-నీపాదములుచేరునట్లు, శూళ్ కణ్డాయ్-ఉపాయము కృపచేయవలయును.

తా.— తిరుక్కుడన్దలో శయనించియుండు ఆరావముదే! జ్ఞానమునకు విషయమైనవాడవా! నీకు నేను శేషభూతుడని అనాదిసంబంధము తెలిసియుండియు ఇంద్రియపరవశుడనై ఎన్ని దినములు నిన్ను వదలియుందును ? నాపాపమును తొలగించి, నిన్ను చేరువిధమును కృపచేయవలయునని.

౭. అరియేఱేయెన్నమ్పొఱ్కున్ఱే శెఙ్గట్కరుముగిలే,
ఎరియేపవళక్కున్ఱేనాల్ తోళెన్దాయునదరుళే,
పిరియావడిమైయెన్నైక్కొణ్డాయ్ కుడన్దైత్తిరుమాలే,
తరియేనినియున్ శరణన్దన్దెన్ శన్మఙ్కళైయాయే.

టీక. అరియేఱే - నిరఙ్కుశస్వాతన్త్ర్యముగలవాడును, అమ్ - రమ్యమై, పొన్ - స్వర్ణమువలెనుండు, శుడర్ - తిరుమేనుకాన్తిని, ఎన్ - నాకుఅనుభవింపజేసినవాడై, శెమ్ - ఎఱ్ఱని, కణ్ - నేత్రములుగలవాడై, కరుముగిలే - నీలమేఘమువంటి మేనుగలవాడై, ఎరియే - ఆశ్రితవిరోధివిషయమందు అగ్నివలెఎఱ్ఱనై, పవళక్కున్ఱే - పగడపుకొండవంటివాడై, నాల్ తోళ్ - చతుర్భుజములుగలవాడునునైన, ఎన్దాయ్ - నన్నేలుకొనినస్వామీ! ఉనదు-నీయొక్క, అరుళ్-కృపను, పిరియా-ఒకప్పుడునువిడకుండునట్లు, అడిమై-దాస్యమునందు, ఎన్నై - నన్ను, కొణ్డాయ్ - ఏలుకొనినవాడా! కుడన్దై - తిరుక్కుడన్దలో, తిరుమాలే-లక్ష్మిసహితుడైవేంచేసియున్నవాడవా! ఇని - ఇకను, తరియేన్ - ఓర్చుకొనను, ఉన్ - నీయొక్క, శరణమ్ - పాదములను, తన్దు - కృపచేసి, ఎన్-నాయొక్క, శన్మమ్ - శరీరసంబన్ధమును, కళైయాయ్-సవాసనగాతొలగొట్టవలయును.

తా.—నీయొక్కకృపచేతనీ సౌందర్యమునుజూపినన్ను వాచికాదికైఙ్కర్య దాసునిగ యేలుకొంటివి, ఇకఒకక్షణమైనను, నిన్నువిడిచియుండజాలను, కన దునీతిరువడిగళనుకృపచేసి పిమ్మటనాప్రతిబంధకములనుబోగొట్టి కటాక్షింపవల

౧౦. కళై వాయ్తున్బజ్కళై యాదొళ్ఙివాయ్కళై గణ్మఱ్ఱిలే
వళై వాయ్నేమిప్పడై యాయ్కుడన్దైక్కిడన్దమామాయా,
తళరావుడలమెనదావిశరిన్దుపోమ్బోదు,
ఇళై యాదునదాళ్గళొరుజ్గప్పిడిత్తుప్పోదవిశై నీయే.

టీక. తున్బమ్ - నిన్ననుభవింప లభింపనిదుఃఖమును, కళైవాయ్-పోగొ కళైయాదొళ్ఙివాయ్ - పోగొట్టకపోయిననుపొమ్ము, కళైగణ్ - దుఃఖనివర్తక మఱ్ఱిలేన్ - వేఱొకటిని, ఇలేన్ - కలవాడనుగాను, వళై - సుంద్రమైన, నోటినిగల, నేమి - చక్రత్తాళ్వానును, పడైయాయ్ - ఆయుధముగకలవా కుడన్దై - కుంభకోణములో, కిడన్ద - పవ్వళించియుండు, మామాయా - అ మగుసౌందర్యముకలవాడా ! ఉడలమ్ - శరీరము, తళరా - శిథిలమై, ఎనదు - క్కు, ఆవి - ప్రాణమైనది, శరిన్దు-ఉనికిదప్పి, పోమ్బోదు-దేహమునువదలిపో ఇళైయాదు - మనశ్శైథిల్యముకలుగకమును పే, ఉనతాళ్-నీపాదములనే, ఒ యోపేయరూపముగ, పిడిత్తు - పట్టి, పోద - అనుసన్ధించునట్లు, నీయే-నీవే, సమ్మతింపవలయును.

తా.—నిన్నుఅనుభవింపనందుచేగలిగినదుఃఖమును బోగొట్టుము, పోగొట్ట యిననుపోనిమ్ము, నీయిష్టప్రకారముచేయుము, నాకునిన్నుదప్పగతివేఱులేదు, దుః ఖనివర్తకైగదానీహస్తమునచక్రత్తాళ్వానుధరించియుండుటయు తిరుక్కుడన్దై శించియుండుటయును. నాశరీరముకృశించి నాప్రాణముబోవుచున్నది. అది మును పేనాయాత్మను నీపాదములందు జేర్చుకొనుముఅని.

౧౧. ఇశైవిత్తెన్నై యుళ్ళాళికైక్కీళ్ప్రిశత్తమమ్మానే,
అశైవిలమరర్తలైవర్తలైవావాదిప్పేరుమూర్తి,
తిశైవిల్వీశుమ్శెళుమామణిగళ్శేరుతిరుక్కుడన్దై
అశైవిలులగమ్పరవక్కిడన్దాయ్కాణవారాయే.

టీక. ఎన్నై - అనాదికాలమునీకువిముఖుడైననన్ను, ఇశైవిత్తు - పొంకొనునట్లుచేసి, ఉన్ తాళికైక్కీళ్ - నీయొక్కపాదములయందు, ఇరుత్తు

న్యపరుడైయుండునట్లుచేసిన, అమ్మానే - స్వామీ ! అశైవు - రెప్పపాటు, ఇల్ - లేని, అమరర్ - నిత్యసూరులకు, తలైవర్ - ముఖ్యులైనఅనంత గరుడాదులకు, తలై వా - అధిపతీ ! ఆది - సమస్తకారణభూతుడై, పెరుమూర్తి - సర్వాధికుడైన ఈశ్వ రుడా! తిశై - అన్నిదిక్కులందు, విల్ - ప్రకాశమును, వీశుమ్ - ప్రసరించు, శెళు - దర్శనీయమై, మా - గొప్పవెలగల, మణిగళ్ - రత్నములు, శేరుమ్ - చేసినట్టి, తిరు క్కుడన్దై - కుంభకోణమున, అశైవు - శ్రమము, ఇల్ - తీరి, ఉలగమ్ - లోకము, పరవ - స్తుతించునట్లు, కిడన్దాయ్ - శయనించినవాడా ! కాణ - నేనునీగమనసౌందర్య మునుజూచునట్లు, వారాయ్ - వేంచేయవలయును.

తా.—నీకు శేషభూతుడగుయీయాత్మకునీవియోగదుఃఖమునుకలుగ జేసినవాడా! నిత్యసూరులచేస్తుతింపబడుఓస్వామీ ! నీవులోకులాశ్రయించుటకుదగినట్టుతిరుక్కుడం దలోబవ్వళించియుండువాడవా ! నేత్రములకువిషయమగునట్లు సేవసాదింపుముఅని.

౧౦. వారావరువాయ్ వరుమెన్మాయా మాయామూర్త్తియాయ్,
ఆరావముదాయడియేనావియగమేతిత్తిప్పాయ్,
తీరావినైగళ్ తీరవెన్నై యాణ్డాయ్ తిరుక్కుడన్దై
యూరా, యునక్కాట్పట్టుమడియేనిన్నముళల్వేనో.

టీక. వారా - కన్నులార సేవించునట్లు వేంచేయక, అరువాయ్ - నేత్రములకగు పడకఅరూపియై, వరుమ్ - మనస్సుకువిషయమై, ఎన్మాయా - నీఆశ్చర్యగుణములను నాకుప్రకాశింపజేయువాడా ! మాయా- ఆశ్చర్యమగు, మూర్త్తియాయ్ - దివ్యమంగళ విగ్రహముగలవాడై. ఆరా.అనుభవించియుతృప్తికలుగని, అముతాయ్-అమృతమువలె భోగ్యుడై, అడియేన్ - నీకుశేషుడగుదాసునియొక్క,ఆవి - ప్రాణాశ్రయమైన, అగమ్- హృదయమందు, తిత్తిప్పాయ్ - అధికమధురమైయుండువాడా ! తీరా - ఎన్నటికిని నశింపని, వినైగళ్ - పాపములు, తీర - నశించునట్లు, ఎన్నై - నన్ను, ఆణ్డాయ్ - ఏలుకొనినవాడై, తిరుక్కుడన్దై - కుంభకోణమును, ఊరాయ్ - గొప్పగభావించిసన్ని హితుడైనవాడా ! ఉనక్కు - నీకు, ఆట్పట్టుమ్ - దాస్యముపొందియుండియు, అడి యేన్ - నీకేదాసుడైరక్షకములేనినేను, ఇన్నమ్ - ఇకమీదటికాలమునందును, ఉళల్వే నో - కష్టపడుచుండవలయునా.

తా.—ఈనేత్రములకగుపడకహృదయమందుస్ఫురించువాడవా ! నీయొక్కఅత్య ద్భుతసౌందర్యవిగ్రహమును సేవింపఁజేసి సర్వాతిశయభోగ్యమైనవాడవా ! నివర్తింపజాలని పాపములనుభోగొట్టినవాడవా ! ఇట్లుదాసుని యంగీకరించుటకైతిరుక్కుడన్దలో ప్రవే శించినస్వామీ ! నీకుదాసుడనైననేనుఇకనుశ్రమపడుదునో అని.

౹౹౧౧. ఉళ్లై యెన్బిత్పేయ్చ్చిములైయూడవళై యయిరుణ్డాన్,
కళ్లల్ గళవై మేశరణాగక్కొణ్డకురుగూర్చ్చడగోపన్,
కుళ్లలిల్ మలియచ్చొన్నవోరాయిరత్తుళిప్పత్తుమ్,
మళ్లై తీరవల్లార్ కామర్ మానేయ్నోక్కియర్కే.

టీక. ఉళ్లై - గవ్వలుగ్రుచ్చినట్లుండు, ఎన్బు - ఎముకలుగల, పేయ్చ్చి - తనయొక్క, ములైయూడు - స్తనములమూలమున, అవళై - ఆపూతనయొక్క, ... రుణ్డాన - ప్రాణమును హరించిన శ్రీకృష్ణునియొక్క, అవై - మునుప్రకాశింప... కళ్లల్ గళే - తిరువడిఘళనే, శరణాగ - ఇష్టసిద్ధికుపాయముగ, కొణ్డ - గ్రహి... కురుగూర్ - తిరునగరికినిర్వాహకులైన, శడకోపన్ - ఆళ్వార్లు, కుళ్లలిల్ - ... గానమునకన్న, మలియ - ఇంపగునట్లు, శొన్న - ఆనతిచ్చిన, ఓర్ - అద్వితీయ... ఆయిరత్తుళ్ - వేయిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, మళ్లై - అశ్రద్ధ, తీర - వదలునట్లు, వల్లార్ - అర్థముతో అనుసన్ధింపసమర్థులగువారు, ... నేయ్ - ఆడుజింకలవలెనుండు, నోక్కియర్కు - చూపుగల అప్సరస స్త్రీలను, కా... కాముకజనులవలె, శ్రియఃపతికిని తదీయులకును భోగ్యమైనవారగుదురు.

తా.—ఆశ్రితవిరోధులను నిరసించుటయే పరమసుఖముగ నెంచియుండు ... రుని చరణారవిన్దముల నే ప్రాప్యప్రాపకములుగ గ్రహించిన ఆళ్వార్లు, శ్రీకృష్ణుని ... నముకంటెను మనోజ్ఞముగ నానతిచ్చిన వేయింటిలో ఈ పదిపాశురములను అర్థముతో... సించువారు శ్రియఃపతికిని తద్భక్తులకును రసికులగుదురని.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్ - జీయర్ తిరువడిగళే శరణమ్.



శ్రీమతేరామానుజాయనమః.

౬ - ప - ౧౦ - తిరువాయ్మొళి.

---

అవ.—సర్వేశ్వరుడు ఆళ్వార్లమొఱనాలకించి, మీనిమిత్తముగనే తిరుమలను ... పదముగఁజేసికొని వచ్చియున్నాననిన; అలర్ మేల్ మంగైతాయార్ పురుషకారము... ముగ, తిరువేఙ్కడముడైయాన్ విషయమున ప్రపత్తిచేయుచున్నారు.

౧. ౹౹ ఉలగముణ్డపెరువాయావులప్పిల్ కీర్త్తియమ్మానే,
నిలవుమ్శుడర్శూళ్ళొళిమూర్త్తినెడియాయడియేనారుయిరే,

తిలదములగుక్కాయ్ నిన్ఱ తిరువేఙ్గడ త్తెమ్బెరుమానే,
కులతొలడియేనునపాదఙ్గూడుమాఱుకూఱాయే.

టీక. (ప్రళయకాలమున) ఉలగమ్ - లోకమును, ఉణ్డ - ఆరగించునపుడు, పెరు- రక్షింపదగినవస్తువులకన్న గొప్పదగు, వాయా - పగడమువంటినోరుగలవాడై, ఉలప్పు- ముగింపు, ఇల్ - లేని, కీర్తి - జ్ఞానశక్త్యాదికల్యాణగుణప్రసిద్ధిని, అమ్మానే - సర్వమునకు స్వామిత్వమునున్నుగలవాడై, నిలవుమ్ - ప్రకాశించుచున్న, శుడర్ శూழ் - స్వాభావిక కల్యాణగుణపరిపూర్ణమైన, ఒళి - విలక్షణతేజోరూపమైన, మూర్తి - దివ్యమంగళవిగ్రహ మునుగలవాడును, నెడియాయ్ - క్రిందుజెప్పినస్వరూపగుణచేష్టితాదులు యింతయనిచె ప్పనశక్యమైనమహిమగలవాడై, అడియేఙ్ - నీయధీనుడైననాకు, ఆరుయిరే - పరిపూర్ణ ప్రాణభూతుడై, (ఇట్లుఅప్రత్యక్షమైనవాడ గాక) ఉలగుక్కు - సర్వలోకములకు, తిల దమ్ - శిరోవాహ్యమైన (ఊర్ధ్వపుండ్రము) తిలకమువలె, ఆయ్ - అయిన, నిన్ఱతిరువేఙ్గ డత్తు - తిరుమలలోనిన్ఱతిరుక్కోలముగ సేవసాదించుచున్న, ఎమ్బెరుమానే - నాకుశే షిత్వము ప్రకాశింపఁజేయుచున్నవాడవా! కులమ్ - వంశక్రమముగవచ్చిన, తొల్ - అనాదియగు, అడియేన్ - దాసుడను, ఉన - రక్షకుడైననీయొక్క, పాదమ్ - తిరు వడిగళను, కూడుమ్-పొందునట్టి, ఆఱు-ప్రకారమును, కూఱాయ్-ప్రసాదింపవలయును.

తా.— కారుణ్యవాత్సల్యాద్యనన్త కల్యాణగుణములు గలవాడును, తనతేజస్సు చేసకలలోకములను ప్రకాశింపఁజేయుచున్న దివ్యస్వరూపము గలవాడును, నాకుధారకు డునగుపరమపదమందుండు నీవు, ఈ నేత్రవిషయమగుటకొఱకుసకల లోకములకుతిలక మువంటి తిరుపతిపర్వతమున సేవసాదించుటచేతను నేనుఅనాదిగవచ్చు వంశపరంపరలో నిదాసుడనగుటచేతను, నీతిరువడిఘళులలో జేరునట్లునన్ను కటాక్షింపవలయునని.

౨. కూరాయ్ నీఱాయ్ నిలనాగిక్కొడువల్లశురర్ కులమెల్లామ్,
శీఱావెరియు న్తిరునేమివలవా తెయ్వక్కోమానే,
శేఱార్ శునై త్తామరై శెన్దీమలరు న్తిరువేఙ్గడత్తానే,
ఆఱావన్బిలడియేనున్నడి శేర్ వణ్ణమరుళాయే.

టీక. కొడు - క్రూరులై, వల్ - ప్రబలులైన, అశురర్ - అసురులయొక్క, కులమ్ - సమూహము, ఎల్లామ్ - అంతయు, కూఱు - భిన్నము, ఆయ్ - అయి, నీఱు- ధూళి, ఆయ్ - అయి, నిలనాగి - నేలపాలైయుండగను, (మఱియు) శీఱా - కోపము గొని, ఎఱియుమ్ - మండుచుండు, తిరు - వీరశ్రీగల, నేమి-సుదర్శనమనుచక్రమును, వలవా- అవలీలగనునట్టి సర్వశక్తిగలవాడై, (ఇట్లాశ్రితవిరోధులను నిరసించుటచేత) తెయ్వమ్-

నిత్యసూరులకు, కోమానే - నిర్వాహకుడై, శేఱు - బురదచే, ఆర్ - నిండిన, ... దొనలలో, తామరై - ఎఱ్ఱదామరపువ్వులు, శెమ్ - ఎఱ్ఱనైన, తీ - అగ్నివంటి ... గలిగి, మలరుమ్ - వికసించునట్టి, తిరువేజ్గడత్తానే - తిరుమలలో వసించువాడవా! ... ఒకప్పుడును తొలగతఏర్పడని, అన్బు - ప్రేమకు, ఇల్ - స్థానమగు, అడియేన్ - ... భూతుడగు నేను, (స్వరూపానుగుణముగ) ఉన్ అడి - నీతిరువడిఘళేను, శేర్ వణ్ణమ్ - ... చువిధమును, అరుళాయ్ - కృపచేసి కటాక్షింపవలయును.

తా. సర్వేశ్వరుడు, ఆళ్వార్లతో, మీపాపములునశించె నేని నాతో ... నగుననిన; ఆళ్వార్లస్వామితో, ఆశ్రితవిరోధులను సుదర్శనముతో నిరసించినట్లు నా ... బన్ధకపాపములను నిరసించినీకాన్తిచే ప్రకాశించుచున్న తామరపుష్పములచే ... మైన తిరుమలలో సేవసాధించుచున్న నీతిరువడిఘళేను, వృద్ధిపొందుచుండు భగవ... యానురాగసాగరమందుమునిగిన దాసుడుచేరునట్లు ననుగ్రహింపవలయునని.

3. వణ్ణమరుళ్ గొళ్ణిమేగవణ్ణామాయవన్నానే,
ఎణ్ణమ్పుగున్దుత్తిక్కుమముదేయిమైయోరదిపతియే,
తెణ్ణలరువిమణిపొన్ముత్తలైక్కున్తిరువేజ్గడత్తానే,
అణ్ణలేయున్నడిశేరవడియోత్తాకావావెన్నాయే.

టీక.—వణ్ణమ్-కాన్తియందు, మరుళ్-భ్రమ, కొళ్ - అతిశయించునట్టి, అణి ... మైన, మేగవణ్ణా-మేఘమువంటికాన్తిగలవాడవై, మాయవ్-ఆశ్చర్యగుణములచే, అ... సర్వాధికుడై,(అనుభవింపగూడనట్లు) ఎణ్ణమ్-హృదయములో,పుగున్దు - ప్రవేశించి ... క్కుమ్-రసించునట్టి,అముదే-అమృతమై, ఇమైయోర్ -నిత్యసూరులననుభవింపజేసు ... దిపతియే-పరత్వముగలవాడవై, తెళ్ - తేటనొంది,నల్-రమ్యమైన, అరువి- సెలయేరు ... మణి - రత్నములను, పొన్ - బంగారును, ముత్తు - ముత్యములను, అలైక్కుమ్ - ... లో కొట్టుకొనివచ్చు, తిరువేజ్గడత్తానే - తిరుమలలో సమీపించినవాడవై, అణ్ణలే - ... త్వమును ప్రకాశింపజేయుచు నిన్దతిరుక్కోలముగ సేవసాధించువాడవా! ఉన్ ... ప్రాప్యమైన నీతిరువడిగళేను, శేర - చేరునట్లు, అడియోఱ్కు - శేషభూతుడను ... ఆఆ - ఐయో!ఐయో! ఎన్నాయ్ - అనికృపచేయవలయును.

తా.— సేవించినవారిని మోహింపజేయు దివ్యమంగళవిగ్రహమును, ఆశ్చ... చేష్టితములనుగలిగి, నిత్యసూరులకధిపతియై, తేటయైనతీర్థముచే మనోజ్ఞమై ... ప్రక్కలలో చేర్చునట్టి సెలయేటులుగల తిరుమలలో వేంచేసియుండి నన్ను దాసు... కొని నాహృదయమందు బ్రవేశించిరసించునట్టి నిరతిశయభోగ్యుడా! నీపాదము... నట్లు దాసుని యనుగ్రహింపవలయునని.

౮. ఆవావెన్నాదులగత్తైయలైక్కుమశురర్ వాణాళ్ మేల్,
తీవాయ్ వాళిమళైపొళ్లిన్దశిలైయా తిరుమామగళ్ కేళ్వా
దేవా, శురర్ గళ్ మునిక్కణజ్గళ్ విరుమ్బున్తిరువేజ్గడత్తానే,
పూవార్ కళ్లల్ గళరువినైయేన్ పొరున్దుమాఱుపుణరాయే.

టీక. ఉలగత్తై- లోకమును, ఆ ఆ - అయ్యో!అయ్యో! ఎన్నాదు - అనికనిక రింపక, అలైక్కుమ్ - శ్రమపఱచునట్టి, అశురర్ - అసురులయొక్క, వాణాళ్ మేల్ - ప్రాణవిషయముగ, తీవాయ్ - అగ్నినిగ్రక్కుచుండు, వాళి - బాణములను, మళై - వర్షమువలె, పొళ్లిన్ద - వర్షించు, శిలైయా - శ్రీశార్ఙ్గమును గలవాడవై, తిరుమామగళ్ - పత్నియగులక్ష్మికి, కేళ్వా - తగిననాయకుడై, తేవా - దానిచేప్రకాశించు రూపముగలవాడవై, శురర్ గళ్ - దేవతలు, ముని - మహర్షులు, కణజ్గళ్ - గుంపులుగుంపులుగ, విరుమ్బుమ్- కోరదగినట్టి, తిరువేంగడత్తానే - తిరుమలలో వేంచేసియుండువాడవా, పూ - వారుసమర్పించినపుష్పములచే, ఆర్ - నిండిన, కళ్లల్ గళ్ - తిరువడిగళను, అరువినైయేన్ - తెలిసియుండియు అనుభవింపగూడనట్టి పాపియగు నేను, పొరున్దుమ్ - పొందు, ఆఱు- ప్రకారమును, పుణరాయ్ - అనుగ్రహించి సంకల్పింపవలయును.

తా. లోకులనుబాధించునట్టి యసురులనుసంహారించి, లోకులకు సౌఖ్యము గలుగ జేసినట్లు, నిత్యసూరులు అపేక్షించునట్టి తిరుమలలో లక్ష్మీసహితుడై వేంచేసియుండు నీ యొక్క భోగ్యమైన(పూవార్ కళ్లల్ గళ్ )అనుతిరువడిఘుఋలలో జేరుటకు మంచియుపాయమునుగల్పించి నా సమస్తదుఃఖములనుబోగొట్టి కటాక్షింపవలయునని.

౯. పుణరాన్నిన్ఱమరమేళ్లున్తెయ్దవొరువిల్ వలవావో,
పుణరేయ్ నిన్ఱమరమిరణ్డిన్నడువేపోనముదల్వావో,
తిణరార్ మేగమెనక్కళిఱుశేరున్తిరువేజ్గడత్తానే,
తిణరార్ శార్జ్గత్తునపాదమ్ శేర్వ్వదడియేనెన్నాళే.

టీక.—పుణరా - గుంపుగ, నిన్ఱ - నిలిచిన, మరమ్ఏళ్లు -ఏడుయేపచెట్లను, అన్ఱు-(సుగ్రీ)వుశుబలవిషయమైసందేహించినపుడు),ఎయ్ద- వారినమ్మకముకొఱకై ప్రయోగించిన, ఒరువిల్ వలవావో - ఒకవింటినిధరించినశూరుడును, పుణర్ - చేరిక, ఏయ్ - పొందునట్లు,నిన్ఱ-నిలిచిన,ఇరణ్డుమరత్తిన్ - రెండుమద్దిచెట్లయొక్క, నడువే- మధ్యను (కృష్ణావతారమందు)పోన- నీకొకశ్రమకలుగకుండునట్లుపోయిన, ముదల్వా-జగత్కారణభూతుడునైన, తిణర్ అర్ - దట్టమగు, మేఘమ్ఎన - మబ్బువలెనుండు,కళిఱు -ఏనుగు

లు, శేరవ్ - చేరివర్తించెడు, తిరువేఙ్గడత్తానే - తిరుమలయందు నెలగొన్న స్వా
తిణర్ ఆర్ - మిక్కిలిబలిష్ఠమైన, శార్ఙ్గమ్ - శార్ఙ్గమును హస్తమందుగల, ఉనపాదఙ్
రువడిఘళను, అడియేన్ - నీపరాక్రమమునకులోఁబడినదాసుడనైననేను, శేర్వదు-చే
ఎన్నాళ్ - ఏదినము.

తా.—వరుసదప్పియున్న సప్తసాలవృక్షములను ఒకబాణముచే గొట్టి, రాక్ష
వేశమైయున్న యమళార్జునములను నశింపఁజేసిన, సర్వప్రాణి రక్షకమగుతిరు
ఆశ్రితరక్షణార్థమై శ్రీశార్ఙ్గాద్యాయుధములతో వేంచేసియున్నస్వామీ! నీతిరువ
ళలోనన్ను జేర్చియుజ్జీవింపఁజేయు టెప్పుడోయని.

౬. ఎన్నాళేనామ్మణ్ణళన్దవిణై త్తామరైగళ్ కాణ్బదఱ్కెన్ఱు,
ఎన్నాళుమ్నిన్ఱిమై యోర్గళే త్తియిఱై ఞ్జియినమినమాయ్,
మెయ్నా మనత్తాల్ వழிపాడు శెయ్యు న్తిరువేఙ్గడత్తానే,
మెయ్నా నెయ్దియెన్నాళ్ ఉన్నడిక్కళడియేన్ మేవువదే.

టీక. మణ్ - భూమిమొదలగుసకలలోకములను, అళన్ద - అందఱికిస్వర్శిం
గునట్లుకొలిచిన, తామరైగళ్ - పాదారవిందములు, ఇణై - రెంటిని, నామ్ -పర
నేయనుభవించుటందాసక్తిగలమేము, కాణ్బదఱ్కు - సేవించుటకు, ఎన్నాళే - ఎప్పు
గలుగునో! ఎన్ఱు - అని, ఇమైయోర్గళ్ - నిత్యసూరులు, ఎన్నాళుమ్ - ఎల్లప్పుడు
నిన్ఱు - కూడియుండి, ఏత్తి - ఇట్లుస్తుతించి, ఇఱైఞ్జి - వంగి, ఇనమినమాయ్ - గు
లుగుంపులుగ, మెయ్ - శరీరముచేతను, నా - నాలుకచేతను, మనత్తాల్ - మన
ముచేతను, వழிపాడు - కైఙ్కర్యమును, శెయ్యుమ్ - చేయునట్టి, తిరువేఙ్గడత్తా
తిరుపతియందుండుశ్రీనివాసా! అడియేన్ - అనన్యార్హుడై, నాన్ - వ్యామోహ
గలనేను, మెయ్ - స్వప్నమందువలెగాక వాస్తవముగ, ఎయ్ది - సమీపించి, ఉన్
అడిక్కళ్ - నీపాదారవిన్దములలో, మేవువదు - పొందునది, ఎన్నాళ్ - ఏదినమో

తా.—నిత్యసూరులు త్రివిక్రమావతారంబున సర్వసులభంబుగకృపచేసినతిరు
ఘళను సేవింపవేరాశతో వచ్చిస్తోత్రముచేసి త్రికరణశుద్ధిగ కైఙ్కర్య మొనర్చునట్టి
వేఙ్కటాచలమన్దు నివసించువాడవా! అట్టివిధమునదాసుడును ప్రత్యక్షముగనీపాద
కైఙ్కర్యములనుచేయు టెప్పుడోయని.

౭. అడియేన్మేవియమర్గిన్ఱ వముదేయిమైయోరదిపతియే,
కొడియావడుపుళ్ళుడై యానేకోలక్కనివాయ్ పెరుమానే,

శెడియార్ వినైగళ్ తీర్ మరున్దేతిరువేజ్గడత్తెమ్బెరుమానే,
నొడియార్ పొళ్ళుదుమునపాదజ్గాణనోలాదార్ త్తైనే.

టీక. అడియేన్ - శేషత్వమేస్వరూపముగగలనేను, మేవి - సమీపించి, అమరక్కిన్ఱ - ఎల్లప్పుడు అనుభవింపఁదగిన, అముదే - అమృతమై, (ఇట్లునిత్యసూరులను న్నుఅనుభవింపఁజేసి) ఇమైయోర్ - అనిత్యసూరులకు, అదిపతియే- నిర్వాహకుడైయుం డుపరమపురుషుడై, అడు - ఆశ్రితవిరోధులనిరసించునట్టి, పుళ్ - గరుత్మంతుని, కొడియా-ధ్వజముగ, ఉడైయానే - కలవాడవై, కోలమ్- ఈభోగ్యతనువృద్ధిబొందించుసౌన్దర్యాదులుగలవాడై, కని - పండువలెఎఱ్ఱనైన, వాయ్ - అధరకాన్తిగలవాడై, పెరుమానే - ఈభోగ్యతకెల్లలేనిమహిమనుగలవాడవై, శెడి - చెట్టువలె, ఆర్ - వృద్ధిపొందిన, వినైగళ్ - పాపములను, తీర్ - నివర్తింపజేయుటకు; మరున్దే - దివ్యౌషధమై, తిరువేజ్గడత్తు - తిరుమలలోసమీపించినవాడై, ఎమ్బెరుమానే - నన్నేలుకొన్నస్వామీ; ఉనపాదమ్ - నీతిరువడిగళను, కాణ - సేవించుటకు, నోలాదు - సాధనానుష్ఠానము చేయకుండినను, నొడియార్ పొళ్ళుదుమ్ - ఒకక్షణకాలమైనను, ఆత్ర్రేన్ - నీసేవ లేకసహించియుండను.

తా.—నిత్యసూరుల కధిపతివైయుండియు తిరుమలకు వేంచేసి ఆశ్రితవిరోధులను, నాపాపములను నశింపఁజేసి, సౌన్దర్యాదులచేనన్ను దాసునిగఁజేసికొని నాకునిరతిశయభోగ్యుడైనవాడవా! నిన్ను సేవింపనొకసాధనమనుష్ఠింపలేదు అయిననునిన్ను విడిచిధరింపజాలను,కాబట్టినిన్ను సేవింపఁజేయుమని.

౮. నోలాదార్ త్తేనునపాదజ్గాణవెన్ఱునుణ్ణుణర్వ్విల్,
నీలార్ కణ్డత్తమ్మానుమ్నిఱైనాన్ముగనుమిన్దిరనుమ్,
శేలేయ్ కణ్ణార్ పలర్ శూళ్ళవిరుమ్బున్తిరువేజ్గడత్తానే,
మాలాయ్ మయక్కి-యడియేన్పాల్ వన్దాయ్పోలేవారాయే.

టీక. ఉనపాదమ్ - నీతిరువడిఘళను, కాణ - సేవించుటకు, నోలాదు - సాధనమనుష్ఠింపకుండియు, ఆత్ర్రేన్ - ధరింపజాలను, ఎన్ఱు - అని, నుణ్ణుణర్వ్విల్ - సూక్ష్మదర్శియై, నీలార్ - హాలాహలమును(విషమును)ధరించుకొనినందుచే నల్లగిల్లిన, కణ్డత్తమ్మానుమ్ - కణ్ఠమునుగలిగినరుద్రుడును, నిఱై - వానికంటెనుపూర్ణుడైన, నాన్ముగనుమ్- చతుర్ముఖబ్రహ్మయును, ఇన్దిరనుమ్ - త్రిలోకాధిపతియగు నింద్రుడును, శేలేయ్ - మత్స్యమువలెసున్దరముగనుండు, కణ్ణార్ - నేత్రములుగల, పలర్ - (వారిభార్యలగు)పార్వతి, సరస్వతి, ఇంద్రాణి, మొదలగువారు, శూళ్ళ - తమ్ముచుట్టుకొనియుండగ, విరుమ్బుమ్-

వారప్రీతితో నాశ్రయించునట్టి, తిరువేఙ్గడత్తానే- ఓ వేఙ్కటాచలనివాసా! మ...
నీలవర్ణుడగు కృష్ణుడై, మయక్కి - గుణచేష్టితముల చేనంవతినిర్భ్రమపఱచి, వన్దా...
పోలే- వచ్చినట్లు, అడియేన్పాల్ - నిన్ను విడిచియుండజాలని నావిషయముగ, వారా...
వేంచేయవలయును.

తా.—సాధనానుష్ఠానమును జ్ఞానశక్తులును గలబ్రహ్మరుద్రేంద్రాదులు, లక్ష్మి...
గుసరస్వతిపార్వతిశచిమొదలగు వారితో గూడియాశ్రయించునట్టి వేఙ్కటాచలమం...
చుశ్రీనివాసా! శ్రీగజేన్ద్రునికి సేవసాదించినట్లు, నీతిరువడిఘళను సేవింప సాధనమను...
వాడును, నిన్ను సేవింపనివ్యసనముచేభ్రమను జెందియున్న నాకు, సేవసాదించి నా...
భీష్టము నెఱవేర్పవలయునని.

౯. వన్దాయ్ పోలేవారాదాయ్ వారాదాయ్ పోల్ వరువానే,
శెన్దామరైక్కణ్ శెఙ్గనివాయ్ నాల్ తోళముదే యెనదుయిరే,
శిన్దామణిగళ్ పగరల్లైప్పగల్ శెయ్ తిరువేఙ్గడత్తానే,
అన్దో! వడియేనునపాదమగలగిల్లేనిఱైయుమే.

టీక. వన్దాయ్ పోలే- వచ్చిచేతికిజిక్కినట్లు, వారాదాయ్- రానివాడవై (...
తవిషయమందు) వారాదాయ్ పోల్-రానివాడవువలెనుండి, వరువానే- ఇష్టుని...
మగునట్లువచ్చువాడవై, శెన్దామరై - ఎఱ్ఱదామరపుష్పమువలెసున్దరమైన, కణ్ -...
ములను, శెమ్ - ఎఱ్ఱనైన, కని - పండువలెనుండు, వాయ్ -(నన్నేయాశ్రయింపు...
అనువాక్యమును, నాల్ తోళ్ - చతుర్భుజములుగలవాడవై, అముదే - అత్యంతభో...
గ్యమైయుండుస్థితిని, ఎనదు - నాకుప్రకాశింపజేసి, ఉయిరే - ధారకుడవై, శిన్దా...
మణిగళ్ - అభీష్టములనిచ్చుచింతామణులయొక్క, పగర్ - కాన్తియైనది, అల్లై -...
రాత్రిని, పగల్ - పగలుగ, శెయ్ - చేయునట్టిదిగనుండు, తిరువేఙ్గడత్తానే - తిరుమల...
కొండయందు వేంచేసియుండుస్వామీ, అన్దో - అయ్యో, ఉనపాదమ్ - నీపాదార...
ములను, అడియేన్ - పరతన్త్రుడగునేను, ఇఱైయుమ్ - క్షణమైనను, అగలగిల్లేన్...
ఎడబాయుటనుసహింపను.

తా.—ప్రతికూలులకు దుర్లభుడును అనుకూలులకు సులభుడగునీవు నన్ను...
అచుకొనుటచేతను స్వప్రకాశముచేరాత్రిని పగలుగజేయురత్నములచే నలఙ్కృత...
తిరుపతిపర్వతములోనానిమిత్తమై నిన్నతిరుకోలముగనుండుటచేతను నీకృపచే...
నీపాదారవిన్దములలోజేర్చుకొనవలయునని.

౧౦. అగలగిల్లేనిఱైయుమెన్ఱలర్ మేల్ మఙ్గై యుఱైమార్బా,
నిగరిల్ పుగళాయులగమూన్ఱుడైయాయెన్నైయాళ్వానే,

నిగరిలమరర్ మునిక్కణజ్గళ్ విరుమ్బు న్తిరువేఙ్గడత్తానే,
పుగలొన్ఱిల్లావడియేనున్న డిక్కీழమర్ న్దుపుగున్దేనే.

టీక. ఇఱైయుమ్ - క్షణమాత్రమైనను, అగల - ఎడబాయుటకు, కిల్లేన్ - శక్తురాలనుగాను, ఎన్ఱు - అని, అలర్ మేల్ - పుష్పమందవతరించుటచేమిగుల మనోజ్ఞురాలగు, మజ్ఙై - శ్రీమహాలక్ష్మి, ఉఱై - నిత్యవాసముచేయు, మార్పా - వక్షస్థలము గలవాడవై, నిగరిల్ - సామ్యములేని, పుగழాయ్ - అత్యన్తవాత్సల్యగుణప్రసిద్ధిగలవాడవై, మూన్ఱులగమ్ - సకలచేతనాచేతనములలో, ఉడైయాయ్ - విడువఁగూడని సంబంధముగలవాడవై, ఎన్నై - నీచుడగునన్ను, ఆళ్వానే - అంగీకరించుసౌశీల్యాతిశయమునుగలవాడవై, నిగరిల్ - సమానములేని, అమరర్ - కైఙ్కర్యనిష్ఠులగుదేవతలును, మునిక్కణజ్గళ్ - మననముచేయుఋషిగణములును, విరుమ్బుమ్- అత్యాదరముతోనపేక్షించు, తిరువేఙ్గడత్తానే - తిరుమలలోనేనాశ్రయించుటకు సులభముగనున్నవాడవా! పుగల్ - శాస్త్రమందుఁజెప్పఁబడుసాధనము, ఒన్ఱుంఇల్లా . ఒకటియులేని, అడియేన్- పరతంత్రుడగునేను, ఉన్ - నీయొక్క, అడి - పాదములకు, కీழ్ - క్రిందురేఖలవలెనుండి, అమర్న్దు - అన్యాపేక్షలేనివాడనైపొంది, పుగున్దేన్-ప్రవేశించినవాడనైతిని.

తా.— అపారకృపాసముద్రుడవై నీకల్యాణగుణములచేనాకుస్వామివైు, నిత్యసూరులకును ప్రార్థనీయమైనతిరుమలలో సకలలోకశరణ్యుడవై నిన్నతిరుకోనలముగనున్ననీయొక్కతిరువడిగళను అన్యాపేక్షలేనివాడనై,నీవిశేషముసుక్షణమైనను సహింపని శ్రీమహాలక్ష్మియొక్క, పురుషకారపూర్వకముగనిన్ను శరణుజొచ్చితిని, ఇప్పుడే నాసమస్తప్రతిబంధకములనుదొలగించి నీతిరువడిఘళులలో దాసుడెల్లప్పుడును సకలవిధకైఙ్కర్యములనుచేయునట్లలభింపజేయవలయును. ఈపాశురముద్వయార్థ ప్రతిపాదకమనిపూర్వాచార్యులనిర్వాహకము.

౧౧. అడిక్కీழమర్న్దుపుగున్దడియీర్ వాழ్ మినెన్ఱెన్ఱరుళ్ కొడుక్కుమ్,
పడిక్కేழిల్లాప్పెరుమానై ప్పழనక్కురుగూర్చ్చడకోపన్,
ముడిప్పాన్ శొన్న వాయిరత్తు త్తిరువేఙ్గడత్తుక్కివై పత్తుమ్,
పిడిత్తార్ పిడిత్తార్ వీఱ్ఱిరున్దు పెరియవానుళ్ నిలావువరే.

టీక. " అడియీర్ - శేషభూతులగువారలారా! (భక్తజనులారా) అడిక్కీழ్ - పాదారవిందములక్రిందు, అమర్న్దు - అన్యప్రయోజనాపేక్షలేనివారై, పుగున్దు - ప్రవేశించి, వాழ్ మిన్ - సుఖింపుడు," ఎన్ఱెన్ఱు - అనివచించి, అరుళ్ - తనకృపను, కొడుక్కుమ్ - ఉపకరించునట్టి, పడి - ప్రకారమునకు, కేழ్ - సమము, ఇల్లా - లేని,

పెరుమానై - సర్వేశ్వరునిగురించి, పణ్ణప్ - పాలములచే సమృద్ధమైన, కురు తిరునగరికి నిర్వాహకులగు, శడకోపన్ - ఆళ్వార్లు, ముడిప్పాన్ - తమకార్య యు నెఱవేర్చుకొనునట్లు, శొన్న - అనతిచ్చిన, ఆయిరత్తు - వేయిపాసురము తిరువేఙ్గడత్తు - తిరుమలను (తిరుపతిని) ప్రతిపాదించునట్టి, ఇవై పత్తుమ్ - ఈపది ములను, పిడిత్తార్ - మూలమును అభ్యసించినవారును, పిడిత్తార్ - అర్థమునకు వారును, (లేక అభ్యసించినవారిని ఆశ్రయించినవారును) పెరియ - సర్వాతిశ మహిమగల, వానుళ్ - పరమాకాశమగు పరమపదమందు, నీళ్ నిరన్దు - ఇష్ట ముగనుండి, నిలావువర్ - నిత్యానుభవము చేయుచుందురు.

తా. కైఙ్కర్యాపేక్షగలిగి తనతిరువడిఘళందు ప్రపత్తిచేసినవారికి కైఙ్క పదనిచ్చుచు నాశ్రితవాత్సల్యముతో సేవసాదించుచున్న తిరుపతి శ్రీనివాసపరబ్ర యముగ తిరునగరికి నిర్వాహకులగు ఆళ్వార్లు తమయభీష్టసిద్ధికొఱకు ప్రసాదించి తిరువాయ్మొళిని యభ్యసించినవారిని ఆశ్రయించినవారు పరమపదమందు భగ వత్సామ్రాజ్యమందు పట్టాభిషిక్తులై నిత్యకైఙ్కర్యముచేయుచు నిత్యానన్ద భవింతురు.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్. జీయర్ తిరువడిగళే శరణమ్.



శ్రీమతే రామానుజాయనమః.

(కోవెల) శ్రీరంగము-శ్రీరంగనాథునివిషయమై సాదించిన

౭-వ పత్తు - ౨-వ తిరువాయ్మొళి.

అవ.— ఆళ్వార్లు భగవద్విషయమందు వ్యామోహమును జెంది యన్యాప వార్తలాడుచున్నారు. ఇచ్చట శ్రియఃపతితో గలిసి, యెడబాసిన ఆళ్వార్ మిగుల దుఃఖించుటను, ఆనాయకియొక్క తల్లిగాఁజూచి, అంతకంటె నధికవ్యస జెంది, (పెరియపెరుమాళ్ళను) శ్రీరంగనాథులనుగూర్చి యీనాయకివిషయమగ స్సఙ్కల్పమేమని మొఱయిడువిధముగ ననతిచ్చుచున్నారు.

౬౭౯. కఙ్గులుమ్పగలుఙ్కణ్డుయిలఱియాళ్ కణ్ణనీర్ కైగళాలిఱైక్కుమ్,
శఙ్గుశక్కరఙ్గళెన్ఱుకైకూప్పుమ్ తామరైక్కణ్ణెన్రేతళరుమ్,
ఎఙ్గనేతరిక్కేనున్నై విట్టెన్నుమిరునిలమ్ కైత్తుళావిరుక్కుమ్,
శెఙ్గయల్ పాయ్నీర్ త్తిరువరఙ్గత్తాయివళ్ తిఱత్తెన్ శెయ్గిన్ఱాయే

టీక.— కఙ్గులుమ్ - లోకులు నిద్రించురాత్రియును, పగలుమ్ - ప్రియుల నిద్రించుపగలును, కణ్ - నేత్రములయొక్క, తుయిల్ - నిద్రను, అఱియాళ్

ఱుగదు, కణ్ణనీర్ - కన్నీటిని, కైగళాల్ - చేతులతో, (తీసి) ఇఱైక్కుమ్ - ఆవల జల్లును, శఙ్గుశక్కరఙ్గళ్ - శఙ్ఖచక్రములు, ఎన్ఱు - అనివానిని౯ెప్పి, కైకూప్పుమ్-ఎదు టసేవించునట్లు నంజలిని జేయుచుండును, తామరైక్కణ్ - తామరపువ్వులవంటినేత్ర ములు, ఎన్ఱే - అనిచెప్పి, (అడిలభింపనందుచే) తళరుమ్ - విసుకును జెందును, ఉన్నై- ఇట్టిసుందరుడైననిన్ను, విట్టు - విడిచి, ఎఙ్ఙనే - ఏవిధముగ, తరిక్కేన్ - ధరింపనోపు దును, ఎన్నుమ్ - అనియు, (ఎడబాసియుండమిచే) ఇరునిలమ్ - ఈభూమినంతయు, కై - తనహస్తములచే, తుళ్ళా - తడవుచు, ఇరుక్కుమ్ - అందుకుశక్తిలేకుండును, శెమ్ - ఎఱ్ఱనికాన్తిగల, కయల్ - మత్స్యములు, పాయ్ - ఎగురుచున్న, నీర్-జల ముగల, తిరువరఙ్గత్తాయ్ - ఉభయకావేరీమధ్యమందు శయనించియున్న శ్రీరఙ్గనాథా! ఇవళ్ తిఱత్తు - నీటినివదలిన మత్స్యమువలె నీవిశ్లేషముచేత త్తఱబడునట్టి యీనాయకి విషయమున, ఎన్ శెయ్గిన్ఱాయ్ - ఏమిచేయదలచియున్నావు.

తా.— ఓశ్రీరఙ్గనాథా! ఈ యాళ్వార్ నాయకి, నిన్ను సేవింపమిచే శయం బగల్ నిద్రింపక పరితపించుచు నీదివ్యమఙ్గళవిగ్రహ దివ్యాయుధముల ననుసంధింపమొ దలుపెట్టి యందుకును శక్తిలేక శైథిల్యమునొంది చేతులనెత్తి నమస్కరించుచున్నది. కావేరిలో శయనించియుండుట యీమెకొఱకైగదా. ఈమెవిషయమున నీసఙ్కల్పమే మో తెలియదు.

ఎన్ శెయ్గిన్ఱాయెన్ తామరైక్కణ్ణావెన్ను మ్కణ్ణీర్ మల్గవిరుక్కుమ్,
ఎన్ శెయ్ గేనెఱినీ ర్తిరువరఙ్గత్తాయెన్ను మ్వెవ్వుయిర్త్తుయిర్త్తురుగుమ్,
మున్ శెయ్దవినై యేముగప్పడాయెన్ను మ్ముగిల్వణ్ణాతగువదోవెన్నుమ్,
మున్ శెయ్దివ్వులగముణ్డుమిళ్ న్దళన్దాయెన్గొలోముడిగిన్ఱదివట్కే. —౨.

టీక.— ఎన్ తామరైక్కణ్ణా - నీనేత్రసౌందర్యమునుజూపి నన్ను వశపఱచు కొన్నవాడవా! ఎన్ శెయ్కిన్ఱాయ్ - నాదుఃఖనివర్తియగునట్లు కరుణింతువో కరుణింప వో, ఎన్ఱుమ్ - అనిచెప్పును, కణ్ణీర్ - కన్నీరు, మల్గ-స్రవించిపారునట్లు, ఇరుక్కుమ్- చేయుటకును శక్తిలేకుండును, ఎఱి - అలలుగొట్టుచుండు, నీర్ - జలముగల. తిరువరఙ్గ త్తాయ్ - కావేరిమధ్యమందున్న శ్రీరఙ్గనాథా! ఎన్ శెయ్గేన్ - ఏమిచేయుదును, ఎన్నుమ్ - అనును, వె - పరితాపముచేవేడిగ. ఉయిర్త్తుయిర్త్తు - పలుమఱునిట్టూర్పులు విడిచి, ఉరుగుమ్ - ఆయుష్షముచేకరుగుచుండును, మున్ - పూర్వమందు, శెయ్ద - చేసిన, వినైయే - కర్మము, ముగప్పడాయ్ - అగుపడుమీ, ఎన్నుమ్ - అని తన కర్మకార్యమును జెప్పుచుండును, ముగిల్ వణ్ణా -పుణ్యాపాపవిభాగములేక యుపకరించు మేఘస్వభావముగలవాడవా! (నీముఖము చూపకుండుట) తగువదో - క్రిందుచెప్పినయు

పకారమునకు తగునా, ఎన్నుమ్ - అనును, ఇవ్వులగమ్ - ఈలోకమును, దట, శెయ్దు - సృష్టించి, ఉణ్డు - ప్రళయమందారగించి, ఉమిழ்స్ద - న్దాయ్ - కొలిచినవాడవా! ఇవట్కు - నిన్నువిడిచియుండలేనియీమెకు, ముడికిన్దదుకొలో - ముగింపఁబోవుచున్నదో.

తా.— జగత్ సంరక్షణార్థముగ కావేరీమధ్యమందు శయనించియున్న ఙ్గనాథా! ఈనాయికి, నీవిశ్లేషదుఃఖమును సహింపలేక నిట్టూర్పులతో ఇది కర్మమాయని తత్తఱపడుచున్నది, మేఘమువంటియుపకారకుడా! ఇట్లు నీకున్యాయమా? యనుచున్నది. ఈమెయొక్కయునికి ఏమిగముగించునోయని.

వట్కిలళిత్తై యుమ్మణివణ్ణా వెన్నుమ్వానమేనోక్కుమ్మైయాక్కుమ్,
ఉట్కుడై యశురరుయి రెల్లాముణ్డవొరువనే యెన్నుముళ్ళురుగుమ్,
కట్కిలీయున్నై క్కాణుమాఅరుళాయ్కాకుత్తాకణ్ణనేయెన్నుమ్,
తిట్కొడిమదిళ్ శూழ் తిరువరఙ్గత్తాయివళ్ తిఱత్తెన్ శెయ్దిట్టాయే.

టీక.— ఇఱైయుమ్ - కొంచమైనను, వట్కు - స్త్రీకి స్వాభావికమగు ఇలళ్ - కలదికాదు, మణివణ్ణా - నీలరత్నచ్ఛాయగలిగి సులభుడైనవాడవా, అనితిరునామమును బహిరఙ్గముగచెప్పుచుండును; వానమే - గజేంద్రునికివచ్చి చినట్లువత్తువని ఆకాశమును, నోక్కుమ్ - చూచును, మైయాక్కుమ్ - ఉట్కు - బలమును, ఉడై - కలిగిన, అశురర్ - అసురులయొక్క, ఉయిర్ - ములను, ఎల్లామ్ - అంతయును, ఉణ్డ - మ్రింగిన, ఒరువనే అద్వితీయుడా, అనిచెప్పును. (ఆవిరోధులను సంహరించుసామర్థ్యమునుదలచి) ఉళ్ - హృదయ ఉరుగుమ్ - కరుగును, కట్కు - ఈమాంసనేత్రములకు, ఇలీ - చూచుటకుదుర్ల నీవు, ఉన్నై - నిన్ను, కాణుమాఱు - సేవించునట్లు, అరుళాయ్-కృపచేయవల కాకుత్తా - నగరవాసులకును వనవాసులకును సేవసాదించిన శ్రీరాముడై, కణ్ణనే - కలకును కృష్ణుడై యవతరించి సేవసాదించినవాడవుగదా, ఎన్నుమ్-అనిచెప్పును, దృఢమై, కొడి - ధ్వజములుగలిగిన, మదిళ్ - ప్రాకారములచే, శూழ் - ఆవరించ తిరువరఙ్గత్తాయ్ - శ్రీరఙ్గమునశయనించినవాడవా! ఇవళ్ తిఱత్తు - ఈమె ఇట్లు రాలగుటకు, ఎన్ శెయ్దిట్టాయ్ - నీవుచేసినదిఏమి.

తా.— ఓశ్రీరఙ్గనాథా! నీసేవలేమిచే ఈమెలజ్జవిడిచి, నీసంశ్లేషమ గజేంద్రునికి సేవసాదింపవచ్చినట్లు వత్తువేమోయని యాకాశమునుజూచు రానియెడ మోహముజెందును, నీవు సాధనాన్తరపరుల కర్మనేత్రములకుఅగు

యునను అనన్యప్రయోజనులై నీసేవనపేక్షించినవారి నిమిత్తమై రామకృష్ణాద్యవతారంబు లొనర్చి సేవసాదింపలేదా! ఈనాయకినిమిత్తమై సర్వవిధముల మనోజ్ఞమగు శ్రీరంగక్షేత్రమందు శయనించియున్న వాడవా! నీవు ఈమెవిషయమందు ఏమిచేయఁదలచియున్నావు.

ఇట్టకాలిట్టకైగళాయిరుక్కు-మెழுన్దులామయఙ్గుమ్ కైకూప్పుమ్,
కట్టమేకాదలెన్ఱుమూర్చ్చిక్కు-మ్ కడల్వణ్ణాకడియైగాణెన్నుమ్,
వట్టవాయ్ నేమివలఙ్గైయా వెన్నుమ్ వన్దిడాయెన్ఱెన్ఱేమయఙ్గుమ్,
శిట్టనేశెழுనీర్ త్తిరువరఙ్గత్తాయివళ్ తిఱత్తెన్శిన్దిత్తాయే. ౮.

టీక.— ఇట్టఇట్ట - ఉంచియున్న చోటనుండునట్టి, కాల్ - కాళ్ళును, కైగళ్ - చేతులును, ఆయ్ - కలదై, ఇరుక్కుమ్ - స్మరణదప్పియుండును, ఎழுన్దు - ప్రజ్ఞగలిగి లేచి, ఉలాయ్ - సంచరించి, మయఙ్గుమ్ - తర్వాత మోహించును, కైకూప్పుమ్-అఞ్జలి చేయును, (రాఁనందుచే) కాదల్ - అపేక్ష, కట్టమే - చెడ్డది, ఎన్ఱు - అనివిన్నివి, మూర్చ్చిక్కుమ్ - మూర్ఛనుజెందును, కడల్వణ్ణా - సకలవస్తువులను తనలో నిమిడ్చికొనినను కొఱతపడనట్టి సముద్రమువంటి స్వభావముగలవాఁడా! కడియైకాణ్ - నావిషయమందు కఠినుడవుగానున్నావుసుమీ! ఎన్నుమ్-అని చెప్పును, (ఆశ్రితరక్షణమందు) వట్టవాయ్ - అన్ని దిశలందుముఖములుగల, నేమి - సుదర్శనచక్రమును, వలఙ్గైయా - కుడిచేతగల వాడవా! ఎన్నుమ్ - అనును, (తిరుగా ఆలమటతీరి) వన్దిడాయ్ - చక్రముసుధరించి రమ్మా, ఎన్ఱెన్ఱే - అని పలుమారుఅపేక్షించి, మయఙ్గుమ్ - మోహించుచుండును, (ఇట్లు ఈమెను తపింపజేసి) శిట్టనే - శ్రియఃపతీ, శెழுనీర్-జలసమృద్ధిగల, తిరువరఙ్గత్తాయ్- కావేరీతీరమందు శయనించియున్న వాడవా! ఇవళ్ తిఱత్తు-నిన్నెడఁబాసినందుచే మూర్ఛఁజెందు నీనాయకివిషయమున, ఎన్ శిన్దిత్తాయ్-ఏమిదలచియున్నావు?

తా. ఓ శ్రీరఙ్గశాయీ! ఈనాయకి కొంతసేపు నిశ్చేష్టితురాలైయుండి యున్నట్టుండిలేచి సంచరించి మూర్ఛనొందును, మఱియును ప్రజ్ఞగలిగి మిగుల వ్యసనముచేనీకు అంజలిచేయును. నీవు గుణవంతుడవుగావు కఠినుడవని చెప్పును, చక్రధారివైవచ్చి నీసౌందర్యమునుజూపుమని పలుమాఱు మోహించుచుండును, శ్రీరంగక్షేత్రమున శయనించియుండు ఓ శ్రియఃపతీ! ఈమెవిషయమున ఏమిచేయదలచియున్నావు అని.

శిన్దిక్కు-మ్ తిశైక్కు-మ్ తేఱుమ్ కైకూప్పుమ్ తిరువరఙ్గత్తుళ్ళాయెన్నుమ్
వన్దిక్కుమ్, ఆఙ్గేమழைక్కణ్ణీర్ మల్గవన్దిడాయెన్ఱెన్ఱేమయఙ్గుమ్,
అన్దిప్పోదవుణనుడలిడన్దానేయలై కడల్ కడైన్దవారముదే,
శన్దిత్తుఉన్ శరణమ్ శార్వదేవలిత్తత్తైయలైమెయల్ శెయ్దానే ౯.

టీక.— అన్తిప్పోదు-అసురబలము వృద్ధియగు సంధ్యాకాలమందు, అవుణ హిరణ్యాసురునియొక్క, ఉడల్ - దేహమును, ఇడన్దానే - చీల్చినవాడై, అలైగ్ర అలలుగల సముద్రమును. కడైన్ద - చిలికిన, ఆరముదే-మిగులభోగ్యమైనవాడై, కూ సంశ్లేషించి, ఉళ్ళరణమే - నీతిరువడిగళనే, శార్వదు - చేరియనుభవింప వలిత్త - సాహసముగలిగియున్న, తైయలై - ఈచిన్నదాని, మైయల్ శెయ్‌దా జెటిచినవాడవా! (ఈమె) శిన్దిక్కుమ్ - పూర్వసంశ్లేషమును చింతించుచుండును, తిక్కుమ్ - అది చిక్కనందుచేమూర్ఛనొందును, తేఱుమ్ - ఉన్నట్లుండి తేటన (వచ్చినట్లుతలచి) కైతొழుమ్ - అంజలిచేయుచుండును, తిరువరఙ్గత్తుళ్ళాయ్ - లోశయనించినవాడవా! ఎన్నుమ్ - అనిచెప్పును, వన్దిక్కుమ్ - ఆరూపసౌందర్యము దలచి నమస్కరించును,ఆఙ్గే - ఆచోటనేయుండి, మழై - చల్లని, కణ్ణీర్ - కన్నీ మల్గ - నిండునట్లు, వన్దిడాయ్ - రమ్మా, ఎన్ఱెత్తే - అని పలుమఱుపచించి, మయఙ్గు వ్యామోహమునుబొందును.

తా.— ఓహిరణ్యాన్తకుడా! ఈమె నీసౌందర్యమును నీతోటిమునుపటి మునుదలచితలచి మోహించుచుండును, చాలా సేపటికి తెలివినొందును, తనకొక చుటకై అంజలిచేయును, తనదుఃఖమును సహింపఁజాలక శ్రీరఙ్గనాథాయనును, శా లేనిదానివలె నీపాదారవిన్దములనుదలచిపడియుండును, అట్లుండి తననేత్రములలో రునిండగ వేంచేయుమాయనుచు మూర్ఛనొందును, నిన్ను సేవించి సంశ్లేషింపనా ణమును ధరించియుండు ఈయాళ్వార్ నాయకిని యీపాటుపడిపింపవలయునా! శ్రితవాత్సల్యమంతయు ఎక్కడపోయినదిఅని,

మైయల్ శెయ్ దెన్నై మనఙ్గవర్ న్దానే యెన్నుమ్ మామాయనేయెన్ను
శెయ్యవాయ్ మణియేయెన్నుమ్ తణ్పునల్ శూழ் తిరువరఙ్గత్తుళ్ళాయే
వెయ్యవాళ్ తణ్డుశఙ్గుశక్కరమ్విల్లేన్దుమ్ విణ్ణోర్ ముదలెన్నుమ్,
పైగొళ్ పామ్బణైయాయివళ్ తిఱత్తరుళాయ్ పావియేన్ శెయత్పాల

టీక.— ఎన్నై - నన్ను, మైయల్ శెయ్‌దు-పామరముగలదానినిగ జేసి, నాహృదయమును, కవర్ న్దానే - దోచుకొన్నవాడవా, ఎన్నుమ్-అనును, మామా ఆశ్చర్యగుణములుగలవాడవా,ఎన్నుమ్- అనును, శెయ్య- ఎఱ్ఱనైన,వాయ్ - అధర గలవాడవై,మణియే- రత్నమును గుడ్డకొంగున ముడివేసికొనునట్లు సులభుడవైనవా ఎన్నుమ్ - అనును, తణ్ - శ్రమహరమగు, పునల్ - నీటిచే, శూழ்-చుట్టబడి వరఙ్గత్తుళ్ళాయ్-శ్రీరఙ్గక్షేత్రమను దీవియందుపళ్ళయనించినవాడవా! ఎన్నుమ్-అనిప వెయ్య - విరోధులుభయపడునట్లు కఠినమైన, వాళ్ - నన్దకమనుకత్తిని, తణ్డు

దకిని(గదను) శఙ్గుశక్కరమ్ - సుదర్శనపాంచజన్యములను, విల్ - శార్ఙ్గమును వింటిని,
ఏన్దుమ్ - ఎప్పుడునుధరించియుండి, (ఆచక్కదనమును) విణ్ణోర్ - నిత్యసూరులకనుభ
వింపఁజేసి, ముదల్ - వారిసత్తకు కారణభూతుఁడైనవాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును,
పై - వికసించినపడిగను, కొళ్ - కలవాఁడైన, పామ్బు - తనమేనుకుతగినయాదిశేషుని,
అణైయాయ్ - పడకగాఁగలవాఁడా! ఇవళ్ తిఱత్తు - ఈమెవిషయమున, పావియేన్ -
ఇట్టి అవస్థపడు ఈమెనుజూచుచున్న పాపియగునేను, శెయ్యత్తక్కదు-చేయునట్టివిధము,
అరుళాయ్ - కృపచేయవలయును.

తా.— ఓశేషశాయీ! నన్ను స్మరణదప్పిపోవునట్లుచేసి నాహృదయమును వశ
పఱచుకొన్నవాఁడవా! ఆశ్చర్యభూతుఁడా! అత్యన్తసౌందర్యవంతుఁడా అని యనుసంధిం
చుచు శ్రమహరముగ శ్రీరఙ్గక్షేత్రమందు శయనించియుండుటనుదలచి, నాకుపయోగప
డవని చెప్పుచుండును. ఆశ్రితులయాపన్నివృత్తికొఱకుపఞ్చాయుధములనుధరించియుండు
నీవు నాప్రతిబన్ధకకర్మములనుబోఁగొట్టి నాతోసంశ్లేషింపకున్నావేయనును, అత్యన్తవ్యా
మోహమునుబొందిన యీమెనుకటాక్షింపకుండుట నాపాపమాయని (ఈయాఴ్వార్ నా
యకియొక్క తల్లివచించునట్లు సాదించెదరు.)

పాలదున్బఙ్గళిన్బఙ్గళ్ పడైత్తాయ్ పఱ్ఱిలార్ పఱ్ఱనిన్ఱానే,
కాలశక్కరత్తాయ్ కడలిడఙ్గొణ్డకడల్వణ్ణా కణ్ణనే యెన్నుమ్,
శేల్ కొళ్ తణ్బునల్ శూழ్ తిరువరఙ్గత్తాయెన్నుమ్ మేన్తీర్త్తనే యెన్నుమ్,
కోలమామళై క్కణ్ పనిమల్ గవిరుక్కుమెన్నుడై కోమళకొழున్దే. ౭.

టీక.— ఎన్నుడై - నాయొక్క, కోమళమ్ - మెత్తనైన, కొழున్దు - చిగురువ
లెనున్నయీమె, పాల - అచ్చటచ్చట, తున్బఙ్గళ్ -ఆశ్రితవిరోధులకు దుఃఖములనున్న,
ఇన్బఙ్గళ్ - ఆశ్రితులకుసుఖములను, పడైత్తాయ్ - కలుగఁజేసినవాఁడవా! పఱ్ఱిలా - ఇత
రులనాశ్రయించుట, ఇలార్ - లేనివారు, పఱ్ఱ - ఆశ్రయించునట్లు, నిన్ఱానే - సుల
భుఁడైయున్నవాఁడవా! కాలశక్కరత్తాయ్ - ఆశ్రితులయొక్క ప్రాప్తికాలము నీనియ
మనప్రకారమగునట్లు మాసఋతువత్సరాది పరివర్తనముగల కాలచక్రమునకు నిర్వాహ
కుఁడై, లేక, (కాల - కాలమునునడపునట్టి, శక్కరత్తాయ్ - చక్రమునుగలవాఁడవా) కడ
ల్ - పాలసముద్రమందు, కడల్వణ్ణా - సముద్రమున మఱియొక సముద్రముపడుకొన్న
విధముగ, ఇడఙ్గొణ్డ - శయనించినవాఁడవై, కణ్ణనే - రక్షించుటకు కృష్ణుఁడైయవతరిం
చినవాఁడవా! ఎన్నుమ్ - అనును, శేల్ కొళ్ - మత్స్యములుగల, తణ్ - చల్లని; పునల్ -
కావేరిజలముచే, శూழ్ -చుట్టఁబడిన, తిరువరఙ్గత్తాయ్-శ్రీరఙ్గమునకునాథుఁడా! ఎన్నుమ్.

అని చెప్పును, ఎన్ - నేను స్నానముచేయుటకు,-తీర్తనే-శ్రేష్ఠమైనవాడవా! ఎన్నుక్-చెప్పును, (మొఱనువినిరానందుచే) కోలమ్ -సుందరమై, మా-పెద్దదై, మల్లై-కణ్ - నేత్రమైనది, పని - నీరు, మల్గ-అతిశయించునట్లు, ఇరుక్కుమ్ - ఏడ్చుచు యూరకుండును.

తా.— ఓశ్రీరఙ్గనాథా! ఆశ్రితవిరోధులకు దుఃఖమును ఆశ్రితులకు సుఖమును గలుగజేయుచు, ఆశ్రితవిరోధుల మరణకాలము నెదురుచూచుచుండు సుదర్శనమును ధరించుటయు, క్షీరాబ్ధిశయనమును రామకృష్ణాద్యవతారములును శ్రీరఙ్గక్షేత్రావతారములును, ఆశ్రితులకొఱకేగదా? నీయనుభవవిరోధియగు నాదోషములను పట్టినట్లు నీసంశ్లేషవిరోధియగు నాపాపముల నన్నిటిని బోగొట్టుమాయనిచెప్పుచు స్వభావురాలగు నాకుమార్తె సున్దరనేత్రములలో కన్నీరునుంచుకొనుచున్నది.

కొళున్దువానవర్గట్కెన్నుమ్కున్ఱేన్దికోనిరై కాత్తవనెన్నుమ్,
అళున్దొళుమావియనలవెవ్వుయిర్క్కుమఞ్జనవణ్ణనేయెన్నుమ్,
ఎళున్దుమేల్నోక్కియిమైప్పిలళ్ళిరుక్కుమెజ్గనేనోక్కుగేనెన్నుమ్,
శెళున్దడమ్పునల్శూళ్తిరువరజ్గత్తాయెన్శెయ్గేనన్తిరుమగట్కే.

టీక.— వానవర్గట్కు - నిత్యసూరులకు, కొళున్దు - అధిపతియైనవాడా! ఎన్నుమ్ - అనిచెప్పును, కున్ఱు - గోవర్ధనపర్వతమును, ఏన్ది - ఎత్తి, కోనిరై - గోవులగుంపును, కాత్తవన్ - రక్షించినవాడా! ఎన్నుమ్ - అనును, అళుమ్ - భక్తురాలైయేడ్చును, తొళుమ్ - ప్రపన్నులవలె అంజలిచేయును, ఆవి - అగ్నివలె, వె - ఉష్ణముగ, ఉయిర్క్కుమ్ - నిట్టూర్పువిడుచును, అంజనవణ్ణనే - కాటుకకాంతిని శమించునట్టి శ్యామళవిగ్రహముగలవాడవా! ఎన్నుమ్ - అనిచెప్పును, మేల్ - పైకి, ఎళున్దు - తలయెత్తి, నోక్కి - చూచి, ఇమైప్పిలళ్ - ఱెప్పపాటులేక, ఇరుక్కుమ్ - ఉండును, ఎజ్గనే - ఏప్రకారముగ, నోక్కుగేన్ -నిన్ను చూతును, ఎన్నుమ్ - అనిచెప్పును, శెళు - రమ్యమై, తడమ్ - అతిశయించిన, పునల్ - జలము, శూళ్ - చుట్టియుండు, తిరువరఙ్గత్తాయ్ - కావేరిమధ్యప్రదేశమును స్థానముగగలవాడవా! తిరుమగట్కు - లక్ష్మికిసమురాలగు ఈనాయకికి, ఎన్ శెయ్గేన్ - ఏమిచేయుదును.

తా. నిత్యసూరి నిర్వాహకుడును, గోవర్ధనమునెత్తి గోపీజనములను పశువులను రక్షించినవాడవునునగు ఓశ్రీరఙ్గనాథా! ఈనాయకి, నీయొక్క నిరవధిక కారుణ్యమునకు నేను విషయముగాకపోతినేయని నిట్టూర్పువిడిచి ఏడ్చును, తనమనోరథసిద్ధికి నమస్కరించును, నీసేవగలుగునేమోయని ఱెప్పపాటులేక యాకాశమునకు జూచును

సేవలభింపనియెడ సేవింపనుపాయ మేదోయని చింతించుచును, కావేరీమధ్యనివాసా! నాకు మార్తివిషయమున నేనేమి చేయనగునని.

ఎన్తిరుమగళ్ శేర్ మార్బనే యెన్నుమెన్నుడై యావియే యెన్నుమ్,
నిన్తిరువెయిర్ఱాలిడన్దునీ కొణ్డనిలమగళ్ కేళ్వనే యెన్నుమ్,
అన్రురువేళ్ఱుడన్తళువినీ కొణ్డవాయ్ మగళన్బనే యెన్నుమ్,
తెన్తిరువరఙ్గఙ్కోయిల్ కొణ్డానే తెళ్రిగిలేన్ ముడివివళ్ దనక్కే. ౯.

టీక. ఎన్ - నాకు పురుషకారురాలగు, తిరుమగళ్ - శ్రీమహాలక్ష్మి, శేర్ - తనకిష్టముతో వసించుచున్న, మార్బనే - వక్షస్థలముగలవాడవా! ఎన్నుమ్ - అని చెప్పును, ఎన్నుడై - నాకు, ఆవియే - ధారకుడై హృదయమందుండువాడవా! ఎన్నుమ్ - అనును, నిన్ - నీయొక్క, తిరువెయిర్ఱాల్ - లక్షణమైనదంష్ట్రముచే, ఇడన్దు - అణ్డకపాలము భేదించియెత్తి, నీ - నీవు, కొణ్డ - నీకిష్టముగ గ్రహించిన, నిలమగళ్ - భూదేవికి, కేళ్వనే - తగిన నాయకుడా! ఎన్నుమ్ - అని చెప్పును, అన్రు - వృషభములను ఓలిగన ముగానుంచినపుడు, ఉరు - మృత్యువువలెనుండుబుషభములు, ఏళుమ్ - ఏడింటిని, తళువి-కౌగలించుకొన్నట్లు వేడుకగతడవి, నీ-నీవు, కొణ్డ (నిక్షేపముగ్రహించినట్లు), చేకొనిన,ఆయ్ మగళ్ - సమానకులమందు జన్మించిన నప్పిన్నపిరాట్టికి, అన్బనే-ప్రియుడైన వాడవా! ఎన్నుమ్ - అని చెప్పును, తెన్ - దక్షిణదిక్కునందలి, తిరువరఙ్గమ్ - శ్రీరఙ్గ క్షేత్రమును, కోయిల్ - వాసస్థానముగ, కొణ్డానే - అఙ్గీకరించినవాడవా! ఇవళ్ తనక్కు-ఈనాయకికి, ముడివు-మనోదుఃఖముయొక్క ముగింపును, తెళ్రిగిలేన్ - తెలియలేను.

తా. కావేటిమధ్యప్రదేశమును నిత్యవాసముగ గైకొనిన, శ్రీరఙ్గనాథా! శ్రీభూనీళల ప్రాణనాయకుడగునీవు, వారిచేపరిగ్రహింపఁబడిననన్ను, మనదాసురాలని, నీదివ్యనేత్రములతో కటాక్షింపుమాయని చెప్పును, ఈనాయకి నిమిత్తమై కోవెలలో శయనించియున్న నీవు ఈమెను కటాక్షింపలేదు. ఇక యీమెయొక్కస్థితి ఏమిగ ముగించునో తెలియలేదు.

ముడివివళ్ దనక్కొన్ఱఱిగిలేనెన్నుమ్ మూవులగాళియే యెన్నుమ్,
కడిగమఴ్ కొన్రైచ్చడైయనే యెన్నుమ్ నాన్ముగక్కడవుళే యెన్నుమ్,
వడివుడై వానోర్ తలైవనే యెన్నుమ్ వణ్ తిరువరఙ్గనే యెన్నుమ్,
అడియడైయాదాళ్ పోలివళణుగియడైన్దనళ్ ముగిల్వణ్ణనడియే. ౧౦.

టీక. ఇవళ్ తనక్కు - ప్రత్యక్షముగ దుఃఖమనుభవించుచుండు ఈనాయికకు, ముడివు - ముగింపు, ఒన్రు - ఒకటియు, అఱిగిలేన్ - తెలియలేను, ఎన్నుమ్ - అనును,

మూవులకాళియే - త్రిలోకాధిపతియగునింద్రునికి అన్తరాత్మయై నిర్వహించువా ఎన్నుమ్ - అనిచెప్పను, కడికమళ్ - పరిమళమునుప్రవహించునట్టి, తాళ్ తైయనుపుష్పమునుధరించిన, శడైయనే - జటామండలధారియగు రుద్రునికి అ యైనవాడవా! ఎన్నుమ్ - అనిచెప్పును, నాన్మగక్కడవుళే - చతుర్ముఖబ్రహ్మ రాత్మయైనవాడవా! ఎన్నుమ్ - అనిచెప్పును, వడివుడై-నీతోసమానమగురూ వానోర్ - నిత్యసూరులకు, తలైవనే - స్వామియైనవాడవా! ఎన్నుమ్ - అని వణ్ - మిక్కిలి యౌదార్యముగలిగి, తిరువరఙ్గనే- శ్రీరఙ్గమునసులభుడై వేంచేసి వాడవా! ఎన్నుమ్ - అనిచెప్పును, అడి-నీశ్రీపాదములను, అడైయాదాళ్ పొం పింపనిదానివలెనున్న, ఇవళ్ - ఈనాయకి, ముగిల్ వణ్ణన్ - ఉపకారస్వభా మేఘమువంటి రూపముగలవానియొక్క, అడి-తిరువడిగళను, అణుగి - సమీ అడైన్దనళ్ - పొందినదైయున్నది.

తా- ఉదారుడవైన ఓశ్రీరఙ్గనాథా! ఈచిన్నది తనయొక్క దుఃఖనివృత్తి పాయము తెలిసికొనకున్నానుఅనును, బ్రహ్మరుద్రాది సకలదేవతలకునుఅన్తరాత్మ ర్యములను నిర్వహించువాడవా! నీకు వారితోపాటి సంబన్ధము దాసునిలో దాఅనును, నిత్యసూరులనేలుకొనునట్టి నీవిగ్రహమును సేవింపఁజేయుమా అని కోవెలలోశయనించి యాశ్రితులకు ఆత్మదానముచేయుచుండు పరమోదారుడా! ఇక పెరుమాళ్ళతిరువడిగళుచేరజాలదు, అనునట్టి స్థితిలోనుండినయీమె, సకల నివర్తించి తనయిష్టప్రకారముగ శ్రీరఙ్గనాథుల తిరువడిగళనుచేరి సంతోషించుచున్న ఈ ఆళ్వార్ నాయకి తల్లిగారు ప్రీతురాలగుచున్నారు.

౧౧ ముగిల్వణ్ణనడియైయడైన్దరుళ్ శూడియుయ్న్దవన్ మొయ్ పునల్ తుగిల్వణ్ణత్తూనీర్చ్చేర్ప్పన్ వణ్పొళిల్ శూళ్ వణ్గురుగూర్చ్చడకోపన్, ముగిల్వణ్ణనడిమేల్శొన్నశొన్మాలై యాయిరత్తిప్పత్తుమ్వల్లార్, ముగిల్వణ్ణవానత్తిమైయవర్ శూళవిరుప్పర్ పేరిన్బవెళ్ళత్తే.

టీక. ముగిల్వణ్ణన్ - ఉదారమైనమేఘమువంటి స్వభావముగల శ్రీరఙ్గనా క్క, అడియే - తిరువడిగళనే, అడైన్దు-పొంది, అరుళ్ - వారికృపను, శూడి- ఉయ్న్దవన్ - ఉజ్జీవించినవారై, మొయ్ - అతిశయించిన, పునల్ -జలముగల నల్ - తామ్రపర్ణియొక్క, తుగిల్ - తెల్లవస్త్రమువంటి, వణ్ణమ్ - కాన్తిగల, పరిశుద్ధమైన, నీర్ - జలము, శేర్ప్పన్ - సమీపమునగల, వణ్ - రమ్యమైన ల్ - తోపులచే, శూళ్ - చుట్టఁబడి, వణ్ -నిరతిశయసంపత్తుతోఁగూడిన, తిరునగరికి నిర్వాహకులగు, శడకోపన్ - ఆళ్వార్లు, ముగిల్ -నీలమేఘమువలె

సౌన్దర్యయుక్తులగు శ్రీరఙ్గనాథుల, అడిమేల్ - తిరువడిగళవిషయముగ, శొన్న-ప్రసాదించిన, శొల్ - శబ్దరూపమగు, మాలై - మాలికలు, ఆయిరత్తు - వేయింటిలో, ఇప్పత్తుమ్ - ఈపది (మాలికలను) పాశురములను, వల్లార్ - తాత్పర్యముతో నభ్యసించువారు, ముగిల్ - మేఘశ్యామళమైన, వణ్ణమ్ - కాన్తిగల, వానత్తు - పరమపదమందు, ఇమైయవర్ - నిత్యసూరులు, శూழ - చుట్టియుండగ, పేరిన్ప వెళ్ళత్తే - నిరతిశయానన్దసముద్రమధ్యమందు, ఇరుప్పర్ - మునిగియుందురు.

తా. పెరియపెరుమాళ్ళ (శ్రీరఙ్గనాథుల) తిరువడిగళను జేరి వారిసంశ్లేషముగలుగుటచే సజ్జీవనములభించినవారై, దివ్యతీర్థసంపూర్ణమగు తామ్రపర్ణి చేతను రమ్యమగు వృక్షములచేతను మనోజ్ఞమైన తిరునగరియందు నిత్యవాసముచేయునట్టి నమ్మాழ్వార్లు పెరియపెరుమాళ్ళవిషయమందు ప్రసాదించిన యీతిరువాయ్ మొழ్ఱిని యభ్యసించినవారు, పరమపదమునందు నిత్యసూరులమధ్య పరిపూర్ణానన్దము ననుభవింపగలరు.

ఆழ్వార్ తిరువడిగళేశరణమ్. జీయర్ తిరువడిగళే శరణమ్.



శ్రీమతేరామానుజాయనమః.

## ౮ - పత్తు - ౧౦ - తిరువాయ్ మొழ్ఱి.

అవతారిక. భగవచ్ఛేషత్వాతిశయము ననుసన్ధించిన ఆழ్వార్లు భగవద్విషయమున అభిమతులగు భాగవతులకు శేషపడుటయే సర్వాతిశయమని యీతిరువాయ్ మొழ్ఱియందు అనతిచ్చుచున్నారు.

౧. నెడుమాఱ్కడిమై శెయ్ వేనో్పోలవనై క్కరుదవఞ్జిత్తు,
తొడుమాఱ్ఱిల్ తీక్కదిగళ్ ముత్ఱుమ్ తవిర్న్దశదిర్ నినైన్దాల్,
కొడుమాకవినై యేనవనడియారడియే కూడుమిదువల్లాల్,
విడుమాఱెన్బదెన్నన్దో! వియన్మూవులగు పెఱినుమే.

టీక. నెడుమాఱ్కు - ఆశ్రితవ్యామోహముగల సర్వేశునికి, అడిమై - దాస్యము, శెయ్ వేన్ పోల్ - చేయువానివలె, అవనై - ఆశ్రియఃపతిని, కరుద - స్మరించినమాత్రమున, తొడుమాఱ్ఱిల్ - ఆయాసము, అఱ్ఱు - వదలునట్లు, తీక్కదిగళ్ - నాయందుండు దుఃఖహేతువైన, ముత్ఱుమ్ - చెడుమార్గములన్నియును, వఞ్జిత్తు - నాకుతెలియకుండునట్లువంచనచేసి, తవిర్న్ద - విడిచిపోయిన, శదిర్ - విధమును, నినైన్దాల్ - తలచినయెడ, అవన్ - ఆయాశ్రితవాత్సల్యముగల శ్రియఃపతికి, అడియార్ - దాసులగు భాగవతులయొక్క, అడియే - తిరువడిగళనే, కూడుమిదువల్లాల్ - లభింపవలసినదితప్ప,

వియన్ - ఆశ్చర్యకరమైన, మూవులగు- త్రైలోక్యైశ్వర్యమును, పెఱినుమ్-లభి
కొడుమావినైయేన్ - క్రూరమైన మహాపాపములుగల నేను, విడుమాఱు - శేష
త్వమును విడువవలసినవిధముగా, ఎన్పదు - చెప్పబడుట, ఎన్ - ఏమి, అన్దో-అ

తా. శ్రియఃపతి ఇట్లు ఆళ్వార్లను తమకు అనన్యార్హముగ శేషపడచు
ము, ననుసన్ధించి, యత్యన్తానన్దప్రీత్యతిశయముల చేఆకల్యాణగుణముల కీడుబడియు
వతోత్తములకు శేషపడుటయేనిరతిశయపురుషార్థమనియధ్యవసించి, ఐశ్వర్యాది
రుషార్థములను ఈ భాగవత శేషత్వపురుషార్థమునకుసమానము కాదనియానతిచ్చు

౨. వియన్మూవులగు పెఱినుమ్పోయ్ త్తానే తానేయానాలుమ్,
పుయల్ మేగమ్పోల్ తిరుమేనియమ్మాన్ పునై పూఙ్కళలడిక్కీ
చ్చ్యయమేయడిమైతలై నిన్ఱార్ తిరుత్తాళ్ వణఙ్గి, యిమ్మైయే
పయనేయిన్బమ్యాన్ పెఱ్ఱదుఱు మోపావియేనుక్కే.

టీక - వియన్- గొప్పదగు, మూవులగు - త్రైలోక్యైశ్వర్యమును, పెఱి
లభించినను, పోయ్ తానే తానే - సంసారసంగమువదలిపోయి తన్నుతానే యను
వాడు, ఆనాలుమ్ - అయినను, పుయల్ మేగమ్పోల్ - వర్షింపఁబోవు మేఘమువలె
మేనియమ్మాన్ - తిరుమేనుగల శ్రియఃపతియొక్క, పునై -కట్టబడిన, పూఙ్కళ
ములును, శూరులుధరించుకడియములునుగల, అడిక్కీళ్ - శ్రీపాదపద్మములక్రింద
మే-తానే ప్రయోజనమైయుండు, అడిమైతలై నిన్ఱార్ -దాస్యముయొక్క హద్దుయందున్న
న్న (దాస్యమునందుపూర్ణులైన) విలక్షణులయొక్క, తిరుత్తాళ్ - దివ్యపాదపద్మ
వణఙ్గి-నమ్రులైయాశ్రయించి, ఇమ్మైయే- ఈలోకమందు, పయనే-ప్రయోజనరూప
యాన్ - నేను, పెఱ్ఱదు-లభించిన, ఇన్బమ్-ఆనన్దమునకు, పావియేనుక్కే-పాపా
నాకు, ఒఱుమో - ఆయైశ్వర్యకైవల్యములు సమానమగునా?

తా. వర్షాకాలపు మేఘమువంటి రూపముగల సర్వేశ్వరునియొక్క తిరువడి
లో స్వయంప్రయోజనముగ కైఙ్కర్యమొనర్చునట్టి భాగవతుల తిరువడిత్తామరై
యించి యీలోకమునందు నేను లభించిన పురుషార్థరూప సుఖమునకు ఐశ్వర్యకైవ
పురుషార్థములేవియు సమానము కాదని.

౩. ఒఱుమోపావియేనుక్కివ్వులగమూన్ఱుముడన్ నిఱైయ
చ్చిఱుమామేనినిమిర్త్త వెన్ శెన్దామరైక్కణ్ తిరుక్కుఱళన్,
నఱుమావిరై నాణ్మలరడిక్కీళ్ప్పుగుదలన్ఱి యవనడియార్,
శిఱుమామనిశరాయెన్నైయాణ్డార్ ఇఙ్గే తిరియవే.

నయన్దరు పేరిన్బ మెల్లామ్ పழுదెన్రునణ్ణినర్ పాల్,
శయన్దరుకీర్త్తియిరామానుశమునితాళిణై మేల్,
ఉయర్న్దగుణత్తు త్తిరువరజ్గత్తముదోజ్గుమన్బాల్,
ఇయమ్బుమ్ కలిత్తురై యన్దాదిరోదవిశై నెఞ్జమే.

టీక — నెఞ్జమే - ఓమనసా! నయమ్ - (శబ్దస్పర్శాది విషయములవలన) కలుగుచున్న, పేర్ - (తెలివిలేనివారు) గొప్పగదలచునట్టి, ఇన్బమెల్లామ్ - ... లన్నిటిని, పழுదు ఎన్రు - వ్యర్థములైనవి అని యాలోచించి, నణ్ణినర్ పాల్ - ఆశ్రయించినవారి విషయమున, శయమ్ - సంసారముయొక్క గెలుపును, ... నట్టి, కీర్త్తి - యశస్సుగల, ఇరామానుశముని - ఉడైయవరులయొక్క, తాళిణై ... శ్రీపాదముల జంటవిషయమై, ఉయర్న్దగుణత్తు - మేలైనగుణములుగల, తిరువరఙ్గ ... ముదు - తిరువరఙ్గత్తముదనారు, ఓఙ్గుమ్ - వృద్ధిపొందుచుండు, అన్బాల్ - ప్రేమ... ఇయమ్బుమ్ - చెప్పునట్టి, కలిత్తురై - కలిత్తురైయనువృత్తములుగల, అన్దాది - ఇరామా... నూశ అన్దాదిని, ఓద - అధ్యయనముచేయుటకు, ఇశై - సమ్మతింపుము.

తా. — ఓమనసా! విషయములవలన గలుగు సుఖములు శాశ్వతము లైనవి... మిగుల నీచములైనవని వానినివిడిచి, తమ్మునాశ్రయించినవారియొక్క సంసారము... ను నివర్తింపఁజేయునట్లు ప్రసిద్ధిబొందిన యతిరాజులవారి శ్రీపాదద్వయ విష... తిరువరఙ్గత్తముదనారు ప్రావణ్యాతిశయముతోఁ బ్రసాదించిన ఇరామానుశనూ... న్దాది నధ్యసించుటకు సమ్మతింపుమాయని తమమనస్సునకు నుపదేశించుచున్నారు.

ఈతనియన్ తిరువరఙ్గత్తముదనార్ ఆనతిచ్చినదనియులేక, వారియొక్క... ముచే పారివణ్యముగల పెద్దలానతిచ్చినదనియు వ్యాఖ్యానగ్రన్థమందున్నది.

శొల్లిన్ తొగై కొణ్డునదడిప్పోదుక్కు త్తొణ్డుశెయ్యుమ్,
నల్లన్బర్ ఏత్తుమ్ ఉన్నామమెల్లామెన్ఱన్ నావినుళ్ళే,
అల్లుమ్పగలుమ్ అమరుమ్బడినల్గు అఱుశమయ
వెల్లుమ్పరమ, ఇరామానుశ, ఇదెన్ విణ్ణప్పమే.

టీక. — శొల్లిన్ - శబ్దములయొక్క, తొగైకొణ్డు - సమూహములను... శొల్లిన్ తొగైకొణ్డు - నూటయెనిమిది పాశురములుగాఁ జెప్పవలయునను ... యొక్క యేర్పాటును హృదయమందుంచుకొని, ఉనదు - దేవరవారియొక్క, అడిప్పోదుక్కు - శ్రీపాదారవిన్దముల విషయమున, తొణ్డు - వాచికకైఙ్కర్యమును, శెయ్యుమ్ - చేయునట్టి, నల్ అన్బర్ - మంచిపారివణ్యముగల తిరువరఙ్గత్తముదనారు...

మ - స్తోత్రము చేయునట్టి, ఉన్నామమెల్లామ్ - దేవరవారి తిరునామములగు నూట యెనిమిది పాశురములును, ఎన్దన్ - నాయొక్క, నావినుళ్ళే - నాలుకలోపల, అల్లుమ్పగలుమ్ - రేయుమ్బగల్లను, అమరుమ్పడి - పొందునట్లు, నల్గు - అనుగ్రహింపుము, అఱుశమయమ్ - షణ్మతములను, వెల్లుమ్ - జయించునట్టి, పరమ - సర్వవిధము లశ్లాఘ్యులగు, ఇరామానుశా! - శ్రీరామలక్ష్ములగు లక్ష్మణులయొక్క అవతార విశేషమగు స్వామీ! ఇదు - ఇది, ఎన్ విణ్ణప్పమ్ - దాసునియొక్క విజ్ఞాపనము.

తా— షణ్మతములను జయించిన, రామానుజాచార్యా! తిరువరఙ్గత్తముదనారు, దేవరవారి శ్రీపాదారవిన్దముల విషయమై అత్యన్తప్రావణ్యముతో వాచికమగు కైఙ్కర్యముగఁ ప్రసాదించిన నూటయెనిమిది పాశురములగు ఇరామానుశనూత్తన్దాది ప్రబన్ధమును దాసునికి నాలుకతో స్పష్టముగ ననుసన్ధించునట్లు అనుగ్రహింప వలయును. దాసుని విన్నపమిదియని ప్రార్థించుచున్నారు.

ఇదిసోమాశియాణ్డాన్ సాదించిన తనియన్ - దీనిని తిరునారాయణపురము మొదలగు కొన్ని దివ్యదేశములలో ననుసన్ధించుచున్నారు.

ఇనియెన్కుఱైనమక్కెమ్బెరుమానార్ తిరునామత్తినాల్,
మునితన్దనూత్తెట్టుచ్చావిత్తిరియెన్నునుణ్పొరుళై,
కలితన్దశెఞ్జొల్ కలిత్తుఱైయన్దాదిపాడి త్తన్దాన్,
పునిదన్ తిరువరఙ్గత్తముదాగియపుణ్ణియనే,

టీక.—ముని - సృష్టిని గుఱించి మననముచేయు సర్వేశ్వరుడు, తన్ద - బ్రహ్మకుపదేశించిన, నూఱు ఎట్టు - నూటయెనిమిదిమార్లు జపింపవలసిన, శావిత్తిరి ఎన్నుమ్ - సావిత్రియని ప్రసిద్ధినొందిన వేదమాతయగు మంత్రముయొక్క, నుణ్ - సూక్ష్మమగు, పొరుళై - అర్థమును, ఎమ్బెరుమానార్ - యతిరాజులయొక్క, తిరునామత్తాల్ - తిరునామములచే, కలి - శబ్దశక్తిని, తన్ద - ఇచ్చునట్టి, శెమ్శొల్ - చెవులకింపగు శబ్దములుగల, కలిత్తుఱై - కలిత్తుఱైయను వృత్తములుగఁ జేయఁబడిన, అన్దాది- ↓ముక్తపదగ్రస్తముగ నుండు రామానుజ నూత్తన్దాదిని, పాడి-అనుభవించి గానము చేసి, పునిదన్ - పరిశుద్ధులగు, తిరువరఙ్గత్తముదు - తిరువరఙ్గత్తముదనారు, ఆగియ- అయినట్టి, పుణ్ణియన్ - ధార్మికులు, తన్దాన్ - ఇచ్చిరి, ఇని - ఇకమీదట, నమక్కు - మనకు, కుఱై - కొదవ, ఎన్ - ఏమియున్నది.

తా—సర్వేశ్వరుడు బ్రహ్మనుసృష్టించియాబ్రహ్మకు ప్రణవపూర్వకముగనుపదేశించినగాయత్రియొక్క సారాంశములను, ధార్మికులునుపావనులునగు తిరువరఙ్గత్తముద

↓ చూ-౨౭౬.పు.

నారు. ఈరామానుశనూత్తన్దాదియనుగ్రన్థముగ సాదించిమనకుపకరించిరి కష్ట,
పరములలోమనకే కొదవయును లేదని.



శ్రీమతేరామానుజాయనమః.

## ఇరామానుశ నూత్తన్దాది.

### అ వ తా రి క.

సకలశాస్త్ర సంగ్రహమగు తిరుమంత్రము యొక్క తాత్పర్యమై,
న్నిర్హేతుక కృపాలబ్ధపరిశుద్ధ జ్ఞానముగల ఆళ్వార్లయొక్క దివ్యప్రబన్ధ పాశు
పరమకారుణికులగు నమ్మాళ్వార్లయొక్క పరిపూర్ణకటాక్షపాత్రులైన శ్రీమన్నా
ప్రసాదించుటచేతను అనుష్ఠించుటచేతను ప్రకటితమై, ఆళ్వార్లచే శ్రీమన్నా
లకు ఆనతీయఁబడినదై, అవ్విధముగ, ఉపదేశపరంపరాప్రాప్తమై పరమరహస్య
మందుచరమపర్వనిష్ఠాప్రకారమును, ఉడైయవరులు తిరువరఙ్గత్తముదనారును,
పచేకూరత్తాళ్వాన్ తిరువడిగళులో ఆశ్రయింపఁజేసి వారిమూలముగ ఉపదే
వినిఆయర్థమును ఉన్నదియున్నట్టుగఁజూచి, ఎల్లప్పుడును ఎంబెరుమానారుల
శను సేవించుకొనుచుండు అముదనారుకు వారిదివ్యగుణములయందు ప్రేమమతిశ
యనుసన్ధించి అనుభవింపవలసివచ్చిన దశగలుగుటచేతను, ఈయర్థజ్ఞానము చేత
సులభమగునట్లు చేయవలయు ననుతమపరమకృపచేతను ఉడైయవరుల ప్ర
సకలమైనవారికి ప్రకాశింపఁజేయుచునుండు ఆళ్వార్లకు ప్రథమశిష్యులగు
ధురకవులు స్వనిష్ఠానుసన్ధానరూపముగను పరోపదేశరూపముగను ఉజ్జీవనార్థము
చేతనులకును గ్రన్థరూపముగఁ బ్రసాదించినట్లు, ఆచార్యాభిమాననిష్ఠులకు
దగినయర్థములనన్నిటిని, స్వరూపోపాయపురుషార్థయాథాత్మ్య ప్రకాశకమును,
ముఖముగ సవిస్తరముగ ప్రసాదించుచున్నారు. బ్రాహ్మణ్యముసిద్ధించుటకు గా
ప్తవ్యమైనట్లు శ్రీవైష్ణవత్వసిద్ధికిఁ ఇరామానుజనూత్తన్దాదిని ప్రపన్నగాయత్రిగ
ర్వాచార్యులు ప్రసాదింతురు. ఎంబెరుమానార్ తిరువడిగళులో పావిత్ర్యమ
“ సావిత్రి ” వలె, ఇదినిత్యానుసన్ధేయమైయుండవలయుననియే ప్రతిపాదక
తిరునామమునుంచినూటయెనిమిది పాశురములుగ సాదించిరి.





శ్రీమతేరామానుజాయనమః.

  

# ఇరామానుశ నూత్తన్దాది.



అవతారిక— తిరువరఙ్గత్తముదనార్, తమహృదయమును గూర్చి, ఉడైయవరులతిరువడిగళనాశ్రయించియుజ్జీవింతమరమ్మని యుపదేశించుచున్నారు.

౧. పూమన్ను మాదుపొరున్దియమార్బన్, పుగర్ మలిన్ద
పామన్ను మారనడిపణిన్దుయ్న్దవన్, పల్ కలైయోర్
తామ్మన్న వన్దవిరామానుశన్ చరణారవిన్దమ్,
నామ్మన్ని వాழ, నెఞ్జే సొల్లువోమ్ అవన్ నామఙ్గళే.

టీక. పూ - తామరపుష్పమునందు, మన్ను - వాసస్థానముగగల, మాదు - శ్రీమహాలక్ష్మి, పొరున్దియ - నిత్యవాసముచేయునట్టి, మార్బన్ - వక్షస్థలముగల శ్రియఃపతియొక్క, పుగழ் - కల్యాణగుణములచే, మలిన్ద - నిండియున్న (కల్యాణగుణప్రతిపాదకములు) పా - తిరువాయ్మొழிపాశురములందు, మన్ను - స్థిరముగనుండునట్టిహృదయముగల, మారన్ - నమ్మాళ్వార్లయొక్క, అడి - తిరువడిగళను, పణిన్దు - ఆశ్రయించి, ఉయ్న్దవన్ - ఉజ్జీవించినవారై; పల్ - అనేకములగు, కలైయోర్ - శాస్త్రములభ్యసించినవారైనను, తామ్ - తత్త్వహితపురుషార్థములను విశదముగగుర్తెఱుగనితాము, (సకలశాస్త్రసారాంశములను తత్త్వముగగుర్తెఱిగిసాధించు వారగుటచే) మన్న - వాస్తవజ్ఞానముతో చక్కగప్రతిష్ఠింపఁబడినవారగునట్లు, వన్ద- పరమపదమునుండి సర్వేశ్వరనియమనముచేవచ్చియవతరించిన, ఇరామానుశన్ - ఉడైయవరులయొక్క, చరణారవిన్దమ్ - శ్రీపాదకమలములను, నామ్- ఇదేప్రాప్యమనిగుర్తెఱిగినమనమిద్దఱము, మన్ని- పొంది, వాழ - సుఖించునట్లు, నెఞ్జే - ఓమనసా! అవన్ - అవుడైయవరులయొక్క నామఙ్గళ్ - భోగ్యమగుతిరునామములను, సొల్లువోమ్ - అనుసన్ధింతము.

తా—తామరపుష్పమందవతరించినవారును, "పద్మిని" అను నామమును సహజముగగలవారై భోగ్యతాతిశయముచే, తామరపుష్పమందివసించుచున్న శ్రీమహాలక్ష్మి, సౌన్దర్యమందు మన్మథునిమించియున్న శ్రీమన్నారాయణుడు తమ్ముకల్యాణముచేసికొనగ నారివక్షస్థలమునసుభవించియాభోగ్యతకీడుపడి, శైత్యపరిమళమార్దవాది గుణవిశేషము

లుగల తామరపుష్పమందలి నిత్యవాసమును వదలి యాస్మరణయేశకయా మన
వాసముచేయునట్టి సర్వేశ్వరునియొక్క పరత్వ సౌలభ్య సౌశీల్య సౌహార్ద వాత్సల్యాది
కల్యాణగుణములనుప్రతిపాదించునట్టి తిరువాయ్ మొళిమూలముగనాశ్రియఃపతి
కపోషక భోగ్యములుగననుభవించుచు నిత్యసూరిసములై వేంచేసియున్న నమ్మా
తిరువడిగళ్ నాశ్రయించి యుజ్జీవించినవారై, సకలశాస్త్రపారీణులగు, కూరేశా
ఉడైయవరుల యనుగ్రహవిశేషము చేతత్త్వ హితపురుషార్థయాథాత్మ్యజ్ఞానము
న, యాదవప్రకాశుడు, యజ్ఞమూర్తి మొదలగు మఱియుననేక చేతనకోట్లను కృ
యుజ్జీవింపఁజేయుటకై, శ్రియఃపతియొక్క నియమనముచే నిత్యవిభూతినుండి
వతరించిన ఆదిశేషులయంశమగు యతిరాజులవారియొక్క మిగుల భోగ్యములగు
రవిన్దములనాశ్రయించి అనాదికాలముగ బద్ధసంసారమందుఁబడియున్న మనము
యవరులకల్యాణగుణప్రతిపాదకములగు తిరునామములనే సకలవిధభోగ్యము
యెల్లప్పుడను సన్ధించియుజ్జీవింతము. ఓమనసా ! నీవుసహకారిగానుండవలయును.

అ-అవ—ఈపాశురమందు తమహృదయమనుకూలించుటయును, సర్వ
పార్థములభించుటయునుజూచి యాశ్చర్యపడుచున్నారు.

౹౹ ౧. కళ్ళార్ పొళ్ఖిల్, తెన్నరజ్గన్, కమలప్పదజ్గళ్, నెఞ్జిల్
కొళ్ళామనిశరై నీజ్గి, కుఱైయల్ పిరానడిక్కీ ళ్,
విళ్ళాదవన్బనిరామానుశన్, మిక్కశీలమల్లాల్,
ఉళ్ళాదెన్నెఞ్జు, ఒన్ఱఱియేనెనక్కుత్ఱ పేరియల్వే.

టీక. కళ్ - తేనె, ఆర్ - నిండియుండు, పొళ్ఖిల్ - తోటలుగలిగి
ఆదమైన, అరజ్గన్ - ఉభయకావేరీమధ్యమందలి ( కోవెలలో ) శయనించి
శ్రీరఙ్గనాథునియొక్క, కమలమ్ - వికసించుటచేతామరవలె భోగ్యమైన, పదజ్గ
తిరువడిగళ్‌ను, నెఞ్జిల్ - హృదయములో, కొళ్ళా - ఒకప్పుడునుంచని, మని
మనుష్యులను, నీజ్గి - దూరమునవిడిచి, కుఱైయల్ - తిరుక్కుఱైయలూరిలో
చిన, పిరాన్ - దివ్యప్రబన్ధనిర్మాణాదులచే లోకోపకారకులైన తిరుమఙ్గైయా
యొక్క, అడిక్కీళ్ - తిరువడిగళ్ క్రింద, విళ్ళాద - విడిచియుండని, అన్బన్
హముగలవారైయున్న, ఇరామానుశన్ - ఉడైయవరులయొక్క, మిక్క -
మైన, శీలమ్అల్లాల్ - శీలగుణమునుదప్ప, ఎన్నెఞ్జు - నాహృదయము
వేరొకటిని, ఉళ్ళాదు- స్మరింపదు, ఎనక్కు - నాకు, ఉత్ఱ - సిద్ధించిన, పేర్
లోపాయములకంటెను) గొప్పదైన, ఒన్ఱు - ఒక, ఇయల్వు - విలక్షణమగుస్వ
షమిది, అఱియేన్ - దీనినిలభించిన విధమునుగుర్తెఱుగను. ( ఏమియాశ్చర్యము).

తా—మాలికలవలెనుండు నుభయకావేరులచేతను, తేనెప్రవహించుచుండునానావిధపుష్పఫలభరితములగు వృక్షములుగల యుద్యానవనములచేతను జుట్టఁబడి రమణీయమై యుండునదియు సర్వేశ్వరునికిలోకమునందు భోగమణ్టపమగు శ్రీరఙ్గక్షేత్రమందు, అత్యన్తసన్తోషముతో శయనించియున్న శ్రీరఙ్గనాథునియొక్క, బ్రహ్మరుద్రాదులచేఁబ్రార్థింపఁబడుచున్న పరమపావనములగు, శ్రీపాదారవిన్దములనాశ్రయించి యుజ్జీవింపక, బహుకాలార్జిత పుణ్యవిశేషముచే లభించిన యీనరజన్మమును వ్యర్థముచేయుచున్నగర్భనిర్భాగ్యులగు సంసారిచేతనులను వదలి, తిరుమొళిమొదలగు దివ్యప్రబన్ధములచేనుశ్రీవాంశములగు సకలార్థములను దెలిపి శ్రీరఙ్గక్షేత్రమందు ప్రాకారాదులు నిర్మించియేకాదశీతిరువధ్యయనోత్సవము జరిపించియు, వీరశైవులతో తర్కించి వారినిజయించిదివ్యదేశములను నిర్వహించుట మొదలగు వానిచే, ఉపకారకులగు తిరుమఙ్గైయాళ్వార్లయొక్కతిరువడిగళయందత్యన్తప్రావణ్యము గలిగివానినెడఁబాయక భాగవతశేషత్వమందీడుపడిన మహానుభావులైయుండియు నాబోటిమందమతులతోఁ గలిసియున్న యతిరాజులవారి ఒకశీలగుణమునకే నామనస్సెనది యీడుపడి చిన్తించుచున్నది. ఇదేమియాశ్చర్యము, ఇందులకైశాస్త్రోక్తములగు కర్మాద్యుపాయములనుష్ఠించిన వాడనుగాను. ఇది యతిరాజులవారినిర్హేతుకకృపచేత నేలభించినది.

అవ—3 పాశురమందు - ఎమ్బెరుమానారుల తిరువడిగళు సంబన్ధముగల భాగవతోత్తముల నాశ్రయించుటను సహాయపడినతమమనస్సును శ్లాఘించుచున్నారు.

౩. పేరియల్ నెఞ్జేయడిపణిన్దేనున్నై, ప్పేయ్ప్పిఱవి.
పూరియరోడుళ్ళశుత్తమ్పులన్ఱి, ప్పొరువరుమ్‌శీర్,
ఆరియన్‌శెమ్మైయిరామానుశమునిక్కన్బుశెయ్యుమ్
శీరియపేఱుడైయార్, అడిక్కీళెన్నైచ్చేర్‌త్తదఱ్కే.

టీక. పేర్ - గంభీరమగు, ఇయల్ - స్వభావముగల, నెఞ్జే - ఓమనసా ! పేయ్ - నీచమగు, పిఱవి - జన్మముగల, పూరియరోడు - అహఙ్కారాదిదోషములచేమూఢులగువారితో, ఉళ్ళ- కలిగిన, శుత్తమ్ -సంబన్ధమును, పులర్‌త్తి- విడిచి, పొరుఅరుమ్-సాటిలేని, శీర్ - శుభగుణములుగలవాడును, ఆరియన్ - సర్వజ్ఞులగు విద్వాంసులును, శెమ్మై-శ్రేష్ఠుల నెట్టివారినైనను దిద్దుపాటుచేయు ఋజుస్వభావముగల, ఇరామానుజమునిక్కు-ఎమ్బెరుమానార్ల విషయమునందు, అన్బుశెయ్యుమ్ - అత్యన్తప్రీతిచేయునట్టి, శీరియ-శ్రేష్ఠమైన, పేఱు ఉడైయార్ - పురుషార్థముగల కూరత్తాళ్వాన్ మొదలగు తదీయులయొక్క, అడిక్కీళ్ - శ్రీపాదపద్మములక్రింద, ఎన్నై - నన్ను, శేర్‌త్తదఱ్కు -చేర్చినయీమహోపకారమునకు, ఉన్నై- నిన్ను గూర్చి, అడిపణిన్దేన్ - ఒక నమస్కారము చేసితిని.

తా— ఉడైయవరుల శీలగుణమున కీడుపడిన గంభీరస్వభావముగల, ఓ
నీచజన్మముగలవారును అహంకారాది దోషగ్రస్తులునగువారియొక్క సాజ్గత్యము
సమస్తకల్యాణగుణాత్మకులును, సకలశాస్త్రజ్ఞులలో నగ్రగణ్యులును, ఆశ్రితు
తులుగానున్నను సన్మార్గమునకు దెచ్చునట్టి ఋజుస్వభావముగల యతిరాజులవారి
యమందలి ప్రావణ్యమునే శ్లాఘ్యమైన పురుషార్థముగ నెంచియుండుకూరత్తాళ్వా
లగుతదీయులయొక్క శ్రీపాదపద్మముల క్రిందునన్నుఁజేర్చిన యీమహోపకార
నిన్నుఁగూర్చి నమస్కరించుచున్నానని.

౪ - అ... ఈ పాశురమందు - దుర్వాసనాబలముచే సద్విషయమందు మ
దప్పెనేని మానిష్ఠకుహానిగలుగఁబోవునని; ఎమ్బెరుమానార్లు తామే నిర్వాహకముగ
గీకరించిరి గనుక నాకొక హానియును గలుగదనుచున్నారు.

తి - ౨

౪. ఎన్నైప్పువియిల్ఒరుపొరుళాక్కి, మరుళ్శురన్ద.
మున్నైప్పళవినై, వేరఱుత్తు, ఊழிముదల్వనైయే.
పన్నప్పణిత్తవిరామానుశన్పరన్ పాదముమెన్,
శెన్నిల్తరిక్కవైత్తాన్, ఎనక్కేదుమ్శిదైవిల్లైయే.

టీక. ఊழி - కాలములచే జెలిసికొనఁదగిన సకలవస్తువులకును, ముదల్వనై
కారణభూతుఁడగు సర్వేశ్వరునినే, పన్న - అంచఱును వివేకించి యనుసంధించు
పణిత్త - శ్రీభావ్యముగ ప్రసాదించిన, పరన్ - సర్వోత్తములైన, ఇరామానుశ
యతిరాజులవారు, ఎన్నై - అవస్తువైననన్ను, పువియిల్ - ఈభూమియందు, ఒరు
రుళాక్కి - ఒకవస్తువగునట్లుచేసి, మరుళ్ - అజ్ఞానముచే, శురన్ద - వృద్ధిబొందు
మున్నైప్పళవినై - మిక్కిలిపురాతనమైన కర్మములను, వేర్ అఱుత్తు - వాసన
గొట్టి, పాదమున్ - తమతిరువడిగళనుగూడ, ఎన్ శెన్నిల్ - నాశిరమునందు,
ధరించువిధముగ, వైత్తాన్ - ఉంచిరి, (ఇట్లైనవెనుక) ఎనక్కు - నాకు,
ఒకటియును, శిదైవు - హాని, ఇల్లై - లేదు.

(రెండవయర్థము - పరన్ - సర్వస్వాత్పరుఁడగు శ్రియఃపతియొక్క పాద
శ్రీపాదములను సహితము, ఎన్ శెన్ని - నాశిరస్సునందు, తరిక్కవైత్తాన్ -
జేసిరి, అని, సర్వేశ్వరుని శ్రీపాదారవిన్దములను నాశిరస్సున ధరింపజేసిరని
ము, మిగిలినవన్నియు పూర్వమువలెనే)

తా—బ్రహ్మరుద్రాదులకన్తర్యామియైయుండి సృష్టిసంహారములను,
రూపియైయుండి సంరక్షణ కృత్యమునుజేయుచు నిల్లు సకల జగత్కారణభూ

యుండు సర్వేశ్వరుడు శ్రియఃపతియేయను తత్వార్థమును సకలచేతనులు గుర్తెఱిగియుజ్జీవించునట్లు శ్రీభాష్యగీతాభాష్యములచే విశదీకరించిన మహోపకారకులైన యెంబెరుమానారులు, స్వరూపజ్ఞానములేనందుచే అవస్తువైననన్ను, తమనిర్హేతుక కటాక్షముచే ఒకవస్తువుగనొనర్చి అనాదియగు అజ్ఞానకర్మవాసనారుచి ప్రకృతిసంబన్ధాత్మకముగ నుండు పుణ్యపాపరూపకర్మములను సవాసనగఁబోగొట్టి, మంత్ర మంత్రార్థజ్ఞానోపదేశములచే స్వరూపజ్ఞునిగఁజేసి తమ శ్రీపాదారవిన్దములను నాకు శిరోభూషణముగ నమర్చి నన్నుజ్జీవింపఁజేయుటచే, ఇక నాకొక హానియును గలుగ నేరదని.

౫. అవ, ఈపాశురమందు, తాముచేయ నారంభించిన గ్రన్థమందు, దోషము లేక యున్నయెడ లాక్షణికులు నిందింతురేయని శంకించి విడిచిపెట్టుదమాయనుకొను చు మరల తామే మనస్తృప్తిచేసి కొని ప్రవర్తించుచున్నారు.

౫. ఎనక్కుత్తన్ఱ శెల్వమిరామానుశన్, ఎన్ఱిశైయగిల్లా
మనక్కుత్తమ్మానిడర్ పత్తిక్కుప్పుగళ్, అవర్మన్నియశీర్
తనక్కుత్తవన్బర్ త్తిరునామఙ్గళ్ శాత్తుమఙ్గపా
వినక్కుత్తమ్ కాణగిల్లార్, పత్తియెయ్న్దవియల్విదెన్ఱే.

టీక. ఎనక్కు - నాకు, ఉత్తన్ఱ - స్వరూపమునకు దగిన, శెల్వమ్ - సంపద, ఇరామానుశన్ - యతిరాజులవారు, ఎన్ఱు - అని, (స్తోత్రముచేయుటకు) ఇశైయగిల్లా - సమ్మతింపని, మనక్కుత్తమ్ - మనోదోషముగల, మానిడర్ - మనుష్యులు, పళిక్కిల్ - నిందింతురేని, పుగళ్ - (అది) స్తుతియేయగును, అవర్ - అవ్వుడైయవరులయొక్క, మన్నియ - స్థిరముగ నమరియుండు, శీర్దనక్కు - జ్ఞానశక్త్యాది కల్యాణగుణములకు, ఉత్తన్ఱ - తగిన, అన్బర్ - ప్రేమముగలవారు, పత్తి - భక్తితో, ఎయ్న్ద - కూడిన, ఇయల్విదు - ప్రపత్తినిగలది, ఎన్ఱు - అని, అవర్ - ఆయెంబెరుమానార్లయొక్క, తిరునామఙ్గళ్ - తిరునామములను, శాత్తుమ్ - చెప్పుచుండెడు ఎన్ - నాయొక్క, పా ఇనమ్ - పాశురముల సముదాయముయొక్క, కుత్తమ్ - దోషమును, కాణగిల్లార్ - చూడఁజాలరు.

తా—మన స్వరూపానురూపమగు సంపద, ఉడైయవరులేయని త్రికరణశుద్ధిగ నిజానుభవకైఙ్కర్యములయం దీడుపడుట, చేతనునికి పరమపురుషార్థమైయుండ అదవదలి తమపాపకర్మముచే అసూయాక్రోధాది మనోదోషములుగల మనుష్యులీగ్రన్థమును నిందింతురేనియూనిన్ద స్తుతియేయగును, యతిరాజులవారి కల్యాణగుణములందు ప్రావణ్యముగల మహాత్ములు భక్తిప్రేరితమై వారి తిరునామములను ప్రతిపా

దించుచున్న యీప్రబన్ధమునందే విధమైన దోషమును యెన్నఁజాలరు, కాఁబట్టి స
త్తులకు సమ్మతమైయుండు నీగ్రన్థము చేయనగునని.

౬ - అ. ఈపాశురమందు - ఈక్రిందు, భక్తిచేఁజేయఁబడిన ప్రబన్ధము
తిమే, అభక్తియైనది తమకుగలదాయని యాలోచించి, యతిరాజులవారి విషయ
నకు దగినభక్తి తమకులేదని తమ్మునిందించుకొనుచున్నారు.

౭. ఇయలుమ్పొరుళుమిశై యత్తొడుత్తు, ఈన్కవిగళన్బాల్
మయల్కొణ్డువాఴ్త్తుమిరామానుశనై, మదియిన్మైయాల్,
పయిలుఙ్కవిగళిల్ పత్తియిల్లాదవెన్ పావినెఞ్జాల్
ముయల్గిన్ఱనన్, అవన్ఱన్ పెరుఙ్కీర్త్తి మొఴిన్దిడవే.

టీక. ఇయలుమ్ - శబ్దమును, పొరుళుమ్ - అర్థమును, ఇశైయ - పొందు
దునట్లు, తొడుత్తు - చేర్చి, ఈన్ - విలక్షణమైన, కవిగళ్ - కవులు, అన్బాల్ -
ప్రేమముచే, మయల్కొణ్డు - తెలివిదప్పి, వాఴ్త్తుమ్ - స్తుతించుచున్న, ఇరామాను
శనై - ఉడైయవరులను, పయిలుమ్ - క్రమపద్ధతితప్పి చెప్పునట్టి, కవిగళిల్ - కవన
యందు, పత్తియిల్లాద - భక్తిలేకుండెడు, ఎన్ - నాయొక్క, పావినెఞ్జాల్ - పాప
గల మనస్సుచే, అవన్ఱన్ - ఆయెమ్బెరుమానార్లయొక్క, పెరుమ్ - ఎల్లలేని, కీర్త్తి -
యశస్సును, మొఴిన్దిడ - వచించునట్లు, మదియిన్మైయాల్ - జ్ఞానములేనందుచే, ముయ
ల్గిన్ఱనన్ - ఉత్సహించుచున్నాను,

తా—శబ్దాలంకార అర్థాలంకారాది సర్వలక్షణములతోఁగూడిన ప్రబన్ధము
జేయ సామర్థ్యముగల కవులు, యతిరాజులవారి యందలి ప్రేమాతిశయముచే క్రమం
తప్పిన లక్షణవిషయములను మఱచి వారివిషయమై ఎల్లప్పుడును ప్రబన్ధరూపముగ స్తో
త్రముచేయుచుందురు, అట్టిప్రబన్ధములందు పాణ్డిత్యము లేని నేను అజ్ఞానముచే ఉడై
యరులయొక్క యత్యన్తమైనకీర్తిని ప్రబన్ధరూపముగ వచించుటకైయుత్సహించుచున్నాను.

౮ - పా. అవ - తమఅయోగ్యతను దలచుకొని ఉరుగుకొన సెంబివ
కూరత్తాఴ్వార్ తిరువడిగళిలో సంబన్ధముండునపుడు మనకశక్యమైనదియొకటియున్న
స్తోత్రమునందు ధీరహృదయులగుచున్నారు.

౮. మొఴియైక్కడక్కుమ్ పెరుమ్బుగఴాన్, వఞ్జముక్కుఱుమ్బామ్
కుఴియైక్కడక్కుమ్ నమ్కూరత్తాఴ్వాన్, శరణ్కూడియపిన్
పఴియైక్కడత్తుమిరామానుశన్ పుగఴ్ పాడియల్లా
వఴియైక్కడత్తల్, ఎనక్కినియాదుమ్ వరుత్తమన్ఱే.

టీక. మొళియై - నోటిమాటలను, కడక్కుమ్ - అతిక్రమించియున్న, (వర్ణింప శక్యముగాని) పెరుమ్ - గొప్ప, పుగళార్ - కీర్తిగలవారై, వఞ్జమ్ - వంచించుచున్న (మంచిమార్గమునుదప్పిపోవునట్లు చేయుచున్న) ముక్కుఱుమ్బుఆమ్ - మూడువిధములగు (గొప్పకులముగలవారము, విద్యావంతులము, ధనవంతులము) అగుఅహంకారముల నెడు, కుళియై - పడుపల్లమును, కడక్కుమ్ - దాటినవారును, నమ్ - మనకు నాథులగు, కూర త్తాళ్వాన్-కూరత్తాళ్వానుయొక్క, శరణ్ - తిరువడిగళ్ నురక్షకముగ, కూడియపిన్ - ఆశ్ర యించినవెనుక, పళియై - దోషములవలెననుభవించితీరవలసిన పాపకర్మములలో, కడత్తు మ్. మునగకుండునట్లు దాటించుచున్న, ఇరామానుశన్ - ఉడైయవరులయొక్క, పు గళ్ - దివ్యగుణములను, పాడి - సంకీర్తనము చేసి, అల్లాకుళియై - స్వరూపవిరుద్ధముల మార్గములను, కడత్తల్ - దాటుటచే, ఎనక్కు - నాకు, ఇని - ఇకమీదు, యా దుమ్ - ఒకటియును, వరుత్తమ్అన్ఱు - శ్రమము గాదు.

(కుళియైక్కడత్తుమ్ ఎఙ్ కూరత్తాళ్వాన్ అనిపాఠాన్తరము)

తా—నోటవర్ణింపనశక్యమైన మహత్తైనయశస్సుగలవారును, నశించుటకుఁగా రణములగు, కులముచేగొప్ప, విద్యచేగొప్ప, ధనముచేగొప్ప, అనుదురభిమానములో కటియును కొంచెమైనను లేక జ్ఞానభక్తివైరాగ్యసంపదలతో ప్రకాశించుచుండిన కూర త్తాళ్వానుయొక్క శ్రీపాదారవిన్దములనాశ్రయించి, జగదాచార్యులైసకలచేతనులదోష ములనుశమింపఁజేసియుజ్జీవింపఁజేయుచున్న కృపాస్వరూపులగుయతిరాజులవారి దివ్యగు ణములనుగొనియాడి, చెడుదారులను దాటుటచేనాకట్టి ప్రయాసములునుగలుగనేరదు, కూరత్తాళ్వాన్ సంబన్ధబలము చే సర్వాభీష్టములు సిద్ధించునని.

ర-అ—ఇంక నీపాశురము మొదల్కొని స్తోత్రముచేయుచున్నారు, అందు మెం దటయాళ్వారులగు పొయ్గైయాళ్వారు లానతిచ్చినదివ్యప్రబన్ధమును తమహృదయమునం దుంచుకొనియుండు మహిమగల ఎంబెరుమానార్లు మాకునాథులనుచున్నారు.

౮. వరుత్తుమ్పుఱవిరుళ్ మాఱ్ఱ, వెమ్పొయ్గైప్పిరాన్ మఱైయిన్

కురుత్తిన్పొరుళై యుమ్ శెన్దమిళ్ తన్నైయుఙ్గూట్టి, యొన్ఱ

త్తిరిత్తన్ఱెరిత్తతిరువిళక్కైత్తన్ తిరువుళ్ళత్తే,

యిరుత్తుమ్పరమన్, ఇరామానుశనెమ్మిఱైయవనే.

టీక. వరుత్తుమ్ - (ప్రాణులకు) శ్రమమునుగలుగఁజేయుచున్న, పుఱమ్ - బాహ్యవిషయప్రావణ్యమునకు సాధనమైన, ఇరుళ్ - అజ్ఞానమనుచీకటిని, మాఱ్ఱ - పోగొట్టుటకొఱకు, ఎమ్ - నాయొక్కసంబన్ధులగుప్రపన్నజనులనిమిత్తమై, పొయ్గై - కాంచీనగరమందలి పుణ్డరీకసరస్సునందవతరించిన పొయ్గైయాళ్వార్ల,

మఱ్ఱైయిఱ్ - వేదములయొక్క, ఉఱత్తిఱ్ - కడపటిదియగు ఉపనిషత్తులయొక్క, పొరుళ్ యుమ్ - అర్థములను, శెమ్ - తత్త్వహితపురుషార్థములను చక్కగ ప్రతిపాదించుటచేమనోజ్ఞమైన, తమిళ్ త్తైయుమ్ - ద్రావిడరూపమైనదివ్యప్రబన్ధములనున్ను, కూట్టి - మంచిద్రవిడపదములనున్ను జేర్చి, ఒన్ఱ - ఆరెంటినిన్ని యొకటిగా కలిసియుండునట్లు, తిరిత్తు - సంబన్ధపఱచి, అన్ఱు - ఒక యింటినడవలో సర్వేశ్వరుడు జేరినపుడు, ఎరిత్త - ప్రకాశింపజేసిన, తిరువిళక్కై - దీపమును, తన్ తిరువుళ్ళత్తే - తమహృదయమందు, ఇరుత్తుమ్ - ఉంచుకొనియుండు, పరమన్ - నిరతిశయప్రభావముగల, ఇరామానుశన్ - ఎమ్బెరుమానార్లు, ఎమ్ - మాకు, ఇఱైయవన్ - నాథులైనవారు.

తా— సకలజగత్కారణభూతుడగు శ్రీమన్నారాయణుడు, ఈజగత్తుయొక్క సృష్టిస్థితిసంహారాదికార్యంబులొనర్చుచుండగ, ఆసర్వేశ్వరునియాజ్ఞకు బ్రహ్మరుద్రేంద్రయమసూర్యాగ్నియమాదిసకలదేవగణములును లోబడి ప్రవర్తించుచుండగ కొందఱు వీనన్నిటిని అసత్యమనియు, ప్రత్యక్షముగనగుపడుచుండునత్యాశ్చర్యకరములగుచేతనాచేతనరూపసకలపదార్థములకును గారణభూతుడు, ఒకడుండునుగదా, యను వివేకములేక వాదముచేయుచుండగ, లోకులు మతిపోందఱు వానినినమ్మివాస్తవార్థమెఱుగకయజ్ఞానాంధకారముచే శ్రమపడుచుండుటను గటాక్షించి, వీరియజ్ఞానమును నివర్తింపఁ జేయుటకై యవతరించినపరమప్రపన్నులగువారిలో కోపకారకులునైనమొదటియాళ్వారులగు పొయ్గై, పూద, పేయాళ్వారులుమువ్వురును, వర్షశ్రమమునకుగాను తిరుక్కోవలూరిలో నొకయింటినడవయందు గూడియుండగ నాసమయమున శ్రియఃపతి సేవసాదించుట యనునపుడు పొయ్గైయాళ్వార్లు సేవించి యనుభవించుటయేగాక ఈ చేతనులయందు పరమకృపచేదురూహములగుసకలవేదాన్తార్థములను ప్రసాదించిన వైయన్దగళి యనెడు ద్రవిడప్రబన్ధమగు ముదల్ తిరువన్దాదియను దీపమును తమహృదయమందుంచుకొన్న శ్వాతిశయులగు ఉడైయవరులేమాకు నాథులని.

స-అ— ఈపాశురమందు, పూదత్తాళ్వార్లతిరువడిగళను తమహృదయమందుంచుకొనియనుభవించునట్టి యెంబెరుమానార్లకల్యాణగుణముల ననుసన్ధించువారు వేలనుగాపాడిలోకమందు ప్రతిష్ఠింపజేసెదువారఁ అనుచున్నారు.

౯. ఇఱైవనై క్కాణ్ణుమిదయ త్తిరుళ్ కెడ, ఞానమెన్నుమ్
నిఱైవిళక్కేఱ్ఱియపూద త్తిరువడిత్తాళ్ గళ్, నెఞ్జ
త్తుఱైయవైత్తాళ్ళుమిరామానుశన్ పుగళ్ ప్పోదుమ్ నల్లోర్
మఱైయినైక్కాత్తు, ఇన్దమణ్ణగ త్తేమన్నవైప్పవరే.

టీక. ఇరైవనై - నాథుడగుశ్రియఃపతిని, కాణుమ్ - సేవించుటకుపకరణమగు, ఇదయత్తు - హృదయమునంటియుండు, ఇరుళ్ - అజ్ఞానము, కెడ - నశించునట్లు, ఞానమ్ ఎన్నుమ్ - పరజ్ఞానమను, నిఱైవిళక్కు - పరిపూర్ణదీపమును, ఏత్తియ - ప్రకాశింపఁజేసిన, పూత్తన్ - పూదత్తాళ్వారను, తిరువడి-స్వామియొక్క, తాళ్కళ్-శ్రీపాదపద్మములను, నెఞ్జత్తు - మనస్సునందు, ఉఱైయ - ఎల్లప్పుడువాసముచేయున ట్లు, వైత్తు - ఉంచి, ఆళుమ్ - అనుభవించునట్టి, ఇరామానుశన్ - ఎమ్బెరుమానార్ల యొక్క, పుగళ్ - దివ్యగుణములను, ఓదుమ్ - ఎల్లప్పుడనుసన్ధించుచున్న, నల్లోర్ - సత్పురుషులైనవారు, (సామాన్యమతస్థులచేఁ జెడకుండునట్లు) మఱైయినై - వేదములను, కాత్తు - కాపాడి, ఇన్దమణ్ణగత్తే - ఈలోకమందు, మన్న - శాశ్వతముగనుండునట్లు, వైప్ప ర్-ఉంచువారైయున్నారు.

తా... సర్వేశ్వరునికి వాసస్థానమును, ఈచేతనునికి సేవింపసాధనమునైనహృద యమందున్నయజ్ఞానమను చీకటిని జ్ఞానమనుదీపమును వెలిగించితొలఁగఁజేసి యాశ్రీమ న్నారాయణునిఁ బ్రత్యక్షముగ సేవించిన పూదత్తాళ్వార్లయొక్క చరణారవిన్దముల నెల్ల ప్పుడుధ్యానించుచుండు యతిరాజులవారికల్యాణగుణముల నను సన్ధించుచున్న మహానీ యులే, పాషణ్డబౌద్ధాది సామాన్యములగు సకలమతములవలన, వైదికసిద్ధాంతమునకునొక బాధయునులేకుండునట్లుసంరక్షించి సుస్థిరముగనుండునట్లు స్థాపింతురని.

౧౦. మన్నియపేరిరుళ్ మాణ్డపిన్, కోవలుళ్ మామలరాళ్
తన్నొడుమాయనైక్కణ్డమైకాట్టుమ్, తమిళ్త్తలైవన్
పొన్నడిపోఱ్ఱుమిరామానుశఱ్కన్బుపూణ్డవర్ తాళ్
శెన్నియిల్శూడుమ్, తిరువుడైయా రెన్ఱుమ్శీరియరే.

టీక. మన్నియ - తొలగింపనశక్యమైస్థిరముగనున్న, పేర్ - గొప్పదైన, ఇరు ళ్ - అజ్ఞానముచీకటి, మాణ్డపిన్ - (మొదటియాళ్వారులిద్దరు వెలిగించినదీపములచే) ంచెమైననులేకనశించిన వెనుక, కోవలుళ్ - తిరుక్కోవలూరిలో, మామలరాళ్ త న్నొడుమ్ - పుష్పవాసినియగు శ్రీమహాలక్ష్మితోఁగూడ, ఆయనై - కృష్ణావతారమందా శ్రితులకు సులభుడైయున్న సర్వేశ్వరుని, కణ్డమై - ప్రత్యక్షముగ సేవించిన విధమును, కాట్టుమ్ - (దివ్యప్రబన్ధముచే) కనుపఱచిన, తమిళ్త్తలైవన్ - ద్రావిడమునకు మొదటి వారగుపేయాళ్వార్లయొక్క, పొన్ అడి - రమణీయమైనశ్రీపాదములను, పోఱ్ఱుమ్-స్తుతించునట్టిస్వభావముగల, ఇరామానుశఱ్కు - ఉడైయవరులవిషయమందు, అన్బు - ప్రేమమును, పూణ్డవర్ - భూషణముగధరించుకొన్నవారియొక్క, తాళ్ - శ్రీపాదము లు, శెన్నియిల్ - తమశిరస్సులందు, శూడుమ్ - ధరించునట్టి, తిరు - సంపత్తును, ఉడైయార్ - కలవారు, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, శీరియర్ - శ్రీమంతులు.

తా— తిరుక్కోవలూరిలో, మొదటియాళ్వారులిద్దరు వెలిగించిన జ్ఞానదీపములచే అజ్ఞానమనుచీకటియంతయును నశించిన వెనుక, సర్వేశ్వరుడు శ్రీమహాలక్ష్మీసమేతుడై ప్రసాదించినవిధమును "తిరుక్కణ్డేన్" అను దివ్యప్రబన్ధమూలమున సకలచేతనులకు ప్రకాశింపజేసిన, ద్రావిడపండితశ్రేష్ఠులగు పేయాళ్వార్లయొక్క తిరువడిగళను స్తుతించుచున్న యతిరాజులవారియందు ప్రావణ్యముగల మహాత్ములయొక్క శ్రీపాదములను ఆభరణముగ వలెతమశిరమున ప్రీతితోధరించువారు, ఎల్లప్పుడును సంపన్నులైయుందురని.

౧౧. శీరియనాన్మఱైచ్చెమ్బొరుళ్, శెన్దమిழாల్ళిత్త
పారియలుమ్పుగழ்ప్పాణ్పెరుమాళ్, శరణామ్బదుమ
త్తారియల్ శెన్నియిరామానుశన్తన్నై చ్చార్న్దవర్దమ్
కారియవణ్మై, ఎన్నాల్ శొల్లొణాదిక్కడలిడత్తే,

టీక, శీరియ - స్వరూపరూపగుణవిభూతులను తత్త్వముగ ప్రసాదించుటచే శ్లాఘ్యమైన, నాల్ మఱై - (ఋక్, యజు, స్సామ, అధర్వణములగు) నాలుగువేదములయొక్క, శెమ్ - రమణీయమైన, పొరుళ్ - విశేషార్థములను, శెమ్ - (సారాంశములను ప్రతిపాదించుటచే) సున్దరమైన, తమిழாల్ - ద్రావిడదివ్యప్రబన్ధముచే, అళిత్త - అనుగ్రహించినవారును, పార్ - భూమియందు, ఇయలుమ్ - వ్యాపించియున్న, పుగழ் - యశస్సు గలవారైన, పాణ్ పెరుమాళ్, - తిరుప్పాణాళ్వార్లయొక్క, చరణామ్ - తిరువడి నెడు, పదుమత్తార్ - తామరపుష్పములచే, ఇయల్ - అలఙ్కరింపబడిన, శెన్ని - శిరముగల, ఇరామానుశన్తన్నై - ఈ దైయవరులను, శార్న్దవర్తమ్ - ఆశ్రయించినవారియొక్క, కారియవణ్మై, వైలక్షణ్యము, ఇక్కడల్ - ఈసముద్రముచే జుట్టబడిన ఇడత్తు - భూమియందు, ఎన్నాల్ - నాచేత, శొల్లొణాదు - చెప్పిముగింపసాధ్యముగాదు.

(మఱియొకయర్థము) ఇక్కడలిడత్తే - ఇరామానుశన్తన్నై, చ్చార్న్దవర్ - అని యన్వయించి భగవన్తునియాశ్రయించుటకుగూడసమ్మతించువారులేని యీభూమియందు, భగవద్భక్తులగు యతిరాజులవారి నాశ్రయించిన మహాత్ములని, "కారియవణ్మై" అనిపాఠమైనపుడు, కార్ - మేఘముయొక్క, ఇయల్ - స్వభావముగల, వణ్మై - దాతృత్వముఅనియర్థము, మేఘముజలస్థలవిభాగమునుజూడక వర్షించినట్లు- మహాత్ములు గుణాగుణని రూపణముచేయక, సకలమైనవారికిని, యతిరాజులవారిదివ్యగుణములను పదేశింతురని).

తా—సకలవేదతాత్పర్యములను "అమలనాదిప్పిరాన్" అనెడు దివ్యప్రబన్ధముచే, సకలమైనవారికిని స్పష్టముగునట్లు ప్రసాదించిన జగత్ప్రసిద్ధమైన కల్యాణ

నములను కీర్తియునుగల తిరుప్పాణాళ్వార్ వారి శ్రీపాదారవిందములను శిరముతో వహించి యతిరాజులవారి నాశ్రయించిన భాగవతోత్తములయొక్క ప్రభావము, నాకు స్తోత్రము చేయనలవిగాదని,

౧౨. ఇడజ్గొణ్డకీర్త్తిమ్మళిశైక్కిఱైవన్, ఇణైయడిప్పో
దడజ్గుమిదయ త్తిరామానుశన్, అమ్ పొఱ్పాదమెన్ఱుమ్
కడజ్గొణ్డిఱైఞ్జుమ్ తిరుమునివర్క్కన్ఱిక్కాదల్ శెయ్యా.
త్తిడజ్గొణ్డఞానియర్క్కు, అడియేనన్బు శెయ్వదువే.

టీక. ఇడజ్గొణ్డ - భూమియందంతటను నిండిన, కీర్త్తి - గుణప్రసిద్ధిగల వారగు, మళిశైక్కు - తిరుమళిశైయ నెడు దివ్యస్థలమునకు, ఇఱైవన్ - నాథులగు తిరుమళిశై యాళ్వార్లయొక్క, ఇణై - చేరికచేసునదరమైన, అడిప్పోదు - శ్రీపాదారవిన్దములు, అడజ్గుమ్ - (మహత్తైనది) అణగియుండు, ఇదయత్తు - హృదయముగల, ఇరామానుశన్ - శ్రీ యెదిపసలయొక్క, అమ్ - విలక్షణమై, పొన్ - అందఱిచే నాశ్రయింపఁదగిన, పాదమ్ - శ్రీపాదమును, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, కడమ్కొణ్డు - ప్రాప్యమని యధ్యవసించి, ఇఱైఞ్జుమ్ - ఆశ్రయించడమనెడు, తిరు - సంపదగల, మునివర్క్కన్ఱి - (ఆవిషయమును) మననముచేయు స్వభావముగల మహనీయులకుదప్ప, కాదల్ శెయ్యా - స్నేహముసేయని, తిడమ్కొణ్డ - నిక్కలివృఢమైన యధ్యవసాయముగల, ఞానియర్క్కు - జ్ఞానవంతులకే, అడియేన్ - దాసుడను, అన్బు శెయ్వదు - ప్రేమముచేయునది

తా.— ఈ లోకమునందత్యన్త ప్రసిద్ధిఁజెందిన మహాప్రభావశాలులగు తిరుమళిశై యాళ్వార్లయొక్క పాదారవిన్దములయందు ప్రావణ్యముగల యతిరాజులవారియొక్క శ్రీచరణారవిన్దముల నాశ్రయించి తదితరములయందు ప్రేమలేక వానినేమననముచేయు చుండు దృఢాధ్యవసాయముగల జ్ఞానవంతులయందే దాసునికి ప్రేమగలిగి యుండునని.

౧౩. శెయ్యుమ్పశున్దుళబత్తొళిల్మాలైయుమ్, శెన్దమిళిల్
పెయ్యుమ్మఱైత్తమిళ్మాలైయుమ్, పేరాదశీరరజ్గ
త్తైయ్యన్కళల్క్కణియుమ్పరన్ఱాళన్ఱియాదరియా
మెయ్యన్ ఇరామానుశన్ శరణేకది వేఱెనక్కే.

టీక. శెయ్యుమ్ - (అతిశయించినతమచే జేయఁబడినదై, పశుమ్ - పచ్చనికాన్తిగల, తుళపమ్ - తులసిచేత, తొళిల్ - వరుసగాఁగూర్పఁబడిన, మాలైయుమ్ - తిరుమాలయును, శెమ్ - చక్కనైన (సర్వార్థప్రకాశకమైన) తమిళ్ - ద్రావిడభాషచే,

శెయ్యుమ్ - కలుగఁజేసిన, మఱై - వేదముఅనఁదగిన, తమిఴ్ మాలైయుమ్ - ద్రా పదములచేఁగూర్చఁబడిన దివ్యప్రబన్ధమునున్ను, పేరాద - నిత్యసిద్ధమైన, శీర్ - కళ్యా గుణములుగలవారై, అరఙ్గత్తు - శ్రీరంగమందు పరమబన్ధుత్వము దోచునట్లు శయ యుండు, అయ్యన్ - శ్రీరఙ్గనాథునియొక్క, కళలుక్కు - తిరువడిగళకు, అణియ సమర్పించువారై శేషత్వముయొక్క యెల్లయందునిలుచుటచే, పరన్ - శేషభూ శ్లాఘ్యులైన తొణ్డరడిప్పొడియాళ్వార్లయొక్క, తాళ్ అన్ఱి - శ్రీపాదములనుదప్ప రియా - మఱిదేనినియుపేక్షించని, మెయ్యన్ - సత్యశీలులైన, ఇరామానుశన్ - యవరులయొక్క, శరణే - తిరువడిగళే, ఎనక్కు - నాకు, వేఱుగది - శ్లాఘ్య ఉపాయోపేయములునై యున్నది

తా— మేలైన తిరుత్తుళాయిమాలికనున్న విశేషార్థములను ప్రతిపాదించు "తిరుమాలై, తిరుప్పళ్ళియెళుచ్చి" యనెడి సారతమములగు రెండు దివ్యప్రబన్ధము న్ను నిర్మించి శ్రీరఙ్గనాథుల పాదారవిందములందు సమర్పించిన భక్తాగ్రగణ్యులగు తొ ణ్డరడిప్పొడియాళ్వార్ల చరణారవిన్దములం దత్యన్తప్రావణ్యముగలిగి వేఱొకటిని చని సత్యవన్తులలో మొదటివారగు యతిరాజులవారి తిరువడిగళే మనకు సర్వ షార్థమని,

౧౪. కదిక్కుప్పదఱి, వెఙ్కానముఙ్కల్లుఙ్కడలుమెల్లామ్,
కొదిక్కత్తవఞ్జెయ్యుమ్కొళ్ గైయన్ఱే, కొల్లికావలన్ శొల్
పదిక్కుమ్కలైక్కవిపాడుమ్పెరియవర్ పాదఙ్గళే.
తుదిక్కుమ్పరమన్, ఇరామానుశనెన్నై చ్చోర్విలనే.

టీక. కొల్లికావలన్ - కొల్లినగరమని చెప్పఁబడు తిరువంజిక్కళమునకు లగు శ్రీకులశేఖరప్పెరుమాళ్ళు, కలైచ్చొల్ - (రత్నములను చెక్కినట్లు) శాస్త్ర ములను, పదిక్కుమ్ - ఇమిడ్చిన, కవి - దివ్యప్రబన్ధమును, పాడుమ్ - సకీర్త యుచున్న, పెరియవర్ - మహాత్ములయొక్క, పాదఙ్గళ్ - శ్రీపాదములను, తుదిక్కు మ్ - స్తుతించుచున్న, పరమన్ - శ్లాఘ్యులైన, ఇరామానుశన్ - ఉడైయవరు ఎన్నై - నన్ను, శోర్విలన్ - ఎడబాయకున్నారు, (కాఁబట్టి) కదిక్కు - శ్రే ర్థమునకు, పదఱి - త్వరపడి, వెమ్ - మిగులనుష్ణమైన, కానమున్ - అరణ్యము కల్లుమ్ - కొండయును, కడలుమ్ - సముద్రము మొదలగు, ఎల్లామ్ - వీనియం టను, (ఉండి) కొదిక్క - (దేహము) దహించునట్లు, తవమ్ - తపస్సును, శెయ్యు మ్ - చేయుచుండు, కొళ్గై - స్వభావమును, అన్ఱే - వదలితిని.

తా__కులశేఖరాళ్వార్లు సకలశాస్త్రసారాంశములను ద్రావిడభాషారూపమగు "పెరుమాళ్ తిరుమొఴి" యను దివ్యప్రబన్ధరూపముగఁ బ్రసాదించిన గ్రన్థమును అనుభవముచేసికొనుచున్న మహాత్ములను స్తోత్రముచేయుచుండు సర్వోత్కృష్టులగు ఎమ్పెరుమానార్లు నాహృదయము నెల్లప్పుడు నెడబాయకున్నారు, కాబట్టి పరమపదప్రాప్తికొఱకై, ఈశరీరమును కృశించునట్లనుష్ఠింపదగిన సాధనానుష్ఠానములతోఁ బనిలేదని పలికిరని.

(ప్రతియొకయర్థము - వెంగానముమ్కల్లుమ్ కడలుమెల్లామ్కొదిక్క - తమయు గ్రతపస్సును, వన, పర్వత, సముద్రములుఁ జూచి పరితపింపఁజేయునట్టి తపస్సును చేసినయని-కొల్లి కావలన్ శోల్ : పదిక్కుమ్ కలైక్కవి - కులశేఖరాళ్వార్ల శ్రీసూక్తిచే ఏర్పడినశాస్త్రమయప్రబన్ధమును గానము చేయుచున్న మహనీయులని)

౧౫. శోరాదకాదల్. పెరుఞ్జుఴిప్పాల్., తొల్లైమాలై యొన్ఱుమ్.
పారాదవనై.ప్పల్లాణ్డెన్ఱు.కాప్పిడుమ్, పాన్మైయన్ఱాళ్,
పేరాదవుళ్ళత్తిరామానుశన్ఱన్ పిఱఙ్గియశీర్,
శారామనిశరై.చ్చేరేన్, ఎనక్కెన్న తాఴ్వినియే.

టీక. శోరాద - వ్యభిచారములేని, లేక, సఙ్కోచింపని (సంపూర్ణమైన) కాదల్ - భక్తియనెడి ప్రవాహమందలి, పెరుమ్ - గొప్పదైన, శుఴిప్పాల్ - సుడిలోఁ జిక్కుకొనుటచే, తొల్లై - నిత్యుడై, మాలై - సర్వరక్షకుడగుటచే గలిగిన మహిమగల వానిని, ఒన్ఱుమ్ - కొంచెమైనను, పారాదు - విచారింపక, అవనై - ఆసర్వేశ్వరుని గూర్చి, పల్లాణ్డుఎన్ఱు - శాశ్వతముగనుందురుగాకయని, కాప్పిడుమ్ - మఙ్గళాశాసనము చేయుటయే, పాన్మైయన్ - తమకు స్వభావముగగల పెరియాళ్వార్లయొక్క, తాళ్ - శ్రీపాదములను, పేరాద - వదలని, ఉళ్ళత్తు - హృదయముగల, ఇరామానుశన్ఱన్ - ఎమ్పెరుమానారులయొక్క, పిఱఙ్గియ - మిక్కుటమైన, శీర్ - దివ్యగుణములను, శారా - తనకు రక్షకమనితలపని, మనిశరై - మనుష్యులను, శేరేన్ - చేరను, ఇని - ఈస్థితి కలిగినవెనుక, ఎనక్కు - నాకు, ఎన్నతాఴ్వు - కొదవ యేమియున్నది.

తా__పెరియాళ్వార్లు, పాణ్డ్యమహారాజసభలో, పరతత్త్వనిర్ణయము చేసినందుల కా రాజప్రభువు సంతుష్టాన్తరంగుడై వీరిని బహువిధముల సన్మానించి యేనుగుమీద వేంచేపుచేయించి గ్రామప్రదక్షిణ మహోత్సవంబు జరిపినపుడు, వీరినిఁ గటాక్షింపవలయు నను అత్యానన్దముతో శ్రీమహాలక్ష్మిసహితుడై సర్వేశ్వరుడు వీరియెదుట సేవసాదింపగ చూచి వానిసర్వరక్షకత్వాది కల్యాణగుణములయందు దృష్టితప్పి ప్రేమపరవశులై, అత్య

న్తసున్దరమగు వాని దివ్యమఙ్గళ విగ్రహాదులకు దృష్టిదోషము సంభవించునేమోయని
హించి, చిన్నలను పెద్దలాశీర్వదించునట్లు మఙ్గళాశాసనముచేసి, వానికి రక్షయిచ్చి
యాళ్వార్ల తిరువడిగళను తమహృదయమునం దెల్లప్పుడును ధ్యానము చేసికొను
ఉడైయవరులయొక్క దివ్యగుణానుభవంబులేని మనుష్యులతో నేను సహవసించ
కాబట్టి నాకిక నేకొఱతయునుగలుగ నేరదని,

పాశు ౧౮. తాழ్వొన్ఱిల్లామఱై తాழ్న్దు, తలముழుదుఙ్కలియే
ఆళ్గిన్ఱనాళ్ వన్దళి త్తవన్. కాణ్మిన్, అరఙ్గర్ మౌలి
శూழ్గిన్ఱమాలైయైచ్చూడిక్కొడుత్తవళ్ తొల్లరుళాల్
వాழ్గిన్ఱవళ్ళల్, ఇరామానుశన్ఎన్నుమ్మామునియే.

టీక. అరఙ్గర్ - శ్రీరఙ్గనాథులయొక్క, మౌలి - శిరమునందు, శూழ్గిన్ఱ
ర్పింపనున్న, మాలైయై - మాలికను, శూడి - తమతలలోనుంచుకొని, కొడుత్తవళ్
ఆశ్రీరఙ్గనాథునికిచ్చిన ఆణ్డాళుయొక్క, తొల్ - స్వాభావికమైన, అరుళాల్ - కృప
యొక్క యాధారముచే, వాழ్గిన్ఱ - సుఖించుచున్న, వళ్ళల్ - పరమోదారులై
మునియెన్నుమ్ - యతీశ్వరులకు రాజని ప్రసిద్ధినొందిన, ఇరామానుశన్ - ఎమ్బెరు
మానార్లు, ఒన్ఱు - తనయందొకవిధమైన, తాழ్వు - కొఱత, ఇల్లా - లేని, మఱై -
మైనది, తాழ్న్దు - ( బాహ్యకుదృష్ట్యాది మతస్థులచే ) వ్యాపకములేక తగ్గి, తలము
దుమ్ - భూమియందంతటను, కలియే - కలియుగాధిదేవతయే, ఆళ్గిన్ఱ - రాజ్యము
చేయుచున్న, నాళ్ - కాలమందు, వన్దు - నిర్హేతుక కృపతోనచ్చి యవతరించి,
త్తవన్ - పరిపాలించినవారు, కాణ్మిన్ - చూడుడు.

తా—ఆండాళు తనకొప్పున ముడుచుకొన్న పుష్పమాలికను, శ్రీరఙ్గనాథు
అత్యన్తప్రియముగ ధరించుకొనునంతటి మహిమాతిశయముగలిగి, వారికి పరమప్రి
యినియగు, ఆండాళమ్మగారియొక్క స్వతస్సిద్ధమైన పరమకృపచే వృద్ధిబొందుచు
యతిరాజులవారు, అపౌరుషేయమును స్వతఃప్రమాణమును, భ్రమాదిదోషరహితము
సర్వోత్కృష్టమునై ప్రకాశించుచుండు వేదమైనది, బాహ్యకుదృష్ట్యాది పాషండు
లను కలిదోషముచేతను తిరస్కరింపఁబడి చెడఁగొట్టఁబడిన సమయమున, అట్టి మతస్థు
సంపతిని నానావిధముల నిరసించి వేదమార్గమును లోకమందంతట ప్రతిష్ఠింపఁజేసి స
చేతనులను తమ నిర్హేతుక కృపచే సంరక్షించిరి, కాఁబట్టి, లోకులారా! అట్టి
మహోపకారకులనాశ్రయింపుడని.

౧౭ - పా. అవ - ఇట్లు ఎమ్బెరుమానార్లు చేసిన మహోపకారములను
వారి నాశ్రయింప రుచిగలవారిని, పూర్వజన్మములయందుఁ జేసిన పుణ్య పాపముల

గలుగు సుఖదుఃఖములు బాధింపవోయనిన; తిరుమఙ్గైయాళ్వార్లయందు పాణివణ్యముగల వారై, మాకు నాథులైయుండు యతిరాజులవారి నాశ్రయించిన మహనీయులు ఆసుఖ దుఃఖములకు చలింపరు; అనుచున్నారు

౧౭. మునియార్. తుయరఙ్గళ్. ముఙ్దిలుమ్, ఇన్బఙ్గళ్. మొయ్ త్తిడినుమ్
కనియార్. మనమ్. కణ్ణమఙ్గైనిన్ఱానై, క్కలై పరవుమ్.
తనియానై రైత్తణ్డమిళ్. శెయ్దనీలన్. తనక్కుఽగిల్
ఇనియానై, యెఙ్గళిరామానుశనై. వన్దెయ్దినరే.

టీక. కలై - సకలశాస్త్రముల చేతను, పరవుమ్ - స్తుతింపఁబడువాడును, తని - అద్వితీయమైన, ఆనైయై - మదగజమువంటి గంభీరస్వభావముగలవాడును, కణ్ణమఙ్గై - తిరుక్కణ్ణమంగైయనెడు దివ్యదేశమందు, నిన్ఱానై - నిలిచియుండు రూపముగ సేవసాదించువానిని, తణ్ - చల్లనైన (ప్రతిపాదించునట్టి యర్థగౌరవముచే సకల తాపములను హరించుచున్న), తమిళ్ - ద్రావిడ దివ్యప్రబన్ధమును, శెయ్ద - చేసిన, నీలన్ తనక్కు - తిరుమంగైయాళ్వార్లకు, ఉలగిల్ - జగత్తునందు, ఇనియానై - ఇష్టులై యుండువారు ను, ఎఙ్గళ్ - మాకు నాథులైన, ఇరామానుశనై - ఎంబెరుమానారులను, వన్దు - వచ్చి, ఎయ్దినర్ - పొందినవారు, తుయరఙ్గళ్ - దుఃఖములైనవి, ముఙ్దిలుమ్ - పైఁగొనివచ్చినను, మునియార్ - ఇట్లువచ్చినదేయని విసుకును జెందరు, ఇన్బఙ్గళ్ - సుఖములైనవి, మొయ్త్తిడినుమ్ - పరిపూర్ణముగఁగూడివచ్చినను, మనమ్ కనియార్ - అతిశయముగ సంతోషింపరు.

తా—సకలశాస్త్ర ప్రతిపాద్యుడును, మిగుల గమ్భీర స్వభావము గలవాడును, ఆశ్రితులందు వాత్సల్యముగలవాడగుటచే, భక్తవత్సలుడను తిరునామమునుఁబొంది తిరుక్కణ్ణమఙ్గలో సేవసాదించుచున్న సర్వేశ్వరునియొక్క కల్యాణగుణములను విశదముగ ప్రతిపాదించుచున్నట్టి తిరుమొళి మొదలగు దివ్యప్రబన్ధములను, సకలచేతను లుజ్జీవించుటకు ప్రసాదించి యుపకరించిన తిరుమంగైయాళ్వార్లయందు, అత్యన్త పాణివణ్యము గలిగియుండు ఎమ్బెరుమానార్ల నాశ్రయించిన మహనీయులు ఎంతటి సుఖ దుఃఖములు సంభవించినను మనశ్చాంచల్యమునొందక యత్యన్త గంభీరస్వభావముగలవారగుదురని.

౧౮. ఎయ్దఱ్కరియమఱైగళై, ఆయిరమిన్దమిழాల్
శెయ్దఱ్కులగిల్ వరుమ్ శడకోపనై, చ్చిన్దైయుళ్ళే

పెయ్‌దక్కొణ్ణైయుమ్ పెరియవర్ శీరై యుయిర్‌గళెల్లామ్
ఉయ్‌దఱ్కుదవుమ్, ఇరామానుశనెమ్ముఱుదుణైయే.

టీక. ఎయ్‌దఱ్కు - లభించుటకు ( అర్థము దెలిసికొనుటకు ) అరియ - కష్ట
ముగాని, మఱైకళై - వేదములను, ఆయిరమ్ - వేయిపాశురములుగ, ఇన్ - రస
ముండునట్లు, తమిళాల్ - ద్రావిడభాషచే, శెయ్‌దఱ్కు - చేసి యుపకరించుట
ఉలగిల్ - లోకమందు, వరుమ్ - వచ్చి యవతరించిన, శఠకోపనై - నమ్మాళ్వార్ల
శిన్దైయుళ్ళే - హృదయమందు, పెయ్‌దఱ్కు - (పరదేవతగ) ఉంచుటకు, ఇశైంద
మ్ - సమ్మతించిన, పెరియవర్ - మిగుల పూజనీయులగు మధురకవులయొక్క, శీరై
జ్ఞానభక్త్యాదిగుణములను, ఉయిర్‌గళెల్లామ్ - సకలాత్మలును, ఉయ్‌దఱ్కు - క
రుటకై, ఉదవుమ్ - (ఉపదేశించి) యుపకరించుచుండు, ఇరామానుశన్ - ఎమ్బె
రుమానార్లు, ఎమ్ - నాకు, ఉఱుతుణై - దృఢమైనసహాయము,

తా—అనన్తములై, అతిశయించిన జ్ఞానముగలవారికిని దెలిసికొన శక్యముగా
నివై, అందఱికి నుపయోగపడక, విప్రక్షత్రియ వైశ్యులగు త్రైవర్ణిక వ్యవస్థగలవా
మాత్ర ముపయోగపడునట్టి సంస్కృత వేదములయొక్క సారాంశములను, వర్ణనియ
ములేక రుచిగలవారందఱును అధ్యయనము చేయుట కనుగుణముగ ద్రావిడభాషలో
భముగనుండునట్లు వేయిపాశురములుగ ప్రసాదించి సకలచేతనుల నుజ్జీవింపఁ జేయుట
యీలోకమందవతరించి యితరమతముల నిరసించి వైదికమార్గమును ప్రతిష్ఠింపఁజేసి
జ్ఞానస్వరూపులగు నమ్మాళ్వార్లనే తమకునుత్కృష్టదైవముగ నధ్యవసించియుండు శ్రీ
ధురకవులయొక్క జ్ఞానభక్తివైరాగ్యాదిదివ్యగుణములను సకలచేతనులకునుపదేశించియు
వింపఁజేయుచున్న యెమ్బెరుమానార్లే నాకు సకలవిధసహాయ భూతులైయున్నారని.

౧౯. ఉఱుపెరుఞ్జెల్వముమ్ తన్దైయుమ్ తాయుమ్, ఉయర్‌కురువుమ్
వెఱిదరుపూమగళ్ నాదనుమ్, మారన్ విళఙ్గియశీర్
నెఱిదరుఞ్జెన్దమిళ్ ఆరణమే యెన్ఱిన్నీణిలత్తోర్
అఱిదరనిన్ఱ, విరామానుశనెనక్కారముదే.

టీక. ఉఱు - ప్రాప్యప్రాపకములునై యుండుటచే శ్లాఘ్యమై, పెరుమ్ - నిరవధి
మైన, శెల్వముమ్ - సంపత్తును, తన్దైయుమ్ - తండ్రియును, తాయుమ్ - తల్లియును
ఉయర్ గురువుమ్ - ( ఆత్మోజ్జీవనకరములగు నర్థముల నుపదేశించిన ) యాచార్యులును
వెఱిదరు - పరిమళించుచుండు, పూ - తామరపుష్పమునందవతరించిన, మగళ్ - శ్రీ

ప్రాప్తికి, నాదనుమ్ - నాథుడగు శ్రీసర్వేశ్వరుడును, మాఱన్ - నమ్మాళ్వార్లు, విళక్కియ - (భగవదనుగ్రహముచే తమకు) ప్రకాశించిన, శీర్ - పరభక్త్యాది స్వభావములను, నెఱి - క్రమముగ, తరుమ్ - ఉపకరించి కృపచేసిన, శెమ్ - చక్కనైన, తమిళ్ ఆరణమే - ద్రావిడ వేదమైన తిరువాయ్మొళియేయని, ఇన్నిలత్తోర్ - ఈమహత్తైనభూమియందుండువారు, అఱితరనిన్ఱ - తెలియునట్లున్న, ఇరామానుశన్ - ఎమ్బెరుమానార్లు, ఎనక్కు - నాకు, ఆరముదు - నిరతిశయ భోగ్యులు.

తా—లోకమునందు - ఇహలోకమునకు మాత్రము నుపయోగపడు ధనము, విద్యయునుగలవారికి ఎంతోమహిమగలిగియున్నది, ఇక, ఇహపరములు రెంటికి సాధకమగు తిరువాయ్మొళియొక్క మహిమను జెప్పశక్యముగాదు గనుక, (ఇహలోక పరలోకైశ్వర్యములును, సర్వవిధబన్ధువులును, ఆత్మనాథుడగు శ్రియఃపతియును,) నమ్మాళ్వార్లు తమకు భగవన్నిర్హేతుక కృపచే స్ఫురించినయర్థ విశేషములను సక్రమముగ ప్రసాదించిన ద్రవిడోపనిషత్తగు తిరువాయ్మొళియే, అని సకలచేతనుల కుపదేశించుచును ఎమ్బెరుమానార్లు నాకు యెంత యనుభవించినను తృప్తిగలుగని యమృతమై యున్నారని.

౩౦. ఆరప్పొళిల్ తెన్గురుగైప్పిరాన్, అముదత్తిరువాయ్
ఈరత్తమిళిన్ ఇశైయుణర్న్దోర్గట్కు, ఇనియవర్ దమ్
శీరై ప్పయిన్ఱుయ్యుమ్ శీలఙ్గొళ్ నాదమునియై నెఞ్జాల్
వారిప్పరుగుమ్, ఇరామానుశనెన్దన్ మానిదియే.

టీక. ఆరమ్ - చన్దనపుచెట్లయొక్క, పొళిల్ - తోటలుగలదై, తెన్ - చూడుటకు రమ్యమై, కురుగై - తిరునగరికి, పిరాన్ - స్వామియగు నమ్మాళ్వార్లయొక్క, అముదమ్ - (అమృతమువలె) పరమభోగ్యమైన, తిరు - దివ్యమైన, వాయ్ - వాక్కున బుట్టిన, ఈరమ్ - మెత్తనిదైన, (వినుటకు జదువుటకింపైన,) తమిళిన్ - ద్రవిడమగు తిరువాయ్మొళియొక్క, ఇశై - లఘుత్వ గురుత్వాదులు స్పష్టముగ బొందియుండుటను, (స్వరమును) ఉణర్న్దోర్గట్కు - తెలిసినవారికి, ఇనియవర్ దమ్ - ఇష్టులైనవారియొక్క, శీరై - గుణములను, పయిన్ఱు - అనుసన్ధించి, ఉయ్యుమ్ - ఉజ్జీవించెడు, శీలంగొళ్ - స్వభావముగలవారగు, నాదమునియై - శ్రీమన్నాథమునులను, నెఞ్జాల్ - తమ మనస్సుచే, వారి - వారితో చేర్చియెత్తి, పరుగుమ్ - పానముచేయుచుండు, (అనుభవించుచుండు) ఇరామానుశన్ - ఎమ్బెరుమానార్లు, ఎన్దన్ - నాకు, మా - మహత్తైన, నిది - నిక్షేపమువంటివారు.

తా—చన్దనవృక్షపు తోటలచే మనోజ్ఞమైన తిరునెల్వేలికి సమీపముననుండు తిరునగరికి నాథులై మనకు మహోపకారకులునగు నమ్మాళ్వార్లు ప్రసాదించినదియును,

వినునట్టి చదువునట్టివారి సకలతాపములను బోగొట్టునట్టి శైత్యమాధుర్యములుగ
వాయ్మొళిని యర్థముతో నభ్యసించిన, శ్రీమధురకవులు తిరుమంగైయాళ్వార్లు
లగు మహాత్ముల కల్యాణగుణములననుభవించుచుండు శ్రీమన్నాథమునులయొక్క
ణానుభవము నెల్లప్పుడును గలిగియుండు ఎమ్బెరుమానార్లే మన కొకనాడును
పరమధనమైయున్న వారని.

౨౧. నిదియైప్పొழியుమ్ముగిలెన్ఱు, నీశర్దమ్వాశల్పఱ్ఱి
త్తుదిగఱ్ఱులగిల్తువళ్గిన్ఱిలేన్, ఇనిత్తూయ్నెఱిశేర్
ఎదిగట్కిఱైవన్యమునైత్తుఱైవన్, ఇణైయడియామ్
కదిపెఱ్ఱుడైయ, విరామానుశన్ఎన్నైక్కాత్తననే.

టీక. తూయ్ - పరిశుద్ధమైన, నెఱి- (సాధనముతో) అనుష్ఠానములో, శేర్
కూడియున్న, ఎదిగట్కు - సన్యాసులకు, ఇఱైవన్ - నాథులగు, యమునైత్తుఱైవ
ఆళవన్దార్లయొక్క, ఇణై-కూడియున్న, అడియామ్ - శ్రీపాదములగు, కది - ప్రా
ర్థమును, పెఱ్ఱుడైయ - లభించియున్న, ఇరామానుశన్ - ఎమ్బెరుమానార్లు ఎన్నై
నన్ను, కాత్తనన్-కృపచేసిరక్షించిరి, ఇని-ఇక, నిదియై-నిక్షేపములను, పొழియుమ్
వర్షించుచుండు, ముగిల్ఎన్ఱు - మేఘముఅని, (వారియౌదార్యమును జెప్పుటకు
తుదికఱ్ఱు - స్తోత్రములను నేర్చుకొని, ఉలగిల్-లోకమందు, నీశర్దమ్-(అహం
రాదులచే) నీచులగువారియొక్క, వాశల్ - ద్వారమును, పఱ్ఱి - ఆశ్రయించి (
సమయమును గనిపెట్టవలసిన) తువళ్గిన్ఱిలేన్ - శ్రమపడవలసినవాడనుగాను.

తా— పరిశుద్ధానుష్ఠానముగల యతీశ్వరులకు నాథులగు శ్రీయాళవన్దార్లయొక్క
పాదారవిన్దములనే ఉత్తమపురుషార్థముగ నాశ్రయించిన ఎమ్బెరుమానార్లు, నాకు స
విధ రక్షకులైరిగనుక, ఇకమీదు, ఐశ్వర్యముచే, దురహంకారగ్రస్తులై జ్ఞానశూన్యు
యుండు క్షుద్రప్రభువులద్వారములందు వారిదర్శన సమయములను ఎదురు చూచు
సందర్భించినపుడు వారిని ఇట్టివారు అట్టివారుఅని స్తోత్రము చేయుచుఁబడి యు
దగిన దీనత్వమును బొందుట కిష్టపడను అని

౨౨. కార్త్తిగైయానుమ్కరిముగత్తానుమ్, కనలుమ్ముక్కణ్
మూర్త్తియుమ్మోడియుమ్వెప్పుమ్ముదుగిట్టు,మూవులగుమ్
పూత్తవనేయెన్ఱుపోఱ్ఱిడవాణన్పిழைపొఱుత్త
తీర్త్తనైయేత్తుమ్, ఇరామానుశనెన్ఱన్ శేమవైప్పే.

టీక. కార్తిగైయానుమ్ - రుద్రునికి పుత్రుడై కృత్తికానక్షత్రమందు జలములో పుట్టిన సుబ్రహ్మణ్యుడును, కరిముగత్తానుమ్ - గజముఖుడగు వినాయకుఁడును, కనలుమ్- అగ్నియును, ముక్కణ్ మూర్తియుమ్ - త్రినేత్రుఁడగు రుద్రుఁడును, మోడియుమ్ - దుర్గయును, వెప్పుమ్ - జ్వరాధిదేవతయును, ముదుగిట్టు - (ముఖము త్రిప్పుకొని) వీపును చూపి (పరుగెత్తుచు) (సర్వేశ్వరుడని తెలిసిన వెనుక) మూవులగుమ్ - మూడు లోకములను పూత్తవనే - బొడ్డునందలి తామరపుష్పమందుండి కలుగఁజేసినవాడవా! ఎన్ఱు - అని, పోఱ్ఱిడ - స్తోత్రముచేయగా, వాణన్ - బాణాసురునియొక్క, పిழై - నేరమును, పొఱుత్త - క్షమించిన, తీర్తనై - గుణశుద్ధిగల సర్వేశ్వరుని, ఏత్తుమ్ - స్తోత్రముచేయుచున్న, ఇరామానుశన్ - ఉడైయవరులు, ఎన్ఱన్-నాకు, శేమమ్ - ఆపదలేనివిధముగ గాపాడియుంచుకొన్న, వైప్పు - నిక్షేపము.

తా—ప్రహ్లాదునికి మనమడును, మహాబలిచక్రవర్తికి పుత్రుఁడునగు బాణాసురుడు శివునిగూర్చి ఘోరతపస్సుచేసి యాతని స్వాధీనపఱచుకొని నీవు నాద్వారమందుండి నాకు సర్వలోక జయముగలుగునట్లు చేయుచుండవలయునని ప్రార్థించిన రుద్రుడును ఆప్రకారముగనే భార్యాపుత్రాదులతోఁగూడవచ్చి నీతలలో పుష్పము వాడకుండునట్లు నిన్ను గాపాడెదనని ప్రతిజ్ఞచేసి వానిద్వారమందుండెను. బాణాసురుని పుత్రికయగు ఉష, అత్యన్త సౌన్దర్యవస్తురాలైయుండును. తండ్రి దానికి క్రీడార్థముగ నొక మేడను గట్టించి యీయగ, అదియు నచ్చట బహుపరిచారకలతోఁ గూడివిహరించుచుండి, తనకు వివాహకాలముగలుగగ మాయాజన్మముగల నొక చెలికత్తెను బిలిచి, భూలోకమందుండు రాజపుత్రుల సందతిని నొక చిత్రపటములో వ్రాసికొని రావలయునని చెప్పెను, ఆచెలికత్తెయు నవ్విధముగ వ్రాసి తెచ్చిచూపగ, ద్వారకానగరవాసియై శ్రీకృష్ణునికి మనమడును ప్రద్యుమ్నుని కొమారుడునగు అనిరుద్ధునిజూచి యాతనినే వరింపవలయునని యత్యన్తవ్యామోహముచే ఆచెలికత్తెను ప్రార్థింపగ నదియు మాయావియగుటచే నచ్చటివారిని వంచించి, అనిరుద్ధుని దెచ్చి యా మేడయందుంచెను, ఉషయును గాన్ధర్వవివాహముచే ననిరుద్ధుని వరించెను. బాణాసురుడాసంగతి దెలిసి యనిరుద్ధునిబట్టి చెఱసాలయందుంచెను. ఈవృత్తాన్తమును శ్రీకృష్ణుడువిని బాణాసురునిపై కోపముగలిగి సపరివారముతో దండెత్తిరాగ బాణాసురుని ద్వారమందున్న; రుద్రుఁడు తన పుత్రులగు సుబ్రహ్మణ్యుడు విఘ్నేశ్వరుడు, మఱియును, అగ్ని, దుర్గ, జ్వరాధిదేవత మొదలగు వారిని సహాయముగనుంచుకొని శ్రీకృష్ణునితోఁ బోరాడి యపజయమునొంది తనసేనతో రుద్రుడు వీపుచూపి యాదెబ్బలకు భయపడి పఱుగెత్తి యప్పుడు శ్రీకృష్ణుని మహిమను గుర్తెఱిగి సకల జగత్కారణభూతుడైన వాడవా! అని స్తోత్రముచేసి బాణాసురుని సంహరింపక రక్షింపవలయునని ప్రార్థింపగా నపుడు శ్రీకృష్ణుడు క్షమించి బాణాసురుని ప్రాణముఁ

తో వదలెను. (ఈవృత్తాన్తము భాగవతహరివంశాదిగ్రన్థములలోఁ జెప్పఁబడియున్న ప్రసిద్ధమేగదా) అట్టి పతితపావనుడును సమస్తకల్యాణగుణాత్మకుడును శ్రీకృష్ణరూపి సర్వేశ్వరుని ఎల్లప్పుడు స్తోత్రముచేయుచుండు ఎంబెరుమానారులే, నాయాపత్కాల మునకుఉపయోగ మగు పరమధనమని.

౨౩. వైప్పాయవాన్పొరుళెన్ఱు, నల్లన్బర్ మనత్తగత్తే
ఎప్పోదుమ్ వైక్కుమ్ ఇరామానుశనై, యిరునిలత్తిల్
ఒప్పారిలాదవుఱువినై యేన్ వఞ్జనెఞ్జిల్ వైత్తు
ముప్పోదుమ్ వాఴ్త్తువన్, ఎన్నామిదువవన్ మొయ్ప్పుగఴ్క్కే.

టీక. వైప్పాయ - (అపద్రక్షకముగ) ఉంచఁబడిన, వాన్ - అతిశయమైన, పొరుళెన్ఱు - ధనమని, నల్ - దోషములేనివారగు, అన్బర్ - ప్రేమగలవారు, (భక్తులు) మనత్తకత్తే - (తమ) మనస్సునందు, ఎప్పోదుమ్ - ఎల్లప్పుడును, వైక్కుమ్ - ఉంచఁ గిన విషయమైన, ఇరామానుశనై - ఎంబెరుమానార్లను, ఇరునిలత్తిల్ - మహత్తైన భూలోకమందు, ఒప్పార్ - పాపాత్ములలోఁ సమానులు, ఇలాద - లేకుండునట్లు, ఉఱు వినైయేన్ - పాపిష్ఠుడను నేను, (ఉఱువినైయేన్ - అని పాఠమైనయెడల, పొందియున్న పాపముగలనేను) అనియర్థము, వఞ్జమ్ - కపటమగు, నెఞ్జిల్ - మనస్సునందు, వైత్తు ఉంచి, ముప్పోదుమ్ - ఉదయ మధ్యాహ్న సాయఙ్కాలములందును, వాఴ్త్తువన్ - పొగడుచున్నాను, ఇదు - ఇట్లు పొగడుట, అవన్ - ఆవుడైయవరులయొక్క, మొయ్ - అందమైన, (ఇంతయని చెప్పశక్యముగాని) పుగఴ్క్కు - యశస్సునకు, (కీర్తి మునకు) ఎన్నామ్ - ఏమియగునో. (కొదవగలునోయని)

తా — అత్యన్తపరిశుద్ధులగు మహాత్ములు, మిక్కిలి ప్రావీణ్యముతో, ఉడైయవరు లను పరమధనముగ తమ హృదయమునందుంచుకొన్న విషయమును, పాపిష్ఠుడగు నేను నీచమైననాహృదయమందుంచి స్తోత్రము చేయుచున్నాను, ఇట్లుసాహసించిననాయపరిశుద్ధ మైన హృదయమందుంచుటచేవారిదివ్యకల్యాణగుణములకెట్టియవమానముగలుగునోయని.

౨౮. మొయ్త్తవెన్దీవినైయాల్ పల్లుడల్ దోఱుమ్ మూత్తు, అదనాల్
ఎయ్త్తొఴిన్దేన్ మున్ నాళ్ గళెల్లామ్, ఇన్ఱుకణ్డుయర్న్దేన్
పొయ్త్తవమ్ పోఱ్ఱుమ్ పులైచ్చమయఙ్గళ్ నిలత్తవియ
కైత్త మెయ్ఞానత్తు, ఇరామానుశనెన్నుమ్ కార్ దన్నైయే.

టీక,— మెయ్ త్త - (లంకలోరాక్షసస్త్రీలు సీతాదేవినిచుట్టుకొనియున్నట్లు) యాత్మనక్రమ్ముకొనియుండు, వెమ్ తీ - మిగులక్రూరమైన, వినైయాల్ - కర్మముచే, ల్ - అనేకములైన, ఉడల్ తోఱుమ్ - ఒక్కొక్కదేహములోను, మూత్తు - ముసలితనమువచ్చువరకువసించి, అదనాల్ - దానిచే, ముననాళ్గళెల్లామ్ - అనాదియగుకాలమంతయును, ఎయ్ త్తొழిన్దేన్ - కృశించిపోతిని, పొయ్- (రావణసన్యాసమువంటి) అసత్యములైన, తవమ్ - తపస్సులను, పోఱ్ఱుమ్ - కాపాడుకొనుచుండు, (చేయుచుండు) పులైచ్చమయఙ్గళై - నీచములగుమతములను, నిలత్తు - ఈభూమియందు, అవియనాశమగునట్లు, కైత్త-మిడతలనునశింపఁజేసినట్లుచేసిన, మెయ్ఙ్ఞానత్తు-వాస్తవజ్ఞానముగల, ఇరామానుశన్ ఎన్నుమ్ - ఎమ్బెరుమానార్లనెడు, కార్ తన్నై-మేఘమువంటి ఔదార్యముగలవారిని, ఇన్ఱు-ఇప్పుడు, కణ్డు - గుర్తెఱిగి, ఉయర్ న్దేన్-శ్లాఘ్యుడనైతిని.

తా.— నేను పూర్వకాలమంతయును మిగుల క్రూరకర్మములచే అనేకజన్మములయెత్తుచు నానావిధ దుఃఖములననుభవించుచు మిగుల శ్రమపడుచుంటిని, ఇప్పుడు, రావణసన్యాసము కాలనేమి జపములవంటి తపస్సులనుజేయుచుండు మాయావాదబౌద్ధాది పరమతస్థులనునిరసించి వేదమార్గప్రతిష్ఠాపనంబొనర్చి జలస్థలవిభాగములేక వర్షించునట్టి మేఘమువలె ఉదారస్వభావముతో లోకులనందఱినిరక్షించిన స్వరూపయాథాత్మ్యజ్ఞానముగల ఎమ్బెరుమానార్లు, నన్నంగీకరించుటచే నేను ఉత్కృష్టుడను ఆయితినని.

౬౧. కారేయ్కరుణైయిరామానుశ, ఇక్కడలిడత్తిల్
ఆరేయఱిబవర్ నిన్నరుళిన్ఱన్మై, అల్లలుక్కు
నేరేయుఱైవిడమ్ నాన్ వన్దునీయెన్నైయుయ్ త్తపిన్ ఉన్
శీరేయుయిర్క్కుయిరాయ్, అడియేఱ్కిన్ఱుతిత్తిక్కుమే.

టీక,— కార్ - (జలస్థలవిభాగములేక వర్షించునట్టి) మేఘముతో, ఏయ్-సమానము (ఉపకరించునట్టి) కరుణై - కృపగల, ఇరామానుశ-ఓయతిరాజా!, అల్లలుక్కు-దుఃఖమునకు, నేరే - ప్రత్యక్షముగ, ఉఱైవిడమ్ - వాసభూమియైయున్న, నాన్ - నేను, ఎన్నై - (ఇట్లుండు) నన్ను, నీవన్దు - దేవరవారేవచ్చి, ఉయ్ త్తపిన్ - (కృపచే) రక్షించినవెనుక, ఉన్ - దేవరవారియొక్క, శీరే-కల్యాణగుణములే, ఉయిర్క్కు-ఆత్మకు, ఉయిరాయ్ - ధారకమై, అడియేఱ్కు-దాసుడైననాకు, ఇన్ఱు-ఇపుడు, తిత్తిక్కుమ్ - మధురమైయుండును, నిన్ - దేవరవారియొక్క, అరుళిన్ - కరుణయొక్క, తన్మై - స్వభావమును, ఇక్కడల్ - ఈసముద్రముచే నావరింపఁబడిన, ఇడత్తు - భూలోకమునందు, ఆర్ - ఎవరు, అఱిపవర్ - గుర్తెఱుగుదురు.

తా.— చేతనుల పుణ్యపాపములను విమర్శింపక ఉదారస్వభావముతో వర్షించునట్టి మేఘమువలె సకలచేతనుల గుణదోషములయందు దృష్టియుంచక నిర్హేతుకకృపా కటాక్షముచే రక్షించుచున్న, ఓయతిరాజా! ఆత్యన్తదుఃఖమునకు పాత్రుడగునన్ను దేవరవారి పరమకృపచే దాసునిగ ననుగ్రహించుటవలన సకలదోషములునివర్తించినవి, ఇప్పుడు దేవరవారియొక్క దివ్యకల్యాణగుణములే దాసునికి ధారకపోషక భోగ్యములై యున్నవి, ఇట్టి దేవరవారియొక్క నిర్హేతుక కృపాతిశయమును, ఈలోకమునందు పొందుగువారు మిగుల దుర్లభులని.

౨౯. తిక్కుఱ్ఱ కీర్త్తియిరామానుశనై, ఎన్ శెయ్ వినైయామ్
మెయ్ క్కుత్త్రమ్ నీక్కివిళజ్గియమేగత్తై, మేవుమ్ నల్లోర్
ఎక్కుత్త్రవాళర్ ఎదుపిఱప్పేదియల్వాగనిన్ఱోర్
అక్కుత్త్రమప్పిఱప్పు, అవ్వియల్వేనన్నైయాట్కొళ్ళుమే.

టీక.— ఎన్ - నాచే, శెయ్ - చేయఁబడిన, వినైయామ్ - పాపములనెడి మెయ్ - స్థిరమైనిలిచిన, కుత్త్రమ్ - దోషమును, నీక్కి - తొలఁగఁజేసి, విళజ్గియ - ప్రకాశించుచున్న, మేగత్తై - (ఔదార్యమందు) మేఘమగునట్టివారును, తిక్కు - దిక్కులందు, ఉఱ్ఱ - నిండియున్న, కీర్త్తి - యశస్సుగలవారైన, ఇరామానుశనై - ఉడైయవరులను, మేవుమ్ - ప్రాప్యముగపొందియుండు, నల్లోర్ - పరమవిలక్షణులగువారు, ఎక్కుత్త్రవాళర్ - ఎట్టిదోషముగలవారుగను, ఎదుపిఱప్పు - ఏతక్కువజన్మముగల వారుగను- ఏదుఇయల్వాక - ఏనడవడికగలవారుగను, నిన్ఱోర్ - (సమాశ్రయణమునకు ముందు) ఉండిరో, అక్కుత్త్రమ్ - ఆదోషమును, అప్పిఱప్పుమ్-ఆతక్కువజన్మము, అవ్వియల్వే - ఆతక్కువనడవడియే, నన్నై - మనలను, ఆట్కొళ్ళుమ్ - (అనుసన్ధింపఁబడినది) స్వాధీనపఱచుకొనును.

తా.— ఉడైయవరులు, పరమ కృపాస్వరూపులగుటచే, నాయందుదృఢముగ నెలగొనియున్న ప్రబలపాపములనుబోగొట్టి స్వరూపజ్ఞునిగఁజేసి, ఒకచేతనుడుద్ధరింపఁ బడాయెనని యానన్దించుచు, ఈవిధముననే సకలచేతనుల దుఃఖములనుజూచి యోర్వలేక వారిపాపములనుబోగొట్టి పరిశుద్ధులనుగావించుమందు వాత్సల్యసౌశీల్యసౌలభ్యాది అనన్తకల్యాణగుణములచే లోకమందంతట వ్యాపించిన మహావైభవముతోఁ బ్రకాశించుచున్న యెమ్బెరుమానారులను ఆశ్రయించియున్న మహానుభావులు, దోషము, జన్మము, ఆచారము, మొదలగువానిచే ఆశ్రయించుటకుమునుపు తక్కువవైనవారైయున్నను, అట్టివారి దోషకులాదులే,మనలనుజ్జీవింపఁజేయుటకు సమర్థములైయున్నవి

ష్టస్పర్శాదులచే నెంతనీచులైనను యతిరాజులవారి నాశ్రయించినయెడల జ్ఞానవన్తులై ముక్తిబొందనగునని.

౭౭. కొళ్ళక్కుఱైవఱ్ఱిలఙ్గి, క్కొడియుమ్బడివిట్టోఙ్గియవున్
వళ్ళల్తనత్తినాల్ వల్వినైయేన్ మనమ్నీపుగున్దాయ్,
వెళ్ళైచ్చుడర్విడుమున్ పెరుమేన్మైక్కిళుక్కిదెన్ఱు,
తళ్ళుత్తిరఙ్గుమ్, ఇరామానుశ వెన్ తనినెఞ్జమే.

టీక,– ఇరామానుశా - ఉడైయవరే! కొళ్ల - కోరినవారు కోరినదంతయును క్షపదగినట్లు, కుఱైవు - ఒకకొదనయు, అఱ్ఱు - లేనిదై, ఇలఙ్గి - (ఇచ్చునట్లులభిం చి)ప్రకాశించునదియై, కొడియుమ్బడివిట్టు - పైపైగదిగిరించి, ఓఙ్గియ - వృద్ధిబొందుచు న్న, ఉన్ - దేవరవారియొక్క, వళ్ళల్తనత్తినాల్ - ఉదారస్వభావముచే, వల్ - క్రూరమైన, వినైయేన్ - పాపాత్ముడగు నాయొక్క, మనమ్-హృదయమందు, నీ-మీరు, పుగున్దాయ్ - దేవరవారిమహిమనుదలపక (వసిష్ఠుడు చణ్డాలశ్రేణిలో ప్రవేశించినట్లు) ప్రవేశించితిరి, వెళ్ళై - మిక్కిలిశుద్ధమై, శుడర్విడుమ్ - ప్రకాశించుచుండు, ఉన్ - మీయొక్క, పెరు - మిక్కిలియధికమైన, మేన్మైక్కు - వైభవమునకు, ఇదు - ఇట్లు నాహృదయమందుఁబ్రవేశించుట, ఇళుక్కుయెన్ఱు-అవమానమని, తని - ఒకతోడులేక ప్రత్యేకించియున్న, ఎన్నెఞ్జమ్ - నాహృదయమైనది. తళ్ళుత్తు - శైథిల్యమునొంది, ఇరఙ్గుమ్, మిక్కిలి తపించుచున్నది.

తా,— ఓయతికులసార్వభౌమా! సకలమైనవారి మనోభీష్టములను నెఱవేర్చ గలిగి వర్ధిల్లుచున్న దేవరవారి ఔదార్యస్వభావముచే, ఈపాపాత్మునికి మీయందు గలి యుండు భక్తిమాత్రమును గటాక్షించి. వసిష్ఠుడుచణ్డాళగృహమునందుఁబ్రవేశించినట్లు, నాహృదయమందుఁ బ్రవేశించితిరి, మిక్కిలి జాజ్వల్యమానముగఁ బ్రకాశించుచుండు మీయొక్క ప్రభావాతిశయమునకు, నామనఃకల్మషము తగులుటచే, అవద్యమేమైనను సంభవించునేమోయని నామనస్సైనది మిగుల పరితపించుచున్నది.

౭౮. శెఴ్ఙిల్ కఱైకొణ్డకఞ్జనై క్కాయ్న్దనిమలన్, నఙ్గళ్
పఴ్ఙి తిరువడిప్పినైక్కాదలన్, పాదమ్నణ్ణా
వఞ్జర్క్కరియ్విరామానుశన్ పుగళ్ప్పన్ని, ఙ్ఙేవాయ్
కొఞ్జిప్పరవగిల్లాదు, ఎన్న వాఴ్వినియ్నక్కూడియదే,

టీక.— నెఞ్జిల్ - (కంసుడు అశరీరివాక్కు విన్నదిమొదలు క్రోధముంచు[illegible]న్న) హృదయమునందు, కఱైకొణ్డ - (ఆక్రోధమును౦చుటచే) నలుపును పొం[illegible] కఞ్జనై - కంసుని, కాయ్న్ద - కోపగించుకొనిన, నిమలన్ - పరిశుద్ధుడును, నమ్బ[illegible] ఆశ్రితులగుమనకుస్వామియును, పఞ్జి-దూదినలెమెత్తనైన, తిరువడి-శ్రీపాదముగల,[illegible] నీళాదేవి విషయమందు, కాదలన్ - స్నేహముగలిగియుండు శ్రీకృష్ణునియొక్క, [illegible]మ్ - శ్రీపాదములను, నణ్ణా - రక్షకముగ నాశ్రయింపని, వఞ్జర్క్కు - వంచింప[illegible] నులకు, అరియ - (లభించుటకు) శక్యముగాని, ఇరామానుశన్-ఉడైయవరులయొక్క పుగళ్ అన్ఱి - దివ్యగుణములనుదప్ప, (అన్యమును) ఎన్ - నాయొక్క, వాయ్.[illegible] క్కైనది, కొఞ్జి-మనోజ్ఞమైనమాటలనుగొని, (బిడ్డలమాటలవంటివచ్చిరానిమాటలచే[illegible] పరవగిల్లాదు - (క్రమమతప్పనట్లు) స్తుతింపదు, ఇన్ఱు - ఇప్పుడు, కూడియదు-నాకు[illegible] గిన, వాழ்వు - సుఖసమృద్ధి, ఎన్న - (కలిగినవిధమును) ఏమని చెప్పనగును.

తా.— సర్వేశ్వరుడు సర్వభూతసముడుగానుండినను, తనయాశ్రితవిరోధి[illegible] తన్ను ద్వేషించిన కంసునియందు క్రోధముగలిగి వానిని సంహరించి ఆశ్రితులయందు[illegible] గులప్రేమగల నప్పిన్నపిరాట్టికి ప్రాణనాయకుడగు శ్రీకృష్ణునియాశ్రయింపక య[illegible] రించియుండు చేతనులకు నాశ్రయించుటకు దుర్లభులగు శ్రీభాష్యకారులయొక్క కల్[illegible] ణగుణములనుదప్ప వేఱొకవిషయమును నావాక్కైనది స్తోత్రముచేయుదు. ఈవిధము నావాక్కునకు లభించిన భాగ్యవిశేషము చెప్పనలవిగానిదిగానున్నదని.

౫౯. కూట్టుమ్ విదియెన్ఱుకూడుఙ్గొలో, తెన్గురుగైప్పిరాన్
పాట్టెన్నుమ్ వేదప్పశున్దమిழ் తన్నై, తన్ పత్తియెన్నుమ్
వీట్టిన్గణ్ వైత్తవిరామానుశన్ పుగழ் మెయ్యుణర్న్దోర్
ఈట్టఙ్గళ్ తన్నై, యెన్నాట్టఙ్గళ్ కణ్డిన్బమెయ్దిడవే.

టీక.— తెన్ - చూచుటకురమ్యమైన, కురుగై - తిరునగరికి, పిరాన్-నా[illegible] లైననమ్మాళ్వార్లయొక్క, పాట్టుఎన్నుమ్ - పాశురములనిప్రసిద్ధమై, వేదమ్-వేద[illegible] పమై, పశుమ్ - చక్కని పదములపొంకముగల, తమిழ் తన్నై-ద్రావిడమగుతిరువాయ్[illegible] మొழிని, తన్ - తనయొక్క, పత్తియెన్నుమ్ - భక్తియనెడు, వీట్టిన్ గణ్ - [illegible] స్థానమందు, వైత్త - ఉంచిన, ఇరామానుశన్ - ఉడైయవరులయొక్క, పుగழ் - కల్యా[illegible] ణగుణములను, మెయ్ - తత్వముగ, ఉణర్న్దోర్ - ఎఱిగియుండువారియొక్క, [illegible] ట్టంగళ్ తన్నై - సమూహములను, ఎన్నాట్టఙ్గళ్ - నాయొక్క నేత్రములైనవి కణ్డు చూచి, ఇన్బమ్ - సుఖమును, ఎయ్దిడ - పొందునట్లు, కూట్టుమ్ - చేర్చెడు, [illegible] వారియొక్కకృప, ఎన్ఱు - ఎప్పుడు, కూడుఙ్గొలో - చేరనగునో.

తా—మిగులరమ్యమైన తిరునగరికి నిర్వాహకులై, తిరువాయ్మొఴి మూలముగ ముముక్షువులైనవారిని స్వరూపజ్ఞానము గలిగి యుజ్జీవించునట్లు చేసిన, నమ్మాళ్వార్లయొక్క దివ్యసూక్తిమయమై సర్వాధికారమైన ద్రావిడవేదమగు దివ్యప్రబన్ధమును తమభక్తిరూపమగు కోవెలలో ప్రతిష్ఠింపఁజేసికొనియుండు ఉడైయవరులయొక్క కల్యాణగుణములను వాస్తవముగ నెఱిఁగియుండు జ్ఞానాధికులయొక్క సమూహములను ఎల్లప్పుడువిడువకుండ సేవించి యానందించునట్టి భాగ్యవిశేషము ఎప్పుడు నాకులభించునోయని.

౩౦ - పా, అవ - ఉడైయవరులు దాసుని శేషభూతునిగాఁజేసికొనిరి. ఇక ఆనన్దావహమగు పరమపదము లభించినను, అత్యన్తదుఃఖములు సంప్రాప్తమైనను దాసునికి రెండును సమానమేయని తమ యధ్యవసాయమును ప్రసాదించుచున్నారు.

౩౧. ఇన్బన్తరు పెరువీడువన్దెయ్దిలెన్, ఎణ్ణిఱన్ద
తున్బన్తరునిరయమ్పలశూఴిలెన్, తొల్లులగిల్
మన్బల్లుయిర్గట్కిఱైయవన్ మాయనెన మొఴిన్ద
అన్బననగన్, ఇరామానుశన్నెన్నైయాణ్డననే.

టీక. తొల్ - అనాదిగనున్న, ఉలగిల్ - లోకమందు, మన్ - నిత్యులై, పల్-అనేకులైన, ఉయిర్గట్కు-ఆత్మలకు, ఇఱైయవన్-నాథుడైనవాడు, మాయన్-స్వరూపగుణములచే ఆశ్చర్యభూతుడగు సర్వేశ్వరుడని, మొఴిన్ద - శ్రీభాష్యమూలముగఁ బ్రసాదించిన, అన్బన్ - స్నేహముగలవారై, అనగన్ -(ఖ్యాతిలాభాపేక్షలకుమూలమగు) పాపసంబన్ధములేకయుండు, ఇరామానుశన్-ఉడైయవరులు, ఎన్నై-నన్ను, ఆణ్డనన్-దాసునిగఁజేసికొనిరి, ఇన్బన్తరు-ఆనన్దావహమగు, పెరువీడు-పరమ పురుషార్థమగు మోక్షమైనది, వన్దు-వచ్చి, ఎయ్దిలెన్-లభించిననేమి, ఎణ్ ఇఱన్ద-లెక్కలేని, తున్బన్తరు-దుఃఖములనిచ్చు, పలనిరయమ్-అనేకనరకములు, శూఴిల్ ఎన్ - తప్పించుకొనరాకుండనట్లు చుట్టుకొన్న నేమి.

తా—ఈజీవాత్మలకు సహజముగ జననమరణాది యేదోషములు లేకుండినను అనాదికర్మసంబన్ధముచే దేవమనుష్యాది జాతులలో జన్మించి బద్ధసంసారులైయున్న బ్రహ్మాది సమస్తజీవరాసులకును శ్రీమన్నారాయణుడే స్వామియనెడు తత్వమైన పరమార్థమును, ఈచేతనులు అనర్థపడి నశింపక యుజ్జీవింపవలయునని, అపారకరుణతో శ్రీభాష్యమందు విశదీకరించిన శ్రీభాష్యకారులు నన్ను శిక్షించి తమదాసవర్గముతోఁ జేర్చుకొనిరి. ఈయుత్తమపురుషార్థము లభించిననాకు బంధమోక్షములందెక్కడనున్నను సమానమే, కనుక యతిరాజులవారియందు దృఢమైన ప్రావణ్యము గలిగియుండి వారికృపను బొందినవారికి సుఖదుఃఖములులక్ష్యములుగావని.

దుర్లభమైన మోక్షమును మనకు దం(డ్రియగు ఉడైయవరులు తమ పాదారవిన్దములను (సాధనమును ఫలమునుగ) ఇచ్చి సంసారసంబన్ధమునుబోగొట్టి తరింపఁజేసిరని.

౭౦. ఎన్నైయుమ్ పార్త్తెన్నియల్వైయుమ్ పార్త్తు, ఎణ్ణిల్ పల్ గుణత్తు
వున్నైయుమ్ పార్క్కిలరుళ్ శెయ్వదే నలమ్, అన్ఱియెన్పాల్
పిన్నైయుమ్ పార్క్కిల్ నలముళదేయున్ఱన్ పెరుఙ్గరుణై
తన్నై యెన్ పార్పర్, ఇరామానుశా వున్నైచ్చార్న్దవరే.

టీక.—ఎన్నైయుమ్- (విషయాసక్తుడగు) నన్నును, పార్త్తు - కటాక్షించి, ఎన్- నాయొక్క, ఇయల్వైయుమ్ - చెడునడవడికలనున్ను, పార్త్తు - కటాక్షించి, ఎణ్ ఇల్ - లెక్కలేని - పల్ గుణత్తు - అనేక దివ్యగుణములుగల, ఉన్నైయుమ్ - దేవరవార్లనున్ను, పార్క్కిల్ - చూచినయెడల, అరుళ్ శెయ్వదే - నిర్హేతుక కరుణించుటయే, నలమ్ - మేలైనది, అన్ఱి ఇదిపోగ, పిన్నైయుమ్ - మరలను, పార్క్కిల్ - విచారించినయెడల, ఎన్ పాల్ - నాయందు, నలమ్ - మేలైనగుణము, ఉళదే ఉన్నదా, ఉన్నై - దేవరవార్లను, శార్న్దవర్ - ఆశ్రయించినవారు, ఉన్ - దేవరవారి యొక్క, పెరుఙ్గరుణై తన్నై - నిరవధికకృపను, ఎన్ - ఏవిధముగ, పార్పర్ - చూతురు.

తా—ఓయతిరాజా! నన్నును నాయొక్క చెడునడవడికను నన్ను దేవరవారిని లెక్కలేని గుణావళులను నన్ను ఆలోచించి చూచినయెడల నన్నొక విషయముగ నిర్హేతుకముగ కటాక్షించుటయే మేలైనది, ఇదివిడచి నేను చేసియుండు కృత్యములను యోచించి చూచినయెడల గుణలేశము సంపాదించే నన్ను చేయువిధముగ వనలసినచ్చును. గుణవన్తులే సర్వోత్తములగు యతిరాజులవారాశ్రయింపదగినవారు, దోషములుగలవారు వారిసన్నిధికర్హులుగారని, దేవరవారి నాశ్రయించినవారు తలచుటచే, దేవరవారికి నిర్హేతుకకృపగలవారు అనెడు మహిమలేకపోవు నేయని.

౭౧. శార్న్దదెన్ శిన్దైయున్ఱాళిణైక్కీழ், అన్బుదాన్ మిగవుమ్
కూర్న్దదత్తామరైత్తాళ్ గళుక్కు, ఉన్ఱన్ గుణఙ్గళుక్కే
తీర్న్దదెన్ శెయ్గైమున్ శెయ్వినై నీ శెయ్వినైయదనాల్
పేర్న్దదు, వణ్మైయిరామానుశా వెమ్ పెరున్దగైయే.

టీక.—వణ్మై - (పుచ్చుకొనువారి తక్కువయును ఇచ్చెడువారి ఘనతయును జూడకయిచ్చునట్టి) ఔదార్యగుణమును, ఎమ్ - ఆయౌదార్యము చేనన్ను వశపరచుకొన్న, పెరున్దగై - గొప్పమహిమగల, ఇరామానుశ - ఉడైయవరే, ఎన్ - నాయొక్క

(గ్నై. హృదయము, ఉన్ - సాత్విక శేషియగు దేవరవారియొక్క, ఇణై - కూడియు న్న, తాళ్కీళ్ - శ్రీపాదములక్రింద, శార్న్దదు-పొందియున్నది, అత్తామరై త్తాళ్ గళు క్కు - తామరలవంటి యా శ్రీపాదములకు, అన్బుదాన్ - స్నేహమైనదియే, మిగ వృష్ణఫలకములగునట్లు, కూర్న్దదు - అతిశయించినది, ఎన్ - నాయొక్క, శెయ్ గై - వృత్తియైనది, ఉన్దన్ - దేవరవారియొక్క, కుణఙ్గళుక్కే - అదివ్యగుణములకే, తీర్న్దదు - వశంవదీతినది, మున్ శెయ్ వినై - పూర్వమందుఁజేసినకర్మములు, నీ - (దానిని నివర్తింపఁజేయునట్టి) దేవరవారు, శెయ్ - చేసిన, అదు - ఆ, వినైయాల్ - వ్యాపారముచే (కృపచే) పేర్న్దదు - కొండ్లపెల్లగిలినట్లు విడిచిపోయినది.

తా—స్వరూపజ్ఞానాది సకలమును, లభించెడువాని తక్కువను ఆలోచింపక ప్రసాదించునట్టి అతిగమ్భీరస్వభావముగల మాస్వామియగు యతిరాజా! నాహృదయము దేవరవారి శ్రీపాదములందుఁగూడి పొందికతోనున్నది. ఆ శ్రీపాదములందు భక్తియై యతిశయించినది. నేను దేవరవారి దివ్యగుణములలో మిగులయపేక్షగాని దేవరవారి కైంకర్యమందు పూనికగలిగియున్నవాఁడను. (ఇట్లుండున) నాపురాకృత కర్మములంతయు దేవరవారియొక్క యజ్ఞీకారముచే నన్ను విడిచిపెగుగడినవని.

౭౨. కైత్తనన్ తీయశ్శమయక్కలగరై, క్కాశినిక్కే
యుయ్ త్తనన్ తూయమఱైనెఱిదన్నై, యెన్ఱున్నియుళ్ళత్తు
నెయ్ త్తవనోడిరున్దేత్తు నిఱై పుగళోరుడనే
వైత్తనన్నై, యిరామానుశన్ మిక్కవణ్మైశెయ్ దే.

టీక.—ఇరామానుశన్ - ఉడైయవరులు, మిక్కవణ్మై శెయ్దు - నిరతిశయ ఔదార్యముఁజేసి, తీయ - నీచములైన, శమయమ్-మతములను (బట్టి) కలగరై - కలహించుచున్నవారిని, కైత్తనన్-జయించినవారై, తూయ-పరిశుద్ధమైన, మఱైనెఱిదన్నై-వేదమార్గమును, కాశినిక్కు-భూమియందు, ఉయ్ త్తనన్ - కృపచేఁ బ్రవర్తింపఁజేసిరి, - అని, ఉన్ని-అనుసన్ధించి, ఉళ్ళమ్ - మనస్సు, నెయ్ త్తు-మెత్తనై, అవనోడు-వారితో, ఇరున్దు - ఉండి, ఏత్తుమ్-స్తోత్రముచేయుచున్న, నిఱై - సంపూర్ణమైన, పుగళోరుడనే - పరిపూర్ణగుణవన్తులతోఁగూడ, ఎన్నై - నన్ను, వైత్తనన్ - కరుణించుచిరి.

తా—ఉడైయవరులు తమఔదార్యాతిశయముచే మిక్కిలి హేయములైన వేదబాహ్యములగు బౌద్ధాదిమతముల నవలంబించి కలహించుచున్నవారిని నశింపఁజేసిరి, మిగుల విశుద్ధమగు వేదమార్గమును భూమియందంతటను బ్రతిష్ఠింపఁజేసిరి. అనుసంధాయతి

రాజులవైభవము ననుసన్ధించి ప్రేమాతిశయముతో స్తోత్రముచేయు చుందు మహాత్ములు గూడ నన్ను నుగలిసియుండునట్లు కరుణించికటాక్షించిరని.

८३. వణ్ణైయినాలుమ్ తణ్మై మాదగవాలుమ్, మదిపురైయుమ్
తణ్ణైయినాలుమిత్తారణియోర్ గట్కు, త్తాఙ్ శరణాయ్
ఉణ్ణైనల్ ఞానమురైత్త ఇరామానుశనైయునున్నుమ్
తిణ్ణైయల్లాలెనక్కిల్లై, మత్తోర్ నిలై తేర్న్దిడిలే.

టీక.—తన్-(ఉపకరించుటకుదగిన) తనయొక్క, వణ్ణైయినాలుమ్ - ఔన్నత్యముచేతను, (చేతనులదుర్గతినిఁజూచి సహింపఁజాలని) మాదగవాలుమ్-పరమకృపచేతను మదిపురైయుమ్-(తాపహరుడై సన్తోషకరుడైన) చంద్రునివలెనుందు, తిణ్ణైయినాలుమ్ చల్లదనముచేతను, ఇత్తారణియోర్ గట్కు - ఈభూమియందుండువారికి, తాన్ - తాను శరణాయ్ - రక్షకులైయుండి, ఉణ్మై- వాస్తవమై, నల్ - విలక్షణమైన, ఞానము జ్ఞానమును, ఉరైత్త - ప్రసాదించిన, ఇరామానుశనై - ఉడైయవరులను, ఉన్నుమ్ ఆనుసన్ధించుచున్న, తిణ్ణైయల్లాల్ - సామర్థ్యముదప్ప, తేర్న్దిడిల్ - విచారించినయెడల, ఎనక్కు - నాకు, మత్తు - ఇతరమైన, ఓర్ నిలై - ఒక్కయునికి ఇల్లై-లేదు.

తా—ఉడైయవరులు తమఉదారస్వభావముచేతనున్ను దానికిఁ గారణమగు పరమకృపచేతనున్ను సకలజనులను సంరక్షించునపుడు చంద్రునివలె చల్లదనముగలిగి యుండుటచేతను ఈభూలోకమందుండువారికిని తామేరక్షకులై విలక్షణమగు స్వరూపజ్ఞానము నుపదేశించినవారగుటచే, వారేరక్షకులని ఆనుసన్ధించుకొనుచుండుటయే నేను ధరించుటకుఁగారణమగును గాని నాయొక్క జ్ఞానప్రేమములేవియును గారణములుగావని.

८४. తేరార్ మఱైయిన్ తిఱమెన్ఱు, మాయవన్ తీయవరై
కూరాఴిక్కొణ్డుకుఱైప్పదు, కొణ్డలనైయవణ్మై
యేరార్ గుణత్తెమ్మిరామానుశనవ్వెழில్ మఱైయిల్
శేరాదవరైచ్చిదైప్పదు, అప్పొరుళ్ శిదైయాదే.

టీక.—మఱైయిన్ - (సర్వేశ్వరుని అజ్ఞారూపములగు) వేదములయొక్క, తిఱమ్-ప్రకారమును, తేరార్ - నిరూపింపరు, ఎన్ఱు-అని, మాయవన్ - ఆశ్చర్యశక్తులుగలసర్వేశ్వరుఁడు, తీయవరై - దుర్మార్గులను, కూర్ - పదునైన, ఆழிక్కొణ్డు

మునుగ్రహించి, కుఱైప్పదు - ఛేదించుటయైయున్నది, కొణ్డలనైయ - (అందఱిని సంర క్షింపనిచ్ఛగలవారగుటచే) మేఘమువంటి, వణ్మై - ఉదారస్వభావముగలవారై, ఏరార్ - పెక్కులియుత్తమములైన, కుణత్తు - వాత్సల్య సౌశీల్యాదిగుణములుగలవారునైన, ఎమ్మిరామానుశన్ - మనఎమ్బెరుమానార్లు, అవ్వైదిల్ - అట్టివిలక్షణముగల - మఱైయిల్ - శేసములందు, శేరాదవర్రై - ప్రామాణ్యబుద్ధిలేక చేరనివారిని, శిదైప్పదు-(ఉత్సాహ మునశించి యోడిపోవునట్లుచేయుట) నశింపజేయుట, అప్పోదు - ఆసమయమందు, ఒరు - మిగులవిలక్షణమగు, శిన్దైశెయ్దే-(వేదాన్తవాక్యములకు యుక్తియుక్తములగునర్థములను), నాలోచనచేసిరే.

తా—యుక్తాయుక్తవివేకములేనివారై, అపౌరుషేయమై ప్రధానప్రమాణమై, సంచేతనులకును త్యాజ్యోపాదేయములను దెలియజేయునట్టి తమ యాజ్ఞారూపములైన వేదములనతిక్రమించి ప్రవర్తించుచుండు దుష్టులను సర్వేశ్వరుఁడు అనేకావతారములను అనేక ప్రయత్నములనున్నజేసి చక్రమును హస్తమందు ధరించి శ్రమతో నిరసించి నట్లుగాక, ఔదార్యమందు మేఘమువంటివారగు యతిరాజులవారు, తాముపదేశించిన జ్ఞానమునకు విరోధులై అల్పజ్ఞానులై గుంపులుగాబడియుండు బాహ్యకుదృష్టిమతస్థులను యుక్తియుక్తములగు వేదాన్తార్థవిశేషములచే సమ్మతించినవారిని జేర్చుకొనియు సమ్మతింపనివారిని నిరసించుచుండునట్టి యతిరాజులవారే మహాప్రభావముగల వారని.

౭౫. శెయ్త్తలైచ్చఙ్గమ్ శెళుముత్తమీనుమ్, తిరువరఙ్గర్
కైత్తలత్తాழியుమ్ శఙ్గముమేన్ది, నఙ్గణ్ముగప్పే.
మొయ్త్తలైత్తున్నై విడేనెన్ఱిరుక్కిలుమ్నిన్పుగழே
మొయ్త్తలైక్కుమ్వన్దు, ఇరామానుశా వెన్నైముற்றுనిన్ఱే.

టీక.—శెయ్త్తలై - (తిరుకావేరియొక్క జలసమృద్ధిగల) పొలములందు, శఙ్గమ్ - శంఖములైనవి, శెళు - రమ్యమైన, ముత్తమ్ - ముత్యములను, ఈనుమ్-ప్రసవించుచుండు, అరఙ్గర్ -(ఉభయకావేరీమధ్యమందు శయనించియున్న) శ్రీరఙ్గనాథులు, తిరు - అందమైన, కైత్తలత్తు - శ్రీహస్తములందు, ఆழியుమ్ - సుదర్శనమును, శఙ్గముమ్ - (పాఞ్చజన్యమను) శంఖమును, ఏన్ది - ధరించి, నమ్కణ్ముగప్పే - మాప్రత్యక్షమునకే, మొయ్త్తు - అగుబడినవాడై, అలైత్తు- (సౌన్దర్యాదిగుణములచే) బుద్ధిని చపలించునట్లుచేసి, ఉన్నై - నిన్ను, విడేన్ - వదలను, ఎన్ఱు - అని, ఇరుక్కిలుమ్ - నున్నప్పటికిని, ఇరామానుశా - ఉడైయవరే, నిన్ - దేవరవారియొక్క, పుగழే - దివ్యకల్యాణగుణములే, వన్దు - వచ్చి, ఎన్నై - నన్ను, ముற்றుమ్ - అంతటను, నిన్ఱు -

చుట్టియుండినిలిచి, మొయ్త్తు - నేను ముందు నేను ముందని తమ వైలక్షణ్యము జూపి, అలైక్కుమ్ - ఈడ్చుచునుండును.

తా—తిరుక్కావేరియొక్క జలము పొలములలో ప్రవహించునపుడు, కొట్టుకవచ్చిన శంఖములవల్ల గలిగిన ముత్యములను గలిగియుండు, శ్రీరఙ్గక్షేత్రమునకు నాథుడైన శ్రియఃపతి, శంఖచక్రాది దివ్యాయుధాలంకృతుడై దాసుడున్న స్థలమునకు వెనకాల వచ్చి తనవైలక్షణ్యమును దాసునికి పూర్ణముగజూపి, నిన్ను నేను విడువనని నాతో దగనిలిచినను వానివైలక్షణ్యమునకు లోబడక, ఓరామానుజా! దేవరవారికే లోబడి నట్లు దేవరవారికల్యాణగుణములన్నియునువచ్చి దాసుని యాక్రమించుకొన్నదని.

౨౧. నిన్ఱవణ్కీర్త్తియుమ్నీళ్పునలుమ్, నిఱైవేఙ్గడప్పొ
ఱ్కున్ఱముమ్వైగున్దనాడుమ్కులవియపాఱ్కడలుమ్,
ఉన్ఱనక్కెత్తనై యిన్బన్దరుమున్నిణైమలర్త్తాళ్
ఎన్ఱనక్కుమదు, ఇరామానుశా! విత్తై యీన్దరుళే.

టీక. —నిన్ఱ - (ఎల్లప్పుడును) స్థిరముగనున్న, వణ్ - మనోజ్ఞమైన, కీర్త్తియుమ్ - యశస్సును, నీళ్ - దీర్ఘమైన (ప్రవహించుచుండు) పునలుమ్ - జలమును, నిఱై - పూర్ణమైయున్న, వేఙ్గడమ్ - తిరువేఙ్గడమను నామముగలదై, పొన్ - సున్దరమైన, కున్ఱముమ్ - (తిరుమలయను) పర్వతమును, వైగున్దమ్ - శ్రీవైకుణ్ఠమును, నాడుమ్ - పరమపదమును, కులవియ - జ్ఞానవన్తులు కొనియాడునట్టి, పాఱ్కడలుమ్ - పాలసముద్రమును (క్షీరాబ్ధియును) ఉన్దనక్కు - దేవరవారికి, ఎత్తనై - ఎంత, ఇన్బమ్ - ఆనన్దమును, తరుమ్ - ఇచ్చునో, ఉన్ - దేవరవారియొక్క, ఇణై - చేరికచే సున్దరమైన, మలర్ - పుష్పములవంటి, తాళ్ - శ్రీపాదములు, ఎన్దనక్కుమ్ - నాకును, అదు - అంతటియానన్దమును, (ఇచ్చును) ఇరామానుశా, ఉడైయవరే, ఇదై - ఈ పాదారవిన్దములను ఈన్దరుళ్ - దాసునికి కరుణించి యిప్పింపవలెను.

తా—ఓయెమ్బెరుమానారే! సర్వకాలములందును మనోజ్ఞమై దివ్యగుణప్రసిద్ధిచేతను ఎల్లప్పుడు ప్రవహించుచుండు నిడుదలగు సెలయేళ్ళచేతను పూర్ణమై తిరువేఙ్గడమను నామముచే ప్రసిద్ధినొందిన, (శ్రీవేఙ్కటాచలమును) శ్రీవైకుణ్ఠమును (పరమపదమును) క్షీరాబ్ధియును, దేవరవారికి, ఎంతటిసౌఖ్యమును ఇప్పించునో అంతసౌఖ్యమును దాసునికి దేవరవారి పాదారవిన్దములు ఇప్పించునుకనుక అట్టి పాదారవిన్దములను కృపతో ప్రసాదింపవలయునని.

౨౨. ఈన్దననీయాదవిన్నరుళ్, ఎణ్ణిల్మఱైక్కుఱుమ్బై
ప్పాయ్న్దననమ్మఱైప్పల్పొరుళాల్, ఇప్పడియనైత్తు

౬౨

మేయ్న్దనర్ కీర్త్తియినాల్ ఎన్ వినైగళై వేర్ పఱియ
క్కాయ్న్దనర్, వణ్మైయిరామానుశఱ్కెన్ కరుత్తినియే.

టీక.—ఈయాద-( ఇంతకుమునుపాకరికిని ) ఈయని, ఇన్నరుళ్ - విలక్షణ మైన కృపను, ఈన్దనర్ - నాకు ఉపకరించి, ( ఇచ్చిరి ) ఎణ్ ఇల్ - లెక్కలేని, మఱై - వేదములందు, కుఱుమ్బై - తప్పుఅర్థములను జెప్పుచున్న కుదృష్టి మతములైన వానిని, అ-ఆ, మఱై - వేదములందు ( ప్రతిపాదించునట్టి ) పల్ పొరుళ్కళ్ - అనే కార్థములనుగొని, పాయ్న్దనన్ - తోలిసివేసిరి, ఇ - ఈ, పడియుమైత్తుమ్ - భూమి యందంతటను, కీర్త్తియినాల్ - యశస్సుచేత, మేయ్న్దనర్ - వ్యాపించినవారైరి, ఎన్-నాయొక్క, వినైగళై - కర్మములను, వేర్ - మూలము, పఱియ - నశించునట్లు, కాయ్న్దనర్-తోలిసిరి, వణ్మై - పరమోదారులైన, ఇరామానుశఱ్కు-ఉడైయవరులను, ఇని - ఇకమీదు, కరుత్తు - తమహృదయమందుండు అపేక్ష, ఎన్ - ఏమియున్నది.

తా—ఉడైయువరులు ఇదివఱకెవ్వరియందును ఉంచని కృపను దాసునియందు ఉంచినవారైరి, అసంఖ్యేయములైన వేదములకు అపార్థములను జెప్పుచున్న కుదృష్టుల ను, ముఖ్యప్రమాణములగు ఆ వేదములను, సత్యమైన అనేకార్థములను జెప్పినిరసించిరి. భూమండలమంతయును తమయొక్క కీర్తిని వ్యాపింపఁజేసిరి, నాయొక్కప్రాప్తి ప్రతి బంధకములగు కర్మములనన్నిటిని నశింపఁజేసిరి, ఇట్టి పరమోదారులైన ఎమ్బెరుమానార్లు, ఇకను ఏమి యుపకరింపవలయునని తలచియున్నారో? (తెలియదు).

౬౩. కరుత్తిల్ పుగున్దుళ్ళిల్ కళ్ళమ్ కళ్ళఱ్ కరుదరియ,
వరుత్తత్తినాల్ మిగవఞ్జిత్తు, నీయిన్దమణ్ణగత్తే,
తిరుత్తిత్ తిరుమగళ్ కేళ్వనుక్కాక్కియపిన్, ఎన్నెఞ్జిల్
పొరుత్తప్పడాదు, ఎమ్మిరామానుశ మఱ్ఱోర్ పొయ్ప్పొరుళే.

టీక.—ఇరామానుశ! ఉడైయవరే! నీ - దేవరవారు, కరుత్తిల్ - మనస్సునం దు, పుగున్దు - ప్రవేశించి, ఉళ్ ఇల్ - మనస్సులోనున్నట్టి, కళ్ళమ్ - (నేను నాది అనెడు) దొంగతనమును, కళ్ళఱ్ఱి - పోఁగొట్టి, కరుదు - ( ఇతరులగు కొందఱికి ) తలఁచుటకును, అరియ - సాధ్యముగాని, వరుత్తత్తినాల్-ప్రయాసచేత, మిగ-మిక్కిలి, వఞ్జిత్తు - (తనకార్యములను) మరుగుపఱచి - తిరుత్తి - (నన్ను) దిద్దుపాటుచేసి, ఇన్ద- మణ్ణగత్తే - భూమియందే, తిరుమగళ్ కేళ్వనుక్కు - శ్రియఃపతియగు స్వామికి, ఆక్కియపిన్ -. దాసుఁడగునట్లుచేసినవెనుక, ఎన్నెఞ్జిల్ - (ఇట్లు దేవరవారిచే దిద్దు

పాటు చేయఁబడిన) నామనస్సునందు, మత్ తుబ్ఱ్ - ఇతర మైన ఒక, పొయ్- అసత్య మైన, పొరుళ్ - అర్థము, పొరుత్తప్పడాదు - బలముగపొందించినను పొందదు.

తా__ఓయతిరాజా! దేవరవారు, మీను జ్ఞానోపదేశమునకు లోబడు వాడుగా డని, దృఢముగఁదెలిసి నాహృదయమందుఁ బ్రవేశించి యచ్చట నాటియున్న దురభిమానాదిదోషములను సవాసనగ నివర్తించునట్లుచేసి,తలచుట కసాధ్యమైన శ్రమను పూర్వానొకటియును దెలియకుండునట్లు మరుగున నేయుండి, పారిష్యభూసుఁడగు శ్రియఃపతికి ఈభూమియందే దాసుడగునట్లు చేసితిరి, ఇకమీదట అహఙ్కారమమకారాదిదుర్గుణము లేవియును నాయన్తఃకరణమున నిలువనేరదని.

౭౯. పొయ్యెచ్చురక్కుమ్పొరుళై త్తురన్దు ఇన్దప్పూదలత్తే, మెయ్యెప్పురక్కుమిరామానుశన్ నిఱ్క, వేఱునమ్మై యుయ్యక్కొళ్ళవల్ల దెయ్ వమిఙ్గియాదెన్ఱు లఱ్న్దవమే, ఐయప్పడానిఱ్పర్, వైయత్తుళ్ళోర్ నల్లఱివిఴన్దే.

టీక.—పొయ్యె - అనృతములను, శురక్కుమ్ - (పైపైగ ప్రతిపాదించుచుండు) పొరుళై - బాహ్యకుదృష్టిమతస్థులయొక్క అర్థమును, తురన్దు—పాఱదోలి- ఇన్ద - ఈ పూదలత్తే - భూమియందే, మెయ్యె - యథార్థములను, పురక్కుమ్-పరిపాలించుచుండు, ఇరామానుశన్ - ఉడైయవరులు, నిఱ్క- ఎవరు వత్తురోయని ఎదురుచూచుచుండగ, (ఈచేతనులు మనవంటి వారేగదాయని యాలక్ష్యముచేసి) వేఱు- వేరైన, నమ్మై మనలను, ఉయ్యక్కొళ్ళవల్ల - జ్ఞానమును బుట్టించి ఉజ్జీవించునట్లు జేయఁదగిన, దెయ్వమ్- దేవత, ఇఙ్గు-ఇచ్చట, యాదుఎన్ఱు - ఏదియని, ఉలర్న్దు - ( మనోదుఃఖముచే) ఎండి (కృశించి) నల్ అఱివు-యథార్థజ్ఞానమును, ఇఴన్దు - లభించునట్లులేక, (పోగొట్టుకొని ) వైయత్తుళ్ళోర్ - భూమియందు ఉన్నవారు, అవమే - ఒకప్రయోజనముపొందకనే, ఐయప్పడానిఱ్పర్-సన్దేహించుచు ఉన్నవారు.

(మఱియొకయర్థము-పొయ్యె - (అసత్యశబ్దముచేఁజెప్పదగిన) అనఁగా అనిత్యమైనదేహమును, శురక్కుమ్ - జన్మపరంపరలచే పైపైగఁగలుగఁజేయునట్టి, పొరుళై (దేహాత్మాభిమానము స్వస్వాతంత్ర్యము మొదలగు) అర్థములను, తురన్దు-(తమయొక్క ఉపదేశముచే) పాఱదోలి, మెయ్యై ,ఒకవికారమునుబొందని ఆత్మస్వరూపమును, పురక్కుమ్ - కాపాడునట్టి, ఉడైయవరులుఅని మిగతఅంతయును క్రిందున్నట్లే)

తా.—ఆత్మ యొక్క దేహపరిమాణత్వము క్షణికత్వము మొదలగు వేదాన్తవిరుద్ధమైన యర్థములను, నోటికివచ్చినట్లు ప్రలాపించుచుండు ఆర్హతులు మొదలగు బాహ్యులు మాయావాదులగు కుదృష్టులు మొదలగువారిని పాఱద్రోలి, సకలచేతనులకును తత్వత్రయము=(చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు) యొక్క స్వభావములను విశదీకరించి యుపదేశించుట యిట్టి పరోజ్జీవనకార్యమును స్వప్రయోజనముగవహించి ప్రకాశించుచుండు కృపాస్వరూపులగు యెమ్బెరుమానార్లను లోకులు ఆశ్రయింపక వారిని తమవంటివారినిగ తలఁచుకొని యేదేవతనాశ్రయించి యుజ్జీవింపనగునోయని వ్యసనముతో కృశించి మంచి ...గొట్టుకొని సన్దేహించుచున్నారని.

౬౦. నల్లార్ పరవుమిరామానుశన్, తిరునామమ్నమ్బ
వల్లార్ తిఱత్తైమఱవాదవర్ గళ్ యవర్, అవర్క్కే
యెల్లావిడత్తిలుమెన్ఱుమెప్పోదిలుమెత్తొழுమ్బుమ్
శొల్లాల్ మనత్తాల్, కరుమత్తినాల్ శెయ్వన్ శోర్విన్ఱియే.

టీక.—నల్లార్ - సజ్జనులందఱును, పరవుమ్ - కొనియాడుచున్న, ఇరామానుశన్ - శ్రీభాష్యకారులయొక్క, తిరునామమ్ - సంపత్కరములగు తిరునామములను, నమ్బవల్లార్ - (తమకు సకలవిధరక్షకములుగ) నమ్మునట్టివారియొక్క, తిఱత్తై - విధమును, మఱవాదవర్ కళ్ - ఎల్లప్పుడు అనుసన్ధించుకొనుచుండువారలు, యవర్ - ఎవరో; అవర్క్కే - వారికే, ఎల్లావిడత్తిలుమ్ - సర్వదేశములలోను, ఎన్ఱుమ్ - సర్వకాలములలో, ఎప్పోదిలుమ్ - సర్వసమయములందును, ఎత్తొழுమ్బుమ్ - సకలవిధకైంకర్యములను- శొల్లాల్ - వాక్కుచేతను, మనత్తాల్ - మనస్సుచేతను, కరుమత్తినాల్ - కర్మముచేతను, శోర్విన్ఱి - విశ్లేషములేక, (విచ్ఛేదములేక) శెయ్వన్ - చేయుదును. [తిఱత్తై మదియాదవర్ కళ్, అనిపాఠమైనయెడల, మదియాదవర్ కళ్ - గణింపనివారు (పరిచ్ఛేదింపనివారు) అనిభావము, వారివైభవమున్మరింపను అనుసన్ధింపను అల... మిగత అంతయునుసమానమే.]

తా.—సుజనులచే నెల్లప్పుడును స్తోత్రముచేయఁబడుచున్న యతిరాజులవారి తిరునామములే, మనకు ఉత్తారకములని నమ్మియుండు మహాత్ములయందు అత్యన్తస్నేహము... ఒకప్పుడును వారిదివ్యగుణములను మఱవక కొనియాడుచుండువారెవరో, ...భాగవతోత్తములకే నేను సర్వదేశ సర్వకాల సర్వసమయములందును సకలవిధకైంకర్యములను మనోవాక్కాయకాది సకలకరణములచేతను, సకలమైనవారికిని దెలియు... తెగక చేయగలవాడనని,

౮౧. శోర్విన్ఱియున్దన్ తుణైయడిక్కీழ், తొణ్డుపట్టవర్ పాల్,
శార్విన్ఱినిన్ఱ వెనక్కు, అరఙ్గన్ శెయ్యతాళిణైగళ్,
పేర్విన్ఱియిన్ఱు పెఱుత్తుమిరామానుశవినియెన్
శీరొన్ఱియకరుణైక్కు, ఇల్లైనూఱుఙ్ తెరివుఱిలే.

టీక.—శోర్వుఇన్ఱి - వేఱొకవిషయమందు మనస్సువిడిచిపోక, ఉన్దన్ - దే
రవారియొక్క, తుణై - కూడియున్న, అడిక్కీழ் - శ్రీపాదములక్రింద, తొణ్డుప
ర్ పాల్ - దాస్యమునుం బొందినవారివిషయమందు, శార్వుఇన్ఱి - పొంతనములేక,
ఉన్న, ఎనక్కు - నాకు, అరఙ్గన్ - శ్రీరఙ్గనాథునియొక్క, శెయ్య - శ్లాఘ్య
ఎఱ్ఱరంగునై, ఇణై - చేరియున్న, తాళ్ కళ్ - శ్రీపాదములను, పేర్వుఇన్ఱి - ఎ
నియెడబాయక, ఇన్ఱు - ఇప్పుడు, పెఱుత్తుమ్ - లభింపంజేసిన, ఇరామానుశా! ఉ
నకే! ఇని - ఇట్లైనవెనుక, ఉన్ - దేవరవారియొక్క, శీర్ ఒన్ఱియ - మహత్త్వము
గూడియుండు, కరుణైక్కు - కృపకు, తెరివుఉఱిల్ - ఆలోచించినయెడల, మా
సమానము, ఇల్లై - లేదు,

తా॥—ఓయెమ్బెరుమానారే! దేవరవారికి శేషభూతులుగానుండువారి
మున దాస్యముచేయుటకు సమ్మతింపనినాకు శ్రీరఙ్గనాథుఁడు తన శ్రీపాదములయం
పంగూడదనియుండగ, అట్టి మహాప్రభావశాలులగు దేవరవారియొక్క భక్తులయం
దాసునికి ప్రావణ్యముగలుగునట్లు అనుగ్రహించితిరి, ఇప్పుడు శ్రీరఙ్గనాథుఁడు
మైన పాదారవిన్దములను ఎల్లప్పుడును నాహృదయమందే యుంచునట్లనుగ్రహిం
ఇట్లు శ్రీరఙ్గనాథుల శ్రీపాదములందు దేవరవారు చేర్చిన పరమకృపకువిచారించినా
నము ఒకటియును లేదని,

వేఱొకయర్థము—అరఙ్గన్ శెయ్యతాళిణైగళ్ - పేర్వుఇన్ఱి - ఉన్దన్ తుణై
డిక్కీழ் తొణ్డుపట్టవర్ పాల్ శార్విన్ఱినిన్ఱ వెనక్కు - ఇన్ఱుపెఱుత్తుమిరామానుశా,
న్వయించి-భగవచ్ఛేషత్వమునకు సమ్మతించుటచే శ్రీరఙ్గనాథులపాదారవిన్దములను
ప్పుడాశ్రయించియుండుగర్వముచే భాగవతులమహిమను దెలిసికొనజాలక దేవర
భక్తులను సాధారణముగదలచి వారియొద్దచేరకయుండునాకు, వారియందుప్రావణ్య
గలుగంజేసిన దేవరవారియొక్క గొప్పమహిమగలకృపకు విచారించిచూచినయెడ
యును సమానములేదు అనియునుగానచ్చును,

౮౨. తెరివుఱ్ఱఞానమ్ శెఱియప్పెఱాదు, వెన్దీవినైయాల్,
ఉరువఱ్ఱఞానత్తుఙ్గల్ గిన్ఱ వెన్నై, ఒరుపొழுదిల్,

పారువన్ఱ కేళ్వియనాక్కినిన్ఱా నెన్న పుణ్ణియనో
తెరివుత్తకీర్త్తి, యిరామానుశనెన్నుమ్ శీర్ముగిలే.

టీక.—తెరివు - మంచిచెడుగులను వివేకించుటయందు, ఉత్తఱ - పూనికగల, ఞానమ్-జ్ఞానమును, శేఱియ-పొందుటను, పెఱాదు-కలుగక, వెమ్తీ-మిగులక్రూరమైన, వినైయాల్ - కర్మముచే, ఉరువుఅత్తఱ-ఒకవస్తురూపమును బొందియుండని, ఞానత్తు - జ్ఞానగలవాడనై, ఉళ్ళల్ గిన్ఱ -దేనియందును నిలకడలేక తిరుగుచుండు, ఎన్నై-నన్ను, ఒరుపొழுదిల్ - ఒకక్షణకాలములో, పారువన్ఱ - సాటిలేని, కేళ్వియన్-(ప్రపత్త్యుపదేశముయొక్క) వినికిగలవానినిగ, ఆక్కి - చేసి, నిన్ఱాన్- భూమియందవతరించియున్నారు, తెరివుఉత్తఱ - ప్రకాశమునుబొండిన. కీర్త్తి - మంచిపేరుగలవారై, శీర్ముగిల్ - చక్కనిమేఘము (పరమోదారులు) అయిన, ఇరామానుశన్ - ఎమ్బెరుమానార్లు, ఎన్నపుణ్ణియనో - ఎంతటిధార్మికులో? (ఉరువఱ్ఱఞాలత్తు, అని పాఠమైనయెడల మంచి అనునది ఒకటియులేనిజగత్తునందు, అనియర్థము)

తా.—సాంసారికప్రవృత్తులలో మోహించి మంచిజ్ఞానమును లభింపలేక మిగులక్రూరమైన దుష్కర్మముచే, దేహమేయాత్మయనుకొనుచు దేనియందును నిలుకడలేక తిరుగుచుండునన్ను ఒకక్షణమాత్రములోనే సకలసన్దేహములు నివర్తించునట్లును, తత్వహితపురుషార్థములను స్పష్టముగ బోధమగునట్లును, ఉపదేశించి ప్రపన్నుడగునట్లుచేసిరి, అంతట వర్షించునట్టి వర్షాకాలమేఘమనదగిన పరమోదారులైన అట్టి ఉడైయవరులయొక్క ఉపకారస్వభావముగొనియాడ నేనెంతటివాడనని. ౘ.

౬౩. శీర్కొణ్డుపేరఱమ్ శెయ్దు, నల్ వీడు శెఱిదుమెన్నుమ్
పార్కొణ్డమేన్మైయర్ కూట్టనల్లేన్, ఉన్ పదయుగమామ్
ఏర్కొణ్డవీట్టై యెళిదినిల్ ఎయ్దువన్ ఉన్నుడైయ
కార్కొణ్డవణ్మై, యిరామానుశా యిదుకణ్డుకొళ్ళే.

టీక.—శీర్ - (శమదమాదిఆత్మ) గుణములను, కొణ్డు - కలిగియుండి, పేర్అఱమ్ - పరమధర్మమగుప్రపత్తిని, శెయ్దు - చేసి, నల్ - పరమపురుషార్థలక్షణమగు, వీడు - మోక్షమును, శెఱిదుమ్ - పొందుదము, ఎన్నుమ్ - అనెడునిష్ఠగలవారైన, పార్కొణ్డ - భూమియందంతటను వ్యాపించిన, మేన్మైయర్ - మహిమగలభాగవతుల కూట్టన్-గోష్ఠియందు చేరినవాడను, అల్లేన్- కాను, రామానుశా!-ఉడైయవరే! ఉన్ - దేవరవారియొక్క, పదయుగమామ్ - శ్రీపాదములజంటయనెడు, ఏర్కొణ్డ -

సర్వవిలక్షణమైన, వీట్టై - పరమపదమును, ఎళిదినిల్ - ఆయాసము లేకుండునట్లు, ఎయ్
దువన్ - పొందుదును, (దానికిఁగారణము) కార్ కొణ్డ - (సకలవిధములుగ ఉపకరిం
టచేత) మేఘమునుజయించిన, ఉన్నడైయ - దేవరవారియొక్క, వణ్మై - ఔదార్య
ఇదు - దీనిని, కణ్డుకొళ్ - (నడవడియందు) చూడుడు. [నల్ వీడు పెఱుదుమ్) అను
కమైనయెడల అర్థమొకటియే, పార్ కొణ్డమేన్మై - లోకులంకఁటివల్లను గ్రహింపఁబ
శ్లాఘ్యుల, "ఏర్ కొణ్డవీట్టిల్" అనిపాఠమైనయెడల విలక్షణమైన మోక్షమందు, ఆ

తా.—శమదమాది ఆకిఞ్చన్య అనన్యగతిత్వరుచి విశ్వాసరూప సమస్తముక్తాధి
ణసంపన్నులై స్వరూపానురూపమగు ప్రపత్త్యుపాయమందన్వయించి మోక్షప్రాప్తి
సంశయంబులేక జగద్వ్యాపకమైన మహిమాతిశయము గలిగి ప్రథమపర్వనిష్ఠులనెడు
యఃపతి నాశ్రయించిన సమూహములోఁ చేరినవాడను గాను, ప్రథమపర్వమునకంటె
మిగుల నతిశయించియుండు దేవరవారి శ్రీపాదములజంటయనెడు విలక్షణమగు
మును నేను దేవరవారి నిర్హేతుకకృపచే ప్రయాసములేక లభింపఁగలను, ఈయం
నానడవడికచే తెలిసికొననగునని.

८४. కణ్డుకొణ్డేనెమ్మిరామానుశన్దన్నై, కాణ్డలుమే
తొణ్డుకొణ్డేనవన్ తొణ్డర్ పొఱ్కాళ్లిల్, ఎన్ తొల్లైవెన్నోయ్
విణ్డుకొణ్డేనవన్ శీర్ వెళ్ళవారియైవాయ్ మడుత్తి
న్ఱుకొణ్డేన్, ఇన్నముఱ్ఱనవోదిలులప్పిల్లైయే.

టీక.—ఎమ్ - (మమ్ముసుద్ధరించునట్టి స్వామియగు, ఇరామానుశన్ తన్నై - శ్రీ
యవరులను, కణ్డుకొణ్డేన్ - (యథాస్థితిగ) కనుగొంటిని, కాణ్డలుమ్ - ఇట్లు కన
న్నప్పుడే, (వారియందుమాత్రమేగాక) అవన్ తొణ్డర్ - వారి దాసులయొక్క, పొ
రమ్యమైన, తాళిల్ - శ్రీపాదములందు, తొణ్డుకొణ్డేన్ - కైంకర్యమును గ్రహించి
ఎన్ - నాయొక్క, తొల్లై - పురాతనమైన, వెమ్ - మిగులకఠినమగు, నోయ్
ములను, విణ్డుకొణ్డేన్ - పోగొట్టుకొంటిని, అవన్ - ఆయతిరాజులవారియొక్క
దివ్యగుణములయొక్క, వెళ్ళమ్ - ప్రవాహరూపమగు, వారియై - సముద్రమును, వాయ్
మడుత్తు - (అధికాపేక్షతో) నోరుతెఱచి, ఇన్ఱు - ఇప్పుడు, ఉణ్డుకొణ్డేన్ - భుజి
చినవాడనైతిని, ఇన్నమ్ - ఇంకను, ఉఱ్ఱన - నేనుపొందినదానిని, ఓదిల్ - చెప్ప
యెడ, ఉలప్పు ఇల్లై - దానికొకసమాప్తిలేదు.

తా—నాకు పాప్రిత్తశేషియైన ఉడైయవరులను కన్నులార సేవించి, ఆయానన్దము భాగవతపర్యన్తము వృద్ధిబొందుటచే ఆభాగవతులపాదారవిన్దములకు శేషభూతుడనై శత్రుభూతమైన దుష్కర్మమును నిశ్శేషముగ నివృత్తిచేసికొని వారియొక్క కల్యాణ గుణామృతమును అశరీర పానముచేసితిని, మఱియు నేనులభించినదానిని చెప్పనారం భించినయెడల ఒకగొప్పగ్రన్థముగఁ జెప్పవలసియుండుటచే అట్లుచెప్పి ముగింపనాచే శక్యముగాదని.

౭౧. ఓదియ వేద త్తినుట్పొరుళాయ్, అదనుచ్చిమిక్క
శోదియైనాద నెననవఱియాదుళ్ళల్ గిన్ఱతొణ్డర్,
పేదైమైతీర్త విరామానుశనైత్తొళుమ్ పెరియోర్,
పాదమల్లాలెన్ఱనక్కారుయిర్క్కు, యాదొన్ఱుమ్పత్ఱిల్లైయే.

టీక.—ఓదియ - తాము అధ్యయనము చేసియుండు, వేదత్తిన్ - వేదములయొక్క, ఉళ్ - లోగనున్న, పొరుళాయ్ - అర్థమై, అదన్ ఉచ్చి - ఆవేదశిరస్సులందు (వేదాన్తములయందు) మిక్క - సర్వాతిశయముగ, శోదియై - ప్రకాశించుచుండు శ్రియఃపతిని, నాదన్ ఎన - మనకుస్వామియని, అఱియాదు - గుర్తెఱుగక, ఉళ్ళల్ గిన్ఱ - (ఇతరవిషయములలోభ్రమఁజెంది) తిరుగుచుండు, తొణ్డర్ - (విషయములకు) లోపడినవారియొక్క, పేదైమై - అజ్ఞానమును, తీర్త - నివర్తింపఁజేసిన, ఇరామానుశనై - ఉడైయవరులను, తొళుమ్ - ఆశ్రయించుచున్న, పెరియోర్ - (మహిమగల) పెద్దలయొక్క, పాదమ్ అల్లాల్ - శ్రీపాదములనుదప్ప, ఎన్ఱన్ ఆరుయిర్క్కు - నాయాత్మకు, యాదొన్ఱుమ్ - వేరు యేదేనియొక, పత్ఱు - పట్టుదల, ఇల్లై - లేదు.

తా—సకలవేదప్రతిపాద్యుఁడును వేదాన్తములందు మిగుల విశదముగఁజెప్పఁబడు చుండు శ్రియఃపతియే మనకు సర్వస్వామియని తెలిసికొనక, తగని విషయములకు లోపడి దుఃఖముల ననుభవించుచుండు సంసారులయొక్క అజ్ఞానమును బోగొట్టిన, కృపాస్వరూపులగు ఉడైయవరులకు శేషభూతులైనవారి శ్రీపాదములనుదప్ప నా యాత్మకు వేఱొకయాశ్రయములేదని.

౭౨. పత్ఱామనిశర్ైప్పత్ఱి, యప్పత్ఱువిడాదవరే
ఉత్ఱారెనవుళన్ఱోడినైయేనిని, ఒళ్ళియనూల్
కత్ఱార్ పరవుమిరామానుశనైక్కరుదుముళ్ళమ్,
పెత్ఱార్ యవర్, అవరెమ్మైనిన్ఱాళుమ్ పెరియవరే.

టీక,—పఱ్ఱా - (ఆపదకునుసమ్పదకును) అనుకూలములేని, మనిశ్శై - మ
ష్యులను, పఱ్ఱి - ఆశ్రయించి, అప్పఱ్ఱు - ఆయాశ్రయణమును, విడాదవర్
లనివారే, ఉఱ్ఱార్ఎన - బన్ధువులుఅని, ఉళ్ఱన్ఱు - ( వారివెనుకనే ) తిరిగి,
( వారిదర్శనమెప్పుడుదిక్కనని ) పరుగెత్తి, ఇని - ఇకమీదట, నైర్త్త -
కొనువాడనుగాను, ఒళ్ళియ - స్పష్టముగ నర్థములను విశదీకరించుచున్న, నూల్
శాస్త్రములను, కఱ్ఱార్ - అభ్యసించియుండువారు, పరవుమ్ - స్తోత్రముచేయ
న్న, ఇరామానుశన్ - ఎమ్బెరుమానార్లను, కరుదుమ్ - అనుసన్ధించుటయే
నుండు, ఉళ్ళమ్ - మనస్సును, పెఱ్ఱార్ - (నిక్షేపమునుగన్నట్లు) లభించిన
యవర్ - ఎవరో (వారికులగోత్రాదులు యేరీతిగనైననుండనగును) అవర్ - వారు,
మ్మును, నిన్ఱు - (మాయాత్మలుండువరకును ) ఒకరీతిగనుండి, ఆళుమ్ - పరిపాలిం
నట్టి, పెరియవర్ - మహానుభావులగుపెద్దలు. (అగుదురు).

తా—ఇకమీద, సామాన్యులగు బద్ధసంసారులను బంధువులనుగ దలచి
శ్రయించి శ్రమమును బొందను, తత్వహితపురుషార్థములయొక్క స్థితిని దెలిసికొని
త్తులచే,స్తోత్రముచేయబడుచుండు ఉడైయవరులను ధ్యానించునట్టి మనస్సును, నిక్షేప
ను బొందినట్లు పొందినవారు ఎట్టివారైనను వారే నన్ను ఏలుకొనందగినవారని.

౮౭. పెరియవర్ పేశిల్లుమ్,పేదైయర్ పేశిలుమ్, తఙ్గళ్ కుణఙ్గ
ట్కు-రియశొల్లెన్ఱుముడైయవనెన్ఱెన్ను, ఉణర్విల్ మిక్కోర్
తెరియుమ్వణ్ కీర్త్తియిరామానుశన్మఱై తేర్న్దులగిల్
పురియునన్ఞానమ్, పొరున్దాదవరైప్పొరుమ్ కలియే.

టీక.—పెరియవర్ - ( మాట్లాడుటకుదగినజ్ఞానశక్తులుగల) మహాత్ములు,
లుమ్-మాట్లాడినను, పేదైయర్ - జ్ఞానములేనివారు, పేశిలుమ్ - మాట్లాడినను, తఙ్
తమయొక్క, కుణఙ్గళుక్కు-సుగుణములకు, ఉరియ-తగిన, శొల్ -(తమస్వరూపాదుల
వచించునట్టి) శబ్దములను, ఎన్ఱుమ్-ఎల్లప్పుడును, ఉడైయవన్-కలిగినవారు, ఎన్ఱెన్ఱు-
చెప్పి, ఉణర్విల్ మిక్కోర్ - మిగులజ్ఞానవన్తులైనవారు, తెరియుమ్ - పలుమారు
కించి యనుసన్ధించుచుండు, వణ్ కీర్త్తి - దివ్యకీర్తినిగలవారగు, ఇరామానుశన్ - ఎమ్బె
రుమానార్లు- మఱై - వేదమును, తేర్న్దు - పరామర్శించి, ఉలగిల్ - లోకమందు,
పురియుమ్ - (వ్యాఖ్యానాదులుచేసి) ఉపకరించిన, నల్ - విలక్షణమైన, ఞానమ్-
జ్ఞానమందు, పొరున్దాదవరై - చేరనివారిని, కలి - కలిదోషము, (కలియుగమునకభి
దేవతయగు శనిగ్రహము) పొరుమ్ - బాధించును. [కుణఙ్గట్కు, కుణంగళుక్కు, అ
రెండుపాఠములునుగలదు.]

తా—అతిశయించిన జ్ఞానశక్తులుగలవారును సామాన్యులును, వారివారిజ్ఞానశ క్తికిఁదగినమాటలచే స్తోత్రముచేయుటకు పొందికతో నమరియున్న స్వరూప రూపగుణ విగ్రహ విభూతులనుగలవారని జ్ఞానాధికులు కొనియాడుచుండునట్టి యతి స్సప్పన్నుల ఉడైయవరులచేఁ బ్రసాదింపఁబడిన విలక్షణజ్ఞానమును లభింపకయుండువారిని, కలి కాలము ఆక్రమించి జ్ఞానశూన్యులనుగఁ జేయునుగాని, ఆమహనీయుల జ్ఞానోపదేశమును లభించినవన్ను ఆశ్రయింపఁజాలదని.

౮౫. కలిమిక్క శెన్నెల్ కళనిక్కురైయల్, కలైప్పెరుమాన్
ఒలిమిక్కపాడలై యుణ్డుతన్నుళ్ళన్దడిత్తు, అదనాల్
వలిమిక్కశీయమిరామాముశన్ మఱైవాదియరామ్
పులిమిక్కదెన్ఱిప్పువనత్తిల్ వన్దమై పోత్తువనే.

టీక.—మిక్క - అతిశయించిన, కలి - (దున్నుట, నాటుట, కోయుట, వీని వలనగలిగిన) శబ్దముకలదై, శెన్నెల్ - ఎఱ్ఱని ధాన్యమునుగలిగియుండు, కళని - పొలము లుగల, కురైయల్ - తిరుక్కురైయలూరికి నిర్వాహకులై, కలై - శాస్త్రములను ప్ర వర్తింపఁజేసిన, పెరుమాన్ - మహిమగల తిరుమఙ్గైయాళ్వార్లయొక్క, మిక్క - అధికమైన, ఒలి - ధ్వనిగల, పాడలై - పెరియతిరుమొழిని. ఉణ్డు - (ధారకపోషక భోగ్యములుగ) అనుభవించి, తన్ - తమయొక్క. ఉళ్ళమ్ -హృదయమైనది, తడిత్తు- పుష్టిబొంది, అదనాల్ - దానిచేత,(ప్రతిపక్షమువారి మతములనుసహింపక) మిక్క- అతిశయించిన, వలి - బలముగల, శీయమ్ - సింహమువలెనుండు, ఇరామానుశన్ - ఉడైయవరులు, మఱై- వేదములను (ఒప్పుకొనినిలిచి) వాదియరామ్ - వాదములనుజేసి లోకమును నశింపఁజేసెడు, పులి - కుదృష్టులు అనెడు పులులు, మిక్కదు - అధికమై నది ఎన్ఱు - అని, ఇప్పువనత్తిల్ - (మంచిమతమును దూషించెడు) ఈభూమియందు, వన్దమై - (కుదృష్టులు మొదలగువారిని నిరసించుటకై) వచ్చియవతరించినవిధమును, పోత్తువన్ - స్తోత్రముచేయుదును.

తా—ఎఱ్ఱని వరిధాన్యము వృద్ధిఁబొందుచుండు పొలములుగల, తిరుక్కురైయ లూరికి నాథులగు తిరుమఙ్గైయాళ్వారులయొక్క దివ్యప్రబన్ధమగు పెరియ తిరుమొழియొ క్క శబ్దార్థాదులను అనుసన్ధించియానన్దించి,దుర్మతస్థులగు ప్రతివాదుల గ్రన్థమునుసహిం పనివారును, ప్రబలమైనసింహమువలెనుండు రామానుజమానార్లు, వేదములను సమ్మతిం పని బాహ్యులవలెగాక వేదములనొప్పుకొని వానికి విపరీతార్థములనుఁజెప్పి, లోకమును

జెఱచెను కుదృష్టిమతస్థులు అను పెద్దపులులను పాఱదోలుటకై, ఈభూమియం దవ-
రించినప్రకారమును స్తోత్రముచేయగలవాడని.

౯౯. పోఱ్ఱరుమ్‌శీలత్తిరామానుశ, నిన్ పుగళ్ తెరిన్దు,
శాత్ఱుమనన్ఱేలదుతాళ్వ్ సదుతీరిల్, ఉన్ శీర్ దనక్కోర్,
ఏత్ఱమెన్ఱేకొణ్డిరుక్కిలు మెన్ మనమే త్తియన్ఱి,
ఆత్ఱగిల్లాదు, ఇదఱ్కెన్నినైవా యెన్ఱిట్టఞ్జువనే.

టీక,—పోఱ్ఱు - స్తోత్రముచేసిముగించుటకు, అరుమ్- సాధ్యముగాని, శీల- సుశీలగుణముగల, ఇరామానుశ - ఓయెమ్బెరుమానార్లె! నిన్ - దేవరవారియొక్క, పుగళ్ - దివ్యకల్యాణగుణములను, తెరిన్దు-విమర్శించి, శాత్ఱుమ నేల్ -(లోకప్రసిద్ధమైనట్లు) విశదీకరించిచెప్పితినేని, (వసిష్ఠమహర్షి గుణములను చణ్డాలుడువర్ణించినట్లు) అది అట్లుచెప్పట. తాళ్వు - తక్కువయగును, అదుతీరిల్ - అట్లువిశదపఱచుటమానితి- నేని, ఉన్ శీర్ దనక్కు - దేవరవారి దివ్యగుణములకు, ఓర్ ఏఱ్ఱమ్ - ఒకఅతిశయము (కలుగును) ఎన్ఱుకొణ్డే- అనినిష్కర్షించియే, ఇరుక్కిలుమ్ - ఉన్ననూ, ఎన్ మనమ్- నా హృదయము, ఏత్తియన్ఱి - (దేవరవారిగుణములను) స్తుతింపక, ఆఱ్ఱగిల్లాదు - ధరించి యుణ్డఁజాలదు, ఇదఱ్కు - దీనికి, ఎన్నినైవాయ్ - (దేవరవారు) ఏమని అభిప్రాయ- మునుగొందురో, ఎన్ఱిట్టు - అని, అఞ్జువన్ - భయపడుచుందును.

తా,—సౌశీల్యాదిగుణములచే మహాప్రభావశాలులగు దేవరవారిని మిక్కిలి నీచుడగు నేను స్తోత్రముచేయుటచే దేవరవారికల్యాణగుణములకు దోషము సంభవించును అని స్తోత్రముచేయకుండుటయే ఉత్తమమైనది. అట్లు దేవరవారిదివ్యగుణములకు అవమానముగ స్తుతించుటకుదగిన సామర్థ్యము లేకున్నను నాహృదయముమాత్రము దేవరవారిని స్తోత్రముచేయక ధరించియుండ నేరదు. ఈవిషయమున దేవరవారేమని తలంతురో యని దాసునికి భయమగుచున్నదని.

౧౦౦. నిన్నైయార్ పిఱవిత్తుయర్మెనీక్కుమ్‌పిరానై, యిన్నిలత్తే,
మన్నైయాళవన్దవిరామానుశనై, యిరుజ్కవిగళ్,
పున్నైయార్ పున్నైయుమ్‌పెరియవర్ తాళ్ గళిల్ఞ్జొఱ్ఱ్ పై యిల్
వన్నైయార్, పిఱప్పిల్ వరున్దువర్, మాన్దర్ మరుళ్ శురన్దే.

టీక—. పిఱవియై - (తమ్మునెదలంచువారియొక్క) పుట్టుకను, నీక్కుమ్ - పోగొట్టునట్టి, పిరానై - ఉపకారకులైన యతిరాజులవారిని, నినైయార్ - తలచ నొల్లనివారు, నీళ్ - విశాలమైన? ఇన్నిలత్తే - ఈ భూమియంతయుఁ నుండగ, ఎన్నై - నన్ను

రి - పరిపాలించుటకై, వన్ద - (నేనున్న స్థలమును సమీపించి) వచ్చిన, ఇరామాను - ఎమ్బెరుమానారుల విషయముగ, ఇరుమ్ - (వారిగుణములను ప్రకాశింపఁజేయు) గొప్పదైన, కవిగళ్ - కవనములను, పునైయార్ - కట్టెడువారు లేరు, పునైయుమ్-(ఉడైయవరులవిషయముగ కవనములు) గట్టునట్టి, పెరియవర్ - పెద్దలయొక్క, తాళ్గళిల్ - శ్రీపాదములందు, పూన్తొడైయల్ - పుష్పమాలికలను, వనైయార్ - చేయరు (అలఙ్కరింపరు) మాన్దర్ - (ఇన్నిటికిదగినజన్మమెత్తియుండు ) మనుష్యులు, మరుళ్ శురన్దు - అజ్ఞానమతిశయించి, పిఱప్పిల్ - జన్మములందు, వరున్దువర్ - బాధనొందుచుందురు. (నినైవార్ పిఱవియై, అనిపాఠమైనయెడల, నినైవార్ - తమ్ముధ్యానించువారియొక్క అని అర్థము).

తా.—ఉడైయవరులు లోకులస్థితినికటాక్షించి, వీరు యోగ్యులు వీరు అయోగ్యులనియెంచక అందఱిని యనుగ్రహించుటకైవచ్చి యవతరించియుండగ, ఈలోకుల లోనెవరైనను తమ్మును సకృత్తుగ ధ్యానించినయెడ, అట్టివారియొక్క అనాదియై యేనాటికి నశింపని సాంసారికదుఃఖమునుబోగొట్టునట్టి పరమకారుణికులగు యెమ్బెరుమానారును దలంచువారుగారు, నన్ను రక్షించుటకై నేనున్నస్థలమును వెదకివచ్చిన వీరినిమధురమైనకవనములచే స్తుతించువారునుగారు. అట్లు స్తుతించుటకు శక్తిలేకపోయినను స్తుతించువారి శ్రీపాదములను ఆరాధించువారునుగారు. అయ్యో!వీనికన్నిటికిని ఉపయుక్తమైన మనుష్యజన్మమెత్తియుండియును, అజ్ఞానముచే దుఃఖించుచున్నారే అని.

౫౧. మరుళ్ శురన్దాగమవాదియర్ కూఱుమ్, అవప్పొరుళామ్,
ఇరుళ్ శురన్దెయ్ త్తవులగిరుళ్ నీఙ్గ, త్తన్నీణ్డియశీర్,
అరుళ్ శురన్దెల్లావుయిర్ గట్కునాదనరఙ్గనెన్నుమ్
పొరుళ్ శురన్దాన్, ఎమ్మిరామానుశన్మిక్కపుణ్ణియనే.

టీక.—మరుళ్ -అజ్ఞానమంతయును, శురన్దు-ఒకటిగాయైకూడి, ఆగమవాదియర్ - రుద్రుడుచెప్పిన శైవాగమమును ప్రమాణముగబట్టుకొని వాదించుచుండు పాశుపతాది మతస్థులు, కూఱుమ్ - (రుద్రపరత్వమును) చెప్పుచున్న, అవమ్ - మిగులహీనమైన, పొరుళామ్ - అర్థములనెడి, ఇరుళ్ - అంధకారము, శురన్దు - అతిశయించి, ఎయ్ త్త - (పొందిన) నశించిన, ఉలగు - లోకముయొక్క, ఇరుళ్ - చీకటి, నీఙ్గ - తొలగిపోవునట్లు, తన్ - తమయొక్క, ఈణ్డియ - కూడిన, శీర్ - (ఆశ్రితరక్షణరూపమగు) వైలక్షణ్యముగల, అరుళ్ - కృపను, శురన్దు - పాఱునట్లుచేసి, అరఙ్గన్ -శ్రీరఙ్గనాథుఁడు, ఎల్లావుయిర్ గట్కుమ్ - సకలాత్మలకును, నాదన్ - నిర్వాహకుఁడు, ఎన్నుమ్-అనెడి,

పారుళ్ - అర్థమును, మిక్కపుణ్ణియర్కు - పరమధార్మికులగు, ఎమ్ఇరామానుశర్ - యెమ్బెరుమానార్లు, ఉరర్దాన్ - ఉపకరించినవారైరి.

(మఱప్పొరుళ్ అని పాఠమైనయెడల, మఱప్పొరుళ్ - ఘాతుకమైన అర్థము అనగా ఆత్మనాశకమైనదనిభావము, "మఱైప్పొరుళ్" అని పాఠమైనపుడు, ప్రశంసాపరములైన వేదవాక్యములను గ్రహించుకొని వేదమున్ను ఇట్లేచెప్పినదని, శైవాగమవాక్యములుచెప్పెడు విపరీతార్థములకు, ఆధారముగాఁజెప్పెడు శివపరత్వమును ప్రతిపాదించు వేదశ్రుతియనియెడుఅంధకారమనిభావము).

తా.—శైవాగమమును ఆధారమ్ముగాఁజేసికొని రుద్రపశుపాతులగు పాశుపతాదిమతస్థులు వాదించు దుస్తర్కములు అను చీకటిని భూమియందుండి తొలగిపోవునట్లుచేసి ఉడైయవరులయొక్క నిర్హేతుక పరమకృపను లోకమంతటను ప్రవహింపఁజేసి సకలాత్మలకును ప్రత్యక్షముగ సేవసాదించుచుండు (పెరియపెరుమాళ్లే) శ్రీరఙ్గనాథుడే స్వామియనునర్థమును మనకంతయును భూరిదానముచేసిన యతిరాజులవారి మహోపకారమును స్తుతించుటకు నేను శక్తుడను కానని.

౯౨. పుణ్ణియనోన్బుపురిన్దుమిలేన్, అడిపోత్రిశెయ్యుమ్,
నుణ్ణరుఙ్గేళ్వినువన్దుమిలేన్, శెమ్మైనూల్ప్పులవర్కు
ఎణ్ణరుఙ్గీర్త్తియిరామానుశవిన్ఱునీపుగున్దు, ఎన్
కణ్ణుళ్ళుమ్నెఞ్జుళ్ళుమ్, నిన్ఱవిక్కారణమ్కట్టురైయే.

టీక.—పుణ్ణియనోన్బు - (ఈపురుషార్థమునకుసాధకముగ) ఒకపుణ్యవ్రతమును, పురిన్దుమ్ - అనుష్ఠించుటను, ఇలేన్ - లేనివాడనైతిని, అడి-శ్రీపాదములను, పోత్రి, శెయ్యుమ్ - ఆశ్రయించుటకుసాధకమైన, నుణ్ - సూక్ష్మమై, అరుమ్ - దుర్లభమైన, కేళ్వి - శ్రవణమును, నువన్దుమిలేన్ - (వినవలయునని) కోరినవాడనుగాను, శెమ్మై - అనన్యప్రయోజనులై, నూల్ - శాస్త్రరూపమగుకవనములను, పులవర్కు-చెప్పుటకు సామర్థ్యముగలవారికి, ఎణ్ణరుమ్ - గణింపశక్యముగాని, కీర్త్తి -యశస్సుగల, ఇరామానుశా - ఉడైయవరే! నీ - ఇట్టిప్రభావాతిశయముగలదేవరవారు ,(అనాదికాలము లేక) ఇన్ఱు - ఇప్పుడు, ఉగన్దు - సన్తోషించి, ఎన్ - నాయొక్క, కణ్ణుళ్ళుమ్ - కన్నులలోను, నెఞ్జుళ్ళుమ్ - హృదయములోను, నిన్ఱ -విషయమైనిలిచిన, ఇక్కారణమ్ - దీనికారణమును, కట్టురై - దేవరవారే అనతీయవలయును.

తా.—ఓరామానుశా! దాసుడను దాసునికిఁదెలిసి కొంచెమైనను ఒక సత్కర్మమునుఁచేసినవాడనుగాను, అవిధముగనే ఉత్తారకమైయుండు సూక్ష్మమైన యేదేనియు

ంశేషార్థమును వినఁగోరి ఒకరితో ప్రస్తావించినవాడనుగాను, నాయొక్క స్థితి ఇంతమా త్రమైయుండఁగ, మంచిశాస్త్రప్రవర్తకులైనవారికిని వర్ణింపతరముగాని సుగుణప్రసిద్ధిగల రేవారు, ఇంతకాలమూరకుండి ఇపుడు నన్ను సమీపించి సేవసాదించుచు నాకర్మ నే త్రములలోను జ్ఞాననేత్రములలోను ప్రవేశించి యుండుటకు హేతువేమో అనతీయవల యునని.

౯౩. కట్టప్పొరుళై మఱై ప్పొరుళెన్ఱు, కయవర్ శొల్లుమ్
పెట్టై క్కెడుక్కుమ్ పిరానల్లనే, యెన్ పెరువినైయై
క్కిట్టిక్కిழఙ్గొడు తన్నరుళెన్నుమ్ ఒళ్ వాళురువి
వెట్టిక్కళైన్ద, విరామానుశనెన్నుమ్ మెయ్ త్తవనే.

టీక.—ఎన్-నాయొక్క, పెరువినైయై - (అనుభవప్రాయశ్చిత్తములచేతనున శింపని) మహాపాపములను, (చూచి) కిట్టి - సమీపించి, కిழఙ్గొడు - (మరలను ఉత్ప త్తికారణమగు) దుంపతోఁగూడ, తన్ - తనయొక్క, అరుళెన్నుమ్-కృపయనెడు, ఒళ్ - (చక్కఁగసానపెట్టుటచే) ప్రకాశించుచుండు, వాళ్ - కత్తిని, ఉరువి-(ఒఱ లోనుండి) ఈవలికిదీసి, వెట్టిక్కళైన్ద - నరికిపాఱవైచిన, మెయ్ త్తవన్ ఎన్నుమ్-వాస్త వమైనతపస్సు (ప్రపత్తి) గలవారని ప్రసిద్ధినొందిన, ఇరామానుశన్ - ఎమ్బెరుమానార్లు, కట్టప్పొరుళై - మిక్కిలినిహీనమైనయర్థములను, మఱైప్పొరుళెన్ఱు - వేదార్థములని, కయవర్ - దుర్మార్గులైన (కుదృష్టులు), శొల్లుమ్ - చెప్పెడు, పెట్టై - భ్రమింపఁజేసెడు మాటలను, కెడుక్కుమ్ - నశింపఁజేసిన, పిరాన్ అల్లనే - ఉపకారకులుగదా.

తా.—ప్రపన్నకులమునకంతటికిని ఉత్తారకులైన యెమ్బెరుమానార్లు, తమసంక ల్పము అను ఒరలోనుండి కృపయనుకత్తినిదీసి, దానిచే నాయొక్క ప్రబలపాతకములను నిశ్శేషముగబోవునట్లు నరికిపాఱవైచి తమవిపరీతజ్ఞానముచే విజృంభించిన అపరాధము లన్నిటిని వేదార్థములని, పరమమూఢులగుకుదృష్టులు చెప్పెడు భ్రమింపఁచేయునట్టి మాటలను, చక్కఁగ నివర్తింపఁజేసిన పరమోపకారులగుటచే, వారు చేయునదియంతయు ఉత్కృష్టమైయుండునని.

౯౪. తవన్దరుమ్ శెల్వమ్ తగవుమ్ తరుమ్, శరియాప్పిరవి
ప్పవన్దరుమ్ తీవినై పాऱ్ఱి త్తరుమ్, పరన్దామమెన్నుమ్,
తివన్దరుమ్ తీదిలిరామానుశన్ తన్నై చ్చార్న్దవర్ గ
ట్కువన్దరున్దేన్, అవన్ శీరన్ఱి యానొన్ఱుమ్ ఉళ్ మగిழ్న్దే.

టిక.—తీదు - (ఆశ్రితులు దుఃఖపడుచుండగఁజూచునట్టి) దోషము, ఇల్
లేని, ఇరామానుశన్ - ఉడైయవరులు, తన్నై - తమ్మును, శార్న్దవర్గట్కు-ఆశ్రయిం
చినవారికి, తవమ్ - ప్రపత్తినిష్ఠను, (శరణాగతిరూపమగుతపస్సును) తరుమ్ - (కృప
యుంచి) యిత్తురు, శెల్వమ్ - భక్తియనుసంపదను, తగవు - (ఫలమునకు) దగునట్లు,
తరుమ్ - ఇత్తురు, శరియా - ఒకనాటికినినళింపని, పిఱవి - పుట్టుకవలనఁగలిగిన, సంస
సంసారమును, తరుమ్ - పైపైగఁ గలుగఁజేసెడు తీవినై - క్రూరకర్మములను, పోక్కి
అణురూపమైనదుమ్మనునట్లు; 'తరుమ్ - 'చేసియిత్తురు, అనఁగా' (పోగొట్టుదురు), పరమ
మమ్ఎన్నుమ్ - పరమపదముఅనెడు, తిఱమ్ - పరమాకాశమగు శ్రీవైకుణ్ఠమును, త
మ్ - ఇప్పింతురు, (వారుఇట్లుసర్వమునిచ్చినను) యాన్ - నేను, అవన్ - ఆయెమ్బె
మానార్లయొక్క, శీర్అన్ఱి - గుణములనుదప్ప, ఒన్ఱైయుమ్ - ఒకటినిన్ని, ఉళ్ మ
న్దు - మనఃప్రీతితో, ఉవన్దు - ఆశగలిగి, అరున్దేన్ - భుజింపను.

(శలియాప్పిఱవిఅని పాఠమైనయెడల, శలియా - చలింపని, ఒకనాటికినివదల
సంసారదుఃఖమనిభావము).

తా.—తమ్ము నాశ్రయించినవారికి ఏదేనికొంచెము వ్యసనముగలిగినయెడ సహిం
జాలని, ఉడైయవరులు, తమయాశ్రితులకు సర్వోత్తారకహేతువును స్వరూపానురూ
నగు ప్రపత్త్యుపాయమునున్ను భక్తినిన్ని కృపచేయుదుర్లు, ఈసంసారిచేతనుని సం
చి యేనాటికినివదలకుండు జననాదిదుఃఖవర్ధకమైన దుష్కర్మములనుఁబోగొట్టి పరమ
రుషార్థలక్షణమగు మోక్షమునుఇత్తురు. ఇట్లు ఆయెమ్బెరుమానార్లు, మహోపకారక
నను, నేను వారికల్యాణగుణములనుదప్ప వేఱొకటినియాశించి యనుభవింపనని.

౯౫. ఉణ్ణిన్ఱుయిర్గళుక్కుఱ్ఱనవేశెయ్దు, అవర్క్కుయవే,
పణ్ణుమ్పరనుమ్పరివిలనామ్బడి, పల్లుయిర్క్కుమ్,
విణ్ణిన్తలైనిన్ఱువీడళిప్పానెమ్మిరామానుశన్,
మణ్ణిన్తలత్తుదిత్తు, మత్తైనాలుమ్వళర్త్తననే.

టీక.—ఉళ్ - (సత్తగలుగఁజేయుటకై) లోపలనుండి, ఉయిర్గళుక్కు-
యాత్మలకు, ఉఱ్ఱనవే - తగినకార్యములనే, శెయ్దు - చేసి, అవర్క్కు-ఆయా
లకు, ఉయవే - ఉజ్జీవనమునే, పణ్ణుమ్ - చేయుచున్న, పరనుమ్ - సర్వస్వామియు
శ్రియఃపతియును, పరివిలనామ్బడి - (ఆత్మలవిషయమందుప్రీతివలె) స్నేహముగలవా
కాదు అనునట్లు, పల్లుయిర్క్కుమ్ - సకలాత్మలకును, వీడు - (పరమపురుషార్థలక్ష
మోక్షమును, అళిప్పాన్ - ఇప్పించుటకొఱకై, ఎమ్ - మాయొక్క-నాథులైన,

ఉన్ - ఉడైయవరులు, విణ్ణిన్ తలైనిన్రుమ్ - ఆకాశముయొక్క శిరస్థానమైన శ్రీవైకుణ్ఠముదుండి, మణ్ణిన్ తలత్తు - ఈభూమణ్డలమందు, ఉదిత్తు, అవతరించి, మఱైనాలుమ్-నాలుగు వేదములను, వళర్త్తనన్ -విశేషముగవృద్ధిబొందునట్లు చేసిరి. (పల్లుయిర్కు), అని యుమపాఠముగలదు అర్థమొకటియే)

తా. — సకలాత్మలకును అన్తర్యామియై వారిసకల ప్రవృత్తినివృత్తులకును గారణభూతుండైన సర్వేశ్వరుడుగూడ, ఈవుడైయవరులవలె ఆశ్రితవిషయమందు వ్యామోహముగలవాడు కాడనియును నీరుజ్ఞానభక్తి వైరాగ్యాది దివ్యగుణములచే సంసారులకంటెను అత్యన్తతారతమ్యముగలిగియుండుటచే, పరమపదమునుండి యేనాడును సంసారగన్ధమెరుగని యొకరు సకలచేతనులకును ఆపరమపదమును కృపచేయవలయును అనునట్టి మహోపకారము కొఱకై ఈలోకమందు ఎమ్పెరుమానారులై అవతరించి దుర్మతముల నణంచి వేదమార్గమును ప్రతిష్ఠింపఁ జేసిరని.

౯౬. వళరుమ్పిణిగొణ్డవల్వినైయాల్, మిక్కనల్వినైయిల్
కిళరుమ్తుణివుకిడైత్తఱియాదు, ముడైత్తలైయూన్,
తళరుమళవుమ్తరిత్తుమ్విழுన్దుమ్తనిదిరివేఱ్కు
ఉళర్ఎమ్మిఱైవర్, ఇరామానుశన్తన్నై యుత్రవరే.

టీక.-వళరుమ్ - వృద్ధిబొందుచున్న, పిణి - దుఃఖమును, కొణ్డ - కలుగఁజేయునట్టి, వల్ - (అనుభవప్రాయశ్చిత్తాదులచే నశింపనట్లు) ప్రబలమైన, వినైయాల్ - పాపకర్మచే, మిక్క - అతిశయించిన, నల్ వినైయిల్ - పరమధర్మమైన శరణాగతియందు, కిళరుమ్ - అతిశయించుచున్న, తుణివు - విశ్వాసము, కిడైత్తఱియాదు - నేరుగలభింపక, ముడైత్తలై - స్వభావదుర్గంధస్థానమైన, ఊన్ - శరీరము, తళరుమళవుమ్ - బలహీనమగువఱకును, తరిత్తుమ్ - ధరించియును, విழுన్దుమ్ - (క్రూరమైన శబ్దాదివిషయములందు) పడియు, తని - (సహాయములేక) ఒంటరిగా, తిరివేఱ్కు - సంచరించుచున్న నాకు, ఎమ్మిఱైవన్ - మనకునాథుఁడైన, ఇరామానుశన్ తన్నై - ఉడైయవరులను, ఉత్రవర్ - ఆశ్రయముగఁబట్టియుండువారు, ఉళర్ - సహాయులైయున్నారు.

(ఎమ్మిఱైయవర్" అనిపాఠమైన యెడల (ఉడైయవరులయొక్క భక్తులు) మనకు స్వాములని అర్థము).

తా. — శరణాగతిని (ప్రపత్తిని) లభించుటకు ప్రబలకర్మములు ప్రతిబన్ధకములైయున్నవి. ఆప్రపత్తికి మహావిశ్వాసము ముఖ్యమైయుండగ నదికలుగక దుర్గన్ధప్రచురమై మాంసరక్తాది మయమైనదేహము దుర్బలమగువరకును, సుఖదుఃఖములను అనుభవించుచు

నొంటరిగనుండునాకు, ఆచరమోపాయమగు ఉడైయవరులకంటెను వారియొక్క దాసులై మిగుల సులభులై మాకు స్వాములునైయుండువారి నే సకలవిధబన్ధువులుగ నభ్యసించి ఇతరదైవమును గుర్తెఱుగకయుండు మహాత్ములే మార్గసహాయులై రక్షకులైయుందురని విశ్వసించి యున్నవాడనని.

౯౭. తన్నై యుత్తాళ్చ్చెయ్యుమ్ తన్మైయినోర్, మన్ను తామరై త్తాళ్
తన్నై యుత్తాళ్చ్చెయ్య వెన్నై యుత్తాన్ ఇన్ఱు, తగవాల్
తన్నై యుత్తారన్ఱి త్తన్మైయుత్తారిల్లై యెన్ఱఱిన్దు
తన్నై యుత్తారై, యిరామానుశన్ గుణమ్ శాత్తిడుమే.

టీక.—తన్నై - తమ్మును, ఉత్తార్ అన్ఱి - ఆశ్రయించినవారుగలరు ఇంతేకాని, తన్నై - తమ్మును, ఉత్తారై - ఆశ్రయించియుండు వారియొక్క, గుణమ్ - సద్గుణములను, శాత్తిడుమ్ - సఙ్కీర్తనము చేయడమను, తన్మై - స్వభావమందు, ఉత్తార్ - పొందియుండువారు, ఇల్లైఎన్ఱు - లేరు అని, అఱిన్దు - గ్రహించి, తన్నై - తమ్మును ఉత్తు - (ఇతరవిషయసఙ్గములేక) ఆశ్రయించి, ఆళ్ శెయ్యుమ్ - తమకు దాస్యము చేయుటయే, తన్మైయినోర్ - స్వభావముగగల వారియొక్క, మన్ను - ఒకటికొకటి పొందియున్న, తామరై - తామరపుష్పమువలె పరమభోగ్యమైయుండు, తాళ్ తన్నై - శ్రీపాదములనుదప్ప, ఉత్తు - (వానికితరములనొకటినిస్మరింపక) ఆశ్రయించి, ఆళ్ శెయ్య - (వారికి) దాస్యము చేయునట్లు, ఇరామానుశన్ - ఎమ్బెరుమానార్లు, తన్ - తమయొక్క, తగవాల్ - కృపచేత, ఇన్ఱు - ఈసమయమందు, ఎన్నై - నన్ను, ఉత్తాన్ - కరుణించి యఙ్గీకరించిరి.

తా.— ఉడైయవరులు లోకమందు తమను ఆశ్రితులుగలరుగాని, తమయాశ్రితులయొక్క దివ్యగుణానుభవ కైఙ్కర్యములను చేయువారు లేరని తెలిసికొని, విషయవిరక్తులై తమ్మునాశ్రయించి తమకు దాస్యము చేయుటయే స్వభావముగఁగలిగియుండు భాగవతులయొక్క భోగ్యమైన శ్రీపాదములను ఆశ్రయించి, వారికి దాస్యము చేయునట్లు దాసునియందు కటాక్షముంచి ఎమ్బెరుమానార్లు దాసునికి లభింపఁజేసిరని.

౯౮. ఇడుమే యినియశువర్క్కత్తిల్, ఇన్నమ్ నరగిలిట్టు,
చ్చుడుమే యవత్తైత్తొడర్ దరుతొల్లై, చ్చుழల్ పిఱప్పిల్
నడుమే యినినమ్మిరామానుశన్ నమ్మై నమ్ వశత్తే,
విడుమే శరణమెన్ఱాల్, మనమే నైయల్ మేవుదర్కే.

టీక.—నమ్ - మనలను ఉద్ధరించుటకై అవతరించిన, ఇరామానుశన్ - ఉడైయ వరు, శరణమ్ఎన్రాల్ - (దేవరవారే) రక్షకులని ఒకమాటమాత్రము చెప్పినయెడల, (సంసారులకు శబ్దాదిభోగ విషయములచే) ఇనియ - ఇష్టముగఁ దోఁచియుండు, శువర్క త్తిల్ - స్వర్గమందు, ఇడుమే - ఉంచియుందురో, ఇన్నమ్ - తమతిరువడిగళను ఆశ్ర యించినవెనుక, నరగిల్ - నరకమందు, ఇట్టు - ఉంచి, శుడుమే - తపింపఁజేయుదురో, అవత్తై - ఆస్వర్గనరకములను, తొడర్ తరు - అనుసరించి యుండునదియై, తొల్లై - ప్రాచీనమై, శుళల్ - చక్రమువలె తిరిగితిరిగి వచ్చుచుండు, పిఱప్పిల్ - జన్మమందు, నడుమే - నిలుపుదురో, ఇని - ఇకజరుగఁబోవుకాలము, నమ్మై - మనలను, నమ్వశత్తే - వారియిష్టప్రకారముగ, విడుమే - విడుతురో, మనమే - ఓమనసా! మేవుదఱ్కు - ప్రాప్తి పొందుటకై, నైయల్ - చిన్తింపవలదు.

తా.— ఓమనసా! మనలను సంరక్షించుటకై యవతరించిన ఉడైయవరులే రక్షకులని వారిశ్రీపాదముల నాశ్రయించి శరణాగతిచేసిన వెనుక స్వర్గమందుంతురో, నర కమందుంతురో, జననాది రూపమగు సంసార చక్రమందుంతురో,యథేచ్ఛముగఁ దిరుగని త్తురో,ఆనెడుసన్దేహముతో పరమపదప్రాప్తినిగుఱించినీవుదుఃఖింపవలసినకార్యములేదని.

౯౯. తఱ్కచ్చమణరుమ్ శాక్కియప్పేయ్గళుమ్, తాళ్ శడైయోన్,
శొల్కఱ్ఱశోమ్బరుమ్ శూనియవాదరుమ్, నాన్మఱైయుమ్,
నిఱ్కక్కుఱుమ్బుశెయ్నీశరుమ్ మాణ్డనర్ నీణిలత్తే,
పొఱ్కఱ్పగమ్, ఎమ్మిరామానుశమున్నిపోన్దపిన్నే.

టీక.— పొన్ - కోరదగిన, కఱ్పగమ్ - కల్పవృక్షమువలె మహాత్మైన ఔదా ర్యముగల, ఎమ్ - (ఆయౌదార్యమును) మనకు ప్రకాశింపఁజేసిన, ఇరామానుశముని - శ్రీభాష్యకారులు, నీళ్ నిలత్తే - ఈమహాభూమియందు, పోన్దపిన్ - వచ్చియవతరించిన వెనుక, తర్కమ్ - సామర్థ్యముతో తర్కించుచు తమ మతమును పరిపాలించుచుండు, శమణరుమ్ - జైనులును, పేయ్ - పిశాచపు పట్టుగల, శాక్కియర్గళుమ్ - బౌద్ధులును, తాళ్ - వ్రేలాడుచుండు, శడైయోన్ - జటలను ధరించి మోహనశాస్త్రముచేసి నరుద్రుడును, శొల్ - వచనమైన శైవాగమమును, కఱ్ఱ - అధికరించియుండు, శోమ్బరుమ్ - తామసులగు శైవులును, (ప్రమాణము, ప్రమాత, ప్రమేయములగు మూడు వస్తువులు) శూనియ వాదరుమ్ - సర్వమును శూన్యమని వాదించునట్టి మాధ్యమికులును, నాన్ - (ఋగాది భేదముచే) నాల్గువిధములై యుండు, మఱైయుమ్ - వేదములును, నిఱ్క - ప్రమాణములుగ నఙ్గీకరించి యుణ్డగను ( ఆ వేదములకు సంబన్ధములేని యర్థము

లను ఉయుక్తులుగఁజెప్పి) తుఱుమ్పు శెయ్ - వైషమ్యమును జేయుచున్న, నీశరుమ్, నీచులైన కుదృష్టిమతస్థులును, మాన్దనర్ - నాశమునొందిరి.

తా.— అభీష్టముల నిప్పించుటయందు కల్పవృక్షమువంటి యతిరాజుల వా అవతరించి శ్రీభాష్య గ్రన్థమునుజేసి వేదములయొక్క వాస్తవార్థములచే నితరమతము నిరసించి అట్టి పరమార్థము నుపదేశించుటచే, తర్కసామర్థ్యములో తమ మతము గాపాడుకొనెడు జైనులును, తత్త్వార్థమును దెలిసికొనక మోటు పట్టుదల యుండు బౌద్ధులును, మోహనశాస్త్రప్రవర్తకుడగు రుద్రుఁడు వచించునట్టి శైవాగమ నధికరించియుండు తామసులైన శైవులును కంటికగుపడు వస్తువులుదప్ప మఱియేదియు లేదని వాదించునట్టి మాధ్యమికులును, చతుర్వేదములను ప్రమాణముగ నఙ్గీకరించిఅర్థ ములనుఁజెప్పి వైషమ్యమును జేయునట్టినీచులగు కుదృష్టి మతస్థులునశించినవారైరి.

౧౦౦ పోన్దదెన్నెఞ్జెన్నుమ్పొన్వణ్డు,ఉనదడిప్పోదిల్లొణ్శీరా మ్
తేన్దెళిదేనుణ్ణమర్ న్దిడవేణ్డి, నిన్పాలదువే,
యీన్దిడవేణ్డుమిరామానుశ్శవిదువన్ఱియొన్ఱుమ్,
మాన్దగిల్లాదు,ఇనిమఱ్ఱొన్ఱుకాట్టిమయక్కిడలే.

టీక.— ఎన్ - నాయొక్క, నెఞ్జు ఎన్నుమ్ - మనస్సుఅనెడు, పొన్ - రత్న మైన, వణ్డు - తుమ్మెద, ఉనదు - దేవరవారియొక్క, అడి - శ్రీపాదములనెడు, పో ల్ - పుష్పమందలి, ఒణ్శీరామ్ - (శైత్యమార్దవ సౌగన్ధ్యాది) కల్యాణగుణములనెడు తెళి - నిర్మలమైన, తేన్ - తేనెను, ఉణ్డు - పానముచేసి. అమర్ న్దిడవేణ్డి - అచ్చో టనే నిత్యవాసము చేయవలయునని, నిన్పాల్ - దేవరవారియొద్దకు, పోన్దదు - వచ్చి నది, ఇరామానుశా, ఉడైయవరే, అదువే- దానినే, ఈన్దిడవేణ్డుమ్ - (దేవరవారు దయ జేసి) ఇప్పింపవలయును- ఇదుఅన్ఱి - దీనినితప్ప, ఒన్ఱుమ్ - వేఱొక వస్తువును, మాన్ద గిల్లాదు - భుజింపజాలదు, (దేవరవారు దలచినట్లైన అదియును జేయింపవచ్చును) ఇని - ఇకమీదు, మఱ్ఱొన్ఱు - వేఱొకదానిని, కాట్టి - చూపి, మయక్కిడల్ - భ్రమింపకుండునట్లు చేయవలయును.

తా.— శ్రీరుక్మిణీదేవి శ్రీకృష్ణుని వైభవమునువిని వానిని వరింప వలయునని సంభ్రమించినట్లు, నామనస్సనెడు తుమ్మెద దేవరవారి శ్రీపాదములనెడు పుష్పమందలి తేనెను భుజించి, అచ్చటనే వసింపవలయునని వచ్చినది, యతిరాజా! దేవరవారు నిర్హే తుక కృపచే దాని నిప్పింప వలయును. దానినితప్ప వేఱొక వస్తువును భుజింప జాలదు, కనుక ఇక వేఱొక విషయమును జూపి భ్రమనొందునట్లు చేయవలదని.

౧౦౧ మయక్కుమ్ఱిరువినైవల్లియిల్పూణ్డు, మదిమయఙ్గి,
త్తుయక్కుమ్పిఱవియిల్తోన్ఱియవెన్నై, త్తుయరగఱ్ఱి,
ఉయ్యక్కొణ్డునల్గుమ్ ఇరామానుశవెన్ఱదున్నైయున్ని,
నయక్కుమవర్క్కిదిఴుక్కెన్బర్, నల్లవరెన్ఱునన్దే.

టీక.— మయక్కుమ్ - అజ్ఞానమును గలుగఁజేసెడు, ఇరు - పుణ్యపాపములచే రెండు విధములైన, వినై - కర్మములనెడు, వల్లియిల్ - దారముచే, పూణ్డు - కట్టబడి, మదిమయఙ్గి - బుద్ధికలవరించి, తుయక్కుమ్ - (మనస్సును) త్రిప్పుచున్న, పిఱవియిల్ - జన్మమందు, తోన్ఱియ - పుట్టిన, ఎన్నై - నన్ను, తుయర్ - కర్మఫలమైన దుఃఖములను, అగఱ్ఱి - పోఁగొట్టి, ఉయ్య - ఉజ్జీవించునట్లు, కొణ్డు - అంగీకరించి, నల్గుమ్ - స్నేహమును జేసిన, ఇరామానుశా - ఉడైయవరే, ఎన్ఱు - అని, ఇదు - (దేవరవారియొక్క పరిశుద్ధతను సంభాషించిన)ఇది, ఉన్నై - దేవరవారిని, ఉన్ని -అనుసంధించి, నైన్దు - శిథిలులై, ఎన్ఱుమ్ - సర్వకాలమును, నయక్కుమవర్క్కు - ప్రేమ చేయువారికి, ఇఴుక్కు - తక్కువ (అని),నల్లవర్ - సత్పురుషులైన వారు, ఎన్బర్ - చెప్పుదురు.

("వల్లియై" అనిపాఠమైనయెడల, వల్లియై - వలను, పూణ్డు - తగిలించుకొని అని అర్థము).

తా.—"విషయాసక్తిగల మనస్సుగలవాడనై చేసియుండు దుష్కర్మములచే జన్మపరంపరలలో సంచరించుచుండు నన్ను, నాదుఃఖములనన్నిటిని బోఁగొట్టి ఉజ్జీవించునట్లు అంగీకరించి కృపచేసిన రామానుజా! అని దేవరవారియొక్క పావనత్వమును క్రిందు అనేకస్థలములలో నేను అనుసన్ధించిన యిది,దేవరవారిని యనుసన్ధించి ద్రవవస్తువువలె శిథిలులైపోవువారికి, అవద్యమైయుండునని,జ్ఞానాధికులైనవారు ఎల్లప్పుడును చెప్పుదురని.

౧౦౨ నైయుమ్మనమ్మున్ఱుణఙ్గళై యున్ని, నానావిరున్దు ఎమ్
మైయనిరామానుశనెన్ఱఴైక్కుమ్, అరువినైయేన్
కైయుమ్దొఴుమ్కణ్కరుదిడుఙ్గాణ్కడల్పుడైశూఴ్
వైయమిదినిల్, ఉన్వణ్మైయెన్పాల్ఎన్వళర్న్దదువే.

టీక.—మనమ్ - హృదయమైనది, ఉన్ - దేవరవారియొక్క, గుణఙ్గళై - దివ్యగుణములను, ఉన్ని - అనుసన్ధించి, నైయుమ్ - తనలోతాను శిథిలమగుచున్నది, ఎన్ - నాయొక్క, నా - నాలుకయైనది, ఇరున్దు - (ఒకరీతిగ) ఉండి, ఇరామానుశన్ - ఉడైయవరులు, ఎమ్ఐయన్ - మనస్వామి, ఎన్ఱు - అని, అఴైక్కుమ్ - పిలుచుచున్నది, (ఉజ్జీవింపఁగ, తగినకరణములను అనాదికాలముగ వ్యర్థవిషయములకు శేషపఱచిన), అరు

వినైయేన్ - మహాపాపియైన నాయొక్క, కైయుమ్ - చేతులును, తొழுమ్ - (దేవర వారి విషయమందు) అంజలిబద్ధమును చేయుచున్నది, కణ్ - నేత్రమైనది, కాణ - (ఎల్లప్పుడును దేవరవారిని) సేవించుటకై, కరుదిడుమ్ - మనోరథించుచున్నది, కడల్ - సముద్రముచే, పుడైశూழ் - నలుప్రక్కల చుట్టఁబడియుండు, ఇదు - ఈ, వైయత్తిల్ - భూమియందు, (అనేక చేతనులుండగ), ఉన్ - దేవరవారియొక్క, వణ్మై - ఉదారత్వము, ఎన్పాల్ - నావిషయమందు, ఎన్ - ఏకారణముచేత, వళర్న్దదు - వృద్ధిబొందుచున్నది.

తా,—ఓయెమ్పెరుమానార్లే! నాయన్తఃకరణమగు మనస్సు దేవరవారియొక్క దివ్యకల్యాణ గుణములను, అనుసన్ధించుచు అచ్చటనే స్తబ్ధమైనది, నా నాలుక దేవర వారి తిరునామ సఙ్కీర్తనమును చేయుచున్నది, మహాపాపియగు నాయొక్క హస్తములు దేవరివారికి నమస్కార మొనర్చుచున్నవి, నా నేత్రములు ఎల్లప్పుడును దేవరవారిని సేవింప నాశించుచున్నవి, అనేకులైన చేతనులుండగ దేవరవారియొక్క దివ్య ఔదార్యము దాసునియందు వృద్ధియగుటకు కారణ మేమని.

౧౦౩ వళర్న్దవెఙ్గోపమడఙ్గలొన్ఱాయ్, అన్ఱువాళవుణన్
కిళర్న్దపొన్నాగఙ్గిழித్తవన్, కీర్త్తిప్పయిరెழுన్దు,
విళైన్దిడుమ్శిన్దైయిరామానుశనెన్ఱనమెయ్వినైనోయ్
కళైన్దునన్ఞానమళిత్తనన్, కైయిల్కనియెన్నవే.

టీక.—వళర్న్ద - మిగుల వృద్ధిపొందిన, వెమ్ - మిగుల క్రూరమైన, కోపమ్ - క్రోధముగల, ఒన్ఱు - సాటిలేనిదియైన, మడఙ్గలాయ్ - నరసింహమై, అన్ఱు - (ప్రహ్లా దునిమీద హిరణ్యాసురుఁడు) కోపగించుకొన్న సమయమందు, వాళ్ - రంపమునకోసి చివచ్చిన, అవుణన్ - హిరణ్యాసురునియొక్క, కిళర్న్ద - వృద్ధిఁబొందిన, పొన్ - బంగారు మయమైన, ఆ కమ్ - దేహమును, కిழித్తవన్ - శ్రమములేక చీల్చినవానియొక్క, కీర్త్తి - దివ్యకీర్తియనెడు, పయిర్ - పంటయైనది, (పొలమునందుసస్యము పొడవై పెరిగినట్లు) ఎழுన్దు - పెరిగి, విళైన్దిడుమ్, సఫలమగునట్లైన, శిన్దై - హృదయము గలిగియుండు, ఇరామానుశన్ - ఉడైయవరులు, ఎన్ఱన్ - నాయొక్క, మెయ్ - శరీరమునుబట్టి వచ్చిన, వినై - కర్మఫలమైన, నోయ్ - దుఃఖములను, కళైన్దు - పోఁగొట్టి, కైయిల్ - చేతియందుండు కనియెన్న - ఉసిరిపండువలె, నల్ - విలక్షణమైన, ఞానమ్ - జ్ఞానమును, అళిత్తనన్ - కృపతో ప్రసాదించిరి.

తా — తమయాశ్రితులగు దేవతలయొక్క స్థానములను ఆక్రమించి లోకములను బాధించుటకొఱకై ఖడ్గమును హస్తమందు ధరించి, బిరుదును చెల్లించుకొనుచు ఉ

నటయేగాక, తనపుత్రుఁడును సర్వేశ్వరునికి ప్రాణసముడునగు ప్రహ్లాదుని, నానావిధ ములబాధించుచుండు హిరణ్యాసురునియొక్క శరీరమును, ఉగ్రమైన నరసింహావతా రమొనర్చి తృణమునుగిల్లినట్లు శ్రమములేక చీల్చిపాఱవైచిన, సర్వేశ్వరుఁడగుశ్రియః పతియొక్క దివ్యకల్యాణగుణములను తమ హృదయమందుంచుకొని అనుభవించుకొను చుండు ఎమ్బెరుమానార్లు తమనిర్హేతుక కృపచే నాకుప్రకృతిసంబన్ధమువలనగలిగినసుస్త దుఃఖములను నశింపఁజేసి కరతలామలకముగ స్వరూప జ్ఞానమును ఉపదేశించినవారైరని.

౧౦౮. కైయిల్కనియెన్నక్కణ్ణనై క్కాట్టి త్తరిలుమ్, ఉన్దన్
మెయ్యిల్పిఱజ్గియశీరన్ఱి వేణ్డిలర్యార్, నిరయ
త్తొయ్యిల్కిడక్కిలుమ్శోదివిణ్ శేరిలుమ్ఇవ్వరుళ్ నీ
శెయ్యిల్తరిప్పన్, ఇరామానుశా ఎన్ శెழுజ్గొణ్డలే.

టీక,— శెழுమ్ - విలక్షణమైన, కొణ్డల్ - మేఘమువలె పరమోదారులై, ఎన్ - నన్నాథుడై ప్రకాశింపఁజేసిన, ఇరామానుశ-ఓయెమ్బెరుమానార్లే, కణ్ణనై - ఆశ్రిత సులభుడైన సర్వేశ్వరుని, కైయిల్ - చేతిలోనున్న, కనియెన్న - ఉసిరిపండువలె, కాట్టి త్తరిలుమ్ - చూపించినను, ఉన్దన్ - దేవరవారియొక్క, మెయ్యిల్ - దివ్యమైనతిరు మేనియందు, పిఱజ్గియ - ప్రకాశించుచుండు, శీర్ అన్ఱి - దివ్యగుణములనుదప్ప, యాన్ - నేను, వేణ్డిలన్ - (ఇతరములను) కోరను, నిరయమ్ - సంసారరూప నరకమనెడు, తొయ్యిల్ - అడుసునందు, కిడక్కిలుమ్ - (అడగి) పడియుండినను, శోది - నిరవధిక తేజోమయమైన, విణ్ - పరమపదమును, శేరిలుమ్ - చేరినను, ఇవ్వరుళ్ - (దీనికిఁదగిన) అనుగ్రహమును, నీ - దేవరవారు, శెయ్యిల్ - చేసినయెడల, తరిప్పన్ - ధరింతును,

నిరయత్తొయ్యిల్, కిడక్కిలెన్ - శేరిలెన్, అనిపాఠమైనయెడల, కిడక్కిలెన్ - పడిననేమి, శేరిలెన్ - చేరిననేమి, అనియర్థము, దేవరవారి గుణానుభవము లభించిన యెడల, ఎక్కడనున్నను బాధకములేదని భావము.

తా.— సకలజనులమనస్సులనపహరించునట్టి అతిమానుషచేష్టితములను జేయుచు ఆశ్రితసులభుడైయుండు శ్రీకృష్ణుని కరతలామలకముగ సాక్షాత్కరింప జేసినను, దేవర వారి దివ్యమఙ్గళ విగ్రహమునందుఁ బ్రకాశించుచుండు కల్యాణగుణములనుదప్ప దాసుడు ఇతరవిషయమును గోరను, దాసునిసంసారమను నరకమందు పడవైచినను, మనలనే ఆశ్రయించియున్నాడే అని, తేజోమయమైన పరమపదమునఁ జేర్చినను, ఎల్లప్పుడును దేవరవారియొక్క కల్యాణగుణములనుదాసునికిఅనుభవింపజేయుచున్న యెడలధరింతునని॰

౧౦౯. శెழுన్దిరైప్పాల్కడల్ కణ్డుయిల్ మాయన్, తిరువడిక్కీழ்,
విழுన్దిరుప్పార్ నెఞ్జిల్ మేవునఞానీ, నల్ వేదియర్ గళ్,

తొழுన్దిరుప్పాదనిరామానుశనైత్తొழுమ్ పెరియోర్
ఎழுన్దిరైత్తాడుమిడమ్, అడియేనుక్కిరుప్పిడమే.

టీక — శెழுమ్ - రమ్యమైన, తిరై - అలలుగలిగియుండు, పాఱ్కడల్ - పాల సముద్రమందు, కణ్ తుయిల్ - యోగనిద్రచేయుచుండు, మాయన్ - ఆశ్చర్యకరుడగు సర్వేశ్వరునియొక్క, తిరువడిక్కీழ் - శ్రీపాదములక్రింద, విழுన్దిరుప్పార్ - అతడే రక్షకమని పడియుండువారియొక్క, నెఞ్జిల్ - హృదయమునందు, మేవుమ్ - పొందియున్న, నల్ - పరమవిలక్షణమగు, ఞాని - జ్ఞానముగలవారై, నల్ వేదియర్ - శ్రేష్ఠమవైదికులైనవారు, తొழுమ్ - నమస్కారాదులచే అనువర్తించునట్టి, తిరుప్పాదన్ - పాదారవిన్దములుగలవారైన, ఇరామానుశనై - ఎమ్పెరుమానార్లను, తొழுమ్ ఎల్లప్పుడు అనుభవించుచుండు, పెరియోర్ - వైభవముగల మహాత్ములు, ఎழுన్దు - లేచి, ఇరైత్తు - (సముద్రమువలె) ఘోషించి, ఆడుమ్ ఇడమ్ - సంభ్రమముతో నాట్యముచేయుస్థలము, అడియేనుక్కు - వారిదాసుడనైన నాకు, ఇరుప్పిడమ్ - వసించుస్థలముగానుండును (పళ్ళికొళ్ మాయన్ అని వేఱొకపాఠము, అర్థమొకటియే)

తా — సర్వవిధములచే మనోహరమైయుండు క్షీరాబ్ధియందు, శైత్యమార్దవాదులచే భోగ్యమైయున్న ఆదిశేషునను శయ్యపై, జగద్రక్షణధ్యానముతో పవ్వళించియున్న శ్రియఃపతియొక్క పాదారవిన్దములనే, సర్వవిధరక్షకముగ విశ్వసించియుండు యోగీశ్వరులచే, అపేక్షింపఁదగిన విలక్షణజ్ఞానముగల పరమవైదికులచే, ఎల్లప్పుడును సేవింపబడుచుండు పాదారవిన్దములుగల ఈ ఉడైయవరులను ఆశ్రయించి, ఆనన్దపరవశులై నృత్యసంకీర్తనాదులను జేయుచుండు స్థలములే నాకు సమ్మతమైన వాసస్థలములుగానుండును.

౧౦౬. ఇరుప్పిడమ్ వైకున్దమ్ వేఙ్గడమ్, మాలిరుఞ్జోలై యెన్నుమ్
పొరుప్పిడమ్ మాయనుక్కెన్బర్ నల్లోర్, అవై దన్నొడుమ్ వ
న్దిరుప్పిడమ్ మాయనిరామానుశన్ మన త్తిన్ఱవన్ వ
న్దిరుప్పిడమ్, ఎన్ఱనిదయత్తుళ్ళే తనక్కిన్బుఱవే.

టీక — మాయనుక్కు - (స్వరూపరూపగుణవిభూతులచే) ఆశ్చర్యభూతుడగు సర్వేశ్వరునికి, ఇరుప్పిడమ్ - వసించుస్థలము, వైకున్దమ్ - పరమపదము, వేఙ్గడమ్ - (తిరుమల) తిరుపతి, మాలిరుంజోలై - తిరుమాలిరుంజోలైయని ప్రసిద్ధినొందిన, పొరుప్పు - పర్వతమగు, ఇడమ్ - స్థానముగ, నల్లోర్ - భగవత్తత్త్వమును సాక్షాత్కరించిన విలక్షణులు, ఎన్బర్ - చెప్పుచుందురు, మాయన్ - ఇట్టిసర్వేశ్వరుడు, అవైదన్నొడుమ్ - ఆస్థలములతోడ, వన్దు - వచ్చి, ఇరుప్పిడమ్ - వేంచేసియున్నస్థలము, ఇరామానుశ

నత్తు - ఉడైయవరుల హృదయములో, (అయియున్నది) అవన్ - అయెమ్బెరుమా న్గళ్, ఇణ్ణు - ఇప్పుడు, వన్దు-వచ్చి, తనక్కు-తమకు, ఇన్బ - అతిశయమైనసుఖము, త్తు - పొందియుండునట్లు, ఇరుప్పిడమ్-వాసముగనుండుస్థలము, ఎన్దన్ - నాయొక్క, నయత్తుళ్ళే - హృదయమందు (అయియున్నది).

తా—భక్తిపారవశ్యముచే సర్వేశ్వరుఁడు, శ్రీవైకుణ్ఠము, శేషాచలము, తిరుమా లుఞ్జోలై, మొదలగు దివ్యదేశములలో నిత్యవాసము చేయుచున్నాడని ప్రసాదించిన టనుగ, ఎమ్బెరుమానార్ల దివ్యహృదయమందును అత్యానన్దముతో నిత్యవాసముచేయు చున్నాడు, ఇప్పుడు అట్టి దివ్యదేశనిత్యవాసులగు సర్వేశ్వరునితోఁగూడవచ్చి యెమ్బెరు మానార్లు, నాహృదయకమలమందు నిరతిశయ సుఖముగనిత్యవాసము చేయుచున్నారని.

॥౧౦౭. ఇన్బుత్ఱశీల త్తిరామానుశ, వెన్ఱుమెవ్విడత్తుమ్,
ఎన్బుత్ఱనోయుడల్ దోఱుమ్పిఱన్దిఱన్దు, ఎణ్ణరియ
తున్బుత్ఱువీయినుమ్శొల్లువదొన్ఱుణ్డుఉన్ఱొణ్డర్గట్కే,
యన్బుత్ఱిరుక్కుమ్బడి, యెన్నైయాక్కియఙ్గాట్పడుత్తే.

టీక—(అత్యన్తనీచమగు నాహృదయమును గొప్పగభావించివచ్చి ప్రవేశించి) న్బుత్ఱ - అత్యానన్దముతో వేంచేసియున్న, శీలత్తు - సౌశీల్యగుణముగల, ఇరామాను శ-ఉడైయవరే. శొల్లువదు - (ఈప్రకారముగనుండు దేవరవారికి) విన్నపముచేయ వలసినది, ఒన్ఱు - ఒకకార్యము, ఉణ్డు - కలదు, (అదేమనిన) ఎన్బు-ఎముకను, ఉత్ఱ- పొందిన, నోయ్ - వ్యాధులకుచోటగు, ఉడల్దోఱుమ్ - ప్రతిదేహములందును, పిఱ న్దిట్టు ఇఱన్దు-మృతిబొంది, ఎణ్ అరియ-లెక్కపెట్టుటకు సాధ్యముకాని, తున్బ - దుఃఖమును, ఉత్ఱు - అనుభవించి, వీయినుమ్ - ముగించినను, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడు ను, ఎవ్విడత్తుమ్ - ఎల్లచోట్లనున్నూ, ఉన - దేవరవారియొక్క, తొణ్డర్గట్కే - దాసులవిషయమందే, అన్బు - ప్రేమమును. ఉత్ఱు-కలిగి, ఇరుక్కుమ్బడి-ఉండునట్లు, ఆక్కి- చేసి, ఎన్నై - నన్ను, అఙ్గు - వారిశ్రీపాదములందు, ఆళ్పడుత్తు - దాసుడగు నట్లు చేయవలయును.

తా—నీచుడగు నాయందు వ్యామోహముగలిగి సంశ్లేషించియుండు ఓయతిరా జా! ఎముకలలోవ్యాపించి బాధపఱచునట్టి వ్యాధులకాస్పదమగు దేహములనుబొందు చు మృతినొందుచు లెక్కలేని దుఃఖములను అనుభవించిముగించినను నన్ను సర్వదేశ సర్వకాల సర్వావస్థలలోను దేవరవారికే శేషభూతులైయుండువారి విషయమందు అత్య న్తవ్యామోహముగలవానినిగను, వారికి క్రయవిక్రయార్హునిగను శేషపడియుండునట్లు చేయుటయే దాసుని మనోరథమని.

౩౮౯౨. అజ్గయల్ పాయ్ వయల్ తెన్నరజ్గ౯, అణియాగమన్నుమ్
పజ్గయమామలర్ప్పావైయైప్పోశ్ ఱుదుమ్, పత్తియెల్లామ్
తజ్గియదెన్న త్తర్లైత్తునెఞ్జే నన్తలైమిశైయే
పొజ్గియకీర్త్తి, యిరామానుశనడిప్పూమన్నవే.

టీక—నెఞ్జే - ఓహృదయమా; పత్తి - భక్తితత్వమైనది, ఎల్లామ్ - సమస్తము, తఙ్గియదెన్న - (మనయందు) శాశ్వతముగ వాసము చేయుచున్నదియనునట్లు, తర్లైత్తు - సంపూర్ణమై, పొఙ్గియ - విస్తరించియుండు, కీర్తి-యశస్సుగల, ఇరామానుశ౯ - ఉడైయవరులయొక్క, అడి - పాదారవిన్దములు అను, పూ - పుష్పము, (అలంకరించుకొనుటకై ఆశించియుండు) నమ్తలైమిశైయే - మనశిరస్సుమీద, మన్న-నిత్యవాసముచేయునట్లు, అమ్ - అన్దమైన, కయల్ - మత్స్యములు, పాయ్ - ఎగురుచుండు వయల్ - పొలములుగలదై, తెన్ - రమ్యమైన, అరఙ్గన్ - ఉభయకావేరీ మధ్యమందు శయనించియున్న శ్రీరఙ్గనాథునియొక్క, అణి - మనోజ్ఞమైన, అగమ్ - వక్షస్థలమునందు, మన్నుమ్ - నిత్యవాసముచేయుచున్నదై, మా - శ్లాఘ్యమైన, పఙ్గయమలర్-తామరపుష్పమందు జన్మించిన, పావైయై - శ్రీమహాలక్ష్మిని, పోశ్ ఱుదుమ్ - ఆశ్రయింతము, (స్తుతింతము) అనియునుగావచ్చును.

తా—ఓమనసా! యతిరాజులవారి శ్రీపాదారవిన్దములు అను పరమభోగ్యమైన పుష్పమును, మనశిరస్సుమీదు నానావిధచిత్రవర్ణ పుష్పములను శేర్చిన మాలికతో అలఙ్కరించినట్లు, అలఙ్కరించి శాశ్వతముగనుండునట్లు మత్స్యములు ఎగురుచుండు సమృద్ధిగల పొలములచే రమణీయమైన ఉభయకావేరిమధ్యమందుండు (కోవెలలో) శ్రీరఙ్గములో పవ్వళించియుండు శ్రియఃపతియొక్క వక్షస్థలమందు, ఆభరణరూపముగ నిత్యవాసము చేయుచున్న కమలోద్భవయును కమలవాసినియునగు శ్రీమహాలక్ష్మిని ఆశ్రయించి మఙ్గళాశాసనము చేయుదమని.

మొదటిపాశురమందు "పూమన్నుమాదు" అనిరి, ఇక్కడ "పఙ్గయమామలర్ పావై" అనుచున్నారు, అచ్చట "పొరున్దియ" అనిరి, ఇచ్చట, "అణియాగమన్నుమ్" అనుచున్నారు, అచ్చట ఇరామానుశ౯ శరణారవిన్దమ్ నామమన్ని వాళ అనిరి, ఇచ్చట "తలమిశైయే ఇరామానుశనడిప్పూమన్న" అనుచున్నారు. అచ్చట "నెఞ్జే" అని హృదయమును శేర్చుకొని అరంభించిరి, ఇచ్చట "నెఞ్జే" అనిహృదయముతోఁగూడ అనుసన్ధించి ముగించిరి.

...తీచే ప్రాప్యమందురుచి అభివృద్ధియగుటయును, ప్రాప్యసిద్ధియనగు స్వరూ...స్వరూపమైన సంపత్తుసిద్ధించుటకుమూలము, సకలాత్మలకును వారివారి అధికారమునకు ...ల్లు అపేక్షితములగు సంపద్విశేషములను శ్రీమహాలక్ష్మి తమకటాక్ష విశేషముచే కృప ...యుదురనియును, ప్రాప్యమైనది ఆచార్య చరణారవిన్దమనియును, దీనికిఅధికారులును ...ప్రాప్యమందు పరిపూర్ణ ప్రావణ్యముగల వారనియును చెప్పబడినదైనది.



...ఎమ్బెరుమానార్ తిరువడిగళేశరణమ్. తిరువరఙ్గత్తముదనార్ తిరువడిగళేశరణమ్, ...జీయర్ తిరువడిగళేశరణమ్. పిళ్ళైలోకమ్జీయర్ తిరువడిగళేశరణమ్.

ఇరామానుశనూత్తన్దాది సంపూర్ణము.



శ్రీమతేరామానుజాయనమః.

## శ్రీమణవాళమామునుల వైభవము.



శ్రియఃపతియగు సర్వేశ్వరుఁడు సంసారిచేతనోజ్జీవనార్థము కలికాలమందు, ...పరకాలాదులను అవతరింపఁజేసిరి, తర్వాత బహుకాలమునకు వెనుక, ఆది ...శేషులను జగద్రక్షణార్థమై భూమియందవతరించి ఇన్నూరుసంవత్సరములుండి సంసారి ...చేతనులను దిద్దుపాటుచేయునట్లు నియమింపగ, వారును ఎమ్బెరుమానారులై అవతరించి ...ప్రకృతిదోషములను గటాక్షించి సహింపలేక నూటయిరువది సంవత్సరములే ఈవి ...భూతియందుండి పరమపదమునకు వేంచేసిరి. తర్వాత చిరకాలమునకు వెనుక ఎమ్బెరుమా ...న్నారులే లోకమంతయును ఉజ్జీవించునట్లు చేయువారి నొకరిని గలుగఁజేయవలయు ...నని యోచించి, ఇకదీనికి అయిన వారెవరని వెదకి మరల ఆదిశేషులనుగటాక్షించి, వారి ...కార్యము మీరు ఉడైయవరులై అవతరించినపుడు భూమియందు ఇన్నూరుసంవత్సర ...ము నివసించియుండునట్లు చెప్పియుండగ కొంతచేసితిరికనుక, మిగతయెనుబదిసంవ ...త్సరములకొఱకై ఒక అవతారంబొనర్చి, జగత్తును దిద్దుపాటుచేయుమని ఆజ్ఞాపింపగ ...స్థితింగతంతస్యజానన్నేవ జగన్నిధేః । తస్మిన్ ధామ్నికతారాతే పునరేవాత ...తర్వాత సర్వేశ్వరునియొక్క అభిప్రాయమును ఆదిశేషుఁడుగుర్తెఱిగినవారై ఆళ్వా ...ర్తిరునగరిలో మణవాళమామునులై అవతరించిరి." అన్నట్లు సాధారణ సంవత్సరము, ...ఐప్పశిమాసము, మూలానక్షత్రమందు గోముహూర్తము, తిరునావీఱుడైయపిరాన్ తాతర ..., అనువారికి కొమారులై తిరువవతరించిరి. వీరికితండ్రిగారు, జాతకర్మాదులొనర్చి అష్ట

గియమణవాళ్ళ అనితిరునామమునుంచి మేనమామగారిస్థలమగు శిక్కిల్ కిడారమందు పెంచుచూవచ్చిరి. వీరితల్లిగారు శ్రీరఙ్గనాచ్చియార్, పూర్వాశ్రమమందు వీరిపేరు రామానుజాచార్యులు, వీరు (కోవెలలో) శ్రీరఙ్గములో నిత్యవాసముచేయుచున్న స్వాచార్యులగు తిరువాయ్మొழிప్పిళ్ళగారియొద్ద, తిరువాయ్మొழிమొదలగు దివ్యప్రబన్ధములును, ఈడుమొదలగు భగవద్విషయమును లభించిరి, వీరియొక్క తిరునామములు పెరియజీయ్యర్, సౌమ్యజామాతృయోగీంద్రులు, రమ్యజామాతృమునీంద్రులు, యతీంద్రప్రవణులు, అழகియమణవాళజీయర్, కాన్తోపయన్తృలు, వరవరమునులు, వరయోగి రామానుజంపొన్నడి, రుచిరజామాతృయోగీంద్రులు, మొదలగునవి. తత్త్వత్రయమ్, రహస్యత్రయమ్, శ్రీవచనభూషణమ్, ఆచార్య హృదయమ్, జ్ఞానసారమ్, ప్రమేయసారమ్, పెరియాழ்వార్ తిరుమొழி, రామానుశ నూఱ్ఱన్దాది, మొదలగు గ్రన్థములకు వ్యాఖ్యానములును, ఈడువ్యాఖ్యానమునకు ప్రమాణత్తిరట్టు, శ్రీవచనభూషణప్రమాణత్తిరట్టు, యతిరాజవింశతి, ఆర్త్తిప్రబన్ధము, ఉపదేశరత్తినమాలై, తిరువాయ్మొழி నూఱ్ఱన్దాది, తిరువారాధనక్రమమ్, మొదలగు ప్రబన్ధములనుఅనుగ్రహించియున్నారు, ఉడైయవరులయొక్క పునరవతారమగు పెరియజీయర్, భూప్రదక్షిణముచేసి అనేకదివ్యదేశములను జీర్ణోద్ధారణంబుగావించి, తిరునగరియందు తిరువాయ్మొழிప్పిళ్ళగారికి, శేషత్వస్వరూపమైన శేషావతారమునుంజూపిరి, పరమతనిరసనస్వమతస్థాపనంబొనర్చిరి, స్థావరజఙ్గమాదులకు మోక్షమును ప్రసాదించిరి, ఉత్తరమధురజీర్ణోద్ధారణంబుచేసి (నమ్బెరుమాళ్ళకు) శ్రీరఙ్గనాథులకు ఈడువ్యాఖ్యానమును విన్నపించుటచే వీరికి పెరుమాళ్ళు పెరియజీయర్ అనితిరునామముంచిరి, కాబట్టి వీరు అందఱికిని ఉద్దేశ్యులై యున్నారు, వీరితిరువడిగళులో ఆశ్రయించినవారు, వానమామలైజియ్యర్, పరవస్తు పట్టర్పిరాన్ జియ్యర్, తిరువేఙ్గడజీయర్, కోయిల్ కన్దాడైయణ్ణన్, ప్రతివాదిభయఙ్కరమణ్ణన్, ఎఱుమ్బిఅప్పా, అప్పిళ్ళై, అప్పిళ్ళాన్, ఈయెనమంద్రకును అష్టదిగ్గజములని నామములు, మఱియును, సేనైముదలియాణ్డాన్ నాయనార్, నాలూర్ శిఱ్ఱాత్తాన్, కన్దాడైపోరేఱ్ఱునాయనార్, ఏట్టూరుశిఙ్గరాచార్యులు, కన్దాడైఅణ్ణప్పన్, కన్దాడైతిరుక్కోట్టియూర్నాయనార్, కన్దాడైనారణప్పై, కన్దాడైతోழప్పరప్పై, కన్దాడైఅప్పైత్తువాழ்విత్తపెరుమాళ్, వీరలకు నవరత్నములనిపేరు. తిరుప్పాణాழ்వార్దాసర్, వడుగనమ్బి, జియ్యర్నైనార్, ఆళప్పిరానప్పై, తిరువాయ్మొழிయాழ்వానప్పిళ్ళై, ముదలియాழ்వారయ్యన్, సాధుభట్టర్, కన్దాడైరామానుజయ్యఙ్గార్, శఠకోపదాసులు, మహాబాణనాథరాయడు, రావుమాధవనాయకులు, రాఘవరాయడు, భూతనాయకులు ఈవిధముగ, చాత్తిన చాత్తాదులును, తిరునామధారులును అనేకులుగలరు. ఇచ్చట సురభీతిచే సంగ్రహింపఁబడినది, కోయిల్ కన్దాడైయణ్ణన్ (ఉడైయవరులకు మదేవ

గ్గాయనవలె) వీరికి పాదుకాస్థానీయులైయుందురు. ఎఱుమ్బియప్పా, (ఉడైయవరులకు వడుగనమ్బివలె) వేఱొకదైవమునుయెఱుగక అత్యన్తాభిమతులైయుందురు. ప్రతివాది భయఙ్కరమణ్ణన్, (కూరత్తాళ్వాన్ వలె) గ్రన్థసహాయులైయుందురు. అప్పిళ్ళాన్ మఠమునందు సర్వభారములను తామువహించినడిపింకురు. వానమామలైజియ్యర్, ఆశ్రయించినదిమొదలు విశేషింపక కైఙ్కర్యము చేయుచుందురు, పట్టర్ పిరాన్ జియ్యర్ పూర్వాశ్రమమునందు గోవిన్దదాసరప్పన్ అని తిరునామమునుగలవారై ముప్పదిసంవత్సరములు యెడబాయకయుండి మహావిరక్తులై జియ్యరైనవెనుక, సన్నిధియందే యుండి దాస్యముచేయుటచే ఎమ్బార్లవలె పాదచ్ఛాయాపన్నులై యుందురు. జియ్యర్ నైనార్ తిరుక్కురుగైప్పిరాన్, పిళ్ళాన్ వలె అత్యాదరణీయులైయుందురు. వీరికందతికిని స్వరూపోపాయ పురుషార్థములను ప్రసాదించుచు పెరియజియ్యర్ నమ్పెరుమాళ్ కోవెలలో (శ్రీరఙ్గములో) ఎనుబది తిరునక్షత్రములు వేంచేసియుండి పరమపదమునకు వేంచేసిరి. వీరియొక్క తనియన్, ॥ శ్రీశైలేశదయాపాత్రమ్ ధీభక్త్యాదిగుణార్ణవమ్ । యతీన్ద్రప్రణవన్దే రమ్యజామాతరమ్మునిమ్ ॥ ఈతనియన్ సకలమైనవారికిని ఉద్దేశ్యమైనది.

శ్రీమతేసౌమ్యజామాతృమునయేనమః.

---

శ్రీమతేరామానుజాయనమః.

## ఉపదేశరత్నమాలకు

కోయిల్ కన్దాడైయణ్ణన్ - సాదించినతనియన్.

ముન్నన్తిరువాయ్మొழிప్పిళ్ళై తాముపదేశిత్త, -
నేర్ తన్నినుడియై త్తణవాదశొల్ మణవాళముని,
తన్ననుబ్దర్ శెయ్దయుపదేశరత్తినమాలైతన్నై,
తన్నెఞ్జుదన్నిల్ తరిప్పవర్ తాళ్గళ్ శరణ్ నమక్కే.

టీక — మున్నమ్ - పూర్వకాలమందు, తిరువాయ్మొழிప్పిళ్ళైతామ్ - తిరువాయ్మొழிప్పిళ్ళగారు, ఉపదేశిత్త - తమకు ఉపదేశించిన, నేర్ దన్నిన్ - క్రమముయొక్క, పడియై - ప్రకారమును, తణవాద - వదలని, శొల్ - వైభవముగల, మణవాళముని - మణవాళమామునులు, తన్ - తమయొక్క, అన్బుడన్ - ప్రేమతో, శెయ్ - ఉపదేశించిన, ఉపదేశరత్తినమాలైతన్నై - ఉపదేశరత్నమాలను ప్రబన్ధమును, తన్ - తమయొక్క, నెఞ్జుతన్నిల్ - హృదయమునందు, తరిప్పవర్ - దృఢముగానుంపువారియొక్క, తాళ్గళ్ - శ్రీపాదారవిన్దములు, నమక్కు - మనకు, శరణ్ - రక్షకములు.

తా— మహనీయులగు మణవాళమామునులు, స్వాచార్యులగు తిరువాయ్మొళి పిళ్లైగారు, తమకు ఉపదేశించిన క్రమమును వెనుకటివారును గుర్తెఱిగి ఉజ్జీవింపవలయునని ప్రేమచే ప్రసాదించిన ఉపదేశరత్నమాలై అను ప్రబన్ధమును హృదయమందుంచుకొని అనుసన్ధించువారు మనకు రక్షకులగుదురని.

శ్రీమద్వరవరమునయేనమః.

## ఉపదేశరత్నమాల - ప్రబన్ధమునకు అవతారిక.



పెరియజీయర్ (మణవాళమామునులు) "(పిన్నానార్ వణఙ్గుమ్ శోది"=వెనుకటివారు ఆశ్రయించి ఉజ్జీవించుటకు దగిన తేజోమయుడై) అన్నట్లు సంసారి చేతనుల ఉజ్జీవనముకొఱకై నిత్యసూరులలో నొకరువచ్చి అవతరించిరి అనఁదగిన ఈ మహాత్ములు తిరువాయ్మొళిప్పిళ్లగారి తిరువడిగళులో నాశ్రయించి తదేకనిష్ఠులైసకల ...ములను అధికరించి కృతార్థులై, ఆ యాచార్యులు తామే, గురుపరంపరా మధ్య హారనాయకరత్నమగు ఉడైయవరుల తిరువడిగళనే మీకొక సహాయముగ లభించి యుండునని చూపింపఁగ, అందుచేత వారి తిరువడిగళులో అత్యన్తపారివశ్యముగలవారును, ఆళ్వార్లయొక్కయు ఆచార్యులయొక్కయు కృపయే తమకు ధారకముగ వృద్ధి బొందినవారును, పరాఙ్కుశ పరకాల భట్టనాథాదులయొక్కయు నాథయామునయతివరాదులయొక్కయు భావమును తమకు ఒక్కొక్క యాకారముచేగలిగియుండువారును, సకలచేతనుల నుజ్జీవింపఁజేయుటయందాసక్తిగలవారును, పరసమృద్ధియే ముఖ్యప్రయోజనముగ నెంచియుండు వారునగుటచే పరమ రహస్యార్థములనన్నిటిని తమప్రబన్ధములలో ప్రకాశింపఁజేసిన మహిమగలవారును (ఉభయవిభూతులలోను= ఇహపరములలోను) తమయొక్క శేషత్వాదిగుణములకు సాటిలేని ఔన్నత్యముగలవారును, శ్రీరఙ్గ మఙ్గళ సమ్పదయులై శ్రీరఙ్గస్థలమునందు నిత్యవాసముచేయువారలై దానిచే, కోయిల్ మణవాళమామునులు అని ప్రసిద్ధిబొందినవారై యుండుట. ఇట్టిమాహాత్మ్యముగల పెరియజీయర్ తమ పరమకృపచే, ఆళ్వార్లయొక్కయు ఆచార్యులయొక్కయు అవతార వైభవములు బహుకాలమునకు ముందగుటచే, వారి వైభవాతిశయములును, ఉక్త్యనుష్ఠానములును ఒకరికిని దెలియక సఙ్కుచితమైవచ్చునట్టివిషయమును తత్కాలమందుండు చేతనులయొక్క జ్ఞానము తక్కువయగుటయును కటాక్షించి ఆళ్వార్లయొక్క అవతారమా స్యాదులును వారి శ్రీసూక్తులును ఈ రెంటిని గుర్తెఱిగిన ఆచార్యులయొక్క శ్రీసూక్త్యనుష్ఠానములు మొదలగువానినన్నిటిని విశదపఱచి, ఈ చేతనులను ఉజ్జీవింపఁ చేయవలయునని నిశ్చయించినదియును తత్కాలమందుండువారుమాత్రముగాక వెనుకటివారును గుర్తెఱిగి యుజ్జీవించునట్లు ప్రబన్ధరూపముగ చేయవలయునని తమదివ్యహృదయమున

పిరితర్వాత, ఆచార్యుల యొక్క ఉపదేశ పరంపరా ప్రాప్తమైన అర్థవిశేష
ములను ప్రసాదించిరి. గనుక ఈ ప్రబన్ధమునకు ఉపదేశ రత్తినమాలై అను తిరునామ
ము గలిగినది. ఇందు ఆళ్వారాచార్యుల సకల వైభవములను ప్రతిపాదించుటచే
నీ సకల ప్రబన్ధ విలక్షణమై యుండును, ఇందు ప్రతిపాదించునట్టి యర్థము తిరుమంత్ర
మును ప్రతిపాదించెడు అకారత్రయము (అనన్యార్హ శేషత్వము, అనన్యశరణత్వము,
అనన్య భోగ్యత్వము, అనునట్టి వీనిని) గలవారియొక్క వైభవమై యున్నది. కాఁబట్టి
దీని మూలము తిరుమంత్రమై యుండును, తిరుమంత్రార్థ నిష్ఠులయొక్క పద్ధతి నేగదా,
"పయిలుంపుడరాళి, నెడుమాల్ కడిమై" అను తిరువాయ్మొழிలయందు విస్తరించి
యానతిచ్చియున్నారు. దానిని యనుసరించిరేగదా "కణ్ణినుణ్ శిఱుత్తాంబు ఱందు
న్, రానివంటిదేగదా "నూఱ్ఱన్దాది." ఆరెంటియొక్క విధమును అనఁగా ఆళ్వా
ర్లయొక్కయు యెమ్బెరుమానార్ల యొక్కయు వైభవమును ఆనతిచ్చుటచే, ఈ వుప
దేశ రత్తినమాలై చరమమునకు చరమమై యున్నది. ఇక ఈ ప్రబన్ధమందు ఆళ్వార్ల
యొక్క తిరునక్షత్రాదులను ఆదరించుటకు మూలమేమనిన, ఆచార్యత్వమును ఆపేక్షిం
చి గీతయందు అభయప్రదానమును ఆనతిచ్చిన మొదటి యాచార్యుఁడైన సర్వేశ్వరుఁడు
సంసారులను రక్షించుట కొఱకు ఇతర సజాతీయుఁడైవచ్చి యవతరించిన, రోహిణీ పున
ర్వసు మొదలగు నక్షత్రములేమి, చైత్ర భాద్రపదాది మాసము లేమి యమునాసర
యూతీరములేమి, మథురాయోధ్యా పట్టణములేమి, ఇట్టివానిని శ్రీరామాయణ మహా
భారతాదులందు వచించుటచే అవ్విధముగనే ఇచ్చట నున్నవారియందుఁ జేయవలసిన
ప్రతిపత్తిని వచించి అనుష్ఠించి యితరులకుపదేశించి యుజ్జీవింపఁ జేయుటకై యవత
రించిన, ఈ యాళ్వారాదులయొక్క తిరునక్షత్ర మాసాదులేమి, పుణ్యస్థలములగు కాం
చీపురము మొదలగు నగరములేమి, కావేర్యాది నదులేమి, వీటినన్నిటిని ఆయితిహాసాదు
లలో "కలౌఖలు భవిష్యంతి" అనియు "క్వచిత్ క్వచిత్" అని యిట్లు సూచింపఁ
బడుటచేతను భగవదవతార విశేషమై భక్తస్వరూపులై అవతరించిన వారగుటచేతను
తాము సన్తోషించి వేంచేసియుండు అర్చాస్థలములైన సకల దివ్యదేశములలోను తాము
నున్న అర్చారూపములను పరిగ్రహించి సేవించుకొనుచు ఈ సంసారి చేతనులకు సేవ
సాధించుచు తమ సంబన్ధముచే సకలాత్మలను ఉజ్జీవింపఁ జేయసమర్థులగుటచేతను వీరి
యొక్క తిరునక్షత్రాదులను, మఱియు, గోదాదేవి (ఆణ్డాళ్), మధురకవి యాళ్వార్,
యెమ్బెరుమానార్లు, ఈ మువ్వురును, ఆళ్వార్లకు పరతంత్రులగుట చేతను, వారికంటెను
అధికమైన వైభవముగల వారగుటచేతను వారిలోఁగూడఁ జేర్చి పఠించడమైనది.
వీరి మహిమాతిశయమును గుర్తెఱిగి యాదరించుచు వచ్చువారగుటచే ఆచార్యులుం
గూడ ఆదరణీయులైరి. ఇట్లు ప్రథమపర్వ చరమ పర్వనిష్ఠుల సకల వైభవములను,
ఈ ప్రబన్ధముయొక్క సంబన్ధముగల వారికి ప్రపన్నజన కూటస్థులయొక్క అనుగ్రహ

మాలమున పురుషార్థసిద్ధి గలుగునట్టి ప్రకారమును, సాధించి పూర్తిచేయునట్టి య... షములను, స్వానుష్ఠాన రూపముగను పరోపదేశ రూపముగను కృపచే అనతిచ్యుత... గురుపరంపరా వైభవమును సాధించుటచే సకలాచార్య భారమును వహించిన శ... సకలమైన వారికిని గురుపరంపరా సంబన్ధము గలిగి ఉజ్జీవించునట్లుచేసి ఉప... చున్నారు.

పెరియజీయర్ తిరువడిగళే శరణమ్.

---

శ్రీమత్కాన్తోపయన్తృమునయేనమః,

## ఉపదేశరత్నమాల.

---

మొదటిపాశురము, అవ - తమయాచార్యానుగ్రహముచే, క్రమప్రాప్త... యర్థవిశేషములను వెనుకటివారును గుర్తెఱిగి ఉజ్జీవించునట్లు ప్రబన్ధరూపముగ ఉ... శించిప్రకాశింపఁ జేయుచున్నామని వినునట్టివారి బుద్ధిసమాధానముకొఱకు, కరు... ప్రతిజ్ఞచేయుచున్నారు.

పా. ౧. ఎన్దైతిరువాయ్మొழிప్పిళ్లై యిన్నరుళాల్,
వన్దవుపదేశమార్గత్తై, చ్చిన్దైశెయ్దు,
పిన్నైవరుజ్కు అక్కవుపదేశమాయ్ప్పేశుగిన్ఱేన్,
మన్నియశీర్, వెణ్బావిల్ వైత్తు.

టీక,—ఎన్దై - మాకు తండ్రియు స్వామియునైన, తిరువాయ్మొழிప్పిళ్లై... వాయ్మొழிయందుఁగలిగియుండు అధిక ప్రేమచే తిరువాయ్మొழிప్పిళ్లైఅను తిరునా... మునుబొందిన ) తిరుమలైయాழ்వార్లయొక్క, ఇన్ - ఇంపైన, అరుళాల్-కృప... వన్ద - పరంపరాక్రమముగవచ్చిన, ఉపదేశమార్గత్తై-ఉపదేశముయొక్క పద్ధతి... శెయ్దు - మనస్సున చింతించి, మన్నియ - ఒకస్థితినిపొందిన, శీర్ - శ్లాఘ్య... వెణ్బావిల్ వైత్తు - ‘‘వెణ్బా’’ అనుపాశురమందిమిడ్చి, (పిన్ ఎవరుమ్ - నా... టిసమస్తమైనవారును)పిన్నైవరుం-తమమార్గమును అనుసరించియుండువారును, క... అభ్యసించునట్లు, ఉపదేశమాయ్ - (ప్రపత్తినిష్ఠులవైభవమారంభించి ఆచార్య... నిష్ఠుల వైభవమువఱకు ఉపదేశమూలముగవచ్చిన యర్థవిశేషములను ) ఉపదే... రూప ప్రబన్ధముగ, పేశుగిన్ఱేన్ - వచించుచున్నాను.

తా—మాకు ఆచార్యులును సకలవిధబన్ధువులునగు తిరువాయ్మొழிప్పిళ్లైగారు పరమకృపచే ప్రసాదించిన ఉపదేశపరంపరా ప్రాప్తమైన అర్థవిశేషములను వెనుకటి వారును గుర్తెఱిగి ఉజ్జీవించునట్లు ఉపదేశ రత్తినమాలై అను ప్రబన్ధరూపముగ వచించు చున్నాను.

౨. పా. అవ - "ఉపదేశమాయ్ పేశుగిన్ఱేన్" అనుచున్నారే, ఓర్వలేజాలివారు నిందింపరో! అని యభిప్రాయమై, దానివలన అపద్య మేదియును లేదు అదియొకయాశ్చర్యమునుగాదు. అనిసమాధానపఱచుకొనుచున్నారు.

౨. కఱ్ఱోర్గళ్ తాముగప్పర్, కల్విదన్నిలాశైయుళ్ళోర్,
పెఱ్ఱోమెనవుగన్దుపిన్బుకఱ్పర్, మఱ్ఱోర్గళ్,
మాచ్చరియత్తాలిగழిల్, వన్దదెన్, నెఞ్జే,
యిగழ்గైయాచ్చరియమోదానవర్కు.

టీక.—(ఇట్లు నేనుఉపదేశించుటను) కఱ్ఱోర్గళ్ తామ్ - సక్రమముగఁజదువుకొన్నవారలు, ఉగప్పర్ - సన్తోషింతురు, కల్విదన్నిల్ - సద్విషయములను నేర్చుకొనుటయందు, ఆశైయుళ్లోర్ - అపేక్షగలవారలు, పెఱ్ఱోమెన - (నిక్షేపములభించినట్లు) దీని లభించితిమిగదాయని, ఉకన్దు - సన్తోషించి, పిన్బు - తర్వాత, కఱ్పర్ - అభ్యసింతురు, మఱ్ఱోర్గళ్ - (సాధుసాజ్గత్యములేని) యితరులు, మాచ్చరియత్తాల్ - ఓర్వలేజాలిచే, ఇగழిల్ - దూషించిరేని, వన్దదెన్ - ఏమిరాఁబోచున్నది (దుష్టులుదూషించుటచే యశస్సేగలుగును) నెఞ్జే - ఓ మనసా, అవర్కు - ఆవోర్వజాలని వారికి, ఇగழ்గై - దూషించుట, ఆచ్చరియమో - ఆశ్చర్యమగునో, (అదివారికి సహజమైయుండుట) ఆశ్చర్యముగాదు.

తా—(నేనిట్లు ఉపదేశించుటనుజూచి) గురుముఖముగ నభ్యసించినవారు ఆనందింతురు, స్వరూపజ్ఞానమందు ఇష్టముగలవారలు, ఇట్టిది లభించినదిగదాయని సన్తోషించి అభ్యసింతురు, ఓమనసా? అసూయాపరులు దూషించిరేని చెడుగేదియును లేదు సుశ్లోకమేయగును, దూషకులకు దూషించుట సహజమైయున్నది, వారికదియాశ్చర్యముగాదు, దానివలన ఈప్రబన్ధమునకేదియును గొదవలేదని.

3. పా. అవ - క్రిందిపాశురమందు, ఇతరుల నిన్దయేకీర్తికరమగునని ప్రబన్ధమును చేయ నారంభించినవారు, ఈప్రబన్ధ ప్రతిపాద్యులకును, వారుచేసిన ప్రబన్ధములకు ను ప్రతికూలులవలన గలుగు అమఙ్గళములు బోవునట్లు అనుకూలులైన తాము మఙ్గళాశాసనము చేయుచున్నారు.

౹౹ 3. ఆఴ్వార్‌గళ్ వాఴియరుళిచ్చెయల్ వాఴి,
తాఴ్వాదుమిల్ కురవర్‌దామ్ వాఴి, ఏఴ్ పారు
మ్మయ్యవవర్గళురైత్తవైగళ్ దామ్ వాఴి,
శెయ్యమఱైదన్నుడనే శేర్‌న్దు.

టీక—ఆఴ్వార్‌గళ్ - పదుగురు ఆఴ్వార్లును, వాఴి - సుఖముగనుండవలయు
ను, అరుళిచ్చెయల్ - వారానతిచ్చిన దివ్యప్రబన్ధములు, వాఴి. తాఴ్ వుయాదున్,
తక్కువయేదియును, ఇల్ - లేని, కురవర్ దామ్ - పూర్వాచార్యులును, వాఴి, ఏ
పారుమ్ - సప్తద్వీపములతోఁ గూడినభూమిలోనుండువారలు, లేక, ఏడులోకము
ను, ఉయ్య - ఉజ్జీవించునట్లు, అవర్‌గళ్ - ఆపూర్వాచార్యులు, ఉరైత్తవైగ
ళ్ దామ్- సాదించిన వ్యాఖ్యానాదులును, శెయ్య- చక్కనైన, మఱైతన్నుడనే- వేద
ములతోఁడ, శేర్‌న్దు - చేరి, వాఴి - సుఖముగ వృద్ధిపొందవలయును.

తా—సకలచేతనోజ్జీవనార్థమై అవతరించిన, పదుగురాఴ్వార్లును వారు అనతి
దివ్యప్రబన్ధములును, పూర్వాచార్యులును వారుప్రసాదించిన గ్రన్థములును వ్యా
నాదులును సకల వేదములతోఁగూడి వర్ధిల్లవలయునని.

౪. పా. అవ-ఆఴ్వార్లయొక్క అవతారక్రమమును ఆనతిచ్చుచున్నారు.

౪. పొయ్‌గైయార్ పూదత్తార్ పేయార్, పుగఴ్ మఴిశై-
అయ్యనరుళ్ మారన్, శేరలర్ కోన్, తుయ్యబట్ట -
నాదనన్బర్ దాళ్ తూళి, నల్పాణన్ నన్ కలియన్,
ఈదివర్ తోన్ఱిత్తడై వాఴిజ్గు.

టీక—పొయ్‌గైయార్ - పొయ్‌గైయాఴ్వార్లు, పూదత్తార్ - పూదత్తాఴ్వా
పేయార్ - పేయాఴ్వార్లు, పుగఴ్ మఴిశై - మహీసారక్షేత్రమని ప్రసిద్ధి బొందిన
మఴిశకు, అయ్యన్ - నిర్వాహకులగు తిరుమఴిశైయాఴ్వార్లు, అరుళ్ మారన్ -
కృపగల నమ్మాఴ్వార్లు, శేరలర్ కోన్ - కులశేఖరాఴ్వార్లు, తుయ్య - పరిశుద్ధు
బట్టనాదన్ - పెరియాఴ్వార్లు, అన్బర్ - భగవద్భక్తులయొక్క, తాళ్ తూళి -
ధూళి అనుతిరునామమును బొందిన తొణ్డరడిప్పొడి యాఴ్వార్లు, నల్ పాణన్ -
లగు తిరుప్పాణాఴ్వార్లు. నన్ కలియన్ - శేషత్వ నిరూపకమగు శ్లాఘ్యతను
యుండు తిరుమఙ్గైయాఴ్వార్లు, ఇజ్గు - ఈలోకమునందు, ఈదు - ఇది
ఈయాఴ్వార్లయొక్క, తోన్ఱత్తు - తిరువవతారముల యొక్క, అడైవు -
- అగును.

(తాత్పర్యము స్పష్టము).

౫ పా, అవ-తర్వాత, ఆళ్వారుల, మాస, తిరునక్షత్రాదులను, అనతిచ్చెదము అనుచున్నారు.

౫. అన్దమిళాల్ నఱ్కలైగళాయన్దు ఉరైత్తవాళ్వార్గళ్,
ఇన్దవులగిరుళ్ నీఙ్గ, వన్దుదిత్త,
మాదఙ్గళ్ నాళ్గళ్ దన్నై మణ్ణులగోర్ దామఱియ,
ఈదెన్రు శొల్లువోమ్యామ్.

టీక.—అమ్ - లక్షణములతోఁ గూడిన, తమిళాల్ - ద్రావిడ భాషచే, నల్ కలైగళ్ - మంచి ప్రబన్ధములను, ఆయ్న్దు - సంసారి చేతనులకని విచారించి, ఉరైత్త - ప్రసాదించిన, ఆళ్వార్ కళ్ - ఆళ్వారులు, ఇన్ద - ఈ, ఉలగు - లోకమందలి, ఇరుళ్ - అజ్ఞాన అంధకారము, నీఙ్గ - విడిచిపోవునట్లు, వన్దు - పరమపదమందుండి వచ్చి, ఉదిత్త - ఈలోక మందవతరించిన, మాదఙ్గళ్ - మాసములనున్ను, నాళ్గళ్ తన్నై - తిరునక్షత్ర దినముల నున్ను, మణ్ణులకోర్ తామ్ - భూమియందుండు చేతనులు, అఱియ - తెలిసికొనునట్లు, ఈదు ఎన్రు - ఇదియని, యామ్ - మేము, శొల్లువోమ్ - చెప్పెదము.

తా.—ద్రావిడదివ్య ప్రబన్ధములను అనతిచ్చిన పదుగురాళ్వార్లు సంసారి చేతనో జ్జీవనార్థమై అవతరించిన మాసములను తిరునక్షత్రములను, అందఱును గుర్తెఱుగునట్లు చెప్పెదమని.

౬ - పా, అవ - మొదటి యాళ్వారులగు మూవురియొక్క అవతార క్రమమును అనతిచ్చుచున్నారు.

౬. ఐప్పిశియిలోణ్ణవిట్టమ్ శదయమివై,
ఒప్పిలవానాళ్గళ్ ఉలగత్తీర్, ఎప్పువియుమ్,
పేశుపుగళ్ప్పొయ్గైయార్, పూదత్తార్, పేయాళ్వార్,
తేశుడనే తోన్రు శిఱప్పాల్.

టీక.— ఉలకత్తీర్ - లోకమందుండు చేతనులారా ? ఎప్పువియుమ్ - సకల లోకములందుండు వారును, పేశు - కొనియాడునట్టి, పుగళ్ - (పుష్పములయందవత రించుట, సర్వేశ్వరుని సాక్షాత్కరించుట, గ్రామైక రాత్రముగా సంచరించి ప్రసిద్ధినొంది నది త్రయము, సర్వేశ్వరుఁడు వీరితో గూడుటయును, ఆసర్వేశ్వరుని సన్తోషింపఁ జేయునంతటి వీరియొక్క మహిమ మొదలగు) వైభవముగల, పొయ్గైయార్ - పొయ్ గైయాళ్వార్లు, పూదత్తార్ - పూదత్తాళ్వార్లు, పేయాళ్వార్ - పేయాళ్వార్లును, తేశు

డనే - (జాజ్వల్యమానముగ ప్రకాశించుచున్న) దివ్యగుణతేజస్సుతో, తోన్ఱి - అవత రించిన, శీఱప్పాల్ - శ్లాఘ్యతచే, ఐప్పిశియిల్ - ఆశ్వీజమాసమందు, ఓణమ్ - శ్రవణము, అవిట్టమ్ - ధనిష్ఠయు, శదయమ్ - శతభిషమునుఅగు, ఇవై - ఈమూడు నక్షత్రములు గల, నాళ్ గళ్ - దినములు, ఒప్పు - సమానము, ఇలవామ్ - లేనివియగును.

తా — లోకులారా! సకలచేతనులును కొనియాడునట్టి మహిమాతిశయముగల పొయ్ గై, భూద, పేయాళ్వార్లు, మహాతేజస్సుతో అవతరించిన శ్లాఘ్యమైన, ఆశ్వీ మాసమున శ్రవణ ధనిష్ఠాశతభిష నక్షత్ర దినములకు సమానదినములు ఏవియును లేవు.

౭-పా, అవ-వీరు మొదటియాళ్వార్లు అగుటకు కారణమును సాదించుచున్నారు.

౭. మత్తుళ్ళ వాళ్వార్ గళుక్కుమున్నే వన్దుదిత్తు,
నత్తమిళ్హాల్ నూల్ శెయ్ దునాట్టైయుయ్ త్త, పెత్తిమైయో
రెన్ఱుముదలాళ్వార్ గళెన్నుమ్ పేర్ ఇవర్కు,
నిన్ఱదులగ త్తేనిగళ్ న్దు.

టీక.—మత్తుళ్ల - మిగతయేడుగురైయుండు, ఆళ్వార్ కళుక్కుమున్నే - ఆళ్వా ర్లకుముందు, వన్దు - వచ్చి, ఉదిత్తు - అవతరించి, నల్ తమిళ్హాల్ - లక్షణములతోను డిన ద్రావిడభాషతో, నూల్ - దివ్యప్రబన్ధములను, శెయ్దు - ఆనతిచ్చి, నాట్టై - లోకమందలి చేతనులను, ఉయ్ త్త - ఉజ్జీవించునట్లుచేసిన, పెత్తిమైయోర్ - మహి మగలవారు, ఎన్ఱు - అని, ముదలాళ్వార్ గళ్ ఎన్నుమ్ - మొదటియాళ్వారులని చెప్ప బడు, పేర్ - తిరునామములు, ఇవర్కు - ఈమూవురాళ్వార్లకును, ఉలగత్తే - లోక మందు, నిగళ్ న్దు - ప్రవర్తించి, నిన్ఱదు - శాశ్వతమై నిలచినది.

తా.—పదుగురాళ్వార్లలో మొదట అవతరించి ద్రవిడదివ్యప్రబన్ధములను ప్రవ దించి చేతనులను ఉజ్జీవింపఁజేసిన మహాత్ములగుటచే ఈముగ్గురికిని మొదటియాళ్వారులను తిరునామములుగలిగినవని.

౮. పేదై నెఞ్జే యిన్ఱైప్పెరుమైయఱిన్దిలైయో,
ఏదు పెరుమైయిన్ఱైక్కెన్నిల్,ఓదుగిన్ఱేన్,
వాయ్ త్తపుగళ్ మళిశైయర్ కోన్మానిల త్తిల్,
వన్దుదిత్త,కాత్తిగైయిల్ కాత్తిగై నాళ్ గాణ్.

టీక. పేదై - అజ్ఞానముగల, నెఞ్జే - ఓమనసా! ఇన్ఱై - ఈదినముయొక్క పెరుమై - వైభవమును, అఱిన్దిలైయో - తెలిసికొనలేవో, ఇన్ఱైక్కు - ఈదినమున

...వైభవము, ఏదు - ఏమిగలదు, ఎన్నెన్నిల్ - అనిఅడిగినయెడల, ఓదుగిన్ఱేన్ - ...చున్నాను, వాయ్త్త - తగిన, పుగళ్ - వైభవముగల, మంగైయర్ కోన్ - తిరు మంగైయాళ్వార్లు, మానిలత్తిల్ - ఈమహాభూమియందు, వన్దుఉదిత్త - వచ్చియవత... కార్త్తిగైయిల్ - కార్త్తికమాసమందు, కార్త్తిగైనాళ్ - కృత్తికానక్షత్రదినము, ...ర్ - దీనిని చూడుమా.

తా— తెలివిలేనిమనసా! ఈదినముయొక్క మహిమను దెలిసికొనలేదా, ఈదిన ...మేమనిన: ప్రాప్తవైభవముగల తిరుమంగైయాళ్వార్లు ఈభూమియందవతరిం... కార్తికమాసమందలి కృత్తికానక్షత్రదివసము చూడుమాఅని.

F - పా, అవ - తిరుమంగైయాళ్వార్లుఅవతరించిన కృత్తికానక్షత్రమును అద... వారికి మఙ్గళాశాసనము చేయుమని తమ హృదయమును గూర్చి అనతిచ్చు ...న్నారు.

...F. మారన్ పణిత్త తమిళ్మఱైక్కు మఙ్గైయర్ కోన్,

† ఆఱఙ్గుకూఱ అవదరిత్త, వీఱుడైయ,

కార్త్తిగైయిల్ కార్త్తిగైనాళ్ ఇన్ఱెన్ఱు కాదలిప్పార్,

వాయ్త్తమలర్త్తాళ్ గళ్ నెఞ్జే వాళ్త్తు.

టీక.— మాఱన్ - నమ్మాళ్వార్లు, పణిత్త - ప్రసాదించిన, తమిళ్మఱైక్కు - ...విడవేదమునకు, మంగైయర్ కోన్ - తిరుమంగైయాళ్వార్లు, ఆఱఙ్గమ్ - ఆఱుఅం ...ములను ప్రబన్ధములను, కూఱ - సాధించుటకు, అవదరిత్త - అవతరించిన, వీఱుడైయ- ...వైభవముగల, కార్త్తిగైయిల్ - కార్త్తికమాసమందలి, కార్త్తిగైనాళ్ - కృత్తికానక్షత్రము, ...ఇన్ఱెన్ఱు-అనివచించి, కాదలిప్పార్ - మిగులప్రేమించువారియొక్క, వాయ్త్త-పొంది ...నందు, మలర్-తామరపుష్పమువంటి, తాళ్ గళ్ -శ్రీపాదములను, నెఞ్జే - ఓమనసా, వాళ్త్తు - స్తోత్రముచేయుమా.

తా.— ఓమనసా! నమ్మాళ్వార్లు ప్రసాదించిన ద్రావిడవేదమునకు, అంగములగు ...ములను, ఆఱింటిని యొనరిచ్చుటకై అవతరించిన, తిరుమంగైయాళ్వార్లయొక్క ...నక్షత్రాది అవతార వైభవములను పరిపాలించునట్టి నంబిళ్ళగారు మొదలైన మహా ...యొక్క పాదారవిన్దములను స్తుతింపుమా అని.

* (४) వేదములు. ఋగ్వేదము-తిరువిరుత్తము, యజుర్వేదము-తిరువాశిరియము, అథ ...వేదము-పెరియతిరువన్దాది, సామవేదము-తిరువాయ్ మొళి.

† (౬) అఙ్గములు. పెరియతిరుమొళి-శిక్ష, తిరుక్కుఱున్దాణ్డగమ్ - వ్యాకరణము, ...నెడున్దాణ్డగమ్ - ఛన్దస్సు, తిరువెళుకూత్తిరుక్కై-నిరుక్తము, శిఱియతిరుమడల్ - ...తిషము, పెరియతిరుమడల్ -కల్పము.

౧౦. కా_ర్తిగై యిల్ రోగిణనాళ్ కాణ్మి నిన్ఱు కాశినియీర్,
వాయ్_త్తపుగళ్ పాణర్ వన్దుదిప్పాల్, అ_త్తియర్ గళ్
అన్బుడనేత్తాన్ అమలనాదిపిరాన్ కత్ అదత్పిన్,
నన్గుడనేకొణ్డాడుమ్ నాళ్.

టీక.– (కాశినియిల్ - భూమియందు) లేక, కాశినియీర్ - చేతనులారా! వాయ్_త్త - తగిన, పుగళ్ - వైభవముగల, పాణర్ - తిరుప్పాణాళ్వార్లు, వన్దు - వచ్చి, ఉదిప్పాల్ - అవతరించుటచే, అ_త్తియర్ గళ్ - ఆ_ర్తిగల శ్రీవైష్ణవులు, అన్బుడనే తాన్ - ప్రేమతో, అమలనాదిపిరాన్ - అమలనాదిపిరాన్ అను ప్రబన్ధమును, కత్ - అభ్యసించి, అదన్ పిన్ - అతర్వాత, నన్గుడనే - శ్లాఘ్యతతో, కొణ్డాడుమ్ - కొనియాడఁదగిన, నాళ్ - దినమగు, ఇన్ఱు - నేటిదినము, కా_ర్తిగైయిల్ - కా_ర్తికమాసమందలి, రోగిణినాళ్ - రోహిణీనక్షత్రమని, కాణ్ మిన్ - (ప్రత్యక్షముగఁ జూచునట్లు) చూడుడు

తా.–ఓచేతనులారా! (శ్రీరఙ్గనాథులు) పెరియపెరుమాళ్లు తమ తిరుమేనియందు ఐక్యముచేసికొన్నంతటి మహాప్రభావ సంపన్నులగు, తిరుప్పాణాళ్వార్లు, మిక్కిలి శ్లాఘ్యమైనదియును, సర్వేశ్వరుడగు శ్రీకృష్ణుడు, తిరుక్కోట్టియూర్ నంబి, మొదలైన వారు అవతరించిన రోహిణీనక్షత్రమందు అవతరించి ప్రసాదించిన అమలనాదిపిరాన్ అను ప్రబన్ధమును ప్రావణ్యాతిశయముగల శ్రీవైష్ణవులు అత్యన్తాదరముతో అనుసన్ధించి ఈ కా_ర్తికమాసమందు రోహిణీనక్షత్రమును మిగులకొనియాడుచుందురు సుమా.

౧౧. మన్నియశీర్ మార్ గళియిల్ కేట్టైయిన్ఱుమానిల_త్తీర్,
ఎన్నిదనుక్కేత్ అమ్మెనిలురైక్కేన్, తున్నుపుగళ్,
మామఱైయోన్ తొణ్డరడిప్పొడియాళ్వార్ పిఱప్పాల్,
నాన్మఱైయోర్ కొణ్డాడుమ్ నాళ్.

టీక — మానిల_త్తీర్ - ఈ మహాభూమియందుండు చేతనులారా! ఇన్ఱు - నేటిదినము, మన్నియ - నిలకడనుబొందిన, శీర్ - వైభవముగల, మార్గళియిల్ - మార్గశిరమాసమందు, కేట్టై - జ్యేష్ఠానక్షత్రమగునట్టి, ఇదనుక్కు - ఈనక్షత్రమునకు, ఏత్ అమ్ - ఏమి వైభవము, ఎన్ - ఏమి, ఎనిల్ - అనియడిగితిరేని, ఉరైక్కేన్ - చెప్పుచున్నాను, తున్ను - పొందియుండు, పుగళ్ - మహిమాతిశయముగల, మా - శ్రేష్ఠమైన, మఱైయోన్ - వేదార్థవిచారముచేయునట్టి, తొణ్డరడిప్పొడియాళ్వార్ - భాగవత పాదధూళియను తిరునామమును వహించినవారు, పిఱప్పాల్ - అవతరించుటచే, నాన్మఱైయోర్ - నాలుగువేదములతాత్పర్యమును గుర్తెఱిగినవారు, కొణ్డాడుమ్ - కొనియాడునట్టి, నాళ్ - తిరునక్షత్రమగును.

తా.— ఓలోకులారా! నేటిదినముస్థిరమైన వైభవముగల మార్గశిరమాస మందలి జ్యేష్ఠానక్షత్రము. ఈనక్షత్ర వైభవమేమనిన, కూడియుండు మహిమాతిశయముగల వేద తాత్పర్యజ్ఞులగు తొణ్డరడిప్పొడియాళ్వార్లు, అవతరించుటచే చతుర్వేద సారాంశమును సరిజెగిన మహాత్ములు శ్లాఘించునట్టి దినముసుమీ.

౧౨. తైయిల్ మగమిన్ఱుతారణియీర్ ఏఱ్ఱమ్, ఇన్ద -
తైయిల్ మగత్తుక్కుచ్చాత్తుగిన్ఱేన్, తుయ్యమది -
పెత్త్ ఱ మழிశైప్పిరాన్ పిఱన్దనాళెన్ఱు,
నఱ్ఱవర్ గళ్ కొణ్డాడుమ్నాళ్.

టీక.— తారణియీర్ - భూమియందుండు చేతనులారా! ఇన్ఱు - నేటిదినము, తైయిల్ - పుష్యమాసమందలి, మకమ్ - మఖానక్షత్రము, ఇన్ద తైయిల్ మగత్తుక్కు - ఈ పుష్యమాస మఖానక్షత్రమునకు, ఏఱ్ఱమ్ - అతిశయమును, శాత్తుగిన్ఱేన్ - చెప్పుచున్నాను, (ఏమనిన) తుయ్య - పరిశుద్ధమైన, మది - జ్ఞానమును, పెత్త్ఱ - లభించిన మழிశైప్పిరాన్ - తిరుమழிశైయాళ్వార్లు, పిఱన్ద - అవతరించిన. నాళ్ ఎన్ఱు - దినమని, నల్ తవర్ గళ్ - మంచితపస్సుగలవారలు, అనఁగా (ఆచార్యాభిమాన నిష్ఠులు) కొణ్డాడుమ్ - కొనియాడునట్టి, నాళ్ - విశేషదినము. (అయియున్నది).

తా.— ఓ చేతనులారా! పుష్యమాసమందలి మఖానక్షత్రముతోఁగూడిన ఈదిన మెట్టిదనిన; పరిశుద్ధజ్ఞానసంపన్నులగు తిరుమழிశైయాళ్వార్లు అవతరించిన దివసమని (సుచితపోనిష్ఠులు) అనఁగా ప్రపన్నులును ఆచార్యాభిమాననిష్ఠులును స్తోత్రముచేయు నట్టి దివసమైయున్నదని.

౧౩. మాశిప్పునర్ పూశమ్ కాణ్మిన్ ఇన్ఱుమణ్ణులగీర్,
తేశిత్తివశత్తుక్కేదెన్నిల్, పేశుగిన్ఱేన్,
కొల్లినగర్ కోన్ కులశేఖరన్ పిఱప్పాల్,
నల్లవర్గళ్ కొణ్డాడుమ్నాళ్.

టీక.— మణ్ణులకీర్ - భూమియందుండు చేతనులారా! ఇన్ఱు - నేటిదినము, మాశి - మాఘమాసమందలి, - పునర్ పూశమ్ - పునర్వసు నక్షత్రము, కాణ్మిన్ - చూడుడు, తేశిత్తివశత్తుక్కు - ఈదినమునకు, తేశు - ప్రకాశము (మహిమ) ఏదెన్నిల్ - ఏమియని, పేశుగిన్ఱేన్ - చెప్పుచున్నాను, కొల్లినగర్ కోన్ - కొల్లియనుపట్టణమునకు అధిపతియగు, కులశేఖరన్ - కులశేఖరాళ్వార్లు, పిఱప్పాల్ - అవతరించుటచే, నల్లవర్ గళ్ - సత్పురుషులు, కొణ్డాడుమ్ - స్తోత్రముచేయునట్టి, నాళ్ - దినమైయున్నది.

తా.—ఓలోకులారా! శ్రీరామావతార దివసంబగు పునర్వసునక్షత్రమువలె సంఖ్య మాసమందలి పునర్వసునక్షత్రము మహిమగలది, ఎట్లనిన; కొల్లినగరమునకధిపతియును శ్రీరామభక్తిగలవారును తిరుపతికొండయందు (తిరుమలలో) తిర్యక్ స్థావరజన్మము కోరినవారును, ప్రతిదినమును శ్రీరఙ్గయాత్రాసక్తి గలవారు నగు శ్రీకులశేఖరాళ్వారు అవతరించుటచే సజ్జనులు కొనియాడు దివసమైయున్నదని.

౪౪౧౪. ఏరార్ వై గాశ్శివిశాగ త్తిన్సీర్ అత్తై,
పారోర్ అఱియప్పగర్ గిన్ద్రేన్, శీరారుమ్,
వేదన్దమిళ్ శెయ్ద్ర మెయ్యనెళ్లిల్ కురుగై,
నాదనవదరి త్తనాళ్.

టీక.—ఏర్ - సౌన్దర్యముచే, ఆర్ - పూర్ణమైన, వైకాశి - వైశాఖ మాసమందలి విశాక త్తిన్ - విశాఖానక్షత్రముయొక్క, ఏర్ అత్తై - అతిశయమును, పారోర్ - భూమియందుండువారందఱును, అఱియ - గుర్తెఱుగునట్లు, పగర్ గిన్దేన్ - చెప్పుచున్నాను (ఏమనిన;) శీర్ - ప్రమాణముగనొప్పుకొనెడిసంపద, ఆరుమ్ నిండియుండు, వేదమ్-సంస్కృత వేదమును, తమిళ్ శెయ్ద - ద్రావిడదివ్యప్రబన్ధముగనొనర్చిన, మెయ్యన్ - తత్త్వ యాథాత్మ్యజ్ఞానముగలవారును, ఎళ్లిల్ - రమ్యమైన, కురుగై- తిరునగరికి, నాదన్ - నిర్వాహకులగు నమ్మాళ్వార్లు, అవదరి త్త - అవతరించినటువంటి, నాళ్ - దివసమైయున్నది

తా.— మిగుల మనోజ్ఞమైన వైశాఖమాసమునందలి విశాఖానక్షత్రముయొక్క వైభవమును ప్రసిద్ధపఱచుచున్నాను. ఏమనిన, పరిపూర్ణప్రామాణ్యసంపదతోనుండు సంస్కృతవేదమును ద్రవిడదివ్య ప్రబన్ధముగ ప్రసాదించిన సత్యవాదులును, తిరునగరి నిర్వాహకులునగు నమ్మాళ్వార్లుఅవతరించిన దివసమైయున్నదని.

౧౫ ఉణ్డో వై గాశ్శివిశాగత్తుక్కొప్పొరునాళ్,
ఉణ్డోశడగోపర్కొప్పొరువర్, ఉణ్డో
తిరువాయ్మొళ్లిక్కొప్పు తెన్గురుగైక్కుణ్డో,
ఒరుపార్దన్నిల్ ఒక్కుమూర్.

టీక.—వైకాశివిశాఖత్తుక్కు-వైశాఖమాసమందలి విశాఖ నక్షత్రమునకు, ఒప్పు - సమానమగు, ఒరునాళ్ - ఒకదివసము, ఉణ్డో - కలదా, శడకోపర్క్కు - ఆళ్వార్లకు, ఒప్పు - సమానులు, ఒరువర్ - ఒకరు, ఉణ్డో - కలరా, తిరువాయ్ మొళ్లిక్కు - ప్రబన్ధములలో సారతమమగు తిరువాయ్మొళ్లి ప్రబన్ధమునకు, ఒప్పు - స... ఉణ్డో - కలదా, (ఆళ్వార్లకు సమానులు ఉభయవిభూతులలో లేనట్

క్షిణదేశమునకు ఆభరణమైన తిరునగరికి, ఒరుపార్ తన్నిల్ - ప్రపఞ్చమందంతటను. (వెదకిచూచినను) ఒక్కుమ్ - సమానమగు, ఊర్-పట్టణము, ఉణ్డో-కలదా (లేదనుట).

తా.—సర్వేశ్వరుడును వాని విభూతియును సమృద్ధమగునట్లు మంగళాశాసనము చేయుట కవతరించిన వైశాఖమందలి విశాఖానక్షత్రమునకు సమానదివసము లేదు. నమ్మాళ్వారుకు సమానులొకరును లేరు. ఆవిధముగనే తిరువాయ్ మొళికి సమానప్రబన్ధమును ఆళ్వార్తిరునగరికిని సమాన పట్టణమును లేదని.

౧౬. ఇన్రైప్పెరుమైయఱిన్దిలైయో యేళైనెఞ్జే,
ఇన్రైక్కెన్నేఱ్ఱమ్మైనిలురైక్కేన్, నన్దిపున్రై
పల్లాణ్డుపాడియ్యనమ్పట్టర్పిరాన్ వన్దుదిత్త,
నల్లానియిల్ శోదినాళ్.

టీక.—ఏళైనెఞ్జే - (విషయవైలక్షణ్యమెఱుగని) చపలమగు ఓమనసా! ఇన్రై - నేటిదినముయొక్క, పెరుమై - మహిమాతిశయమును, అఱిన్దిలైయో - తెలిసికొనలేదా, ఇన్రైక్కు - నేటిదినమునకు, ఏఱ్ఱమ్-అతిశయము, ఎన్ ఎనిల్ -ఏమనిన, ఉరైక్కేన్ - చెప్పుచున్నాను, నన్ది - మేలు, పున్రై - సమగూర్చునట్లు, పల్లాణ్డు - అనేకసంవత్సరములు (వెంచేసి యుండవలయునని) పాడియ - మంగళాశాసనము చేసిన, నమ్ - మనయొక్క, పట్టర్ పిరాన్ -ఇతరమత నిరసనపూర్వకముగ పరస్వరూపమును స్థాపించిన పెరియాళ్వార్లు, వన్దు - వచ్చి, ఉదిత్త - అవతరించిన, నల్ ఆనియిల్ - శ్రేష్ఠమగు జ్యేష్ఠమాసమందలి, శోదినాళ్ - స్వాతి నక్షత్ర దివసమై యున్నది.

తా.—వైలక్షణ్యజ్ఞానములేనిమనసా! నేటి మహిమాతిశయమును గుర్తెఱుగవా? నేటి కతిశయమేమనిన, పరతత్వ నిర్ణయంబుచేసి శ్రియఃపతికి మంగళమును ప్రార్థించుచు తిరుప్పల్లాణ్డుపాడిన మనపెరియాళ్వార్లు అవతరించిన జ్యేష్ఠమాసమందలి స్వాతినక్షత్రము అని.

౧౭. మానిలత్తిల్ మున్నమ్ పెరియాళ్వార్ వన్దుదిత్త,
ఆనిదన్నిల్ శోదియెన్నాల్ ఆదరిక్కుమ్, జ్ఞానియర్కు
ఒప్పోరిల్లైయివ్వులగుదన్నిలెన్రునెఞ్జే,
ఎప్పోదుమ్ శిన్దిత్తిరు.

టీక.—నెఞ్జే - ఓమనసా! మున్-పూర్వము, మానిలత్తిల్ -ఈమహాభూమియందు, నమ్ - మనయొక్క, పెరియాళ్వార్ - పెరియాళ్వార్లు, వన్దుదిత్త- వచ్చియవతరించిన,

అనితన్నిల్ - జ్యేష్ఠమాసమందలి, శోదియొన్దాల్ - స్వాతీనక్షత్రమనిన, ఆదరిక్కుమ్ - మిగుల అపేక్షతో నాదరించునట్టి, ఞానియర్కు - మహాత్ములకు, ఇవ్వులగుతనిల్ - ఈభూ క్రమునందు, ఒప్పోర్ - సమానులు. ఇల్లై - లేరు, ఎన్ఱు - అని, ఎప్పోదుమ్ - ఎల్లప్పుడును, శిందిత్తుఇరు - ఆలోచించియుండుమా.

తా.— ఓమనసా! పెరియాళ్వార్లు అవతరించిన, జ్యేష్ఠమాసమందలి స్వాతీనక్షత్రమును ఆదరించునట్టి మహాత్ములకు సమానులు ఒకరును ఈభూమియందులేరని బుద్ధియందు తలచియుండుమా అని.

౧౮. మఙ్గళాశాసనత్తిల్ మత్తుళ్ళవాళ్వార్ గళ్,
తఙ్గళార్వత్తళవున్దానన్ఱి, ప్పొఙ్గుమ్
పరివాలేవిల్లిపుత్తూర్పట్టర్ పిరాన్ పెత్రాన్,
పెరియాళ్వారెన్నుమ్ పెయర్.

టీక.—మంగళాశాసనత్తిల్ - సర్వేశ్వరునికి అతిశయమును ప్రార్థించుటయందు, మత్తుళ్ళ - ఇతరులగు, ఆళ్వార్ గళ్ తంగళ్ - తొమ్మండ్రుగురు ఆళ్వార్ల, అర్వత్తు - ఆశయొక్క, అళవుదాన్ అన్ఱి - కొలదిగాక, పొఙ్గుమ్ - వృద్ధిపొందుచుండు, పరివాలే (భగవద్విషయమందలి) స్నేహమునే, విల్లిపుత్తూర్ పట్టర్ పిరాన్ - శ్రీవిల్లిపుత్తూరు విష్ణుచిత్తులు, పెరియాళ్వార్ ఎన్ఱుమ్ - పెరియాళ్వార్లుఅనెడు, పెయర్ - తిరునామమును, పెత్రాన్ - పొందిరి.

తా.—శ్రియఃపతికి క్షేమాతిశయమును ప్రార్థించువిషయమందుతక్కినతొమ్మండ్రుగురు ఆళ్వార్లకంటెను, శ్రీవిష్ణుచిత్తులు, ఉప్పొంగుచుండు అధికాపేక్షగలవారగుటచే వీరికి పదుగురాళ్వారులలో పెరియాళ్వార్లు (పెద్దఆళ్వార్లు) అని తిరునామము గలిగెను.

౧౯. కోదిలవాళ్వార్ గళ్ కూఱుగలైక్కెల్లామ్,
ఆదితిరుప్పల్లాణ్డానదువుమ్, వేదత్తు-
క్కోర్ మొన్నుమదుపోల్ ఉళ్ళదుక్కెల్లామ్ శురుక్కాయ్,
త్తాన్ మఙ్గలమాదలాల్.

టీక.— కోదు - దోషము, (ఇచ్చట సామాన్యకథాప్రస్తావము) ఇలవాన్ - దోషరహితులైన ఆళ్వార్ గళ్ - పదుగురుఆళ్వార్లను, కూఱు - సాదించినట్టి, కలైక్కెల్లామ్ - దివ్యప్రబన్ధములకన్నిటికిని, తిరుప్పల్లాణ్డు - తిరుప్పల్లాణ్డుప్రబన్ధము, వేదత్తుక్కు - సంస్కృతవేదమునకును, ఉళ్ళదుక్కెల్లామ్ - సమస్తమునకును, శురుక్కాయ్ - సంగ్రహమై,

ఎన్నుమ్ అదుపోల్ - ఓమ్ అనెడు ప్రణవమువలె, తాన్-తాను, మఙ్గళమ్ - శుభకరమై, ఆదలాల్ - అగుటచే, ఆది - మొదటిప్రబన్ధము, ఆనదువుమ్ - అయిన విధమునై యున్నది.

తా.— సంస్కృతవేదములకును మఱియు సమస్తములకును ఓమ్ అను ప్రణవము ఆదియందుంకునట్లు దివ్యప్రబన్ధములకన్నిటికిని, తిరుప్పల్లాణ్డు మంగళకరమైనదగుటచే మొదటి ప్రబన్ధమైయున్నదని.

౨౦. ఉణ్డో తిరుప్పల్లాణ్డుక్కొప్పదోర్ కలై దాన్,
ఉణ్డో పెరియాళ్వార్క్కొప్పొరువర్, తణ్డమిళ్ నూల్
శెయ్దరుళుమాళ్వార్గళ్ దమ్మిలవర్ శెయ్గలైయిల్,
పైదల్ నెఞ్జే నీయుణర్న్దుపార్.

టీక.—తణ్ - రమ్యమైన, తమిళ్ నూల్ - ద్రావిడశాస్త్రరూపదివ్యప్రబన్ధమును, శెయ్దరుళుమ్ - ప్రసాదించినట్టి, ఆళ్వార్గళ్ తమ్మిల్ - పదుగురాళ్వార్లలో, పెరియాళ్వార్క్కు - పెరియాళ్వార్లకు, ఒప్పు - సమానులు, ఒరువర్ - ఒకరు, ఉణ్డో - లేరా! అవర్ - ఆపదుగురాళ్వార్లు, శెయ్కలైయిల్ - సాదించిన దివ్యప్రబన్ధములలో, తిరుప్పల్లాణ్డుక్కు - తిరుప్పల్లాణ్డు అను దివ్యప్రబన్ధమునకు, ఒప్పుఆదు - సమానమగు, ఓర్కలైదాన్ - ఒక దివ్యప్రబన్ధము, ఉణ్డో - కలదా! పైదల్ నెఞ్జే - తెలివిలేనిమనసా నీ - నీవు, ఉణర్న్దు - ఆలోచించి, పార్ - చూడుము.

తా.—ద్రావిడ దివ్యప్రబన్ధములను ప్రసాదించిన ఆళ్వార్లలో పెరియాళ్వార్లకు సమానులు ఒకరును లేరు. ఆయాళ్వారాదులు ప్రసాదించిన దివ్యప్రబన్ధములలో తిరుప్పల్లాణ్డుప్రబన్ధమునకు సమానప్రబన్ధమును లేదు. జ్ఞానహీనమైనమనసా ఆలోచించి చూడుమని.

... ములను

౨౧. ఆళ్వార్ తిరు[illegible]మగళార్ ఆణ్డాళ్, మదురకవి - ...ల తిరునక్షత్రదివ
యాళ్వార్ ఎతి[illegible] రామిశర్గళ్, వాళ్వాగ[illegible]
నన్దుది త్తమాద[illegible]ళ్ నాళ్గళ్ దమ్మి[illegible]
ఇన్దవులగో[illegible]రె ఫ్ఫామ్ యామ్

టీక.—ఆళ్వార్ తిరువ[illegible]ార్ - [illegible] ఇన్ద [illegible]
...యుము, మదురకవియా[illegible] ... ఏటపస్ నెఞ్జే ...
... - ఉడైయవరులు [illegible] ద్దైమక్కెన్ను ... మ్మోర్ ! ...
... సంపదగ, [illegible] ... కమందు, ఎన్దై - మాయొక్కసత్తకు కారణభూతు
... ఎర్ - ఆచార్యపర[illegible] ...
* గరుత్మ[illegible]ధురకవియాళ్వార్లు, [illegible] ఉడైయవరులు, ఎన్దమక్కు - మనకొఅక్కై, వన్ద-

వచ్చి ఉదిత్త - అవతరించిన, నాళ్ - దివసము, ఎన్నుమ్ - అనెడు, వాళియినాళ్, విశేషముచే, నెఞ్జే - ఓమనసా! ఇన్దత్తిరువాదిరైతన్నిల్ - ఈ యారుద్రానక్షత్రము యొక్క, శీర్మైదనై - వైలక్షణ్యమును, ఒరువామల్ - విడువక, ఎప్పొழుదుమ్-ఎల్లప్పుడును, ఓర్ - అనుసన్ధించుకొనుచుండుము.

తా. -- ఓమనసా! ఈజగత్తునందు మనకు మూలకారణభూతులగు ఉడైయవరులు మననిమిత్తమై అవతరించిన యీ ఆరుద్రా నక్షత్రముయొక్క వైలక్షణ్యవిశేషము ఎల్లప్పుడును యెడతెగక అనుసన్ధించుకొనుచుండుమా అని.

౩౦. ఎణ్ణరుమ్శీర్ప్పొయ్గైమున్నోర్ఇవ్వులగిల్తోన్ఱియవూర్,
వణ్మైమిగుకచ్చిమల్లైమామయిలై, మణ్ణియిల్నీర్,
తేఙ్గుమ్కుఱైయలూర్శీర్కలియన్తోన్ఱియవూర్,
ఓఙ్గుముఱైయూర్పాణనూర్.

టీక. -- ఎణ్ - లెక్కించుటకు, అరుమ్ - దుర్లభమైన, శీర్ - కల్యాణగుణములుగల, మున్నోర్ - మునుపటివారగు, పొయ్గై - (పొయ్గై, పూద, పేయాళ్వార్లు) అనుమూవురును, ఇవ్వులగిల్ - ఈలోకమందు, తోన్ఱియ - అవతరించిన, ఊర్ - నగరములు, వణ్మై - పూర్ణమైన వైలక్షణ్యము, మిగు - అతిశయించియుండు, కచ్చి - కాంచీనగరము, మల్లై - తిరుక్కడల్మల్లై (మహాబలిపురము) మా - గొప్పదైన, మయిలై - మైలాపురను (అయివున్నవి), మణ్ణియిల్ - మణ్ణియనుయేటియందు, నీర్ - జలము తేఙ్గుమ్ - నిండియుండు, కుఱైయలూర్ - తిరుక్కుఱైయలూర్ అనునగరము, శీర్ - సంపదతోఁగూడిన, కలియన్ - తిరుమఙ్గైయాళ్వార్లు, తోన్ఱియ - అవతరించిన, ఊర్ - నగరమైయున్నది, ఓఙ్గుమ్ - అతిశయించియుండు, పాణన్ - తిరుప్పాణాళ్వార్లయొక్క ఊర్ - నగరము, ఉఱైయూర్ - (శ్రీరఙ్గమునకుసమీపమందుండు) ఉఱైయూరైయని.

తా. — కాంచీనగరము పొయ్గైయాళ్వార్లకును, తిరుక్కడల్మల్లై (మహాబలి పురము) భూదత్తాళ్వార్లకును, మైలాపురము, పేయాళ్వార్లకును జలసమృద్ధిగలిగియుండు తిరుక్కుఱైయలూర్ తిరుమంగైయాళ్వార్లకును, శ్రీరఙ్గమునకు సమీపమందుండు ఉఱైయూరు తిరుప్పాణాళ్వార్లకును, అవతారస్థలములైయున్నవని.

౩౧. తొణ్డరడిప్పొడియార్తోన్ఱియవూర్, తొల్పుగழ్ శేర్,
మణ్డఙ్గుడియెన్బర్మణ్ణులగిల్, ఎణ్డిశైయు

మేత్తుమ్కుల శేకరన్నూ రెనవురై ప్పర్,
వాయ్ త్తతిరువఞ్జిక్కళమ్.

టీక.—మణ్ణులగిల్ - భూమియందు, తొండరడిప్పొడియార్ - తొణ్డరడిప్పొడి యాళ్వార్లు (విప్రనారాయణులు), తోన్ఱియ- అవతరించిన, ఊర్ - నగరము, తొల్- కారియగు, పుగళ్ - యశస్సైననది, శేర్-కలిగియుండు, మణ్డఙ్గుడి - మణ్డఙ్గుడియను గ్రామము, ఎన్బర్ - అనిచెప్పుదురు, ఎణ్డిశైయుమ్ - ఎనిమిది దిక్కులందును, ఏత్తుమ్- స్తోత్రముచేయునట్టిదియు, వాయ్త్త, పొందియుండు, తిరువంజిక్కళమ్ - కేరళదేశ మందలి నిచుళమని పేరుగల మహానగరమగు, కులశేఖరన్ - కులశేఖరాళ్వార్లయొక్క, ఊర్ఎన - పట్టణమని, ఉరైప్పర్ - ప్రసాదింతురు.

తా.—లోకమున తొణ్డరడిప్పొడి యాళ్వార్లయొక్క అవతారస్థలము ప్రసిద్ధి గాంచిన మణ్డఙ్గుడియందురు, అష్టదిక్కులందును కొనియాడునట్టి కేరళదేశమందలి నిచుళనగరము కులశేఖరాళ్వార్ల అవతారస్థలమని చెప్పుదురని.

౨౨. మన్ను తిరుమழிశై మాడ త్తిరుక్కురుగూర్,
మిన్ను పుగழ் విల్లి పుత్తూర్ మేదినియిల్, నన్నెఱియోర్
ఏయ్న్దప త్తిశారర్ ఎழிల్ మాఱన్ పట్టర్ పిరాన్,
వాయ్న్దుదిత్తవూర్ గళ్ వగై.

టీక.—మేదినియిల్ - భూమియందు, నల్ నెఱియోర్ - మేలైన ఆచార్యాభిమార్గమందు నిష్ఠగలవారును, ఏయ్న్ద - పొందియుండు, పత్తిశారర్-సారమగు భక్తిగలవారునగు తిరుమழிశైయాళ్వార్లు, మన్ను తిరుమழிశై - *జగన్నాథస్వామి నిత్యవాసము చేయునట్టి తిరుమழிశైయు, ఎழிల్ మాఱన్ -సున్దరులగునమ్మాళ్వార్లు, మాడత్తిరుక్కురుగూర్ - మేడలతోగూడియుండు తిరునగరియు, పట్టర్ పిరాన్ - పెరియాళ్వార్లు, మిన్ను పుగழ் - అంతట ప్రకాశించుచుండు యశస్సుగల, విల్లిపుత్తూర్ - శ్రీవిల్లిపుత్తూర్ యును, వాయ్న్దు - మహిమనొంది, ఉదిత్త-అవతరించిన, ఊర్ గళ్ - పట్టణముల యొక్క, వగై - క్రమమైయున్నవి.

తా.—ఈ భూమియందు *జగన్నాథస్వామి నిత్యవాసము చేయునట్టి మహీసారక్షేత్రమునందు తిరుమழிశైయాళ్వార్లను పాణ్డ్యదేశమందలి తిరునగరియందు నమ్మాళ్వార్లను శ్రీవిల్లిపుత్తూరునందు పెరియాళ్వార్లను అవతరించినవారైరని.

శీరారుమ్ విల్లిపుత్తూర్ శెల్వ త్తిరుక్కోళూర్,
ఏరార్ పెరుమ్బూదూర్ ఎన్నుమివై పారిల్

*తిరుమழிశైయను గ్రామములోనుండు పెరుమాళ్లకు పేరు. పురిజగన్నాధముకాదు.

మదియారుమ్మాణ్డాళ్ మదురకవియాళ్వార్,
ఎత్తిరాశర్త్తోన్ఱియపూరిఙ్గు.

టీక.—ఇఙ్గు - ఈభూమియందు, శీర్ - సమృద్ధమైనది, ఆరుమ్ - సమృద్ధి యుండు, విల్లిపుత్తూర్ - శ్రీవిల్లిపుత్తూరు, పారిల్ - భూమియందు, మదియారుమ్ తదీయపర్యన్తమైన జ్ఞాన పరిపూర్తిగల, ఆణ్డాళ్ - గోదాదేవియును, శెల్వత్తిరుక్కో ళూర్ - సమృద్ధతోఁగూడిన *తిరుక్కోళూరు, మదురకవియాళ్వార్ - మధురకవి ఆళ్వార్లును, ఏర్ - సౌన్దర్యము, ఆర్ - అతిశయించియుండు, పెరుమ్బూదూర్ - శ్రీపెరుంబూదూరు, యతిరాశర్ - ఉడైయవరులును, ఎన్ఱుమివై - అనెడు పట్టణము (క్రమముగ) తోన్ఱియవూర్ - అవతరించినపట్టములైయున్నవి.

తా.—శ్రీవిల్లిపుత్తూరునందు ఆణ్డాళమ్మగారును, *తిరుక్కోళూరునందు-మధురకవి యాళ్వార్లును, శ్రీపెరుంబూదూరిలో యతిరాజులవారును, అవతరించినవారైరి.

३४. ఆళ్వార్గళేఱ్ఱమ్మరుళిచ్చెయల్లేఱ్ఱమ్,
తాళ్వాదుమిన్ఱియవైతాఙ్గవళర్త్తోర్,ఏళ్పారు-
మ్ముయ్యవవర్గళ్ శెయ్దవియాక్కియైగళుళ్ళదెల్లామ్,
వైయమఱియప్పగర్వోమ్వాయ్న్దు.

టీక.—ఆళ్వార్గళ్ - ఆళ్వారాదులయొక్క, ఏఱ్ఱమ్ - అతిశయమును, అరుళిచ్చెయల్ - వారుప్రసాదించిన దివ్యప్రబన్ధములయొక్క, ఏఱ్ఱమ్ - అతిశయమును, తాళ్వాదుమిన్ఱి - కొఱత కొంచమైననులేక, అవైతాఙ్గ - వానినన్నిటిని, వళర్త్తోర్ వృద్ధిబొందించినవారును, ఏళ్పారుమ్ - సకలలోకవాసులును, ఉయ్య - ఉజ్జీవించునట్లు, అవర్గళ్ - అపూర్వాచార్యులు, శెయ్ద - చేసినట్టి, వియాక్కియైగళ్ - వ్యాఖ్యానములు, ఉళ్ళదెల్లామ్ - సమస్తమును, వైయమ్- భూమిలోనుండువారందరును, అఱియ - గుర్తెఱుగునట్లు, వాయ్న్దు - (పొందికగలిగి) అభివృద్ధమగునట్లు, పగర్వోమ్ - చెప్పుదుము.

తా.—పన్నిద్దరాళ్వారుల వైభవమును, వారానతిచ్చిన దివ్యప్రబన్ధముల మరియును, పూర్వాచార్యులు ఆదివ్యప్రబన్ధములకు కొఱతలేక ప్రసాదించిన వ్యాఖ్యానములు యావత్తును సకలచేతనులునుగుర్తెఱుగునట్లు చక్కగ అభివృద్ధినొందునట్లు వచించెదమని.

३५. ఆళ్వార్గళైయుమ్మరుళిచ్చెయల్గళైయుమ్,
తాళ్వానినైప్పవర్గళ్దామ్ నరగిల్,

* ఆళ్వార్తిరునగరికి సమీపమునసుండు ఊరు.

...వ్వార్గళెన్నునినైత్తునెఞ్జేయెప్పొழுదుమ్నీయవర్పాల్,
...న్ణుగక్కూశి త్తిరి.

...క.—నెఞ్జే - మనసా! ఎప్పొழுదుమ్ - ఎల్లప్పుడును, నీ - నీవు, అళ్వార్గ...ళ్ - పన్నిద్దరాళ్వారులనున్ను, అరుళిచ్చెయల్...యుమ్ - వారానతిచ్చిన దివ్యప్ర...మున్ను, తాழ్వాగ - (జన్మమాత్రమును భాషామాత్రమునుయోచించి) తక్కు...నినైప్పవర్గళ్ తామ్ - తలచెడు నీచులు, నరగిల్ - నరకమందు, వీழ్వార్గళ్ - ...దురు, ఎన్రు - అని, నినైత్తు - తలచి, అవర్పాల్ - వారియొద్ద, కూశి - భయ...బడి, శెన్రు - పోయి అణుగ - సమీపించునట్లు, తిరి - ప్రవర్తించుము.

తా.— ఓమనసా! నీవు అళ్వారాదులనున్ను వారి దివ్యప్రబన్ధములనున్ను ...వగ దలచెడు పరమనీచులు నరకమునకు బోవుదురని యెంచి వారిసన్నిధియందును ...ప్రబన్ధములవిషయములయందును, భయభక్తులుగలిగి ప్రవర్తింపుమాఅని.

౩౬. తెరుళుత్ఱవాళ్వార్గళ్శీర్మైయఱివారార్,
అరుళిచ్చెయల్లైయఱివారార్, అరుళ్పెత్ఱ
నాదమునిముదలానన్దేశికరైయల్లాల్,
పేదైమనమేయుణ్డో పేశు.

టీక.—తెరుళ్ - దివ్యజ్ఞానమును, ఉత్ఱ - లభించియున్న, అళ్వార్గళ్ - ...రాదులయొక్క, శీర్మై - వైలక్షణ్యమును, అఱివార్ - గుర్తెఱుగువారు, ఆర్ - ...అరుళిచ్చెయలై - వారానతిచ్చిన దివ్యప్రబన్ధమహిమను, అఱివార్ - తెలిసికొ...ను, ఆర్ - ఎవరు, అరుళ్ - అళ్వార్లయొక్క కృపను, పెత్ఱ - లభించిన, ...ముని - శ్రీమన్నాథమునులు, ముదలాన - మొదలగు, నందేశికరై యల్లాల్ - మన ...చార్యులనుదప్ప, పేదైమనమే - తెలివిలేని మనసా, ఉణ్డో - వేఱొకరుగలరా, ...చెప్పుము.

తా.— తెలివిలేనిమనసా! దివ్యజ్ఞానసమ్పన్నులగు అళ్వారాదులయొక్కయు దివ్య...ములయొక్కయు మహిమాతిశయమును, అళ్వార్ల కృపాకటాక్షపాత్రులగు శ్రీ...నాథమునులు మొదలగు పూర్వాచార్యులను దప్ప తెలిసికొనువారు వేరే ఎవరున్నారు ...చూడుము (అనగా లేరని).

ఓరాణ్వழிయాయుపదేశిత్తార్మున్నోర్,
ఏరారెతిరాశర్ఇన్నరుళాల్, పారులగిల్,

ఆశైయుడై యోర్కెల్లామ్ ఆరియర్ గాళ్
కూఱుమెన్ఱు పేశివరమ్బఱుత్తార్ పిన్.

టీక.—మున్నోర్ - ఉడైయవరులకు పూర్వాచార్యులు, (ప్రపత్త్యర్థము) ఒక్కొక్క, ఆణ్ వఴియాయ్ ... గుణములుగలపురుషుల మూలముగ, ఉపదే ఉపదేశించి రక్షించుచూవ ... ,ఏర్ - సౌన్దర్యముయొక్క, ఆర్ - పూర్తిగల,ఎతిర ఉడైయవరులు, ఇఙ్ - నిర్హేతుకమైన (భోగ్యమైన), అరుళాల్ - కృపచే, ... గిల్ - భూలోకమందు, ఆశైయుడైయోర్ క్కెల్లామ్ - అపేక్షగలవారికందరికిని,ఆ ర్ గాళ్ - ఆచార్యపదమునందు నియమింపఁబడిన, ఆచార్యులారా! కూఱుమ్ - ఉప పుడు, ఎన్ఱు - అని, పేశి - నాదించి, పిన్ - తర్వాత (మునుపటివారియొక్క) మ్బు - హద్దును, అఱుత్తార్ - ఛేదించిరి.

తా.—పూర్వాచార్యులుసంవత్సరము,ఆరుమాసములు, ఒక చేతనుని,నానావిధ పరీక్షించి, తగినవైలక్షణ్యము కుదిరియున్న చేతనునికి ప్రపత్త్యర్థమును నుపదేశించు వచ్చిరి. యతిరాజులవారు. తమనిర్హేతుక పరమకృపచే, అపేక్షగల చేతనులకంద కిని, విశేషనియమములనుజూడక ఆచార్యులారా! ఉపదేశంపుడని మునుపటి నియమ ను నివర్తింపఁజేసిరని.

౩౮. ఎమ్బెరుమానార్ దరిశనమెన్ఱేయిదుక్కు,
నమ్బెరుమాళ్ పేరిట్టునాట్టివైత్తార్, అమ్బువియోర్,
ఇన్దద్దరిశనత్తైయెమ్బెరుమానార్ వళర్త్త,
అన్దచ్చెయలఱిగైక్కా.

టీక.—అమ్బువియోర్ - రమ్యమైన భూమియందుండువారు (గుర్తెఱిగి యు వించుటకొఱకు) ఇన్దద్దరిశనత్తై - ఈవైష్ణవసిద్ధాన్తమును, ఎమ్బెరుమానార్ - ... యవరులు, వళర్త్త - వృద్ధిపొందించిన, అన్దచ్చెయల్ - ఆకృత్యమును, అఱిగైక్కా గుర్తెఱిగి యుజ్జీవించునట్లు, నమ్బెరుమాళ్ - శ్రీరంగనాథులు, ఇదుక్కు - ఈవైష్ణ ధ్ధాన్తమునకు,(నాథయామునాదులుండగ) ఎమ్బెరుమానార్ దరిశనమెన్ఱే-యతిరాజుల సిద్ధాన్తమనియే, పేర్-తిరునామమును ఇట్టు-ఉంచి, నాట్టివైత్తార్ - స్థాపించినవా

తా.—ఎమ్బెరుమానార్లు సకలచేతనులును ఉజ్జీవింపవలయునని ... ను పరమ ఈవైష్ణవసిద్ధాన్తమును అభివృద్ధి నొందించుటవలన, నంబెరుమాళ్లు, ఎమ్బె దర్శనమని ఈవైష్ణవసిద్ధాన్తమునకు తిరునామమును స్థాపించినవారైరని.

౩౯. పిళ్ళాన్ నఞ్జీయర్ పెరియవాచ్చాన్పిళ్ళై,
తెళ్ళార్ వడక్కుత్తిరువీధి పిళ్ళై,

ఆ వ్యాఖ్యానములు, అన్ఱాగిల్ - లేనియెడ, అన్దో - అయ్యో! తిరువాయ్ మొళ్ళిప్పొరుళై - తిరువాయ్ మొళ్ళియొక్క యర్థమును, తేర్ న్దు - పర్యాలోచనచేసి, ఉరైక్క వల్ల - సాటి పెదగిన, గురువు - ఆచార్యులు ఒకరు, ఇక్కాలమ్ - ఈ కాలమునందు, ఆర్ - ఎవరు నెఞ్జమే - ఓ మనస్సా! నీ చెప్పుమా.

తా.—ఓ మ[illegible] మొదలగు ఆర్యులు తిరువాయ్ మొళ్ళికి వ్యాఖ్యానములు సాదింపక[illegible] కాలమందు అట్టి దివ్యప్రబన్ధముయొక్క అర్థవిశేషములను సాదింపగల[illegible]న్నారు.

౪౧. [illegible]ళ్ళారుమ్ ఞాన త్తిరుక్కురుగైప్పిరా
న్పిళ్ళాన్, ఎతిరాశర్ పేరరుళాల్, ఉళ్ళారు -
మన్బుడనే మాఱన్ మఱై ప్పొరుళై యన్ఱురై త్తదు,
ఇన్బమిగు మాఱాయిరమ్.

టీక.— [illegible] పరిపూర్ణమైన, ఞాన - జ్ఞానవిశేషముగల, తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్ - తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్ అనువారు, ఎతిరాశర్ - ఉడైయవరులయొక్క, పేరరుళాల్ - నిరవధికకృపచేత, ఉళ్ - హృదయమందు, [illegible] [illegible] [illegible] - ఆకాలమందు, మాఱన్ - ఆళ్వారులయొక్క [illegible] - ద్రావిడ వేదమగు, [illegible] [illegible] - తిరువాయ్ మొళ్ళియొక్క, పొరుళై - అర్థమును, [illegible] [illegible]యించియుండునట్టి, (పురాణరత్నమగు శ్రీవిష్ణుపురాణ [illegible] [illegible] - ఆఱు వేల వ్యాఖ్యానముగ, ఉరైత్తదు - ప్రసాదించిన

తా.—మిగుల [illegible] జ్ఞానవిశేషముగలతిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్ ఎతిరాజులవారి నిరవధికకృపచే వారిసన్నిధిలో విని, మననముచేసి అర్థములు విశదముగా ఆకాలమునందు పరిపూర్ణమైన ప్రేమతో ద్రావిడవేదమగు తిరువాయ్ మొళ్ళికి శ్రీవిష్ణుపురాణసంఖ్యతో ఆఱు వేల వ్యాఖ్యానమును ప్రసాదించినవారైరని

౪౨. తఞ్జీరై ఞానియర్ గళ్ తామ్ పుగళుమ్ వేదాన్ది,
నఞ్జీయర్ దామ్ భట్టర్ నల్లరుళాల్, ఎఞ్జాద -
ఆర్వముడన్ మాఱన్ మఱై ప్పొరుళై యాయ్ న్దురై త్తదు,
ఏర్ ఒన్బదినాయిరమ్.

టీక.—తఞ్జీరై - తమ జ్ఞానాదిగుణములను, లేక తమయొక్క లోకమునకు శరణమైన ఆచార్యానువర్తనము మొదలగు ఆత్మగుణములను, ఞానియర్ గళ్ - జ్ఞా[illegible]

...కలందలును, పుగఝుమ్ - కొనియాడునట్టి, వేదాన్ది - వేదాన్తి అని ప్రసిద్ధినొందిన, ...జీయర్ తామ్ - (స్వాచార్యులగు శ్రీభట్టరు మనజీయరు అని అభిమానించిన) నంజీయర్ ...నువారు, బట్టర్ నల్లరుళాల్ - శ్రీభట్టర్ వారి పరమకృపచే, ఎణ్ణాద - సజ్జోకచము ...ందని, అర్వముడన - అభినివేశముతో, మాఱన్ - ఆళ్వార్లయొక్క, మఱై - ద్రావిడ వేదమగు తిరువాయ్ మొళియొక్క, పొరుళై - అర్థమును, ఏర్ - శబ్దములపొందికయొక్క చా...ర్యముచేతను అర్థగౌరవము చేతను మిగుల మనోజ్ఞముగనుండు, ఒన్బది నాయిరమ్ - తొమ్మి... వేలవ్యాఖ్యానముగ, అయ్న్దు - ఆలోచించి, ఉరైత్తదు - ప్రసాదించినది.

తా.—జ్ఞానాధికులు స్తోత్రముచేయునట్టి దివ్యగుణసంపదగల నంజీయరు (వేదా...న్తి) శ్రీభట్టర్ వారి పరమకృపచే అసజ్కుచితమగునపేక్షతో తిరువాయ్ మొళికి వేదా...న్తస్త్రమైన శ్రీభాష్యసంఖ్యచే శబ్దార్థములచే గంభీరముగనుండు తొమ్మిది వేలవ్యాఖ్యానమును ఆనతిచ్చిరని.

౪౩. నమ్బిళ్ళైతమ్ముడైయ నల్లరుళాలేవియిడ,
పిన్ పెరియవాచ్చాన్పిళ్ళైయదనాల్, ఇన్బా
వరుపత్తిమాఱన్మఱైప్పొరుళైచ్చొన్నదు,
ఇరుబత్తునాలాయిరమ్.

టీక.—నమ్బిళ్ళై - (కలివైరిదాసులు) నంబిళ్లగారు, తమ్ముడైయ - తమయొక్క, నల్లరుళాల్ - కేవలపరమకృపచే, ఏవియిడ - (తిరువాయ్ మొళికి ఒకవ్యాఖ్యానమును చేయుమని) నియమింపఁగ, పిన్ - తర్వాత, (పెరియవాచ్చాంబిళ్లగారు) అదనాల్ - ఆచార్యనియమనమునుబట్టి, ఇన్బా - సుఖరూపముగ, వరు - వచ్చుచుండు, పత్తి - భక్తి ...యొక్క బలాత్కారముచే, మాఱన్ - ఆళ్వారులయొక్క, మఱై - ద్రావిడవేదమగు తిరువాయ్ మొళియొక్క, పొరుళై - అర్థమును, శొన్నదు - సాధించినది, ఇరుబత్తునాలాయిరమ్ - (శ్రీరామాయణసంఖ్యతో) ఇరువదినాల్గు వేల వ్యాఖ్యానమైయున్నది.

తా.— నంబిళ్లగారు తిరువాయ్ మొళికి ఒకవ్యాఖ్యానమును చేయుమని పెరియ వాచ్చాంబిళ్లైగారికి నియమింపగ వారుభక్తిప్రేరితులై శ్రీరామాయణప్రక్రియగ ఇరువది నాల్గువేల వ్యాఖ్యానమును సాధించిరని.

౪౪. తెళ్ళియదానమ్బిళ్ళై శెప్పునెఱిదన్నై,
వళ్ళల్ వడక్కుత్తిరువీధిప్పిళ్ళై, ఇన్ద -

నాడఱియమాఱన్మఱైప్పొరుళ్నిన్గురైత్తదు,
* ఈడుముప్పత్తాఱాయిరమ్.

టీక.— తెళ్లియదు - తేటనొందినదియును సారాసారములను వివేకించుటయంద సామర్థ్యముగల, నమ్బిళ్లై - నమ్బిళ్లగారు, శెప్పు - సాదించిన, నెఱితన్నై - దివ్యసూ క్రమమును, వళ్లల్ - (అప్పటివారికిమాత్రముగాక వెనుకటివారును ఉజ్జీవించునట్లు "ఈ డు" అనువ్యాఖ్యానమును గ్రన్థముగ వ్రాసియుంచి ఉపకరించిన) ఔదార్యముగల, వ డక్కుత్తిరువీధిప్పిళ్లై - (ఉత్తరవీధికృష్ణులు) వడక్కుత్తిరువీథిప్పిళ్లగారు, ఇన్దనాడు - ఈ లోకమువారందఱును, అఱియ - గుర్తెఱుగునట్లు, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, మఱై - ద్రావిడవేదమగు తిరువాయ్మొళియొక్క, పొరుళ్ - అర్థమును - నన్గు - (చక్కగ) స్పష్ట మగునట్లు, *(ఈడుముప్పత్తారాయిరమ్) అనువ్యాఖ్యానమును, ఉరైత్తదు - సాదించినది.

* ఈడు=మహిమనొందినవ్యాఖ్యానము. ఈడు=ఉపమానము, సమానము, ఉపపత్తులకుసమానమైనదనియు, ప్రమాణాదులు మొదలగువానిచేఅభ్యసించుటకు దగియుండు వ్యాఖ్యానము.

ముప్పత్తారాయిరమ్=౩౨ అక్షరములుగూడినదిఒకగ్రన్థమనియుఆవిధముగలెక్క పగ ౩౬ వేల గ్రన్థములుగలది. ఈవిధముగనే ఆఱాయిరప్పడి మొదలైనవానికిసంకేతము.

తా.— సారాసారవివేకచతురులగు నమ్బిళ్లగారు ప్రసాదించిన, తిరువాయ్మొళి యొక్క శ్రుతప్రకాశికప్రక్రియయగు ఈడు ముప్పదియారువేలు గలవ్యాఖ్యానము వెనుకటివారును గుర్తెఱిగి ఉజ్జీవింపవలయునను అనెడుపరమకృపతోఁగూడిన ఔదా ర్యముచే గ్రన్థపూర్వకముగ సకల చేతనులకును వడక్కుత్తిరువీథిప్పిళ్లగారు సాదించి

౭౫. అన్బొడళగియమణవాళచ్చీయర్,
పిన్బొరుమ్కల్ ఱఱిన్దుపేశుగైక్కాయ్, తమ్పెరియ -
పోదముడన్మాఱన్మఱైయిన్పొరుళ్నురైత్తదు,
ఏదమిల్పన్నీరాయిరమ్

టీక.—అన్బొడు - ప్రేమముతో, అళగియమణవాళచ్చీయర్ - వాదికేసరిఅళగియ మణవాళజీయర్ అనువారు, పిన్బొరుమ్ - వెనుకటివారును, కల్ఱు - అభ్యసించి, అర్థ తాత్పర్యమును గుర్తెఱిగి, పేశుగైక్కాయ్ - (పరత్వప్రతిపాదన విషయమందు సామర్థ్య ముతో) వార్తలాడుటకు, తమ్ - తమయొక్క, పెరియపోదముడన్ - మహత్తైనబుద్ధితో మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, మఱైయిన్ - ద్రావిడవేదమగు తిరువాయ్మొళియొక్క

పొరుళ్ - ప్రతిపదార్థమును, ఏదమ్ - దోషము, ఇల్ - లేని, పన్నీరాయిరమ్ - పన్నెండువేలవ్యాఖ్యానముగ, ఉరైత్తదు - ప్రసాదించినది.

తా.— వాదికేసరి అళ్గియమణవాళజీయర్ అనువారు, వెనుకటివారికి తిరువాయ్మొళియొక్క అర్థము సులభముగ దెలియవలయును అను వాత్సల్యముచే ప్రతిపదార్థముగ శ్రీభాగవతప్రక్రియతో పన్నెండువేల వ్యాఖ్యానమును అనుగ్రహించిరని.

౪౬. పెరియవాచ్చాన్పిళ్ళై పిన్బుళ్ళవైక్కుమ్,
తెరియవియాక్కియైగళ్ శెయ్వాల్, అరియ -
వరుళిచ్చెయలప్పొరుళై యారియర్గట్కిప్పోదు,
అరుళిచ్చెయలాయ్త్తఱిన్దు.

టీక.— పెరియవాచ్చాంబిళ్ళై - (శ్రీకృష్ణపాదులు అనువారు) పెరియవాచ్చాంబిళ్ళగారు, పిన్బుళ్ళవైక్కుమ్ - తిరువాయ్మొళికిగాక తిరుప్పల్లాణ్డు ఆరంభించితిరుమడల్ వరకునైన, దివ్యప్రబన్ధములు ఇరువదిమూడింటికిని, తెరియ - స్పష్టమగునట్లు, వియాక్కియైగళ్ - వ్యాఖ్యానములు, శెయ్వాల్ - చేయుటచే, అరియ - దుర్లభమైన, అరుళిచ్చెయల్ - దివ్యప్రబన్ధములయొక్క, పొరుళై - అర్థములను, ఇప్పోదు - ఇప్పుడు, ఆరియర్గట్కు - (పెరియవాచ్చాంబిళ్ళగారికి వెనుకటి) ఆచార్యులకు, అఱిన్దు - (వీరి వ్యాఖ్యానములవలన) గుర్తెఱిగి, అరుళిచ్చెయల్ - ఒకరికి సాదించునట్లు, ఆయ్త్తు - ఆయినది.

తా.—పెరియవాచ్చాంబిళ్లగారు, తిరువాయ్మొళికేగాక, తిరుప్పల్లాండు మొదలుకొని శిఱియతిరుమడల్ పెరియతిరుమడల్ వరకు దివ్యప్రబన్ధములు ఇరువదిమూడింటికి విశదముగ వ్యాఖ్యానములు సాదించిరి. అందుచే ఈవలి ఆచార్యులందఱును ఆవ్యాఖ్యానములను ఆచార్యులమూలముగలభించి సులభముగ దెలిసికొని మాబోటిచేతనులకు సాదింపనైనవని.

౪౭. నఞ్జీయర్ శెయ్దవియాక్కియైగళ్ నాలిరణ్డుక్కు,
ఎఞ్జామైయావైక్కుమిల్లైయే, తఞ్జీరాల్,
వైయగురువిన్ తమ్బిమన్ను మణవాళముని,
శెయ్యుమవైదానుమ్శిల.

టీక.—నంజీయర్ -(వేదాన్తి)నంజీయ్యరనువారు, శెయ్ద - చేసిన, వియాక్కియైగళ్ - వ్యాఖ్యానములు, నాల్ ఇరండుక్కు - కొన్నిప్రబంధములకేఅయియున్నది. ఎఞ్జామై - కొదవలేక, యావైక్కుమ్ - సకలదివ్యప్రబంధములకును, ఇల్లైయే -

వ్యాఖ్యానములు చేయలేదు గదా, తమ్ శీరాల్ - తమయొక్క జ్ఞానాదికల్యాణగుణములచే, వైయగురవిశ - పిళ్లలోకాచార్యులయొక్క, తమ్బి - తమ్ములగు అళ్లగియమణవాళప్పెరుమాళ్ నాయనార్, మన్ను మణవాళముని - స్థిరమైననిరూపకముగల వాదికేసరి అళ్లగియమణవాళజీయ్యర్ అను (వీరిద్దఱును), శెయ్యుమవైయుమ్ - చేసినవ్యాఖ్యానములు, శిల - కొన్ని దివ్యప్రబంధములకు, (అయివున్నవి).

తా.—నంజీయరనువారు కొన్ని దివ్యప్రబంధములకు వ్యాఖ్యానములు సాదించిరి. జ్ఞానాది సకలగుణపరిపూర్ణులగు పిళ్ళలోకాచార్యులతిమ్ములు అళ్లగియ మణవాళప్పెరుమాళ్ నాయనారును, వాదికేసరి అళ్లగియ మణవాళజీయ్యరును కొన్ని దివ్యప్రబంధములకు వ్యాఖ్యానములు సాదించిరని.

४७. శీరార్ వడక్కుత్తిరువీదిప్పిళ్ళై, యెழ్దు -
దేరార్ తమిழ్ వేదత్తీడుదనై, త్తారుమెన -
వాజ్గిమున్నమ్బిళ్ళై యీయుణ్ణిమాదవర్కు, త్తాజ్గొడుత్తార్,
పిన్నదనై త్తాన్.

టీక.—మున్ - పూర్వమందు, శీరార్ - స్వాచార్యానుగ్రహము చేలభించినఅర్థవిశేషములను అందఱికిని వుపకరించునట్టి జ్ఞానాదిగుణపూర్తిగల, వడక్కుత్తిరువీదిప్పిళ్లై - వడక్కుత్తిరువీధిప్పిళ్లయనువారు, ఎழుదు - వ్రాసినటువంటి, ఏరార్ - శబ్దార్థములపొంకముచేత సౌందర్యమతిశయించియుండు, తమిழ్ వేదత్తు - ద్రావిడ వేదమగుతిరువాయ్మొழியొక్క ఈడుదనై - ఈడుఅనువ్యాఖ్యానమును, నంబిళ్లై - నంబిళ్లగారు, తారుమ్ఎన - ఇందుఅని వాంగి - తమసన్నిధిలో ఉంచగాపుచ్చుకొని, తామ్ - నమ్బిళ్లగారైనతాము, పిన్ - తమసన్నిధిలో ఆగ్రన్థముచేరిన వెనుక, అదనైత్తాన - (ఆచార్యానుమతిలేకవ్రాసిన) ఈవ్యాఖ్యానగ్రన్థమును, (పొందికగనుండుటచే) ఈయుణ్ణిమాదవర్కు - ఈయుణ్ణివంశములో అవతరించినమాధవులుఅనువారికి, కొడుత్తార్ - వెనుకటివారికిని ఉపయోగపడునట్లుఇప్పించిరి.

తా.— సకలచేతనులకును విశేషార్థములను ప్రసాదించి యుపకరించి ఉజ్జీవింపజేయునట్టి జ్ఞానాదిగుణపరిపూర్ణులగు వడక్కుత్తిరువీధిప్పిళ్లగారు, నంబిళ్లగారిసన్నిధిలో తాములభించిన తిరువాయ్మొழியొక్క యీడువ్యాఖ్యానమును గ్రన్థముగ లిఖించియుంచగ, నంబిళ్లగారు, వడక్కుత్తిరువీధిప్పిళ్ల గారియొద్దనుండి ఆయీడువ్యాఖ్యానమును పుచ్చుకొని ఈయుణ్ణిమాధవులకు ప్రసాదించి వెనుకటివారికిని ఉపయోగించునట్లు చేసిరి.

४८. ఆజ్గవర్ పాల్ పెత్ఱశిఱియాழ్వాన్ అప్పిళ్ళై,
తామ్కొడుత్తార్ తమ్మగనార్ తమ్కైయిల్, పాజ్గుడనే-

ఱ, నాళ్ దోఱుమ్ - ప్రతిదినమును, ఇమ్మైయిలే - ఈలోకమునందు, ఏత్తుమ్-స్తోత్ర మచేయుటచేఁ గలిగిన, ఇన్బమ్ - ఆనన్దమును, పెత్తోమ్ - లభించితిని ఎనుమ్ - అని సెలవిచ్చిన, మాఱనై - ఆళ్వార్లను, ఉలగీర్ - ఓలోకులారా! ఒరునాళ్ - ఒకదిన మైనను, నా - నాలుకయందు, తழும்ప - కాయకాచునట్లు, ఏత్తుమ్ - స్తోత్రము చేయుఁడు.

తా.—ఓలోకులారా! స్వేచ్ఛగ, రామకృష్ణాద్యనేకావతారములనెత్తి, ఈలో కములను గాపాడుచుండు పరిశుద్ధస్వభావుఁడగు శ్రియఃపతియొక్క కల్యాణగుణములను ఎల్లప్పుడును స్తుతించి అత్యన్తానందమును బొందితినని సాధించిన, నమ్మాళ్వార్లను మీరా ఒకనొకప్పుడైనను బాగుగస్తుతింపుఁడని.

౬౹ ౩౮. ఒరునాయగమాయ్యులగుక్కు, వానోర్,
ఇరునాట్టిలేఱియయ్గుక్కుమిన్బమ్, తిరమాగా -
మన్నుయిర్ప్పోగమ్తీదుమాలడిమైయేయినిదామ్
పన్నియుత్తైమాఱన్పరైప్పాల్.

టీక —ఉలగుక్కు - ఈలోకమునకంతయును, ఒరునాయగమాయ్ - ఏకచ్ఛత్రా ధిపతియై, ఉయ్క్కుమ్ - అనుభవించునట్టి, ఇన్బమ్ - ఆనన్దమును, వానోర్ - దేవతల యొక్క, ఇరునాట్టిల్ ఏఱి - మహిమనొందినస్వర్గలోకమునకుఁబోయి, ఉయ్క్కుమ్ - అనుభవించునట్టి, ఇన్బమ్-ఆనన్దమును, తిరమ్ - స్థిరము,ఆగా - కాచాలదు, మన్-నిత్య మైన ఉయిర్ పోగమ్ - ఆత్మానుభవమును, తీదు - చెడుగే (అవును) మాఱన్-నమ్మా ళ్వారు- ఇవై - వీనిని, పన్ని - ( అల్పాస్థిరత్వాదులను ) విచారించి, ఉరైప్పాల్ - సాధించుటచే, మాల్ - శ్రియఃపతికి, అడిమైయే - (స్థిరమైన) దాస్యము చేయుటయే, ఇనిదు - మనోజ్ఞమైనది, ఆమ్ - అగును.

తా.—చక్రవర్తియై ఈలోకమంతటిని పరిపాలించి అనుభవించునట్టి యానన్ద మును, స్వర్గలోకానన్దమును శాశ్వతమైనదిగాదు. ఆత్మానుభవరూపమగు కైవల్యమను నదియును చెడుగే అగును. అనునట్టి వీనియొక్క అల్ప అస్థిరత్వాది దోషములను విమర్శించి సాధించుటచే శ్రియఃపతికి (తిరునారాయణస్వామికి) దాస్య మొక్కటే స్వరూపానుగుణమైన ఉత్తమ పురుషార్థమగునని.

౩౯. పాలరైప్పోల్ శీழ்గ్గిప్పరనళవిల్, వేట్కైయాల్,
కాలత్తాల్, దేశత్తాల్, కైగழிన్దు, కాల -

అరిదానపోగ త్తిల్ఆశై యుళ్ళునై న్దార్,
కురుగూరిల్వన్దుది త్తకో.

టీక,—కురుకూరిల్ - తిరునగరియందు, వన్దు - వచ్చి, ఉదిత్త, అవతరించిన, కో - (తిరునగరికి నిర్వాహకులగు) ఆళ్వార్లు, పాలరైప్పోల్ - కోరినవస్తువులను తత్క్షణమే కావలయునని ఏడ్చెడు బిడ్డలవలె, శీర్ గి - రోదనముచేసి, పరన్ అళవిల్. సర్వేశ్వరునివిషయమందు, వేట్కైయాల్ - భక్తిచే, కాలత్తాల్ దేశత్తాల్-కాలముచేతను దేశముచేతను, కైకళిన్ద-కడచిన, (అతిదూరమందుండు), శాల-మిక్కిలి, అరిదాన. దుర్లభమైన, పోగత్తిల్-కైఙ్కర్యానుభవమునందు, ఆశై ఉళ్ ళు-అత్యాశనుబొంది, నైన్దార్ - వ్యాకులమైన మనస్సుగలవారైరి.

తా —తిరునగరిలో అవతరించిన నమ్మాళ్వార్లు, కోరినవస్తువులను తోడనే ఇచ్చవలయునని ఏడ్చెడు శిశువువలె వ్యసనాక్రాంతులై శ్రియఃపతియందుభక్తిచే, అతిదూరమందుండు పరమపదము, క్షీరాబ్ధి, కాలాతీతమగు రామకృష్ణాద్యవతారములు మొదలగు మూర్త్యంతరములయొక్క కైఙ్కర్యానుభవమునందు వ్యామోహమును బొంది కలతపడిన అంతఃకరణులైరని.

33. కోవానవీశన్, కురై యెల్లామ్తీరవే,
ఓవాదకాలత్తువాదిదనై, మేవి -
క్కళిత్తడియైక్కాట్టిక్కలన్దగుణమాఱన్,
వళుత్తుదలాల్వాళ్ న్దదినమణ్.

టీక.—కోఅనఈశన్ - సర్వనిర్వాహకుడగు సర్వేశ్వరుడు, కురైయెల్లామ్ భోగ్యవస్తువును అనుభవింపనందుచేగలిగినదుఃఖమంతయును, తీర-పోవునట్లు, ఓవాద కాలత్తు-విచ్ఛేదములేక నడచుచుండు కాలమందు, ఉవాదివనై - అతిక్రమించిన ఉపాధిని, మేవి - వీరితోఁజేరి, కళిత్తు - ఆకాలోపాధినిపోగొట్టి, అడియైక్కాట్టి - క్రిందట అపేక్షించిన పూర్వమందు జరిగిన కార్యములనన్నిటినిజూపి, (క్కరణములును కరణియొక్క వీరియొక్క పత్రయును, శ్రియఃపతికి చందన ఆభరణాదులు అయిన విధమునంతయును జూపి) కలన్దగుణమ్ - చేరుటకుఁ దగినగుణమును, మాఱన్ - నమ్మాళ్వార్లు, ... లాల్ - స్తోత్రముచేయుటచే, ఇన్దమణ్ - ఈభూలోకమైనది, వాళ్ న్ద బొంది సుఖించినది.

తా.—సర్వేశ్వరుడుఆళ్వార్లకొఱత నివర్తించునట్లు ఎడతెగక నడుచుమందు అతిక్రమించిన ఉపాధిని ఈయాళ్వార్లతోఁగూడి పోగొట్టి క్రిందు అనుభ

...నములనన్ని టినిన్ని (లేక) సర్వేశ్వరునికి ఈయాళ్వార్లయొక్క కరణములునసత్త ...చందన అభరణాదులు అయినరీతినంతయును జూపి, సర్వేశ్వరుడును వీరును ఒకే ...నట్లు కూడిన ప్రణయిత్వగుణమును నమ్మాళ్వార్లు స్తుతించుటచే ఈభూలోకవాసు ...లును సుఖించిరని.

౩౮. మణ్ణులగిల్ మున్ కలన్దుమాల్ పిరిగై యాల్, మాఱన్
పెణ్ణిలై మైయాయ్ క్కాదల్ పిత్తేఱి, ఎణ్ణిడిల్ మున్
పోలిముదలానపొరుళై యవనాయ్ నినైన్దు,
మేల్ వ్యామోహమెయల్ తన్నిల్ వీఴు.

టీక.— మణ్ ఉలగిల్ - ఈభూలోకమునందు, మాల్ - శ్రియఃపతి, మున్ - ...మందు, కలన్దు - కూడి, పిరిగైయాల్ -ఎడబాయుటచే, మాఱన్ - నమ్మాళ్వార్లు, ...నిలైమైయాయ్ - స్త్రీస్వభావముగలవారై; కాదల్ - భక్తిచే, పిత్తుఏఱి - భ్రమ ...మై, ఎణ్ణిడిల్ - తలచునపుడు, మున్ పోలిముదలానపొరుళై - ముందు ఉపమాన ...లు మొదలగువానిని, అవనాయ్ - ఆసర్వేశ్వరుఁడుగనే, నినైన్దు-తలచి, మైయ ...వీఴు మేల్ వ్యామోహన్ - అధికవ్యామోహముచే వాటియందు మిక్కిలి అభినివేశము ...వారైరి.

తా.— ఈలోకమందు శ్రియఃపతి ముందుసంశ్లేషించి విశ్లేషించుటచే ఆళ్వార్లు ...కి స్వరూపిరై, భక్తిచే భ్రమఅతిశయించి స్మరించునపుడు ముందుజూచిన సమాన ...ర్థములనున్ను సమ్బన్ధించిన పదార్థములనన్నిటిని సర్వేశ్వరునిగప్రపత్తిచేసే వ్యామో ...యముచే వానియందు అత్యభినివిష్టులైరని.

౩౯. వీఴ్ న్దిరుక్కుమ్ మాల్ విణ్ణిల్ మిక్క మయల్ దనై ౨,
అళ్ ఱుదత్తా తన్ పెరుమైయానదెల్లామ్, తోఱ్ ఱవన్దు —
నన్దుకలక్క పోఱ్ ఱినను గన్దు వీఴురైత్తాన్,
శెన్దుయర్ మాఱన్ తీర్ న్దు

టీక.— విణ్ణిల్ - పరమపదమందు, వీఱ్ ఱిరుక్కుమ్ - వేంచేసియుండు, మాల్ - ...శ్వరుఁడు, మిక్క - అతిశయించిన, మయల్ తన్నై - ఆళ్వార్ల వ్యామోహమును, ...తా - శమింపఁజేయుటకుగాను, తన్ పెరుమైయానదెల్లామ్ - తనయొక్క ...గుణాది వైభవములనన్నిటిని, తోఱ్ ఱవన్దు - ప్రకాశింపఁగ ఇచ్చుటకివచ్చి, నన్దుకల ...వీతో కూడగ, పోఱ్ ఱి - సర్వేశ్వరునిసేవించి నమ్రులై, నన్దు ఈగన్దు - మిక్కిలి ...లై మాఱన్ - నమ్మాళ్వార్లు, శెన్దు - నడుచుచున్న, తుయర్ - దుఃఖములను,

తీర్న్దు - నివర్తించి, వీఱు - ఉభయవిభూతులందును (ఇహపరములు రెంటియందును) తాము ప్రత్యేకించియున్న మహిమను, ఉరైత్తాన్ - సాదించిరి.

తా.— శ్రీవైకుణ్ఠనాథుఁడు ఆళ్వార్లవ్యామోహాతిశయమును శమింపఁజేయుటకు తనవైభవాతిశయములన్నియును ప్రకాశింపఁగవచ్చి వీరితోఁకలియుగ, అట్టి సర్వేశ్వరుని సేవించి నమస్కరించి మిగుల ఆనన్దించిననమ్మాళ్వార్లు దుఃఖమునుబోగొట్టుకొని ఉభయ విభూతులందును తాము వ్యావృత్తులైన మహిమను ఆనతిచ్చిరని.

౩౬. తీర్ప్పారిలాదమయల్ తీరక్కలన్దమాల్,
ఓర్ప్పాదుమిన్ఱియుడన్ పిరియ, నేర్క -
వఱివక్రిన్దుఱ్ఱారుమఱక్కలజ్గ, ప్పేర్ కేట్టు -
అఱివుపెఱ్ఱాన్ మాఱన్ శీలమ్.

టీక.— తీర్ప్పార్ - తీర్చునట్టివారు, ఇలాద - లేని, మయల్ - అధికాపేక్ష యైనది, తీర - తీరునట్లు, కలన్ద - కూడిన, మాల్ - సర్వేశ్వరుఁడు, ఓర్ప్పు - విచారణ, ఆదుమ్ఇన్ఱి - కొంచెమైనను లేక, ఉడన్ - తోడనే, పిరియ - ఎడబాయగ, నేర్క - సమీపించియుండుటచే, అఱివు - జ్ఞానము, అళిన్దు - తప్పి, ఉఱ్ఱారుమ్ - (దానినిజూచిన) తల్లిమొదలగుబన్ధువులును అఱక్కలజ్గ - మిక్కిలికలతఁజెందియుండఁగ, పేర్ - (సర్వేశ్వరునియొక్క) తిరునామములను, కేట్టు - విని, మాఱన్ - నమ్మాళ్వార్లు, అఱివు - సత్తను, పెఱ్ఱాన్ - లభించిరి, శీలమ్ - ఇదిఆళ్వార్లయొక్క గుణమైయున్నది.

తా.— ఆళ్వార్ల అధికాపేక్షదీరునట్లు సంశ్లేషించిన సర్వేశ్వరుఁడు తక్షణమే విశ్లేషింపఁగసమీపమందుండియు తెలివితప్పియుండుటను జూచిన, తల్లిమొదలైనవారు సమనశ్చాంచల్యమును జెందియుండగ పరిశుద్ధస్వభావులగు నమ్మాళ్వార్లు శ్రియఃపతియొక్క తిరునామములనువినిసత్తనుబొందిరని.

౩౭. శీలమిగుకణ్ణన్ తిరునామత్తాలుణర్న్దు,
మేలవన్ఱన్ మేనికణ్డు మేవుదఱ్కు, చ్చాల -
వరున్దియిరవుమ్ పగలుమ్ మాఱామల్ కూప్పిట్టు,
ఇరున్దననే తెన్గురుగూరేఱు.

టీక.— తెన్ కురుగూర్ ఏఱు - దక్షిణదేశమందలి తిరునగరికి నిర్వాహకులగు నమ్మాళ్వార్లు, శీలమ్ మిగు - ప్రణయినులతోఁగలిసిన గుణాతిశయముగల, కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, తిరునామత్తాల్ - తిరునామముచే, ఉణర్న్దు - (మోహముదీరి) ప్రజ్ఞ

కొంది, మేల్ - తర్వాత, అవన్దన్ - ఆసర్వేశ్వరునియొక్క, మేని - దివ్యమఙ్గళవిగ్రహమును, కణ్డు - సేవించి, మేవుదఱ్కు - సమీపించి అనుభవించుటకు, శాల - మిక్కిలి, వరున్ది - శ్రమనొంది, ఇరవుమ్పగలుమ్ - రేయుంబగల్లను, మాఱామల్-ఎడతెగక, కూప్పిట్టు - మొఱయిడుచు, ఇరున్దనర్ - ఉండిరి.

తా.— నమ్మాழ்వార్లు, ప్రణయినులతోఁగలిసిన శీలాధిక్యముగల శ్రీకృష్ణుని తిరునామములనువిని ప్రజ్ఞదెలిసి తర్వాత వాని దివ్యమఙ్గళవిగ్రహమును సేవించి అనుభవించుటకు మిగుల శ్రమపడి అహోరాత్రములను విరామములేక మొఱయిడుచుండిరని.

౩౮. ఏఱుతిరువుడైయవీశనుగప్పుక్కు,
వేఱుపడిలెన్నుడైమైమిక్కవుయిర్, తేఱుఙ్గాల్,
ఎన్ఱనక్కుమ్వేణ్డావెనుమాఱన్ఱాళై నెఞ్జే,
నన్దమక్కుప్పేఱాగనణ్ణు.

టీక.— ఏఱుతిరువుడైయఈశన్ - తనవక్షస్థలమందు ఆరోహింపలభించిన శ్రీమహాలక్ష్మినిగల సర్వేశ్వరునియొక్క, ఉగప్పుక్కు - హృదయమునకు, వేఱుపడిల్-వేఱైనయెడల, ఎన్ ఉడమై - నాయాభరణాదులును, మిక్కఉయిర్, వీనికంటెను అధికమైనఆత్మయును, తేఱుమ్గాల్ - విచారించినయెడల, ఎన్ఱనక్కుమ్-నాకును, వేణ్డా ఎన్నుమ్ - కోరఁబడునవి కావు అనునట్టి, మాఱన్ఱాళై - నమ్మాழ்వార్ల శ్రీపాదములను, నెఞ్జే-ఓమనసా! నమ్తమక్కు-మనకు, పేఱాగ-ప్రాప్యముగ, నణ్ణు - పొందుదువుగాక.

తా.— ఓమనసా! వక్షస్థలమందు శ్రీమహాలక్ష్మినిధరించియుండు సర్వేశ్వరునిదివ్యహృదయమునకు సమ్మతములేని నాయాభరణాదులును నాప్రాణముసహితము నాకపేక్షితములుగావు, అని యానతిచ్చెడు ఆழ்వార్ల శ్రీపాదారవిన్దములను మనకు ప్రాప్యమైన ఉత్తమపురుషార్థముగ పొందుమని.

౩౯. నణ్ణాదుమాలడియైనానిలత్తేవల్వినైయాల్,
ఎణ్ణారాత్తున్బముఱువ్వుయిర్గళ్, తణ్ణిమైయై,
కణ్డిరుక్కమాట్టామల్కణ్గలఙ్గుమ్మాఱనరుళ్,
ఉణ్డునమక్కుఱ్ఱతుణైయొన్ఱు.

టీక.— మాల్ - సర్వేశ్వరునియొక్క, అడియై-శ్రీపాదములను, నణ్ణాదు-ఆశ్రయింపక, నానిలత్తే - నలువిధములగు ఈలోకమునందు, వల్వినైయాల్ - బలిష్ఠమైనపాపకర్మములచే, ఎణ్ ఆరా - అసంఖ్యాకమైన, తున్బమ్ - దుఃఖములను, ఉఱుమ్ - అను-

భవించెడు, ఇవ్వుయిర్‌గళ్ - ఈయాత్మలయొక్క, తణ్ణిమైయై - తక్కువను, కణ్డు - చూచి, ఇరుక్కమాట్టామల్ - తృప్తిబొందియుండఁజాలక, కణ్ - నేత్రములును హృదయమును, కలఙ్గుమ్ - కలతనొందెడు, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, అరుళ్ - కృపయైనది, నమక్కు - మనకు, ఉఱ్ఱతుణై - తగినసహాయము, ఒన్ఱుణ్డు - ఒకటికలదు.

తా.— ప్రబలమగు పాపకర్మములచే సర్వేశ్వరుని ఆశ్రయింపక అత్యన్తదుఃఖమననుభవించుచుండు ఈచేతనులకొఱతను కటాక్షించి సహింపఁజాలక చిన్తించుచుండు ఆళ్వార్లయొక్క నిర్హేతుకకృపయైనది ఒకటియే మనకు సహాయమైయున్నదని.

౪౮. ఒన్ఱుమిల త్తేవివ్వులగమ్‌పడై త్తమాల్,
అన్ఱియెనవారుమఱియవే, నన్ఱాగ -
మూదలిత్తుప్పేశియరుళ్, మెయ్‌మ్మగిఴ్‌మ్మోన్‌తాళ్‌దొఴవే,
కాదలిక్కుమెన్నుడైయకై.

టీక.— ఇవ్వులగమ్ - ఈలోకములను, పడైత్త - సృష్టించిన, మాల్అన్ఱి - సర్వేశ్వరుడుగాక, తేవు - వేఱొకదైవము, ఒన్ఱుమ్ - ఒకటియును, ఇల్లైయెన - లేదు అని, ఆరుమ్ - అందఱును, అఱియ - గుర్తెఱుగునట్లు, నన్ఱాగ - బాగుగ, మూదలిత్తు - విశదపఱచి, పేశియరుళ్ - కృపచేసాదించిన, మెయ్‌మగిఴ్‌మ్మోన్ - మహిమగలవకుళాభరణులగు ఆళ్వార్లయొక్క, తాళ్ - శ్రీపాదములను, తొఴవే - నమస్కరించుటకొఱకే, ఎన్నుడైయ - నాయొక్క, కై - హస్తములు, కాదలిక్కుమ్ - అపేక్షించును.

తా.— జగత్సృష్టికి కారణభూతుడగు శ్రియఃపతినిదప్ప సర్వస్వామియగువాఁడు ఒకడు లేడని అందఱికిని స్పష్టమగునట్లు "మార్కండేయవిషయము రుద్రకపాలవిమోచనము" మొదలగువానిని ఋజువుపఱచిసాదించిన ఆళ్వార్లశ్రీపాదములను నాహస్తములు నమస్కరింప నపేక్షించునని.

౪౯. కైయ్యారుమ్‌శక్కరత్తెన్ కాదలన్ఱి క్కేయిరుక్క,
పొయ్యాగప్పేశుమ్‌పులనురైక్కు, మెయ్యాన,
పేర్‌త్తైయుపగరి త్తపేర్‌గుళ్ళిఁతన్నైదనై,
పోఱ్ఱిననేమాఱన్‌పాలిన్దు.

టీక.— కై - శ్రీహస్తము, ఆరుమ్ - నిండునట్లు, శక్కరత్తోన్ - చక్రమును ధరించుటయే నిరూపకమైనవాఁడు, కాదల్ - తనవిషయమందుభక్తి, ఇన్ఱిక్కేయిరుక్క - లేకయుండగ, పొయ్యాగ - అసత్యముగ, పేశుమ్ - మాట్లాడునట్టి, పులనురై

...ళు - వంచకమైన వార్తలకు, మెయ్యాన - వాస్తవమైన, పేఱ్ఱై - ఉత్తమపురుషార్థమును, ఉపకరిత్త - ఉపకరించిన, పేరరుళిన్ - మహత్తైన కృపయొక్క, తన్మై తన్మై - స్వభావమును, మాఱన్ - నమ్మాళ్వార్లు, పాలిన్దు - అతిశయించి, పోఱ్ఱినన్ - సాదించిరి.

తా.—చక్రహస్తుఁడగు శ్రియఃపతి ఈ చేతనులు తనయందు భక్తిలేక అసత్యముగ ప్రపత్తిసూచకములగు కపటవచనములను సంభాషించినను, ఉత్తమపురుషార్థమును ఇచ్చునట్టి సర్వేశ్వరుని మహత్తైన కృపాస్వభావమును అతిశయముగ ఆళ్వార్లు కొనిచ్చిరని.

౮౨. పొలిగపొలిగ వెన్ఱుపూమగళ్ కోన్‌తొణ్డర్,
మలివుదనై క్కణ్డుగన్దువాழ்త్తి, యులగిల్, —
తిరున్దాదార్‌దమ్మై త్తిరుత్తియ, మాఱన్‌శొల్,
మరున్దాగప్పోగుమ్‌మనమాశు.

టీక.—పొలిగ పొలిగ - అభివృద్ధినొందుగాక అభివృద్ధినొందుగాక, ఎన్ఱు - అని, పూమగళ్ కోన్ - శ్రీమహాలక్ష్మి కధిపతియగు సర్వేశ్వరునియొక్క, తొణ్డర్ - దాసులు, మలివుదనై - కూడియుండునట్టి సమృద్ధిని, కణ్డు - చూచి, ఉగన్దు - సన్తోషించి, వాழ்త్తి - మంగళాశాసనముచేసి, ఉలగత్తిల్ - లోకమందు, తిరున్దాదార్‌తమ్మై - దిద్దుపాటులేని వారిని, తిరుత్తియ - దిద్దుపాటొనర్చిన, మాఱన్ - ఆళ్వార్లయొక్క, శొల్ - శ్రీసూక్తియగు, మరున్దాగ - ఔషధమూలముగ, మనమ్ - మనస్సునందలి, మాశు - కళఙ్కము, పోగుమ్ - నివర్తించును.

తా — భగవద్భక్తులగోష్ఠినిజూచి సన్తోషించి అభివృద్ధి నొందుగాకఅని మఙ్గళాశాసనంబొనర్చి చేతనులనుదిద్దుపాటుచేసిన ఆళ్వార్లయొక్క శ్రీసూక్తియను ఔషధమూలముగ హృదయమందలి దోషములు నివర్తించునని.

౮౩. మాశఱుశోదికణ్ణన్‌వన్దుకలవామైయాల్,
ఆశైమిగున్దుపழிక్కఞ్జామల్, ఏశఱవే,
మణ్ణిల్‌మడలూర్‌మాఱ న్నొరుమిత్తాన్,
ఉణ్ణడుఙ్గత్తాల్ పిఱన్దపూర్.

టీక.— మాశు - మాలిన్యము, అఱు - లేనట్టి, శోది - జ్యోతియగు, కణ్ణన్ - శ్రీకృష్ణుడు, వన్దు - వచ్చి, కలవామైయాల్ - చేరమిచే, ఆశై - అపేక్ష, మిగున్దు - అతిశయించి, పழிక్కు - నిందకు, అఞ్జామల్ - భయపడక, ఏశఱ - దోషము నివ

త్తించి, తాన్ - తాము, పిఱన్ద - అవతరించిన, ఊర్ - పట్టణమునందలి చేరనులవా
క్కు, ఉళ్ - హృదయము,నడుఙ్గ - వడకునట్లు, మణ్ణిల్ - భూమియందు, * మడల్.
మడల్ అను సంప్రదాయమును, ఊర - నడిపించుటకు, మాఱన్ - నమ్మాళ్వార్లు, ఒరుమి
త్తాన్ - ఏర్పాటుచేసికొనిరి.

తా.— మహాజ్యోతిస్స్వరూపుడగు శ్రీకృష్ణుడువచ్చి సంశ్లేషింపనందున నమ్మాళ్వా
ర్లు అపేక్షాతిశయముచే లోకనిందకు భయపడక తమ అవతారస్థలమందలి జనులువడకు
నట్లు ఈభూమియందు మడల్ అనుసంప్రదాయమును అనుష్ఠించుటకు సన్నాహము
చేసికొనిరని.

* [మడల్—భర్తయైనవాడు భార్యనుఒల్లకుండునపుడు భార్యయైనదితనపురుష
రూపమును ఒకపటమున వ్రాయించి ఆపటమును ఒకచిన్నబండియందుంచి ఒకతాటిను
గును గుఱ్ఱముగా జేసికొని దానిమీదయెక్కి తాను వీధులవెంబడి దిరుగుచు ఈనాయకు
నినిమిత్తమై నేను నాగొంతుతెగగోసికొని ప్రాణములను విడిచెదనని భార్యచేయునట్టి
కృత్యము,ఇట్టితనభార్యయొక్కకృత్యమును భర్తవినినతక్షణమేభార్యనుఅంగీకరించునట్లు]

౪౪. ఊరనినైన్దమడలూరవు మొన్నాదపడి,
కూరిరుళ్ శేర్, కఙ్గులుడన్గూడినిన్ఱు, పేరామల్,
తీదుశెయ్యమాఱనృరువుళ్ళత్తు, చ్చెన్ఱదుయర్,
ఓదువదిఙ్గెఙ్గనేయో.

టీక.— ఊర - చేయుటకు, నినైన్ద - తలచిన, మడల్ - మడల్అను కృత్య
మును, ఊరవుమ్ - చేయుటకును, ఒన్నాదపడి - కూడనివిధముగ, కూర్ - అతిశయి
చిన, ఇరుళ్ - చీకటి, శేర్ - దట్టముగచేరిన, కఙ్గుల్ - రాత్రియైనది, ఉడన్కూడి
నిన్ఱు - తనపరివారముతో చేరినిలిచి, పేరామల్ - ఉంచినఅడుగుయెత్తక, తీదుశెయ్య -
చెడుగుచేయగ, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, తిరువుళ్లత్తు - హృదయమునందు
శెన్ఱతుయర్ - కలిగిన దుఃఖమును, ఇఙ్గు - ఇక్కడ, ఓదువదు - చెప్పదమును
ఎఙ్గనేయో - ఏవిధముగనో, (గుర్తెఱుగము.)

తా.— మడల్అను వ్యాపారమునున్ను చేయఁగూడని విధముగ సూర్యుడు అస్త
మించి ప్రియహితములను పలుకునట్టివారును నిందించువారు మొదలగు సకలమైనవారు
నిద్రించుటచేతను, అత్యన్తాన్ధకారముతోను తనపరివారముతోను రాత్రియైనది ఇటుఅటు
తొలగక శ్రమపఱచగ ఆసమయమందలి నమ్మాళ్వార్ల మనోదుఃఖము చెప్పనలవిగానిది
యుండెనని.

౯౮. ఎజ్ఞనేనీర్, మునివదెన్నైయిని నమ్బియழగు,
ఇజ్ఞనేతోన్ఱుగిన్ఱదెన్ఱెన్ఱుమున్నే, అజ్ఞ -
నురువెళిప్పాడావురైత్తతమిழ் మాఱన్,
కరుదుమవర్క్కిన్బక్కడల్.

టీక.— ఎన్నై - నన్ను, ఇని - ఇక, ఎజ్ఞనే - ఏవిధముగ, నీర్ - మీరు, [మునివదు] - కోపగించుట, ఎన్ మున్నే - నాయెదుట, నమ్బిఅழగు - గుణవిగ్రహ సౌన్ద[ర్యము]చే పూర్ణులగు తిరుక్కుఱుంగుడి నమ్బియొక్క ఆయుధాభరణ అవయవశోభయై [ఇజ్ఞ]నే - ఇదిగో, తోన్ఱుగిన్ఱదు - ప్రకాశించుచున్నది, (అని) అజ్ఞన్ - అవిధమైన [ఉరు]వెళిప్పాడా - ప్రత్యక్షసమానమైనట్లు విశదముగ, ఉరైత్త - సాదించిన, తమిழ் [మాఱ]న్ - ద్రావిడ బ్రహ్మదర్శియగు నమ్మాழ்వార్లను, కరుదుమవర్కు - స్మరించువారికి, [ఇన్బక్క]డల్ - ఆనన్దసముద్రమైయుందురు.

తా.— తిరుక్కుఱుంగుడి నమ్బిని నేను సేవించిన వెనుక నన్ను కోపింపఁదగునా, [తిరుక్కు]ఱుంగుడి నమ్బియొక్క గుణవిగ్రహసౌన్దర్యాది సమస్తశోభయును ప్రత్యక్ష[ము]గ ప్రకాశించుచున్నదని ఆనతిచ్చినవారును ద్రావిడబ్రహ్మసంహితను కటాక్షిం[చిన] ఆழ்వార్లను ధ్యానముచేయువారికి ఆనంద సముద్రులై యుందురని.

౯౯. కడల్ ఞాలత్తీశనై మున్ కాణామల్, నొన్దు,
ఉడనావనుకరిక్కలుఱ్ఱు, త్తిడమాగ,
వాయ్న్దవనాయ్ త్తాన్ పేశుమ్ మాఱనురైయదనై,
ఆయ్న్దురైప్పారాட్చెయ్యనోఱ్ఱార్.

టీక.— కడల్ ఞాలత్తు - సముద్రము చేజుట్టఁబడిన ఈ భూమియందు, ఈశనై - [సర్వేశ్వ]రుని, మున్ - ఎదురుగ, కాణామల్ - సేవింపక, నొన్దు - నొచ్చుకొని, ఉడనా[వనుకరి]క్కల్ ఉఱ్ఱు - గోపికార్లు కృష్ణుని అనుకరించి ధరించిన విధముగ విచారించి [వాని]ని అనుకరించి ధరించునట్లు హృదయమందుఁదలచి, తిడమాగ - దృఢముగ, వాయ్[న్దు] - సమీపించి, అవనాయ్ - ఆసర్వేశ్వరుఁడుగనే, తాన్ - తాము, పేశుమ్ - అను[కరించి ప]ల్కినట్లాడునట్టి, మాఱన్ - నమ్మాழ்వార్లయొక్క, ఉరైయదనై - శ్రీసూక్తిని, ఆయ్న్దు - [అర్థ]మును విచారించి, ఉరైప్పార్ - అనుసన్ధించువారు, ఆళ్ శెయ్య - ఆழ்వార్లకు [కైంకర్య]ముచేయుటకు, నోఱ్ఱార్ - నోమునోచినవారగుదురు.

[తా].— ఈభూమియందు సర్వేశ్వరుని ప్రత్యక్షముగ సేవింపనందుచే నొచ్చుకొని [విశ్లేష]సమయమందు, గోపిమార్లు అనుకరించి ధరించినట్లు ధరింపఁదలచి దృఢాధ్య

వసాయముతోఁగూడి సమీపించి శ్రియఃపతిగనే అనుకరించిసాధించిన ఆళ్వార్ల శ్రీసూక్తి మొదలగు వైభవములను అనుసన్ధించువారు ఆళ్వార్లకు కైజ్కర్యము చేయనోచినవారగుదురని.

౪౭. నోత్తనోన్బాదియిల్లేనున్నైవిట్టాల్ ఇగిల్లేన్,
పేర్ట్రుక్కుపాయమున్ఱన్ పేరరుళే, శార్ట్రుగిన్ఱేన్,
ఇజ్గెన్నిలై యెన్నుమ్లెళ్లిల్ మాఱన్శొల్ వల్లార్,
అజ్గమరర్క్కారావముదు.

టీక.— నోత్ర - మోక్షసాధనముగ అనుష్ఠించునట్టి, నోన్బాది - కర్మాద్యుపాయములందు అన్వయము, ఇలేన్ - లేనివాడను, నున్దనై - ధారకభోగ్యములుగానుండునిన్ను, విట్టు - విడిచి, ఆత్రగిల్లేన్ - ధరింపఁజాలినవాడనుగాను, పేర్ట్రుక్కు ఉపాయమ్ - మోక్షోపాయమైనది, ఉన్దన్ - దేవరవారియొక్క పేర్ అరుళే-నిర్హేతుకకృపయే, శార్ట్రుగిన్ఱేన్ - అందఱును గుర్తెఱుగునట్లు చెప్పుచున్నాను, ఇజ్గు - ఇక్కడ ఈ యాత్మవిషయమందు, ఎన్నిలైయెన్నుమ్ - నాయొక్క నిష్ఠయిదియనెడు, ఎళ్లిల్ - శేషత్వపారతంత్ర్యములగు ఆత్మభూషణములచే రమ్యమైయుండు, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, శొల్ - ఉపాయనిష్కర్షమైన ఈ తిరువాయ్మొళిని, వల్లార్ - అభ్యసింపఁగలవారు, అజ్గు - అక్కడ, అమరర్క్కు - నిత్యసూరులకు, ఆరా - అపూర్వమైన, అముదు - అమృతమగునట్లు లభింతురు.

తా.— నేను నీయొక్క చరణారవిన్దములను బొందుటకు కర్మాద్యుపాయములను అనుష్ఠింపలేదు, అయినను నిన్ను విడిచి ధరింపఁజాలను, కాఁబట్టి నీయొక్క నిర్హేతుకకృపయే సాధనమని ప్రసిద్ధపఱచుచున్నాను, ఈవిషయమందు నానిష్ఠయిదియని ఆత్మభూషణములగు శేషత్వపారతంత్ర్యములనుగల ఆళ్వార్లయొక్క ఉపాయనిష్కర్షమైన ఈతిరువాయ్మొళిని అభ్యసించువారిని నిత్యసూరులు అమృతమువలె భావింతురని.

౪౮. ఆరావముదాళ్వారాదరిత్తపేఱుగళై,
త్తారామైయాలేతళర్న్దుమిగ, త్తీరాద —
ఆశైయుడన్నాల్కామై పేశియలమన్దాన్,
మాశఱుశీర్మాఱనెమ్మాన్.

టీక.—ఆరావముదాళ్వార్ - నిరతిశయభోగ్యులగు తిరుక్కుడందై ఆరావముదు పెరుమాళ్ళు, ఆదరిత్త - ఈయాళ్వార్లు అపేక్షించిన, పేఱుగళై - పురుషార్థములను, తారామైయాలే - తక్షణమే ఇప్పింపకపోవుటచే, మిగ- మిక్కిలి, తళర్న్దు

మాఱప్పి, మాశు - దోషము, అఱు - లేని, శీర్ - జ్ఞానవైలక్షణ్యముగల, ఎమ్మాఱ్ఱ - ప్రపన్నజనస్వామియగు, మాఱ్ఱఱ్ - నమ్మాళ్వార్లు, తీరాద - తీరని, ఆశైయుడన్ - అ పేక్షతో, అన్ఱొామై - తనురొుక్క ధరింపజాలమిని, పేశి - మాట్లాడి, అలమన్దాన్ - శోవ్యాకులమును బొందిరి.

తా.— తిరుక్కుడంద ఆరావముదు పెరుమాళ్ళు ఈయాళ్వార్ల మనోరథమును సఫలము చేయక పోవుటచే నిరుత్సాహులై నిరుపమజ్ఞాన వైలక్షణ్యముగల ప్రపన్నజనకూటస్థులగు నమ్మాళ్వార్లు అత్యాపేక్షతో సర్వేశ్వరుని యెడబాసి ధరింపకుండుటను అనుస రించి శ్రమజెందిరని.

మూ. మానలత్తాల్ మాఱ్ఱఱ్ తిరువల్లవాళ్ పుగప్పోయ్,
త్తాని శై త్తువీళ్న్దవప్పూర్ దన్నరుగిల్, మేల్ నలఙ్గి,
త్తున్బముఱ్ఱుచ్చొన్న, శొలవుగఱ్ఱార్ దఙ్గళుక్కు, —
ప్పిన్ పిఱక్క వేణ్డాపిఱ.

టీక.— మాఱ్ఱఱ్ - నమ్మాళ్వార్లు, మానలత్తాల్ - మిగుల ప్రేమాతిశయముచే, తిరువల్లవాళ్ - తిరువల్లవాళ్ అను దివ్యదేశమును, పుగప్పోయ్ - ప్రవేశింపఁబోయి, అవ్వూర్ తన్నరుగిల్ - ఆయూరిసమీపమందు, తాన్ ఇశైత్తువీళ్న్దు - తాముబడలికజెంది, మేల్ నలఙ్గి - దానికిపైఁ చెలికత్తెలనిషేధవచనములచేతను శ్రమనొంది, తున్బమ్ ఉఱ్ఱు - దుఃఖమును పొంది, శొన్న - చెప్పిన, శొలవు - ఈతిరువాయ్ మొழிని, కఱ్ఱార్ తఙ్గళుక్కు - అభ్యసించువారికి, పిన్ - అభ్యాసమునకువెనుక, పిఱ - తిరు వాయ్మొழிకిసంబన్ధముకానిఇతరమైనజన్మమునందు, పిఱక్క వేణ్డా - జన్మింపవలసినదిలేదు, లేక, పిన్ పిఱక్క వేణ్డా - దీనినిఅభ్యసించినవెనుకజన్మింపవలసినదిలేదు,జన్మమునులేకుండునట్లుచే యును, పిఱఅనునది అవ్యయము, (పిన్ పిఱక్క వేణ్డాపిఱ - ఈతిరువాయ్ మొழிనితప్ప మరియొకటినిఅభ్యసింపఁబనిలేదు. ) అనియుఁగావచ్చును.

తా.—నమ్మాళ్వార్లు ప్రేమాతిశయముచే తిరువల్లవాళ్ దివ్యదేశమును ప్రవేశింపఁ బోయి ఆసమీపమందు తాముబడలికచేపడి చెలికత్తెలనిషేధపుమాటలచే శ్రమనొంది దుఃఖాక్రాంతులై అనతిచ్చిన ఈతిరువాయ్ మొழிని అభ్యసించువారికి జననాదిదుః ఖములుగలుగవని.

౫౦. పిఱన్దులగమ్ కాత్తళిక్కుమ్ పేరరుట్కణ్ణా, వుఱ్ఱ
శిఱన్దగుణత్తాల్ ఉరుగుమ్ శీల, త్తిఱమ్ తవిర్న్దు

శేర్ న్దనుబవిక్కుమ్ నిలై శెయ్దోన్ఱ, శీర్ మాఱన్,
వాయ్ న్ద పద త్తే మనమే వైగు.

టీక —పిఱన్దు - అనేకావతారములనెత్తి, ఉలకమ్ - లోకమును, కాత్తళి క్కుమ్ - కాచియుండిరక్షించునట్టి, పేర్ అరుళ్ - గొప్పకృపగల, కణ్ణనే - ఓశ్రీకృష్ణా, ఉన్ శీలఙ్దగుణత్తాల్ - నీయొక్కకల్యాణగుణానుసన్ధానముచే, ఉరుగుమ్ - మనస్సుకరుగునట్టి, శీలత్తినుమ్ - స్వభావమును, తవిర్ న్దు - విడిచి, శేర్ న్దు - నిన్నుగూడి, అనుబవిక్కుమ్ - అనుభవించునట్టి, నిలై - మనస్సుయొక్కనిలకడను, శెయ్ ఎన్ఱ - చేయుముఅనిచెప్పిన, శీర్ మాఱన్ - జ్ఞానవైలక్షణ్యముగలఆళ్వార్లయొక్క, వాయ్ న్ద పదత్తే - ఒకటికొకటిసమానమగు శ్రీపాదములయందు, మనమే - నామనసా! వైగు. నీవునిలుకడనొందియుండువుగాక.

తా.— అనేకావతారములఁచేసి కృపచేలోకమునురక్షించునట్టి ఓశ్రీకృష్ణా! నీకల్యాణగుణానుసన్ధానముచే మనస్సుకరుగునట్టి స్వభావమునువిడిచినిన్ను సమీపించి అనుభవించునట్లుమనస్థైర్యమునుగలుగఁ జేయవలయును అనిఆనతిచ్చెడు జ్ఞానాదిగుణములుగలఆళ్వార్లయొక్క పరస్పరసదృశమగు శ్రీపాదములేమనకురక్షకమని ఓమనసా! స్థిరచిత్తుడగుము అని.

౫౯. వైగల్ తిరువణ్ వణ్డూర్ వైగుమిరామనుక్కు, ఎన్ -
శెయ్ గైదన్నై ప్పుళ్ళినఙ్గాళ్, శెప్పుమెన, క్కైగళ్రిన్ద -
కాదలుడన్ తూదువిడుమ్ కారిమాఱన్ కళలే,
మేదినియీర్ నీర్ వణఙ్గుమిన్.

టీక.— మేదినియీర్ - భూమియందుండువారలారా, తిరువణ్ వండూర్ - తిరువణ్ వండూర్ అనుదివ్యదేశములో, వైగల్ - ఎల్లప్పుడును, వైగుమ్ - నిత్యవాసము చేయుచున్న, ఇరామనుక్కు - చక్రవర్తితిరుమగనుకు (శ్రీరాములకు) పుళ్ ఇనఙ్గాళ్ - పక్షులసమూహములారా! ఎన్ శెయ్ గైదనై - నాయొక్కదశను, శెప్పుమ్ ఎన - తెలియపఱచుడుఅని, కైకఱ్రిన్ద - అతిశయించిన, కాదలుడన్ - ఆశతో, తూదువిడుమ్ - దూతగాపంపిన, కారిమాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, కళలే - శ్రీపాదములనే, నీర్ - మీరు, వణఙ్గుమిన్ - నమస్కరింపుడు.

తా.— ఓలోకులారా! తిరువణ్ వండూర్ అను దివ్యదేశమందు నిత్యవాసము చేయుచున్నచక్రవర్తితిరుమగనుకు, "పక్షులారా! నాదశనువిన్నపింపుడుఅని" ఆశతో పక్షులనుదూతలనుగాఁబంపిన ఆళ్వార్ల శ్రీపాదములనే మీరునమస్కరింపుడని.

౯౨. మిన్నిడై యార్ శేర్ కణ్ణన్, మెత్తెనవన్దానెన్ఱు,
తన్నిలైపోయ్, ప్పెణ్ణిలై యాయ్త్తాన్ తళ్ళి, ఉన్నుడన్ శే -
కూడేనెన్ఱూడుమ్ కురుగైయర్ కోన్, తాళ్ దొழுవే,
నాడోఱుమ్ నెఞ్జమే నల్గు.

టీక.— మిన్ ఇడైయార్ - మెఱుపుతీగ వంటినడుముగలస్త్రీలతో, శేర్ - కూడియున్న, కణ్ణన్ - శ్రీకృష్ణుడు, మెత్తెన - ఆలస్యముగ, వన్దాన్ ఎన్ఱు - వచ్చినాడని, తన్ నిలైపోయ్ - తమయొక్క ఆకారమువదలి, పెణ్ నిలైయాయ్ - గోపిమారుల యొక్క ఆకారమునుగలవారై, తాన్ తళ్ళి - తాముగూడియుండసంకేతస్థలమందు ప్రవేశింపవలయునని ఆకృష్ణుడు సమీపమునకురాగా, ఉన్నుడనే - నీతోడ, కూడేన్ - చేరను, ఎన్ఱు - అని, ఊడుమ్ - కోపగించిన, కురుగైయర్ కోన్ - తిరునగరికినిర్వాహకులగునమ్మాழ்వార్లయొక్క, తాళ్ - శ్రీపాదములను, తొழு - నమస్కరించుటకు, నెఞ్జమే - ఓమనసా! (నీవును) నాళ్ దోఱుమ్ - ప్రతిదినమును, నల్గు - ఉపకరింతువుగాక.

తా.—ఓమనసా! సుందరులగుస్త్రీలతో గూడియున్న శ్రీకృష్ణుడు ఆలస్యము చేసివచ్చినాడని, ఆழ்వార్లుతమరూపమును విడిచినాయకిరూపమును ధరించితామున్నస్థలమునకు శ్రీకృష్ణుడుసమీపించిరాగా "నీతోచేరనని కోపించుకొనిన" ఆழ்వార్ల శ్రీపాదములను నమస్కరించుటకునీవును సహాయపడవలయునని.

౯౩. నల్లవలత్తాల్ నమ్మైచ్చేర్ త్తోన్, మున్నణ్ణారై,
వెల్లుమ్ విరుత్తవిబూదియనెన్ఱు, ఎల్లైయిలి -
త్తానిరున్దు వాழ்త్తుమ్ తమిழ் మాఱన్ శొల్ వల్లార్,
వానవర్క్కు వాయ్త్త కురవర్.

టీక.— నల్లవలత్తాల్ - లీలోపకరణములను గ్రహించుట మొదలగు మంచిఅభిప్రాయముచే లేక బలముచే, నమ్మైచ్చేర్ త్తోన్ - మనయొక్క ప్రణయకలహమునునివర్తింపచేసిచేరునట్లు చేసినవాడు, మున్నణ్ణారై - పూర్వశత్రువులను, వెల్లుమ్ - జయించును, విరుత్తవిబూతియన్ ఎన్ఱు - విరుద్ధవిభూతికత్వమును, (సుఖదుఃఖాత్మకమగుప్రకృతిని) గలవాడని, ఎల్లైయిలి - అంతములేక, తాన్ - తాను, ఇరున్దు - ఉండి, వాழ்త్తుమ్ - స్తోత్రముచేయుచున్న, తమిழ் మాఱన్ - ద్రావిడశాస్త్ర పండితులలో మొదటివారగు ఆழ்వార్లయొక్క, శొల్ - శ్రీసూక్తిని, వల్లార్ - అభ్యసింపగలిగినవారు, వానవర్కు - నిత్యసూరులకు, వాయ్త్త - పొందియుండు, కురవర్ - ఆచార్యులగుదురు.

తా.— మంచిబలముచే (లేక) అభిప్రాయముచే మనప్రణయకలహమును నివర్తింపఁజేసి చేర్చిన శ్రియఃపతి, మునుపటిశత్రువులను (లేక) మనస్త్రీత్వాభిమానాదులను భోగ్యపట్టెను అనియు పరస్పరవిరుద్ధములగు సుఖదుఃఖములను గలిగియుండు విభూతులను (లోకములను) కలవాఁడనియు సదా, స్తుతించుచున్న ద్రావిడభావమగు ఆచార్యులగు ఆళ్వార్ల యొక్క దివ్యప్రబన్ధమును అభ్యసించువారునిత్యసూరులకు పరమపూజ్యులగుదురని.

౫౧. కురవైముదలాక్కణ్ణన్‌కోలచ్చెయల్‌గళ్,
ఇరవుపగలెన్నామలెన్ఱుమ్, పరవుమనమ్ —
పెఱ్ఱేనెన్ఱేకళిత్తుప్పేశుమ్పరాఙ్కుశన్ఱన్,
శొల్‌తేనిల్, నెఞ్జేతువళ్.

టీక.— కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, కురవై - రాసక్రీడ, ముదల్ ఆమ్ - మొదలగు, కోలమ్ - సుందరమైన, శెయల్‌గళ్ - వ్యాపారములను, ఇరవుపగల్ - రాత్రిపగలు, ఎన్నామల్ - అనిచూడక, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, పరవుమ్ - స్తుతించునట్టి మనమ్ - మనస్సును, పెఱ్ఱేన్ - లభించితిని, ఎన్ఱు - అని, కళిత్తు - సన్తోషించి, పేశుమ్ - మాట్లాడుచున్న, పరాఙ్కుశన్ ఱన్ - నమ్మాళ్వార్లయొక్క, శొల్ తేనిల్ - శ్రీసూక్తియను తేనెయందు, నెఞ్జే - ఓ మనసా! తువళ్ - కూడివృద్ధిబొందుమూ.

తా.— ఓ మనసా! శ్రీకృష్ణునియొక్క మనోజ్ఞములగు రాసక్రీడమొదలగు వ్యాపారములను విరామములేక స్తుతించునట్లు లభించితినని సన్తోషముతో సంభాషించుచుండు నమ్మాళ్వార్లయొక్క శ్రీసూక్తిరూపమగు తేనెను అనుభవించి వృద్ధిబొందుమని.

౫౨. తువళఱ్ఱశీర్‌మాల్‌తిఱత్తుత్తొన్నలత్తాల్, నాళుమ్ —
తువళుఱ్ఱుశీలమెల్లామ్‌శొన్నాన్, తువళఱవే —
మున్నమనుభవత్తిల్‌మూళ్‌గినిన్ఱమాఱనదిల్,
మన్నుమువప్పాల్‌వన్దమాల్.

టీక.— తువళ్ - ఇతరాసక్తిఅనుదోషము, అఱ - నివర్తించుటచే, మున్నమ్ - పూర్వమందే, అనుభవత్తిల్ - భగవదనుభవమందు, మూళ్‌గినిన్ఱ - ప్రవేశించిన, మాఱన్ - నమ్మాళ్వార్లు, అదిల్ - ఆయనుభవమందు, మన్నుమ్ - నిలుకడనొందియున్న, ఉవప్పాల్ - సన్తోషముచే, వన్ద - కలిగిన, మాల్ - ప్రేమాతిశయముచే, తువళ్ అఱ్ఱశీర్ - దోషములేని కల్యాణగుణములుగల, మాల్ తిఱత్తు - సర్వేశ్వరునివిషయమందు, తొల్ నలత్తాల్ - స్వాభావికమగుభక్తిచే, నాళుమ్ - ఎల్లప్పుడును, తువళ్ ఉఱ్ఱు - ఆవిషయమందు చలనముబొంది తన్ శీలమ్ ఎల్లామ్ - తనయొక్కస్వాభావములనన్నిటిని, శొన్నాన్ - కృపచేఅనతిచ్చి

తా. — పూర్వమందే ఇతరాపేక్షవదలి భగవదనుభవమందు ప్రవేశించిన ఆళ్వా
(రు)భయనుభవమందలి సన్తోష ప్రేమాతిశయములచే నిరుపధికకల్యాణగుణ సమ్పన్నుడగు ఆస
(ర్వే)శ్వరునియందు స్వాభావిక భక్తిచే సదాతమకుగలిగియుండు అట్టివిషయమందలి దృఢా
(ధ్య)వసాయములనన్నిటిని కరుణచే అనతిచ్చిరని.

౯౬. మాలుడనే,తాన్ కలన్దు,వాழ పెరామైయాల్,
శాలనై న్దు,తన్నుడైమై,తానడైయ,క్కోలియే,
తానిగழ వేణ్డామల్,తన్నై విడల్,శొల్ మాఱన్,
ఊనమఱుశీర్,నెఞ్జేయుణ్.

టీక.— మాలుడనే - ఆశ్రితవ్యామోహముగల సర్వేశ్వరునితో, తాన్ - తాము,
(కల)న్దు - కూడి, వాழ - సుఖించుటకు, పెఱామైయాల్ - లభింపమిచే, శాల-మిక్కలి,
(నొన్)దు - విసిగి, తన్ ఉడైమై - తమఆత్మయును ఆత్మతో సంబన్ధించినదియును, అడైయ-
(అన్ని)టిని, తాన్- తాము, ఇగழ వేణ్డామల్ కోలియే-విడుచుటకు ప్రయత్నింపఁగోరినట్లు
(గా)క, తన్నై విడల్ - తనంతటతానే యావత్తును తమ్మువిడిచిపోవునట్టి విధమును, శొల్-
(అనతి)చ్చునట్టి, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, ఊనమఱు - దోషములులేని, శీర్-కల్యా
(ణగు)ణములను, నెఞ్జే - ఓ మనసా! ఉణ్ - నీవు అనుభవింతువుగాక.

తా.— ఓ మనసా! తనభక్తులయందు వ్యామోహమును బొందియుండు సర్వేశ్వరు
(నితో) ఆళ్వార్లు తాముగూడిసుఖించుటకు లభింపనందున మిగుల నిరుత్సాహులై యున్న
(పు)డు తమంతటతామే తమఆత్మాత్మీయములు యావత్తును తమ్మువిడిచిన విధమును అనతిచ్చి
(నట్టి)ఆళ్వార్లయొక్క పరిశుద్ధమగు కల్యాణగుణములను నీవు అనుభవింపుమని.

౯౭. ఉణ్ణుఞ్జోఱాదియొరుమూన్ఱుమెమ్బెరుమాన్,
కణ్ణనెన్ఱేనీర్ మల్గిక్కణ్ణిణైగళ్, మణ్ణులగిల్
మన్నుతిరుక్కోళూరిల్,మాయన్బాల్ పోమ్,
మాఱన్‌పొన్నడియేనన్దమక్కుప్పేఱ్.

టీక.— ఉణ్ణుమ్ - ఆరగించునట్టి, శోఱుఆది - ప్రసాదము మొదలగు, ఒరుమూ
(న్ఱుమ్)- ఒకమూడు ధారకవస్తువులును, ఎమ్బెరుమాన్ - సర్వేశ్వరుఁడగు, కణ్ణన్ ఎన్ఱే -
(కృ)ష్ణుడు అనియే, కణ్ ఇణైగళ్ - రెండుకండ్లయందును, నీర్ - కన్నీరైనది, మల్గి -
(నిండి) మణ్ ఉలగిల్ - భూలోకమందు, మన్ను - నిలుకడనొందిన, తిరుక్కోళూరిల్ -
(తిరుక్కో)ళూరిలో సేంచేసియుండు, మాయన్ పాల్ - ఆశ్చర్యగుణచేష్టితములుగల సర్వే

తా.– మంచిజలముచే (లేక) అభిప్రాయముచే మన ప్రణయకలహమును నివర్తింపఁజేసిచేర్చిన శ్రియఃపతి, మునుపటిశత్రువులను (లేక) మన స్త్రీత్వాభిమానాదులను భోగ్యముగా చేసెను అనియు పరస్పరవిరుద్ధములగు సుఖదుఃఖములను గలిగియుండు విభూతులను (లోకములను) కలవాఁడనియు సదా, స్తుతించుచున్న ద్రావిడభాషక ఆచార్యులగు ఆళ్వార్లయొక్క దివ్యప్రబన్ధమును అభ్యసించువారునిత్యసూరులకు పరమపూజ్యులగుదురని.

౫౮. కుర వై ముదలా క్కణ్ణన్ కోలచ్చెయల్ గళ్,
ఇరవుపగ లెన్నామ లెన్ఱుమ్, పరవుమనమ్ –
పెత్తే నెన్ఱుకళిత్తుప్పేశు మ్పరాజ్కుశన్ఱన్,
శొల్ తేనిల్, నెఞ్జే తువళ్.

టీక.— కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, కురవై - రాసక్రీడ, ముదల్ అమ్ - మొదలగు, కోలమ్ - సుందరమైన, శెయల్ గళ్ - వ్యాపారములను, ఇరవుపగల్ - రాత్రి పగలు, ఎన్నామల్ - అనిచూడక, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, పరవుమ్ - స్తుతించునట్టి మనమ్ - మనస్సును, పెత్తేన్ - లభించితిని, ఎన్ఱు - అని, కళిత్తు - సన్తోషించి, పేశుమ్ - మాట్లాడుచున్న, పరాంకుశన్ తన్ - నమ్మాళ్వార్లయొక్క, శొల్ తేనిల్ - శ్రీసూక్తియను తేనెయందు, నెఞ్జే - ఓ మనసా! తువళ్ - కూడివృద్ధిబొందుమూ.

తా.— ఓ మనసా! శ్రీకృష్ణునియొక్క మనోజ్ఞములగు రాసక్రీడమొదలగు వ్యాపారములను విరామములేక స్తుతించునట్లు లభించితినని సన్తోషముతో సంభాషించుచున్న నమ్మాళ్వార్లయొక్క శ్రీసూక్తిరూపమగు తేనెను అనుభవించి వృద్ధిబొందుమని.

౫౯. తువళఱుశీర్ మాల్ దిఱత్తుత్తొన్నలత్తాల్, నాళుమ్ –
తువళఱ్ఱుత్ శీలమెల్లామ్ శొన్నాన్, తువళఅవే –
మున్న మనుభవత్తిల్ మూళ్ గినిన్ఱమాఱునదిల్,
మన్ను మువప్పాల్ వన్దమాల్.

టీక.— తువళ్ - ఇతరాసక్తిఅనుదోషము, అఱ - నివర్తించుటచే, మున్నమ్ - పూర్వమందే, అనుభవత్తిల్ - భగవదనుభవమందు, మూళ్ గిన్ఱ - ప్రవేశించిన, మాఱన్ - నమ్మాళ్వార్లు, అదిల్ - ఆయనుభవమందు, మన్నుమ్ - నిలుకడనొందియున్న, ఉవప్పాల్ - సన్తోషముచే, వన్ద-కలిగిన, మాల్ - ప్రేమాతిశయముచే, తువళ్ అఱుశీర్ - దోషములేని కల్యాణగుణములుగల, మాల్ తిఱత్తు - సర్వేశ్వరునివిషయమందు, తొల్ నలత్తాల్ - స్వాభావికమగుభక్తిచే, నాళుమ్ - ఎల్లప్పుడును, తువళ్ అఱు - ఆవిషయమందు చలనములేక శీలమ్ ఎల్లామ్ - తనయొక్కస్వభావములనన్నిటిని, శొన్నాన్ - కృపచేఅనతిచ్చి

తా. — పూర్వమందే ఇతరాపేక్షవదలి భగవదనుభవమందు ప్రవేశించిన ఆళ్వా రనుభవమందలి సన్తోష ప్రేమాతిశయములచే నిర్దుష్టకల్యాణగుణ సమ్పన్నుడగు ఆస ర్వేశ్వరునియందు స్వాభావిక భక్తిచే సదాతమకు గలిగియుండు అట్టివిషయమందలి దృఢా ధ్యవసాయములనన్నిటిని కరుణచే ఆనతిచ్చిరని.

౯౬. మాలుడనే,తాన్కలన్దు,వాழ ప్పెఱామైయాల్,
శాలనైన్దు,తన్నుడై మై,తానడైయ,క్కోలియే,
తానిగழ వేణ్డామల్,తన్నై విడల్,శొల్ మాఱన్,
ఊనమఱుశీర్,నెఞ్జే యుణ్.

టీక. — మాలుడనే - ఆశ్రితవ్యామోహముగల సర్వేశ్వరునితో, తాన్ - తాము, కలన్దు - కూడి, వాழ - సుఖించుటకు, పెఱామైయాల్ - లభింపమిచే, శాల-మిక్కిలి, ఐన్దు - విసిగి, తన్ ఉడైమై - తమఆత్మయును ఆత్మతో సంబన్ధించినదియును, అడైయ - అన్నియు, తాన్ - తాము, ఇగழ వేణ్డామల్ కోలియే - విడుచుటకు ప్రయత్నింపఁగోరినట్లు కాక, తన్నై విడల్ - తనంతట తానే యావత్తును తమ్మువిడిపోవునట్టి విధమును, శొల్ - చెప్పినట్టి, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, ఊనమ్అఱు - దోషములులేని, శీర్ - కల్యాణగుణములను, నెఞ్జే - ఓ మనసా! ఉణ్ - నీవు అనుభవింతువుగాక.

తా. — ఓ మనసా! తనభక్తులయందు వ్యామోహమును బొందియుండు సర్వేశ్వరునితో ఆళ్వార్లు తాముగూడిసుఖించుటకు లభింపనందున మిగుల నిరుత్సాహులై యున్న తమంతటతామే తమఆత్మాత్మీయములు యావత్తును తమ్మువిడిచిన విధమును ఆనతిచ్చిన ఆళ్వార్లయొక్క పరిశుద్ధమగు కల్యాణగుణములను నీవు అనుభవింపుమని.

౯౭. ఉణ్ణుమ్ శోఱాది,యొరుమూన్ఱుమ్,ఎమ్బెరుమాన్,
కణ్ణనెన్ఱే,నీర్ మల్గి,క్కణ్ణిణైగళ్, మణ్ణులగిల్
మన్ను తిరుక్కురుగూరిల్,మాయన్పాల్ పోమ్,
మాఱనాపొన్నడియే,నన్దమక్కు,ప్పేఱు.

టీక. — ఉణ్ణుమ్ - అరగించునట్టి, శోఱుఆది - ప్రసాదము మొదలగు, ఒరుమూన్ఱుమ్ - మూడు ధారకవస్తువులును, ఎమ్బెరుమాన్ - సర్వేశ్వరుఁడగు, కణ్ణన్ ఎన్ఱే - అనియే, కణ్ ఇణైగళ్ - రెండుకండ్లయందును, నీర్ - కన్నీరైనది, మల్గి - మణ్ ఉలగిల్ - భూలోకమందు, మన్ను - నిలుకడనొందిన, తిరుక్కురుగూరిల్ - తిరుక్కురుగూరిలో వేంచేసియుండు, మాయన్ పాల్ - ఆశ్చర్యగుణచేష్టితములనుగల సర్వే

శ్వరునియొద్దకు, పోమ్ - వెడలునట్టి, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, పొన్ అడిరే- రమ్యమైన శ్రీపాదములే, నన్దమక్కు - మనకు, పాన్ - నిక్షేపమైయుండును.

తా.— ప్రసాదాది ధారకవస్తువులను శ్రీకృష్ణుడేఅని కండ్లలో కన్నీరునిండ ఈ భూమియందలి తిరుక్కుఱూరిలో వేంచేసియుండు ఆశ్చర్యకరుడగు సర్వేశ్వరునియొద్దకు వెడలెడు ఆళ్వార్లయొక్క రమ్యమైన శ్రీపాదములే మనకు నిక్షేపమని.

౫౮. పొన్నులగుబూమియెల్లామ్పుళ్ళినఙ్గట్కే వఴఙ్గి,
ఎన్నిడర్కై మాలుక్కియమ్బుమెన, మన్నుతిరు
నాడుముదల్ తూదునల్గివిడుమ్మాఱనైయే,
నీడులగీర్ పోయ్ వణఙ్గునీర్.

టీక.—పొన్ ఉలగు - పరమపదము, పూమి-భూమిమొదలగులోకములు, ఎల్లామ్ - ఈయావత్తును, పుళ్ ఇనఙ్గట్కే - పక్షిసమూహములకే, వఴఙ్గి - ఇప్పించి, ఎన్ ఇడర్కై - నాదుఃఖమును, మాలుక్కు - ఆశ్రితవ్యామోహముగల సర్వేశ్వరునికి, ఇయమ్బుమెన - చెప్పుడుఅని, మన్నుతిరునాడుముదల్ - స్థిరమగుపరమపదముమొదలగుస్థలములయందు, తూదు - దూతలనుగ, నల్గి - అపేక్షించి, విడుమ్ - పనిపిను మాఱనైయే - ఆళ్వార్లనే, నీడుఉలగీర్ - గొప్పభూమియందుండువారలారా! నీర్ - మీరు, పోయ్ - వెళ్లి, వణఙ్గుమ్ - నమస్కరింపుడు.

తా.—ఓలోకులారా! మీరు, ఇహపరలోకములనన్నిటిని పక్షులగుంపుకేఇప్పించినావ్యాకులమును శ్రియఃపతికి విన్నవింపుడని పరమపదముమొదలగు స్థలములకు పక్షులనుదూతలనుగపంపిన ఆళ్వార్లనే రక్షకముగనమ్మినమస్కరింపుడని.

౫౯. నీరాగిక్కేట్టవర్గళ్ నెఞ్జఴియ, మాలుక్కుమ్
ఏరార్ విసుమ్బిలిరుప్పరిదా, ఆరాద
కాదలుడన్ కూప్పిట్ట కారిమాఱన్ శొల్లై,
ఓదిడ వేయుయ్యుములగు.

టీక.—కేట్టవర్గళ్ - వినినవారియొక్క, నెఞ్జు - మనస్సు, నీర్ ఆగి - జలరూపమై, అఴియ - నశించునట్లును, మాలుక్కుమ్ - సర్వేశ్వరునికిని, ఏర్ ఆర్ - మిగులమనోజ్ఞమగు, విసుమ్బిల్ - పరమపదమందు, ఇరుప్పు-ఉండుట, అరిదు-దుర్లభము అగునట్లును, ఆరాద - శమింపని, కాదలుడన్ - ప్రేమముతో, కూప్పిట్ట - పిలిచిన, కారిమాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, శొల్లై - శ్రీసూక్తిని, ఓదిడవే - అభ్యసింపఁగానే ఉలగు - లోకము, ఉయ్యుమ్ - ఉజ్జీవించును.

తా.—విన్నవారిహృదయము కరిగి రూపుచెడునట్లు శ్రియఃపతికినిమిగులరమణీయమైనపరమపదమందలిఉనికి అరుదగునట్లును తృప్తినొందనిప్రేమాతిశయముతో కూడియున్న ఆళ్వార్లయొక్క దివ్య ప్రబన్ధమును అభ్యసించితేని సకలచేతనులు ఉజ్జీవింతురని.

౬౦. ఉలగుయ్యమాల్ నిన్ఱువుయర్ వేఙ్గడత్తే,
అలర్ మగళై మున్నిట్టవన్ఱన్ మలరడియే,
వన్ శరణాయ్ చ్చేర్న్ద మగిழ் మాఱన్ తాళిణైయే,
ఉన్ శరణాయ్ నెఞ్జమే యుళ్.

టీక.—ఉలగు - లోకము, ఉయ్య - ఉజ్జీవించునిమిత్తము, మాల్ - సర్వేశ్వరుడు, నిన్ఱు - నిన్ఱతిరుక్కోలముగ (నిలిచినరూపముగ) సేవసాదించుచున్న, ఉయర్ - ఉన్నతమైన, వేఙ్గడత్తే - తిరుమలలో, (తిరుపతికొండమీద), అలర్ మగళై - అలర్ మేల్ మఙ్గైయగు శ్రీమహాలక్ష్మిని, మున్నిట్టు - పురుషకారముగ ముందుంచి, అవన్దన్ - సర్వేశ్వరునియొక్క, మలర్ అడియే - తామరపుష్పములవంటి శ్రీపాదములను, వన్ శరణ్ ఆయ్ - దృఢమైన ఉపాయముగ, శేర్న్ద - ఆశ్రయించిన, మగిழ் మాఱన్ - పొగడపూలదండను ఆభరణముగ ధరించియుండు నమ్మాళ్వార్లయొక్క, తాళ్ ఇణైయే - రెండు శ్రీపాదములనే, ఉన్ శరణ్ ఆయ్ - నీకు ఉపాయముగ, నెఞ్జమే - ఓమనసా ! ఉళ్ - తలంతువుగాక.

తా.—ఓమనసా ! లోకోజ్జీవనార్థముగ సర్వేశ్వరుడు వేంచేసియుండు తిరుమలలో, అలర్ మేల్ మంగతాయార్ల పురుషకారమూలముగ ఆశ్రియఃపతియొక్క పాదారవిన్దములనే దృఢరక్షకముగ నమ్మి ఆశ్రయించియుండు వకుళాభరణులగు ఆళ్వార్లయొక్క శ్రీపాదములనే నీకు ఉపాయముగ తలంచుమా అని.

౬౧. ఉణ్ణిలావైవరుడ నిరుత్తి యివ్వులగిల్,
ఎణ్ణిలామాయ నెనై నలియ వెణ్ణుగిన్ఱాన్;
ఎన్ఱునినైన్దోలమిట్టవిన్బుగழ் శేర్ మాఱనెన,
కున్ఱివిడుమే పవక్కడ్గుల్,

టీక.— ఇవ్వులగిల్ - ఈలోకమందు, ఉళ్ - లోగ, నిలావు - వర్తించెడు, ఐవరుడన్ - అయిదు ఇంద్రియములగు శత్రువులతో, ఇరుత్తి - ఉండునట్లుచేసి, ఎణ్ణిలా - అసంఖ్యాకమైన, మాయన్ - ఆశ్చర్యగుణచేష్టితములుగల సర్వేశ్వరుడు, ఎనై - నన్ను, నలియ - శ్రమపడుచుటకు, ఎణ్ణుగిన్ఱాన్ - తలచుచున్నాడు, ఎన్ఱునినైన్దు - అని తలచి, ఓలమిట్ట - మొఱయిడిన, ఇన్ - ఇంపైన, పుగழ் - కీర్తియైనది, శేర్ - పొందిన

యుండు, మాఱన్ ఎన - ఆళ్వార్లని అనుసన్ధింపగానే, పవళ్కంఱ్గుల్ - సంసారమను కాళరాత్రియైనది, కన్ఱివిడుమ్ - తగ్గినశించిపోవును.

తా.— ఈలోకమందు మనలోగ పంచేంద్రియములు అను శత్రువులను ఉండునట్లు చేసిన ఆశ్చర్యగుణచేష్టితుడగు సర్వేశ్వరుఁడు నన్ను శ్రమపఱచుటకు తలచుచున్నాడుఅని తలచిమొఱయిడిన మనోజ్ఞమైన కీర్తిగల ఆళ్వార్లయొక్క తిరునామమునుఅనుసన్ధింపగనే సంసారమను కాళరాత్రియైనది తగ్గినశించిపోవునని.

౭౬౨. కజ్గుల్ పగలరదిశై విణ్జిమోగముఱ,
అజ్గదనైక్కణ్డోర్ అరజ్గరై ప్పార్త్తు, ఇజ్గివళ్ పాల్,
ఎన్ శెయనీరెణ్ణుగిన్ఱదెన్నుమ్ నిలైశేర్ మాఱన్,
అజ్గోలుఱ నెఞ్జు వెళ్లై యామ్.

టీక.—కజ్గుల్ పగల్ - రాత్రియందును పగటియందును, అరతి- అసౌఖ్యము, శైవింజి - అతిశయించి, మోగమ్ ఉఱ - మోహమునుబొందగ, అజ్గు - అచ్చట, అద నైక్కణ్డు - దానినిజూచి, ఓర్ - సమానములేని, అరజ్గరై - శ్రీరజ్గనాథులను, పార్త్తు- సేవించి, ఇజ్గు - ఇచ్చట, ఇవళ్ పాల్ - ఈ మెవిషయమందు, ఎన్ శెయ - ఏమిచేయుటకు, నీర్ - మీరు, ఎణ్ణుగిన్ఱదు - తలంచునది, ఎన్నుమ్ - అనితల్లిఅడుగునట్టివిధమైన, నిలై శేర్ - స్థితినిబొందిన, మాఱన్ - ఆళ్వార్లయొక్క, అమ్ శొల్ - మనోజ్ఞమైనఈ తిరువాయ్ మొళినిని, ఉఱ - అభ్యసింపగ, నెఞ్జు వెళ్లైఆమ్ - ఉపాయాన్తరవిషయమైన మనోమాలిన్యమునివర్తించితదేకోపాయత్వానుసన్ధానము చేమనశ్శుద్ధిఅగును.

తా.— ఆళ్వార్ నాయకి రేయింబగల్లను అసౌఖ్యమధికమై మోహమునుబొందగ అచ్చటదానినిజూచిసమానరహితులగు శ్రీరజ్గనాథులను ( నంబెరుమాళ్లను ) సేవించిఈ మెవిషయమందు మీరేమిచేయతలచితిరి అనితల్లిఅడుగునంతటి దశనుబొందినఆళ్వార్ల యొక్కమనోజ్ఞమైన ఈతిరువాయ్ మొళిని అభ్యసింపగమనశ్శుద్ధిగలుగునని.

౭౬౩. వెళ్ళియనామఙ్గేట్టు విట్టగన్ఱ పిన్ మోగమ్,
తెళ్ళియమాల్ తెన్ఱిరుప్పేర్ శెన్ఱుపుగ, ఉళ్ళమజ్గే
పఱ్ఱి నిన్ఱతన్మై పగరుమ్ శడకోపఱ్కు,
అఱ్ఱవర్గళ్ దామ్ మాళియార్.

టీక.—వెళ్ళియనామమ్- పావనత్వభోగ్యత్వధారకత్వాదిగుణములుగల పెరియపెరుమాళ్ల యొక్క (శ్రీరజ్గనాథులయొక్క) తిరునామములను, కేట్టు - తల్లిగారుచెప్పగా

ఱ్ఱి, మోగమ్ - మోహమైనది, విట్టు - విడిచి, అగన్దపిన్ - తొలగినవెనుక, తెళ్ళియ
రాల్ - ఆశ్రితరక్షణమందు వివేకజ్ఞుడగు సర్వేశ్వరుఁడువర్తించెడు, తెన్ తిరుప్పేర్ - దక్షిణపుతిరుప్పేరుఅనుదివ్యదేశమునందు, శెన్ఱుపుగ - వెళ్ళిప్రవేశింపగ, ఉళ్ళమ్ - తమ హృదయమైనది, అజ్గే - ఆస్థలమందు, పల్ని - ఊని, నిన్ఱ - నిలిచిన, తన్మై - స్వభావము, పగరుమ్ - సాదించెడు, శడకోపఱ్కు - ఆళ్వార్లవిషయమందు, అల్ అవర్ గళ్ తామ్ - వారికే శేషభూతులమనితీర్మానించుకొన్నవారలు, ఆళియార్ - (లోతైన భగవద్భక్తికిసముద్రమగుశ్రీమన్నాధమునులవలె) అగాధమైన (లోతైన) జ్ఞానప్రేమము గలవారు (అగుదురు).

తా.— శ్రీరజ్గనాథులయొక్క పావనత్వాదిగుణములు గల తిరునామములను ల్లిగారుచెప్పగ ఆళ్వార్ నాయకివిని మోహమునివర్తింపగ ఆశ్రితరక్షణజ్ఞానము అతిశయించియుండు సర్వేశ్వరుడు, నిత్యవాసముచేయుచున్న తెన్ తిరుప్పేర్ అనుదివ్యదేశమునప్రవేశింపగతమహృదయముఅచ్చటనిలుకడనొందిన రీతినిఆనతిచ్చినట్టి ఆళ్వార్లకే శేషభూతులమనినిశ్చయించుకొన్నవారలు అగాధభగవద్భక్తిసిద్ధులైన శ్రీమన్నాధమునులవలెఅగాధజ్ఞాన ప్రేమములను గలవారగుదురని.

౭౮. ఆళివణ్ణర్ తన్ విశయమానవైముల్ లుజ్గాట్టి,
వాళిదనాలెన్ఱుమగిళ్ న్దునిఱ్క, ఊళిలవై
దన్నై యిన్ఱుపోలక్కణ్డుతానురైత్త మాఱన్ శొల్,
పన్నవరేనల్లదుకఱ్పార్.

టీక.—ఆళివణ్ణర్ - శ్రమహరమైనసముద్రచ్ఛాయగల సర్వేశ్వరుఁడు, తన్ విశయమ్ - తనవిజయపరంపరలు, ఆనవై - అయినవానిని, ముల్ లుమ్ - సమస్తమును, కాట్టి - చూపి, ఇదనాల్ - దీనిచే, వాళ్ - సుఖింపుడు, ఎన్ఱు - అని, మగిళ్ న్దు - సంతోషించి, నిఱ్క - నిలువగ, ఊళిల్ ఆవైదన్నై - పురాతనముగనడచుచువచ్చిన, అవదానములను (పూర్వకృత్యములను), ఇన్ఱుపోలక్కణ్డు - నేటివలెప్రత్యక్షముగ అనుభవించి, తాన్ - తాను, ఉరైత్త - అనుభవముఆనుచెరువునకు అలుగురీతిగఆనతిచ్చిన, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, శొల్ - దివ్యసూక్తిని, పన్నువరే - విచారించి అనుసన్ధించువారలే, నల్లదు- తమప్రియహితములకు ఉపయోగముగవిలక్షణశబ్దములను, కఱ్పార్ - అభ్యసించినవారగుదురు.

తా.—సముద్రకాన్తిగల సర్వేశ్వరుఁడు తమజయపరంపరలనన్నిటిని జూపిసుఖింపుడని సంతుష్టుఁడైయుండగ, ఆళ్వార్లు అతీతకాలాపదానములను తత్కాలమందు

ప్రత్యక్షముగ అనుభవించి అనుభవపరీవాహరూపముగ ఆనతిచ్చిన దివ్యప్రబన్ధమును అనుసన్ధించు వారలే తమక్షేమమునకు ఉపయుక్తమగువానిని అభ్యసించినవారగుదురని.

౬౫. కఱ్ఱోర్ కరుదుమ్ విశయజ్గళుక్కెల్లామ్,
పఱ్ఱామ్ విబవగుణప్పణ్బుగళై, ఉఱ్ఱుణర్న్దు
మణ్ణిలుళ్ళోర్ తమ్మిళ్ళవై వాయ్న్దురైత్తమాఱన్ శోల్,
పణ్ణిల్ ఇనిదాన తమిళ్ప్పా.

టీక.—కఱ్ఱోర్ - సకలశాస్త్రతాత్పర్యములను అభ్యసించిన దశరథచక్రవర్తి శ్రీవసుదేవులు మొదలైనవారు, కరుదుమ్ - ఆదరించెడు, విజయజ్గళుక్కు - విజయములకు, ఎల్లామ్ - అన్నిటికిని, పఱ్ఱుఆమ్ - ఆశ్రయమగు, విబవగుణప్పణ్బుగళై - రామకృష్ణాద్యవతారములయొక్క గుణస్వభావములను, ఉఱ్ఱుఉణర్న్దు - విచారించిసర్తెఱిగి, మణ్ణిల్ - ఈభూమియందు, ఉళ్ళోర్ తమ్ - ఉండెడుచేతనులయొక్క, ఇళ్ళవై - భగవద్గుణానుభవలాభమును, వాయ్న్దు - సులభమైసమీపించియుండి, ఉరైత్త - సాధించిన, మాఱన్ శోల్ - ఆళ్వార్లయొక్కదివ్యసూక్తియైనది, పణ్ణిల్ - గానములయందు, ఇనిదుఆన - మనోజ్ఞమైనరాగమగు, తమిళ్ప్పా - ద్రావిడశబ్దరూపమైనఛన్దస్సుఅగును.

తా.— సర్వజ్ఞులగు చక్రవర్తిశ్రీవసుదేవ ప్రభృతులు ఆదరించు జయపరంపరలకన్నిటికి ఆశ్రయమైన రామకృష్ణాద్యవతారాదులయొక్క గుణస్వభావములను గుర్తెఱిగి ఈలోకమందలి చేతనులకు భగవద్గుణానుభవలాభమును సులభముగసమీపించియుండి ఆనతిచ్చిన ఆళ్వార్లదివ్యప్రబన్ధమైనది గానములలోమనోజ్ఞగానమగు ద్రావిడశబ్దరూపమగువృత్తములుగలదియగునని.

౬౬. పామరువు వేదమ్ పగర్ మాల్ కుణజ్గళుడన్,
అమళగు వేణ్డప్పాడామ్ అవన్ఱై, తూమనత్తాల్
నణ్ణియవనై క్కాణ నన్గుదుగిక్కూప్పిట్ట,
అణ్ణలైనణ్ణార్ శేర్వరియర్.

టీక.—పామరువు వేదమ్ - ఛన్దస్సులతోఁగూడిన వేదములచే, పగర్ - ప్రతిపాదింపఁబడు, మాల్ కుణజ్గళుడన్ - మేలైనకల్యాణగుణములతోఁగూడి, అమ్అళగు - మంచి సౌన్దర్యము, వేణ్డప్పాడు అమ్అవన్ఱై - పరత్వముఅగువానిని, తూమనత్తాల్ - పరిశుద్ధమగుమనస్సుతో, నణ్ణి - సమీపించి, అవనై - క్రిందుఁజెప్పినగుణవిశేషములతోఁగూడినవానిని, కాణ - ప్రత్యక్షముగఅనుభవింపవలయునని ఇష్టపడి, నన్గు - బాగుగ,

వీ - మనస్సుకరిగి, కూప్పిట్ట - మొఱయిడిన, అణ్ణలై - మహాత్ములగుఆళ్వార్లను
వ్లైయర్ - జ్ఞానహీనులగుసంసారులు, నణ్ణార్ - ఆశ్రయింపఁజాలరు.

తా.— వేదప్రతిపాద్యమైన కల్యాణగుణములతో దివ్యసౌన్దర్యము పరత్వము మొ
లగువాటిని పరిశుద్ధహృదయముతో సమీపించి ఆసర్వేశ్వరుని ప్రత్యక్షముగననుభవింప
చ్ఛగించి ద్రవవస్తువవలెకరిగి మొఱయిడినమహనీయులగు ఆళ్వార్లను జ్ఞానశూన్యులగు
సంసారులు ఆశ్రయింపఁజాలరని.

౬౭. ఏழ்ைయర్గళ్ నెఞ్జై యుళగువిక్కుమ్మాల్ఏழ்గు,
శూழ்న్దుతోన్ఱిత్తుయర్ విళైక్క, ఆழுమనమ్
తన్నుడనేయవ్వழగై త్తానురైత్తమాఱన్పాల్,
మన్నుమవర్ తీవినై పోమ్మాయ్న్దు.

టీక.— ఏழైయర్గళ్ - అవివేకులగుసంసారులయొక్క, నెఞ్జై - మనస్సును,
ళగువిక్కుమ్ - కరుగునట్లుచేసెడు- మాల్ఏழ்గు - సర్వేశ్వరునిసౌన్దర్యము, శూழ்
న్దు - అంతటనువ్యాపించి, తోన్ఱి - అగుపడి, తుయర్ - దుఃఖమును, విళైక్క -
కలుగఁజేయగ, ఆழுమ్మనమ్తన్నుడనే-ఆదుఃఖసముద్రమందుమునిగిన హృదయముతో,
అవ్వழகై - ఆసౌన్దర్యమును, తాన్ ఉరైత్త - తామేఅనుభవించిసాధించిన, మాఱన్
పాల్ - ఆళ్వార్లవిషయమునందు, మన్నుమవర్ - పొందియుండువారియొక్క, తీవినై-
పాపము, మాయ్న్దుపోమ్ - నశించిపోవును.

తా.—సంసారులహృదయమును కరుగునట్లు చేయునట్టిశ్రియఃపతియొక్క చక్క
దనముఆళ్వార్లకు ప్రత్యక్షసమానముగనుండినను అనుభవమునకు రానందుచే దుఃఖాక్రాం
తమైనహృదయముతో ఆసౌన్దర్యమును తామనుభవించి, ఆనతిచ్చినఆళ్వార్ల విషయమునందు
ప్రావణ్యముగలవారలయొక్క పాపము రూపులేకనశించునని.

౬౮. మాయామల్ తన్నై త్తవైత్తవైళిత్తిరియాలే,
తీయ్యావిళిత్తిరమాచ్చేర్ పొరుళోడు, ఓయామల్,
వాయ్న్దునిఱ్కుమ్మాయక్కావళముఱైత్తమాఱనై నామ్,
ఏయ్న్దురైత్తువాழுనాళిన్ఱు.

టీక.—మాయామల్ - తమశేషత్వస్వరూపమునశింపక, తన్నై - తమ్మును,
వైత్త - ఉంచిన, వైళిత్తిరియాలే - విచిత్రాకారముగలిగియుండుటచే, తీయావిళిత్తిరమ్
మొదలగుపఞ్చభూతములును, ఒకదానియొక్క కార్యము మఱియొకదానికిలేకనే

ఉవేఱురూపమై, శేర్ పారళోడు - చేతనులయొక్కసమూహములను ఆప్రకారము గనే వేరు వేరురూపములగుటచే విచిత్రమైచేరిన పదార్థములతో, ఆయామల్ - వాని దోషములను విచారింపక, వాయ్న్దనిఱ్కుమ్ - వానితోపొందియుండెడు, మాయ్ర్ పళమ్ - సర్వేశ్వరునియొక్క విభూతివిస్తారమును, ఉరైత్త - స్థాదించిన, మాఱనై - నమ్మాళ్వార్లను, నామ్ - మనము, ఏయ్న్దు - సమీపించి, ఉరైత్తు - వారితిరునామము లనువచించి, వాఴుమ్వాళ్ - సుఖించుకాలము, ఎన్రు - ఏకాలమో.

తా.— తమస్వరూపముచెడకుండునట్లు తమ్ముఉంచినవిచిత్రాకారతచేతను అగ్ని మొదలగుపంచభూతములును వేరువేరుకార్యములు గలిగినానావిధాకారమై, ఆప్రకారముగనే చేతనవర్గమును నానావిధాకారములుగలదగుటచే విచిత్రమైచేరిన పదార్థముల తో వానిదోషములను ఆలోచింపకవానితోపొందియుండెడు సర్వేశ్వరునియొక్కవిస్తారమైనవిభూతినిఅనతిచ్చిన ఆళ్వార్లను మనముసమీపించి వారితిరునామములను అనుసన్ధించిసుఖించుకాలమెప్పుడో అని.

(ఓయామల్ వాయ్న్దనిఱ్కుమ్ అనిపాఠమైనయెడల, ఎల్లప్పుడునుచేరియుండును అని అర్థము).

౮౯. ఎన్ఱనై నీయిజ్గువైత్తదేదుక్కెన్న, మాలుమ్
ఎన్ఱనక్కుమెన్ఱమర్క్కుమిన్బమదా, నన్ఱుకవి
పాడవెనక్కై మాఱిలామై,
పగర్ మాఱన్పాడణై వార్క్కుణ్డామిన్బమ్.

టీక.—ఎన్ఱనై - సంసారమందుపొందనినన్ను, నీ - సర్వశక్తిసమ్పన్నుడవగు నీవు, ఇజ్గు - ఈలోకమందు, వైత్తదు - ఉంచినది, ఏదుక్కు - ఏమిప్రయోజనముకొఱకు, ఎన - అనియడుగగ, మాలుమ్, సర్వేశ్వరుడును, ఎన్ఱనక్కుమ్ - నాకును, ఎన్ఱమర్క్కుమ్ - నాభక్తులకును, ఇన్బమదామ్ - ఇంపైన, నన్ఱుకవి - మంచికవనములను, పాడఎన - పాడుటకొఱకని ప్రత్యుత్తరమివ్వగ, కైమాఱు - సర్వేశ్వరుడుచేసిన ఉపకారమునకు ప్రత్యుపకారము, ఇలామై - తమయందులేకుండుటను, పగర్ - సాధించిన, మాఱన్పాడు - ఆళ్వార్లయొద్ద, అణైవార్క్కు - సమీపించువారికి, ఇన్బమ్ - ఆనన్దము, ఉణ్డామ్ - కలుగును.

తా.— ఆళ్వార్లుసర్వేశ్వరునిసేవించి నీవెందుకొఱకై నన్నీవిభూతియందుఉంచితివనిఅడుగగ, ఆసర్వేశ్వరుడు నాకును నాభక్తులకును మనోజ్ఞమైన కవనములను పాడుటకొఱకుఅనగ, ఆసర్వేశ్వరునికి తాముప్రత్యుపకారము చేయకుండుటను అనతిచ్చిన ఆళ్వార్లయొక్కసన్నిధియందు చేరినవారికి అనన్దాతిశయముగలుగునని.

౭౦. ఇన్బక్కవి పాడువిత్తోనైయిన్దిరై యోడు,
అన్బుఱ్ఱు వాழ్ తిరువాఱన్ విళైయిల్, తున్బమఱ.
క్కణ్డడిమై శెయ్యక్కరుదియ మాఱన్ కழలే,
తిణ్డిఱలోర్ యావర్క్కుమ్ తేవు.

టీక.— ఇన్బక్కవి - నిరతిశయభోగ్యమైన తిరువాయ్ మొழிని, పాడువిత్తోనై-సన్నగానిపాడించినఉపకారకుని, ఇన్దిరై యోడు - శ్రీమహాలక్ష్మితో, అన్బుఱ్ఱు - ప్రేమతో, వాழ் - సుఖించుచున్న, తిరువాఱన్ విళైయిల్ - తిరువాఱన్ విళైఅను దివ్యదేశమందు, తున్బమ్అఱ - తమదుఃఖమంతయును నశించునట్లు, కణ్డు - చూచి, అడిమై-కైంకర్యమును, శెయ్య - చేయుటకు, కరుదియ - తలచిన, మాఱన్ కழలే - ఆళ్వార్ల యొక్క శ్రీపాదములే, తిణ్ తిఱలోర్ - దృఢాధ్యవసాయముగలవారగు మధురకవులు శ్రీమన్నాథమునులు మొదలగు, యావర్క్కుమ్ - అందఱికిని, తేవు - పరదేవతయగును.

తా.— తిరువాయ్ మొழிని తమకూలముగపాడించిన ఉపకారకుని తిరువాఱన్ విళైయందు శ్రీమహాలక్ష్మితోఁగూడి సుఖించుచుండుటను తమమనోవ్యాధులను నివర్తించునట్లుసేవించి కైంకర్యము చేయఁదలచిన ఆళ్వార్ల శ్రీపాదములే దృఢాధ్యవసాయనిష్ఠులగు మధురకవి శ్రీమన్నాథముని ప్రభృతులకు ఉత్కృష్టదైవము అగునని.

౭౧. తేవనుఱై పదియిల్ శేర ప్పెఱామైయాల్,
మేవుమడియార్ వశనామ్ మెయ్న్నిలైయుమ్,
యావైయుమ్ తానామ్నిలైయుమ్ శజ్గిత్తవై తెళిన్దమాఱన్బాల్,
మానిల త్తీర్ నజ్గళ్ మనమ్.

టీక.—మానిల త్తీర్ - గొప్పలోకమందుండువారలారా! తేవన్ - సర్వేశ్వరుఁడు, ఉఱై - నిత్యవాసము చేయుచున్న, పదియిల్ - దివ్యక్షేత్రమునందు, శేర - చేరి తిరునామములను పాడికైంకర్యము చేయుటకు, పెఱామైయాల్ - లభింపనందుచే, మేవుమ్ - తన్నాశ్రయించియుండు, అడియార్ - తదీయులకు, వశన్ ఆమ్ - పరతంత్రుఁడగునట్టి, మెయ్నిలైయుమ్ - తత్త్వమైనఉనికియందును, యావైయుమ్ - చేతనాచేతనములన్నియును, తాన్ ఆమ్నిలైయుమ్ - తానుఅనుమాటకులోఁగ అణగునట్టిఉనికియందును, శజ్గిత్తు - మిగులసన్దేహించి, అవై తెళిన్ద - వానియథాస్థితిని దెలిసికొనిన, మాఱన్ పాల్ - ఆళ్వార్లవిషయమందు, నజ్గళ్ మనమ్- మనహృదయము ఊనియుండును.

తా.— ఓలోకులారా! సర్వేశ్వరుఁడు సన్తోషించినివసించు దివ్యదేశమందుచేరి, తిరుగుణానుభవకైంకర్యములను చేయలభింపమిచ్చే తన్నాశ్రయించియుండు భాగవతులకు

స్వాధీనుఁడగునట్టి తత్వస్థితియందును, చిదచిత్తులన్నియును తానుఅను శబ్దమందు అణిగి యుండు స్థితియందును, సన్దేహముగలిగి శ్రియఃపతియే సర్వముఅను వాస్తవార్థమును గుర్తెఱిగిన, ఆళ్వార్లవిషయమందు మనహృదయము నిలుకడనొందియుండునని.

౭౨. నజ్ఞరుత్తైనన్గాగనాడినిఱ్కుమ్మాలఱియ,
ఇజ్ఞివత్తిల్లాశై యెమక్కుళదెన్శజ్ఞై యినాల్,
తన్నుయిరిల్మత్తిల్లాశై, తానొళిన్దమాఱన్నాన్,
అన్నిలైమైయాయ్న్దురైత్తానజ్ఞు.

టీక.— నమకరుత్తై - మనయొక్కహృదయమును, నన్గాగ - బాగుగ, నాడినిఱ్కుమ్ - విచారించుచువచ్చెను, మాల్ - సర్వేశ్వరుఁడు, అఱియ - గుర్తెఱుగునట్లు, ఇజ్ఞు-ఈలోకమందలి, ఇవత్తిల్ - ఈప్రకృతివిషయములందు, ఆశై - అపేక్ష, ఎమక్కు - మాకు, ఉళ్ళదెన్ఱు - కలదుఅనెను, శజ్ఞైయినాల్ - సన్దేహముచే, తన్ఉయిరిల్ మత్తిల్ -తనప్రాణమందునుతన్నుసంబన్ధించిన సొత్తులయందును, ఆశైతాన్ ఒళిన్ద - ఆశనివర్తిచేసికొనిన, మాఱన్ - ఆళ్వార్లు, అన్నిలైమై - ఆస్వభావమును, ఆయ్న్దు - విచారించి, అజ్ఞుఉరైత్తాన్ - విచారించిగుర్తెఱిగిన ప్రకారముగ ఆనతిచ్చిరి.

తా.—మనయొక్కహృదయవిషయవిచారణకర్తయగు సర్వేశ్వరుఁడు తెలిసికొనునట్లు ఈప్రకృతివిషయములందు చేతనులకుఅపేక్షకలదనెడుసన్దేహముచే, తనఆత్మాత్మీయములయందు అపేక్షవదలిన ఆళ్వార్లుఆస్వభావమును విచారించి గుర్తెఱిగినట్టిఆవిధమునుతప్పకఆనతిచ్చిరని.

౭౩. అజ్ఞమరర్పేణవవర్నడువేవాళ్తిరుమాఱ్కు,
ఇజ్ఞోర్పరివరిల్లై యెన్ఱఞ్జి, ఎజ్ఞుమ్
పరివదుళ్ళత్తెన్న ప్పయన్దీర్న్దమాఱన్,
వరిగళుళ్ళాల్, శేర్న్దవర్వాళ్వార్.

టీక.— అజ్ఞు - అనిత్యవిభూతియందు, అమరర్ - నిత్యసూరులు, పేణ - మజ్గళాశాసనముచేయగ, అవర్నడువే - వారియొక్కమధ్యను, వాళ్ - సుఖించుచుండు, తిరుమాఱ్కు - శ్రియఃపతియైనసర్వేశ్వరునికి, ఇజ్ఞు - ఈవిభూతియందు, ఓర్ పరివర్ - ప్రేమయుక్తులై మజ్గళాశాసనముచేయువారు, ఇల్లైయెన్ఱు - ఒకరునులేరని, అఞ్జి - భయపడగ, ఎజ్ఞుమ్ - అంతటను, పరివర్ - ప్రేమగలవారు, ఉళర్ - ఉన్నారు, ఎన్న - (అనిసర్వేశ్వరుఁడు) ఆనతీయగ, పయమ్ - భయము, తీర్న్ద - నివృత్తిచేసికొనిన,

మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, వరికళ్గల్ తాళ్ - రేఖలుగలిగివీరులుధరించు పెండేరములతోఁగూడినశ్రీపాదములను, శేర్న్దవర్ - పొందినవారు, వాఴ్వార్ - భయములేకసుఖింపఁగలుగుదురు.

తా. —పరమపదమందు నిత్యసూరులు మఙ్గళాశాసనముచేయఁగ వారలతోఁగూడి ఆనందించుచుండు సర్వేశ్వరునికి, ఈభూమియందు మంగళాశాసనముచేయువారలేరని, ఆళ్వార్లుభయపడఁగ ఎచ్చోటను ఉన్నారని సర్వేశ్వరుఁడు ఆనతిచ్చుటచే, భయముదీరిననమ్మాళ్వార్లయొక్క దివ్యలక్షణరేఖలుగల శ్రీపాదములను, ఆశ్రయించువారు నిర్భయులైసుఖింతురని.

౨౮. వారామలచ్చమినిమాల్ దన్వలియినైయుమ్,
శీరార్ పరివరుడన్ శేర్త్తియైయుమ్, పారుమెన,
త్తానుగన్దమాఱన్ తాళ్, శార్ నెఞ్జే శారాదేల్,
మానిడవరైచ్చార్న్దుమాయ్.

టీక, —(ఆళ్వార్లకు) ఇని - ఇక, అచ్చమ్ - భయము, వారామల్ - కలుగకుండునటుల, మాల్ - సర్వేశ్వరుఁడు, తన్ వలియినైయుమ్ - తనపరాక్రమాదులను, శీర్ ఆర్ - లక్షణయుక్తమగు, పరివరుడన్ శేర్త్తియైయుమ్. - ప్రేమగలవారలతోచేరికయున్ను, పారుమ్ఎన - చూడమనిచూపఁగ, (చూచి) తాన్ ఉగన్ద - తానుసన్తోషించిన, మాఱన్ తాళ్ - ఆళ్వార్ల శ్రీపాదములను, నెఞ్జే - మనసా ! శార్ - ఆశ్రయింపుము, శారాదేల్- ఆశ్రయింపనియెడల, మానిడవరై -మనుష్యులను, శార్న్దు - ఆశ్రయించి, మాయ్ - నశించిపొమ్ము.

తా. —ఓమనసా ! సర్వేశ్వరుఁడు ఆళ్వార్లకు భయములేకుండునట్లుతన పరాక్రమాదులను పేరిమయుక్తులసంసర్గమునున్ను సేవింపఁజేయఁగసేవించి సన్తోషించినఆళ్వార్ల శ్రీపాదములను ఆశ్రయింపుములేనియెడ మనుష్యులతోశేరినశించి పొమ్మ అని.

౨౯. మాయన్ వడివళగైక్కాణాదవల్ విడాయాయ్,
అదఅవిఞ్జియళుదలఱ్ఱుమ్, తూయపుగళ్,
ఉఱ్ఱశడగోపన్నైనామొన్నినిఱ్క మొఴ్పొదుపగల్,
అఱ్ఱపొళుదానదెల్లియామ్.

టీక. — మాయన్ వడివళగై - సర్వేశ్వరునియొక్కదివ్యవిగ్రహసౌన్దర్యాదులను, కాణాదవల్ విడాయాయ్అదు - సేవింపనందుచేగలిగిన అతిశయించినబడలిక అయినది, అవిఞ్జి - మిక్కిలిఅధికమై, అళుదు - దుఃఖించి, అలఱ్ఱుమ్ - క్రమముతప్పిమొ

అపెట్టేను, తూయ - పరిశుద్ధమైన, పుగళ్ ఉడై - కీర్తి అతిశయించిన, శఠకోపనై - నమ్మాళ్వార్లను, నామ్ - మనము, ఒన్ఱి నిఱ్కుమ్ పోదు - సమీపించినిలిచి అనుభవిం చునట్టి కాలము, పగల్ - పగటికాలమైయుండును, అల్ ఉపాఱు దానదు - ఆయనుభ వవిచ్ఛేదకాలము, ఎల్లిఅమ్ - కాళరాత్రియైఉండును.

తా.—సర్వేశ్వరునిరూపసౌన్దర్యాదులను సేవింపమిచ్చేగలిగిన ఆయాసము అధిక రించివ్యసనపడి మొఱయిడెడు యశస్సమ్పన్నులగు ఆళ్వార్లను మనముదగ్గరించి అను భవించుకాలముపగలును ఆయనుభవము లేనికాలము మహాకాళరాత్రియునైయుండునని.

౨౧. ఎల్లిపగల్ నడన్దవిన్దవిడాయ్ తీరుగైక్కు,
మెల్లవన్దుతాళ్ కలక్కవేణుమెన, నల్లవర్ గళ్,
మన్నుకడిత్తానత్తే మాలిరుక్కమాఱన్ కణ్డు,
ఇన్నిలైయై చ్చొన్నానిరున్దు.

టీక.—ఎల్లిపగల్ - రేయుంబగళ్ళగ, నడన్ద - జరిగిన, ఇన్దవిడాయ్ - ఈశ్ర మము, తీరుగైక్కు - నివర్తించుటకు, మెల్ల - నిదానముగ, వన్దు - వచ్చి, తాళ్ - తాము, కలక్కవేణుమ్ఎన - అనుభవింపవలయునుఅనితలచి, నల్లవర్ గళ్ - సత్పురు షులు, మన్ను - నిత్యవాసము చేసిసుఖించెడు, కడిత్తానత్తే - తిరుక్కడిత్తానమనుదివ్య దేశమందు, మాల్ - సర్వేశ్వరుఁడు, ఇరుక్క - వేంచేసియుండగ, మాఱన్ - నమ్మా ళ్వార్లు, కణ్డు - సేవించి, ఇరున్దు - నిలుకడనొందియుండి, ఇన్నిలైయై - ఈస్వభా వము, శొన్నాన్ - అనతిచ్చిరి.

తా.—ఆళ్వార్లు శ్రియఃపతియొక్క విశ్లేషము చేఅహోరాత్రములు అనుభవించిన కష్టమునివృత్తియగునట్లు తిరుక్కడిత్తానమునకువచ్చి అచ్చటిస్వామిని తాముఅనుభవిం పదలచిసత్పురుషులువసించునట్టి ఆతిరుక్కడిత్తానమందు సర్వేశ్వరుఁడు సేవసాదింపగ సేవించి అచ్చటవసించి ఈస్వభావమును అనతిచ్చిరని.

౨౨. ఇరున్దవన్దాళ్ వన్దిజ్ఞివరెణ్ణమెల్లామ్,
తిరున్దవివర్ దన్దిఱత్తేశెయ్దు, పొరున్ద -
క్కలన్దినియనాయిరుక్కక్కణ్డశఠకోపర్,
కలన్దనెఱికట్టురైత్తార్ కణ్డు.

టీక.—ఇరున్దవన్ తాన్ - తిరుక్కడిత్తానమందు వేంచేసియున్న సర్వేశ్వరుఁడే ఇఙ్గువన్దు - ఇచ్చోటికివచ్చి, ఇవర్ ఎణ్ణమ్ఎల్లామ్ - వీరియొక్క మనోరథమంతయును,

టున్ద - పూర్ణముగలభించునట్లు, ఇవర్ దమ్ - వీరియొక్క, తిఅత్తే - విషయమందు, శెయ్దు - కృపచేసి, పొరున్దక్కలన్దు - ఒకజలమురీతిగకలిసి, ఇనియనాయ్ నిఱ్క - మనోజ్ఞుడైనిలువగ, కణ్డ - సేవించిన, శడకోపర్ - నమ్మాళ్వార్లు, కలన్దనెఱి - వాడు తమతోవచ్చికలిసినప్రకారమును, కణ్డు - మనస్సుతోసేవించి, కట్టురైత్తార్ - ఆనతిచ్చిరి.

తా.— తిరుక్కడిత్తానమందలి సర్వేశ్వరుఁడే ఇచ్చటికివచ్చి, వీరికోరికలనంతయు సంపూర్ణముగకృపచేసి జలమురీతిగకలిసి మనోహరుఁడైయుండగ, సేవించిన ఆళ్వార్లు శ్రియఃపతి తమతోఁగలిసినవిధమును సాక్షాత్కరించి ఆనతిచ్చిరని.

౭౮. కణ్ణిఱై యుమ్వన్దుకలన్దమాలిక్కలవి,
తిణ్ణిలై యామాఱేణుమెన్నచ్చిన్దిత్తు, త్తణ్ణిదెనుమ్,
ఆరుయిరినేఱ్ఱమదుకాట్టవాయ్న్దురైత్తార్
కారిమాఱన్ఱన్ఱకరుత్తు.

టీక.—కణ్ నిఱైయు - కండ్లునిండునట్లు, వన్దు-వచ్చి, కలన్ద - కూడిన, మాల్ - సర్వేశ్వరుఁడు, ఇక్కలవి - ఈకూడిక, తిణ్ నిలైయా- దృఢస్వభావముగలదియగునట్లు, వేణుమ్ఎన - కావలయునని, శిన్దిత్తు - తలచి, తణ్ణిదుఎనుమ్ - చిన్నదియనెడు, ఆర్ ఉయిరిన్ - దుర్లభమైనఆత్మయొక్క, ఏఱ్ఱమ్ - మహిమను, కాట్ట- సేవింపఁజేయగ, కారిమాఱన్- ఆళ్వార్లు, ఆయ్న్దు - విచారించి, తన్ కరుత్తు- తమమనోభిప్రాయమును, ఉరైత్తాన్ - సాదించిరి.

తా.— నేత్రానన్దముగ సంశ్లేషించిన సర్వేశ్వరుడు ఈసంశ్లేషము స్థిరముగనుండవలయుననియెంచి సూక్ష్మమనెడు అరుదైనఆత్మయొక్క మహిమను చూపగ ఆళ్వార్లు యోచించి తమ అభిప్రాయమును ఆనతిచ్చిరని.

౭౯. కరుమాల్ తిఱత్తిల్లొరుకన్నిగై యామాఱన్,
ఒరుమాకలవియురైప్పాల్, తిరమాగ,
అన్నియరుక్కాగాదవన్దనక్కేయాగుముయిర్,
ఇన్నిలై మ్మెయ్మోరునెడిదా.

టీక.— కరుమాల్ తిఱత్తిల్ - నీలవర్ణముగలవాడై ఆశ్రితవ్యామోహముగలిగియుండు సర్వేశ్వరునివిషయమందు, ఒరుకన్నిగై ఆమ్మాఱన్ - ఒకకన్యావస్థనుబొందిన ఆళ్వార్లు, ఒరుమాకలవియురైప్పాల్ - అద్వితీయమైవిలక్షణమైన సంశ్లేషలక్షణములను చెప్పిరైత్తె మాటలుగసాదించుటకు ప్రవేశించుటచే, తిరమ్ఆగ - నిశ్చయముగ, ఉయిర్ - ప్రాప్తశేషికేశేషమగు ఆత్మస్వరూపనిష్ఠ, అన్నియర్క్కు ఆగాదు - ఇతరులకు శేషపడఁ

గూడదు, అవర్క్కే తనక్కే - ఆసర్వేశ్వరునికే, ఆగుమ్ - శేషమగును,(అ నెడు)ఇన్నిలైయై- ఈయునికిని, నెడిదుఅ - దీర్ఘముగ, ఓరుమ్ - ఆలోచింపుడు.

తా.—నీలవర్ణుడును ఆశ్రితవ్యాముగ్ధుడునగు శ్రియఃపతివిషయమందు ఒకకన్యదశను బొందిన ఆళ్వార్లు, అద్వితీయమై మహత్తైన సర్వేశ్వరసంశ్లేషచిహ్నములను చెలికత్తెయొక్క మాటలుగ సాధించుటచే, సర్వేశ్వరునికే ఈజీవాత్మవస్తువు తత్త్వముగ శేషమగును గాని అన్యులకు శేషముగాదు అనునట్టి ఈస్థితిని దీర్ఘముగయోచింపుడని. (అనతిచ్చిరి.)

౮౦. శ్రీ నెడుమాల్అழగుదనిల్ నీళ్ గుణత్తిల్, ఈడు -
పడుమ్మానిలైయుడైయ్యప త్తర్క్కు, అడిమైదనిల్,
ఎల్లైనిలమ్తానాగ వెణ్ణినార్మాఱన్,
అదుక్కోలైనిలమానని లై కొణ్డు.

టీక.— నెడుమాల్ - సర్వేశ్వరునియొక్క, అழగుతనిల్ - రూపసౌన్దర్యమందును, నీళ్ కుణత్తిల్ - గొప్పసౌహార్దగుణమందును, ఈడుపడుమ్ - లోబడుచున్న, మానిలైఉడైయ - గొప్పస్వభావముగల, పత్తర్క్కు - భక్తులవిషయమున, అడిమైతనిల్ - దాసభూతులగు విషయమునందు, అదుకోలైనిలమ్ - ఆభాగవతశేషత్వము సీమాభూమియగు ఉత్తమపురుషార్థము, ఆననిలైకొణ్డు -అయినదనిష్ఠనుగొని, మాఱన్ -నమ్మాళ్వార్లు, ఎల్లైనిలమ్ - పద్దుప్రదేశము, తాన్ ఆగ - తామగునట్లు, ఎణ్ణినార్ - తలచినవారైరి.

తా.— సర్వేశ్వరుని రూపసౌన్దర్య సౌహార్దాది దివ్యగుణములకు లోబడుచుండు మహనీయులగు భక్తశిరోమణులకు దాసభూతులగుటయే ఉత్తమపురుషార్థము అనునట్టి నిష్ఠనుగొని ఆళ్వార్లు అట్టిభాగవతులకు తాము దాసభూతులమని తలచినవారైరని.

౮౧. కొణ్డపెణ్డీర్ తాన్ముదలాక్కుఱ్ఱుమఱ్ఱార్ కన్మత్తాల్,
అణ్డినవరేన్నేయవరై విట్టు, త్తొణ్డరుడన్
శేర్క్కుమ్తిరుమాలైచ్చేరుమెన్నార్, ఆర్క్కుమిదమ్,
పార్క్కుమ్పుగழ్ మాఱన్పణ్డు.

టీక.— ఆర్క్కుమ్ -ఎంతతెలివిలేనివారి విషయమందును, ఇదమ్పార్క్కుమ్-హితము నేచేయఁజూచెడు, పుగழ్ - కీర్తినిగల, మాఱన్ - నమ్మాళ్వార్లు, పణ్డు -పూర్వమందు, కొణ్డ - అంగీకరించిన, పెణ్డీర్ తాన్ముదలా - భార్యమొదలగునదిగా, కూఱుమ్ - చెప్పఁబడు, ఉఱ్ఱార్ - బన్ధువర్గమంతయును, కన్మత్తాల్ - కర్మనిబన్ధనపూర్వకముగ అణ్డినవర్ ఎన్నే - పొందినవారుఅనియే, అవరై - అకర్మనిబన్ధనముగ వచ్చినబన్ధువులను

ఇప్పించుచున్నాను, నాక్ నారాయణన్ అన్ఱో - నేను నారాయణశబ్దవాచ్యుడనుగదా, ఎన్ఱు - అని, పేర్ ఉఱవైక్కొట్టు -తనయొక్క గొప్పయగు సర్వవిధబన్ధుత్వమునుజూపగ, అవన్ శీలత్తిల్ - ఆసర్వేశ్వరునియొక్క శీలగుణమందు, కాల్ తాழ్న్ద-ఆర్తిగలిగియున్న లైఅనతిచ్చిన, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, అరుళ్ - కృపయైనదీ, నమ్మనత్తు -మన మనస్సునందుండు, మై - అజ్ఞానమును, మాట్టి విడుమ్ -సంబన్ధములేకుండునట్లు నశింపఁ జేయును.

తా.— సర్వేశ్వరుఁడు ఆళ్వార్లనుకటాక్షించి మీయపేక్షితములనన్నిటిని కృప చేసిముగించుచున్నాను, నేను నారాయణ శబ్దవాచ్యుడనుగదా అని తనసర్వవిధ బన్ధుత్వ మునుజూపగ, ఆసర్వేశ్వరుని శీలగుణమందు అత్యన్తభక్తిగలిగియుండు ఆళ్వార్లకృపయై నది, మనమనోమాలిన్యమును నిశ్శేషముగ నివర్తింపఁజేయునని.

౮౪. మైయార్ కణ్ మామార్బిల్ మన్ను న్దిరుమాలై,
కైయార్ శక్కరనైకాణవెణ్ణి, మెయ్యాన
కాదలుడన్ కూప్పిట్టుక్కణ్డుగన్ద మాఱన్ పేర్,
ఓదవుయ్యుమే యిన్నుయిర్.

టీక.— మై - కాటుక, ఆర్ - అలఙ్కారముగ ధరించియుండు, కణ్ - నేత్ర ములుగల, మా - శ్రీమహాలక్ష్మి, మార్బిల్ - వక్షస్థలమందు, మన్నుమ్ - నిత్యవాసము చేయు నట్టి, తిరుమాలై - శ్రియఃపతియగుసర్వేశ్వరుని, కైయార్ శక్కరనై - శ్రీహస్తమునందలిశంఖ చక్రములతో, కాణవెణ్ణి - సేవించియనుభవింపఁదలచి, మెయ్ఆన - వాస్తవమైన, కాద లుడన్ - ప్రేమతో, కూప్పిట్టు - మొఱయిడి, కణ్డుగన్ద - అవిధముగ సేవించి సం తోషించిన, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, పేర్ - తిరునామమును, ఓద - అనుసన్ధింపగ, ఇన్ ఉయిర్ - విలక్షణమైనఆత్మవస్తువు, ఉయ్యుమ్ - ఉజ్జీవించును.

తా.—శ్రీ మహాలక్ష్మి నిత్యవాసము చేయునట్టి వక్షస్థలముగల సర్వేశ్వరుని, శంఖ చక్రములతో సేవించి యనుభవింపఁదలచి, వాస్తవమగుభక్తితో మొఱయిడి సేవించి సంతో షించిన ఆళ్వార్లయొక్క తిరునామమును, అనుసన్ధించినయెడ విలక్షణాత్మ ఉజ్జీవించును.

౮౫. ఇన్నుయిర్ మాల్ తోన్ఱినదిన్ఱెన్నెఞ్జిలెన్ఱు, కణ్ణాల్
అన్నవనైక్కాణవెణ్ణియాణ్ పెణ్ణాయ్, ప్పిన్నైయవన్,
తన్నైనినైవిప్పవర్ గళ్ తాళ్ తళర్న్ద మాఱనరుళ్
ఉన్నువవర్క్కుళ్ళముయ్గుమ్.

టీక.— ఇన్నుయిర్ మాల్ - నాకుధారకుడగు సర్వేశ్వరుడు, ఇణ్ణంతోన్ఱినదు - ఇక్కాలమందు ప్రత్యక్షమైనది, ఎన్నెఞ్జిల్ ఎన్ఱు - నామనస్సునందుఅని, అన్ఱు - ఆసమయమందు, అవనై - ఆసర్వేశ్వరుని, కణ్ణాల్ - కంటిచే, కాణవెణ్ణి - సేవించిఅనుభవింపదలచి, పెణ్ పేఱ్ ఆయ్ - స్త్రీరూపమునుబొంది, పిన్నై - పైగ, అవన్ తన్నై - ఆసర్వేశ్వరుని, నినైవిప్పవఱ్ఱాల్ - స్మరింపజేసెడు మేఘసమూహము మొదలైనవానిచే, తాన్ నొన్ద - తానుమిక్కిలి పరవశమునుబొందిన, మాఱన్ అరుళ్ - ఆళ్వార్లయొక్కకృపను, ఉన్నుమ్ అవర్క్కు - స్మరించువారికి, ఉళ్ళమ్ - హృదయమైనది, ఉరుగుమ్ - కరుగుచుండును.

తా.— నాప్రాణభూతుడగు సర్వేశ్వరుడు నాకుప్రత్యక్షమాయెనని ఈకర్మేంద్రియములతో వానిని సేవించి అనుభవింపదలచి, స్త్రీరూపియై పైగఆసర్వేశ్వరునిస్మరణను కలుగజేయునట్టి మేఘములు మొదలగు వానిచే మిగుల పరవశమును బొందిన ఆళ్వార్ల యొక్కకృపను స్మరించువారికి మనస్సు కరుగుచుండునని.

౭౬.. ఉరుగుమాలెన్నెఞ్జమ్ ఉన్ఱన్ శెయల్గళెణ్ణి,
పెరుగుమాల్ వేట్కైయుమ్ ఎనక్కెన్ శెయ్వన్, మరువుగిన్ఱ
విన్నాప్పుడనవన్ శీర్ ఏయ్న్దుయర్న్దమాఱన్ శొల్,
ఎన్నాళ్ శొల్లాదిరుప్పదెజ్గు.

టీక.— ఉన్ - నీయొక్క, శెయల్గళ్ - తక్కువైనకృత్యములను, ఎణ్ణి-అనుసంధించి, ఎన్నెఞ్జమ్ - నామనస్సైనది, ఉరుగుమ్ - కరుగుచుండును, వేట్కైయుమ్ - దానికి కలుగు శ్రద్ధయయినది, పెరుగుమ్ - అతిశయించుచున్నది, ఎన శెయ్వేన్ - అనియానతిచ్చి, మరువుగిన్ఱ విన్నాప్పుడన్ - సమీపించుచున్న ఉపేక్షతో, అవన్ శీర్ - వానియొక్కప్రణయిత్వగుణములను, ఏయ్న్దుయర్న్ద - హృదయమునందు పొందియుండగ ఆనతిచ్చిన, మాఱన్ శొల్ - ఆళ్వార్లయొక్క శ్రీసూక్తులను, ఎజ్గు - ఏవిధముగ, ఎన్నా - నానాలుకయైనది, శొల్లాదు - అనుసన్ధింపక, ఇరుప్పదు - ఉండునది, (అనుసన్ధింపక ఉండజాలదని).

తా.— నీయొక్క అతిమానుష కృత్యములనుదలచి నాహృదయము కరుగుచుండును, మఱియును అభినివేశము అతిశయించును, అనిసాధించి క్రిందుస్మారకపదార్థముల శ్రమనొందుటవలనగలిగిన విసుగుతో వానియొక్క ప్రణయిత్వమును హృదయమందు పొందగ ఆనతిచ్చిన ఆళ్వార్లయొక్క శ్రీసూక్తులను నానాలుకయైనది అనుసన్ధింపక ఉండజాలదని.

౭౭. ఎజ్గాదలుక్కడిమాల్ ఏయ్న్దవడివమ్ గెణ్ణ,
అజ్గాదుపన్ఱ్రాళాల్ వాజ్గవన్పాల్, ఎజ్గుముళ్ళ,

పుళ్ళినత్తైత్తూదాగప్పోగవిడుమ్మాఅన్నాళ్,
ఉళ్ళినర్క్కుత్తీఙ్గైయఱుక్కుమ్.

టీక.— ఎమ్కాదలుక్కు - మాయొక్క ప్రేమాతిశయమునకు, అడి - కారణము, మాల్ - సర్వేశ్వరునియొక్క, ఏయ్న్ద - స్వరూపానుబన్ధియైతగిన, వడివళ్ళగుఎన్ఱు - విగ్రహసౌన్దర్యమని, అఙ్గు - ఆదళయందు, అదుపత్తాశు ఆ - అవిగ్రహసౌన్దర్యమేఆశ్రయముకాగ, అఙ్గు - అచ్చట, అవన్ బాల్ - ఆసర్వేశ్వరుని విషయముగ, ఎఙ్గుమ్ - ఎచ్చోటను, ఉళ్ళ - ఉండెడు, పుళ్ యినత్తై పక్షిసమూహమును, తూదుఆగ - దూత్యముగ, పోగవిడుమ్ - పోవునట్లుపంపిన, మాఱన్ తాళ్ - ఆళ్వార్లయొక్క శ్రీపాదములు, ఉళ్ళినర్క్కు - తమ్మననుసరించినవారికి, తీఙ్గై - ప్రతిబన్ధకములను, అఱుక్కుమ్ - పోగొట్టును.

తా.— మాభక్త్యతిశయమునకు కారణము సర్వేశ్వరునియొక్క స్వరూపానుబన్ధియును అనురూపమునైన విగ్రహసౌన్దర్యమని వానియొద్దకు పక్షిసమూహమును దూతలనుగ బంపిన ఆళ్వార్లయొక్క పాదారవిన్దములు, తమయాశ్రితులదోషములను ఛేదించునని.

౮౮. అఱుక్కుమిడర్ ఎన్ఱవన్పాల్ అఙ్గువిట్టతూదర్,
మఱిత్తువరప్పెత్తామనత్తాల్, అఱప్పదఱి,
చ్చెయ్యతిరునావాయిల్ శెల్లనినైన్దాన్మాఱన్,
మైయలినాల్ శెయ్వదఱియామల్.

టీక.— ఇడర్ - మనయొక్క దుఃఖమును, అఱుక్కుమ్ఎన్ఱు - పోగొట్టును అని, అవన్ బాల్ - వానియొద్దకు, అఙ్గువిట్ట - ఆవిధముగబంపిన, తూదర్ - దూతలు, మఱిత్తువరప్పెత్తా - మరలివచ్చి ప్రత్యుత్తరము చెప్పునట్లులభింపని, మనత్తాల్ - హృదయముచే, అఱప్పదఱి - మిగులత్వరబడి, మైయలినాల్ - బుద్ధిభ్రమచే, శెయ్వుఅఱియామల్ - చేయవలసినది ఇట్టిదని తెలియక, మాఱన్ - నమ్మాళ్వార్లు, శెయ్య - విలక్షణమైన, తిరునావాయిల్ - తిరునావాయ్ అనుదివ్యదేశమునకు, శెల్ల - వేంచేయునట్లు, నినైన్దాన్ - తలచిరి.

తా.—ఆశ్రియఃపతిమన దుఃఖమునుబోగొట్టునని, వానియొద్దకు పక్షులనుదూతలనుగ బంపగ అవి మరలివచ్చి ప్రత్యుత్తరముచెప్పలేదను భ్రమచేత్వరబడి, కర్తవ్యమెఱుగక ఆళ్వార్లు విలక్షణమగు తిరునావాయ్ అను దివ్యక్షేత్రమునకు వేంచేయఁదలచిరని.

౮౯. మల్లడిమైశెయ్యనాళ్మాల్, దన్నై క్కేట్కు, అవన్
శోల్లుమళవుమ్ప్పత్తాత్తన్నలత్తాల్, శెల్గిన్ఱ,

వాళ్‌ఱ్ఱా మైపేశియలమర్‌న్దమాఱనరుళ్,
మాళ్‌ఱ్ఱాగప్పోగుమెన్ఱన్ మాల్.

టీక.— మల్ అడిమై - పూర్ణమైన కైఙ్కర్యము, శెయ్యుమ్ నాళ్ - చేయునట్టి కాలము, (ఎప్పుడని) మాల్ దన్నై - సర్వేశ్వరుని, కేట్క - అడుగగా, అవన్ - ఆసర్వేశ్వరుడు, శొల్లుమ్ - నిశ్చయించియానతిచ్చునట్టి, అళవుమ్ పోఱ్ఱా - అంతమాత్ర మును సమ్మతింపని, తొల్ నలత్తాల్ - స్వాభావికమైన భక్తిచే, శెల్ గిన్ఱ - తమకునడుచు చున్న, ఆఱ్ఱామై - ధరింపఁజాలిమిని, పేశి - ఆనతిచ్చి, అలమర్‌న్ద - వ్యాకులపడిన, మాఱన్ అరుళ్ - ఆళ్వార్లకృపయైనది, మాళ్‌ఱ్ఱాగ - అజ్ఞానమునకు ఎదురుముఖముగ, ఎన్ఱన్ మాల్ - నాయొక్క అజ్ఞానము, పోగుమ్ - నశించిపోవును.

తా.—ఆళ్వార్లు సమృద్ధముగ కైఙ్కర్యమొనర్చునట్టికాల మెప్పుడని, సర్వేశ్వరుని అడుగగ వాడునిశ్చయించి ఆనతిచ్చునంతకులోఁగ తమయొక్క స్వాభావికమైన భక్తిచే తాము ధరింపఁజాలకుండుటను ఆనతిచ్చి భ్రమనొందిన ఆళ్వార్లకృపయైనది నాయజ్ఞానమును నివర్తింపఁజేయునని.

౯౦. మాలుమదువాఙ్గైమ్మునుమ్ ముమ్మన్ను ముడమ్బిన్ ముడివిల్,
శాలనణ్ణిచ్చెయ్ వనెన్ఱాన్ ఉగన్దు, మేలవనై,
చ్చీరార్ కణపురత్తే శేరుమెనుమ్ శీర్ మాఱన్,
తారానోనన్దమక్కుత్తాళ్.

టీక.— మాల్ - ఆశ్రితవ్యామోహముగల సర్వేశ్వరుఁడు, ఉమదు వాంఛైమ కెల్లామ్ - మీయొక్క అపేక్షితములనన్నిటిని, మన్నుమ్ ఉడమ్బిన్ - ఆత్మతోపొంది యుండు శరీరముయొక్క, ముడివిల్ - అవసానమందు, శాల - (తిరుకణ్ణపురమందు) మిక్కిలి, నణ్ణి - సమీపించి, శెయ్‌వన్ ఎన - చేసిముగింతునుఅని యానతీయఁగ, తాన్ - తాను, ఉగన్దు - సన్తోషించి, మేల్ అవనై - కాలావధిని ఆనతిచ్చినదిగాక పైగతిరు కణ్ణపురమునకువచ్చి మిగుల సమీపించియున్న వానిని, శీర్ ఆర్ - ఐశ్వర్యాదులును శీలాదులును ప్రవహించునట్టి, కణపురత్తే - తిరుకణ్ణపురమందు, శేరుమ్ ఎనుమ్ - (అందరును) ఆశ్రయింపుడుఅని యానతిచ్చెడు, శీర్ మాఱన్ - జ్ఞానప్రేమాది గుణములనుగల ఆళ్వార్లు, నన్దమక్కు - మనకు, తాళ్ - తమతిరువడిగళ్ను, తారానో - (కృపచే) ఉపాయోపేయములుగ ఉపకరింపఁజాలరో.

తా.— సర్వేశ్వరుఁడు మీయపేక్షితములనన్నిటిని మీశరీరావసానమందు తిరుకణ్ణపురమున సమీపించినెఱవేర్తును అనియానతీయగ, ఆళ్వార్లుసన్తోషించి పైగఆసర్వే

శ్వరుని ఐశ్వర్యాది శీలాదిగుణములు ప్రవహించుచుండు తిరుకణ్ణపురమందు, సకలచేతనుల నాశ్రయింపుడని సాధించునట్టి జ్ఞానభక్త్యాది గుణములనుగల ఆళ్వార్లు, మనకు తమశ్రీపాదములను రక్షకముగ నుపకరింతురని.

౭౧ తాళడైన్దోర్ తజ్గళుక్కు త్తానేవళిత్తుణై యామ్,
కాళమేగత్తైక్కదియాక్కి, మీళుదలామ్
ఏదమిల్లావిణ్ణులగిలేగవెణ్ణుమ్మాఱనెన,
క్కేదముళ్ళదెల్లామ్ కెడుమ్,

టీక.— తాళ్ - తమశ్రీపాదములను, అడైన్దోర్ తంగళుక్కు - ఉపాయముగ ఆశ్రయించినవారికి, తానే - తానే, వళిత్తుణైఆమ్ - మార్గబన్ధువగునట్టి, కాళమేగత్తై - నీలమేఘమువంటిసర్వేశ్వరుని, కదిఆక్కి - మార్గమునకురక్షకముగనొనర్చి, మీళుదల్ ఆమ్ - తిరుగుకొనునదియగు, ఏదమ్ఇల్లా - దోషములేకయుండెడు, విణ్ ఉలగిల్ - పరమపదమందు, ఏగఎణ్ణుమ్ - వేంచేయుటకుమననముచేయునట్టి, మాఱన్ ఎన - ఆళ్వార్లు అని అనుసన్ధింపగానే, కేతమ్ ఉళ్లదుఎల్లామ్ - దుఃఖమని పేరుపొందినదంతయును, కెడుమ్ - నివృత్తమగును.

తా.— తమశ్రీపాదములనాశ్రయించినవారికి తానే మార్గసహాయమగునట్టి నీలమేఘమువంటి సర్వేశ్వరుని మార్గరక్షకముగనొనర్చి పునరావృత్తిరూపదోషరహితమగు పరమపదమునకు వెళ్లుటకు మననముచేయుచుండు ఆళ్వార్ల తిరునామమును అనుసన్ధించిన మాత్రమున సకలదుఃఖములు నివృత్తియగునని.

౭౨ కెడుమిడర్వైగున్దత్తైక్కట్టినాఱ్పోల్,
తడముడైయనన్దపురన్దన్నిల్, పడవరవిల్
కణ్డుయిల్మాల్క్కాట్చెయ్యక్కాదలిత్తాన్మాఱన్,
ఉయర్విణ్ణన్నిల్ ఉళ్ళోర్ వియప్పవే.

టీక.—మాఱన్ - నమ్మాళ్వార్లు, ఉయర్ విణ్ తన్నిల్ - పరమాకాశమందు (పరమపదమందు) ఉళ్ళోర్ - ఉండునట్టి అనన్తగరుడవిష్వక్సేనాదులు, వియప్ప - ఆశ్చర్యపడునట్లు, కెడుమిడర్ - దుఃఖమునునశింపఁజేయునట్టి, వైగున్దత్తై - శ్రీవైకుణ్ఠమును, కిట్టినాల్ పోల - పొందికైఙ్కర్యములభించినట్లు, తడమ్ఉడై - విస్తీర్ణముగలిగియుండు, అనన్దపురమ్తన్నిల్ - తిరువనన్తపురమందు, పడమ్అరవిల్ - ఫణములుగల సర్పశయనమందు, కణ్ తుయిల్ మాల్ కు - యోగనిద్రచేసెడు సర్వేశ్వరునికి, ఆళ్ శెయ్య - కైఙ్కర్యము చేయుటకు, కాదలిత్తాన్ - అపేక్షించిరి.

తా.— ఆళ్వార్లు పరమపదమందలి నిత్యసూరులు ఆశ్చర్యపడునట్లు శ్రీవైకుణ్ఠమున కైఙ్కర్యములభించినవిధముగ తిరువనన్దపురమందు యోగనిద్రచేయునట్టి అనంతపద్మనాభస్వామికి కైఙ్కర్యముచేయ నపేక్షించిరని.

౯౩. వేయ్ మరుదోళ్ళిన్దిరై కోన్, మేవుగిన్ఱ దేశత్తై,
త్తాన్ మరువా, త్తన్నైయినాల్, తన్నైక్ష్ యిన్నమ్
పూమియిలే వైకుమెనచ్చఙ్గిత్తుమాల్, తెళివిక్క, త్తెళిన్ద,
తక్కపుగళ్, మాఱనెజ్గళ్ శార్వు.

టీక.— వేయ్ మరుతోళ్ - వెదుళ్లవంటిభుజములుగల, ఇన్దిరైకోన్ - శ్రీమహాలక్ష్మికి వల్లభుడగు సర్వేశ్వరుఁడు, మేవుగిన్ఱ దేశత్తై - ఆచేరికతో వేంచేసియుండుదేశమును, తాన్ మరువాత్తన్నైయి నాల్ - (అభినివేశముగల) తాముపోయిప్రవేశించునట్లులభింపమి చేత తన్నై - తమ్మును, ఇన్నమ్ - ఇకను, పూమియిలే - సంసారమందు, వైకుమ్ఎన - ఉంకురోఅని, శఙ్గిత్తు - సన్దేహించి, మాల్ - సర్వేశ్వరుఁడు, తెళివిక్క - (బుద్ధిని) తేటనుబొందింపగ, తెళిన్ద - తేటనొందిన, తక్కపుగళ్ - తగినకీర్తిగల, మాఱన్ - ఆళ్వార్లు, ఎజ్గళ్ శార్వు - మాకు ఆధారమైనవారు.

తా.—ఆళ్వార్లు తాము ఆజానుబాహువగు శ్రియఃపతి దివ్యమహిషీసహితుఁడై వేంచేసియుండు పరమపదమును ప్రాపింపలభింపనందున తమ్మునింకను ఈభూమియందుంతురోయని సంశయించి సర్వేశ్వరునిచే సంశయనివృత్తినిబొందిన యశస్సమ్పన్నులగు ఆళ్వార్లు మాకాధారభూతులని.

౯౪. శార్వాగ న్నేయడియిల్, తానురైత్త పత్తిదాన్,
శీరార్ పలత్తుడనే, శేర్న్దదనై, చ్చోరామల్,
కణ్డురైత్త మాఱన్, కళ్ళిణైయే నాడోఱుమ్,
కణ్డుగక్కుమ్ ఎన్నుడైయకణ్.

టీక.—శార్వుఆగ - అందఱికిని ఆశ్రయముగ, ఉరైత్త - అనతిచ్చిన, పత్తిదాన్ - భక్తియే, శీర్ ఆర్ - శ్లాఘ్యత అతిశయించియుండు, పలత్తుడనే - ప్రపత్తియగుఫలముతో, శేర్న్దదనై - చేరినప్రకారమును, కణ్డు - చూచి, శోరామల్ - తప్పకుండునట్లు, ఉరైత్త - అనతిచ్చిన, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, కళ్ళల్ ఇణైయే - చేరకచేమనోజ్ఞమైన శ్రీపాదములజంటనే, నాళ్ దోఱుమ్ - ప్రతిదినమును, ఎన్నుడైయకణ్ - నాయొక్క నేత్రములు, కణ్డు - సేవించి, ఉగక్కుమ్ - సన్తోషించును.

తా.— సకలచేతనులకును ఆశ్రయముగ సాధించినభక్తియే, అత్యన్తశ్లాఘ్యమగు ప్రపత్తిరూపమగు ఫలముతోఁ చేరియుండు విధమునుజూచి జారిపోకుండునట్లు అనతిచ్చిన ఆళ్వార్లశ్రీపాదద్వయమునే నా నేత్రములు ఎల్లప్పుడును సేవించి సన్తోషించునని.

౧౫. కణ్ణనడియిణైయిల్ కాదలుఱువార్ శెయలై,
తిణ్ణముఱ వేశురుఙ్గచ్చెప్పియే, మణ్ణవర్కు
త్తానుపదేశిక్కై తలైక్కట్టినార్ మాఱన్,
ఆనపుగర్ శేర్ తన్నరుళ్.

టీక.—కణ్ణన్ అడియిణైయిల్ - శ్రీకృష్ణుని శ్రీపాదములందు, కాదలుఱువార్ - భక్తి గలవారియొక్క, శెయలై - వ్యాపారములను, తిణ్ణమ్ ఉఱ - దృఢముగ అందుకొనునట్లు, శురుఙ్గ - సంగ్రహముగ, శెప్పి - అనతిచ్చి, మణ్ణవర్కు - భూమియందుండు సకలాత్మలకును, మాఱన్ - ఆళ్వార్లు, ఆన - శ్లాఘ్యమైన, పుగழ్ శేర్ - కీర్తితోఁ జేరిన, తన్ అరుళ్ - తమయొక్కకృపచేత, తాన్ ఉపదేశిక్కై - తాము ఉపదేశించుకార్యమును, తలైక్కట్టినార్ - కృపచే పూర్తిచేసిరి.

తా.— శ్రీకృష్ణునిపాదారవిన్దములందు భక్తులు చేయు కైఙ్కర్యవృత్తి దృఢమునుబొందునట్లు అనతిచ్చి, సకలాత్మలకును ఆళ్వార్లు అత్యన్తప్రశస్తమగు కీర్తితోఁగూడిన తమ కృపచే తాముపదేశించునట్టి కృత్యమును కరుణచే సంపూర్ణముగావించిరని.

౧౬. అరుళాలడియిలెడుత్తమాలన్బాల్,
ఇరుళార్ న్దతమ్ముడమ్బైయిచ్చిత్తు, ఇరువిశుమ్బిల్
ఇత్తుడన్ కొణ్డేగవిశైవు పార్త్తిరున్ద,
శుత్తికొల్లుమ్ మాఱన్ శెఞ్జొల్.

టీక.— అరుళాల్ - కేవలనిర్హేతుకకృపచే, అడియిల్ ఎడుత్త - క్రిందు(అజ్ఞానమయమగు సంసారమందుండి) యెత్తిన, మాల్ - సర్వేశ్వరుఁడు, అన్బాల్ - (పరమపదమందు కైఙ్కర్యముచేయవలయును అను) ప్రేమచే, ఇరుళ్ ఆర్న్ద - అజ్ఞానప్రచురమైన, తమ్ ఉడమ్బై - తమదేహమును, ఇచ్చిత్తు - అపేక్షించి, ఇరువిశుమ్బిల్ - మహత్తైనపరమపదమందు, ఇత్తుడన్ - ఈ దేహముతోఁ, కొణ్డుఏగ - వెంటబెట్టుకొనిపోవుటకు, ఇవర్ ఇశైవు - వీరియొక్క సమ్మతమును, పార్త్తిరున్ద - ఎదురుచూచుచుండిన, శుత్తి - ఆసర్వేశ్వరునియొక్క శుద్ధిని, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, శెఞ్జొల్ - శ్రేష్ఠమైనద, కొల్లుమ్ - తెలియపఱచును.

తా.— సర్వేశ్వరుఁడు నిర్హేతుకకృపచే ఈచేతనులను సంసారమందుండి ముందు యెత్తినట్టి ప్రేమచే, అజ్ఞానభూయిష్ఠమగు తమశరీరమును ఇచ్చగించి పరమపదమునకు వెంటబెట్టుకొనిపోవుటకు వీరియిష్టము నెదురుచూచుచుండిన ఆశ్రయాఃపతియొక్క పరిశుద్ధతను ఆళ్వార్లదివ్యసూక్తియైనది తెలియపఱచునని.

౯౭. శెఞ్జొఱ్పరన్ తనదుశ్శీరారుమ్మేనిదనిల్,
వఞ్జిత్తుచ్చెయ్గిన్ఱవాశ్యై చ్చదనిల్, విఞ్జుదలై,
క్కణ్డవన్ పైక్కాఱ్కట్టిక్కైవిడువిత్తుక్కొణ్డ,
తిణ్డిఱల్ మాఱనన్దిరు.

టీక.— శెఞ్జొల్ పరన్ - మనోజ్ఞమైన తిరువాయ్ మొழிచే ప్రతిపాదింపఁబడునట్టి సర్వస్వామియగు సర్వేశ్వరుఁడు, తనదు - తనయొక్క, శీరారుమ్ - జ్ఞానభక్త్యాదులుమించియుండెడు, మేనితన్నిల్ - విగ్రహమందు, వఞ్జిత్తు శెయ్గిన్ఱ వాశ్యైచ్చదనిల్ విఞ్జుదలైక్కణ్డు - పైఁబడిఆత్యాదరమును జేయునట్టివిధమునుజూచి, అవనైకాల్ కట్టి- ఆసర్వేశ్వరుని పాదములనుకట్టి = (వానిశ్రీపాదములనాశ్రయించి) కైవిడువిత్తుక్కొణ్డ - చేతినివిడిపించుకొనిన, తిణ్ - దృఢమైన, తిఱల్ - శక్తినిగల, మాఱన్-నమ్మాళ్వార్లు, నమ్ తిరు - మనకుసమ్పదయైయున్నారు.

తా.— తిరువాయ్ మొழிచే ప్రతిపాదింపఁబడునట్టి సర్వేశ్వరుఁడు పరమవిలక్షణమగు ఆళ్వార్లయొక్క శరీరమందు ఆత్యాదరముచే, ఆశరీరముతోనే పరమపదమునకు వెంటబెట్టుకొని పోవలయునని వారిహస్తమునుబట్టుకొనగ, వారు పెరుమాళ్ల శ్రీపాదములను బట్టుకొని చేతినివిడిపించుకొనిరి, అట్టిదృఢశక్తిసమ్పన్నులగు నమ్మాళ్వార్లు మనకు సమ్పదయైనవారని.

శ్రీ ౯౮. తిరుమాల్ తన్బాల్ విరుప్పమ్ శెయ్గిన్ఱ నేర్ కణ్డు,
అరుమాయత్తన్ఱగల్విప్పానెణ్ణ, పెరుమాల్నీ,
ఇన్ఱెన్బాల్ శెయ్వానెన్నవిడరుళ్ ఇనిన్ఱాన్,
తున్నుపుగழ் మాఱనైత్తాన్ శూழ்న్దు.

టీక.— తిరుమాల్ - సర్వేశ్వరుఁడు, తన్బాల్ - తమవిషయమందు, విరుప్పమ్- ఆత్యాదరమును, శెయ్గిన్ఱ నేర్ కణ్డు - చేయునట్టివిధమునుజూచి, అన్ఱు - అప్పుడు, (అనాదికాలముగ), అరుమాయత్తు - అతిక్రమింపశక్యముగాని ప్రకృతియందుంచి, అగల్ విప్పాన్ ఎన్ - ఎడబాపచేసినదెందుకు, నీ - దేవరవారు, ఇన్ఱు - ఇప్పుడు, ఎన్బాల్ - నావిషయ

మందు, పెరుమాల్ - అధికవ్యామోహమును, శెయ్ వాన్ ఎణ్ణి - చేయుటయెందుకు, ఎన్న - అనియడుగగ, తున్ను పుగళ్ - అతిశయించినకీర్తిగల, మాఱనై - ఆళ్వార్లను, తాన్ - తాను, శూళ్న్దు - చుట్టుకొని, ఇశర్ ఉట్ట్ఱు - దుశిథ్యతిశయించి, నిన్ఱాన్ - నిలిచెను.

తా.—సర్వేశ్వరుడు తమయందు అత్యాదరమును జేయుటను ఆళ్వార్లుజూచి, అనాదికాలముగ నీవు ఈ ప్రకృతియందుంచినదెందుకు, ఇప్పుడునాయందు అధికవ్యామోహమును జూపుటయెందుకని యడుగగ, సర్వేశ్వరుఁడు సర్వజ్ఞుడయ్యును యశస్సమ్పన్నులగు ఆళ్వార్లను పరివేష్టించి నిరుత్తరుడై నిలిచెనని. (పెరియజీయర్ ఆశ్చర్యపడుచున్నారు)

శ్రీ ౯౯. శూళ్న్దునిన్ఱ మాల్ విశుమ్బిల్ తొల్లైవళికాట్ట,
ఆళ్న్దదన్నైముట్ట్ఱు మనుబవిత్తు, వాళ్న్ద
అడియరుడనేయిరున్దవాఱ్ఱై యుఱైశెయ్ దాన్,
ముడిమగిళ్ శేర్ ఞానముని.

టీక.— ముడిమగిళ్ శేర్ - తమశిరస్సునందు పొగడపూవులదండ చేరియుండు, ఞానముని - జ్ఞాననిధియగు ఆళ్వార్లఅనెడుమహర్షి, శూళ్న్దునిన్ఱమాల్ - తమ్ముచుట్టుకొనియున్న సర్వేశ్వరుఁడు, విశుమ్బిల్ - పరమాకాశమందు (పరమపదమందు) తొల్లైవళి కాట్ట - పూర్వమార్గమైన అర్చిరాదిమార్గముజూపగ, ఆళ్న్దు - అచ్చటియానన్దసముద్రమందు మునిగి, అదన్నైముట్ట్ఱుమ్ - ఆయానన్దమును సర్వమును, అనుబవిత్తు - అనుభవించి, వాళ్న్దు - క్రమముగ అనుభవించి కృతార్థులై, అణ్ణు అడియరుడనేయిరున్దఅవ్ఱై - అపరమపదమందు అనన్తగరుడ విష్వక్సేనాదులగు భక్తులతో ఆనన్దనిర్భరులైయున్న ప్రకారమును, ఉఱైశెయ్ దాన్ - అనతిచ్చిరి.

తా.— శిరమున వకుళపుష్పమాలికచే నలంకృతులును జ్ఞాననిధియునగు ఆళ్వార్లు అనెడుమహర్షి, సర్వేశ్వరుఁడు పరమాకాశమందు అర్చిరాదిమార్గమును జూపగ ఆసర్వమునసుభవించి కృతార్థులై అచ్చటిఅనన్తగరుడవిష్వక్సేనాదినిత్యసూరులగు భక్తవర్గముతో ఆనన్దపరవశులై యున్నస్థితిని అనతిచ్చిరని.

శ్రీ ౧౦౦. మునిమాఱన్ మున్బుఱైశెయ్ ముట్ట్ఱిన్బమ్ నీఙ్గి,
త్తనియాగ్గినిన్ఱుతళర్న్దు, ననియామ్,
పరమపత్తియాల్ నైన్దుపజ్గయత్తాళ్ కోనై,
ఒరుమైయుడ నిచ్చేర్న్దాన్ ఉయర్న్దు.

టీక.— మునిమాఱన్ - మననశీలులైయుండునట్టి ఆళ్వార్లు, మున్బు - పూర్వము, ఉఱైశెయ్ - పురుషార్థమునులభించినట్లుఅనతిచ్చిన, ముట్ట్ఱిన్బమ్ - సర్వ ఆనన్దమును

నీఙ్గి - విడిచి, తనిఅగి నిన్ఱు - ప్రత్యేకించి యుండి, తళర్న్దు - నిరుత్సాహమునుబొంది, ననిఆమ్-అధికమగు, పత్తియాల్-పరమభక్తిచే, నైన్దు- పరిపక్వమునుబొంది,పఙ్గయత్తాళ్ కోనై - శ్రియఃపతిని, ఒరుమై ఉళ్ళు - దివ్యహృదయముచే ఏకీభవించి, ఉయర్న్దు - నిత్యసూరులయొక్క ఉచ్ఛ్రాయముగలవారై ప్రత్యక్షసాక్షాత్కార మగునట్లు సమీపించి, శేర్న్దార్ - (శ్రీశ్రియఃపతులసన్నిధియందు)కైంకర్యముచేయలభించిరి.

తా.—ఆళ్వార్లు పూర్వమందానతిచ్చిన సంపూర్ణానన్దమునునిడిచి విసుకును జెంది అత్యన్తపరమభక్తిచే పరిపక్వమునొందగ వీరివిషయమున త్వరబడెడు సర్వేశ్వరుని దివ్య హృదయములో వీరి దివ్యహృదయమును త్వగబడి ఏకమై నిత్యసూరులయొక్క ఉన్నత దశను ఇచ్ఛటనొందినవారై శ్రియఃపతిని ప్రత్యక్షసాక్షాత్కారమగునట్లు సమీపించి శ్రీమహాలక్ష్మితో గూడియుండు సర్వేశ్వరుని సన్నిధానమందు కైంకర్యముచేయునట్లు లభించిరని.

తిరువాయ్ మొழிనూऱ్ఱన్దాదిసంపూర్ణము.

పెరియజీయర్ తిరువడిగళేశరణమ్.



శ్రీమద్వరవరమునయేనమః.



మణవాళమామునులు సాదించిన

# ఆర్త్తిప్రబన్ధము.

## తనియన్.

(నేరిశైవెణ్బా.)

తేన్పయిలుమ్తారా నెతిరాశన్ శేవడిమేల్,
తాన్పరమపత్తితలైత్తెయుమత్తు, మాన్దర్
కున్దువాగవార్త్తియుడనోణ్డమిழ்గళ్ శెయ్దాన్,
మణవాళమామునివన్దన్.

టీక.— తేన్ - మకరన్దమును (తేనెను), పయిలుమ్-స్రవించుచుండు, తారాన్ - పుష్పమాలికనుధరించిన, ఎతిరాశన్ - ఎమ్బెరుమానార్లయొక్క, శేవడిమేల్ - ఎఱ్ఱనిపాదారవిన్దములవిషయమై, తాన్ - తాము, పరమపత్తి-అతిశయమగుభక్తి, తలై యెదుత్తు - ఉన్మస్తకమై, మాన్దర్కు - జ్ఞానములేని సంసారులకు, ఉణవాగ - జ్ఞానముగలుగునట్లు ఆర్తియుడన్ - ప్రీతిపూర్వకమగు వ్యసనముతో, ఒణ్ - భోగ్యమగు, తమిళ్ గళ్ -ద్రావిడపదములనుగూర్చి, మణవాళమామునివన్ వన్దు - మణవాళమామునులు అవతరించి, శెయ్దార్ - ఆర్తియను ఈప్రబన్ధమును ఆనతిచ్చిరి.

తా.— మణవాళమామునులు ఎమ్బెరుమానారుల పాదారవిన్దములయందు భక్త్యతిశయముచే అజ్ఞులకుజ్ఞానముగలుగునట్లు ప్రేమగర్భమగు వ్యసనముతో ఆర్తిప్రబన్ధమును ఆనతిచ్చిరని.

వమ్బవిళ్ తార్ వళ్ళమణవాళమామునివన్,
అమ్బువియిల్ కాల్ పొరున్దా వార్తియినాల్, ఉమ్బర్ తొழுమ్,
విణ్ణులగిల్ శెల్లవిరైన్దెతిరాశన్ పదజ్గళ్,
నణ్ణియురైత్తార్ నమక్కు. *

టీక.— వమ్బవిళ్ - అప్పుడువికసించిన, తార్ - పుష్పమాలికచే అలంకరింపఁబడిన, వళ్ళ - ఔదార్యశీలులగు, మణవాళమామునివన్ - పెరియజీయరు, అమ్-సున్దరమైన, పువియిల్ - భూమియందు, కాల్ - శ్రీపాదములు, పొరున్దా-పొందని, ఆర్తియినాల్ - దుఃఖముచే, ఉమ్బర్ - నిత్యసూరులచే, తొழுమ్ - సేవింపఁబడుచున్న, విణ్ణులగిల్ - పరమపదమునకు, శెల్ల - వేంచేయునిమిత్తమై, విరైన్దు - త్వరబడి, ఎతిరాశన్ - ఎమ్బెరుమానార్లయొక్క, పదజ్గళ్ - శ్రీపాదములను, నణ్ణి - అధ్యవసించి, (సమీపించి) నమక్కు - మనకు, ఉరైత్తాన్ - ఆనతిచ్చినవారైరి.

తా.— పరమోదారులగు మణవాళమామునులకు ఈభూమియందలియునికి సహింపమిచే పరమపదమునకు వేంచేయనాతురులై, ఉడైయవరుల శ్రీపాదముల నాశ్రయించి మనకు ఆర్తిప్రబన్ధమును ఆనతిచ్చిరని.

## ఆ ర్తి ప్ర బ న్ధ ము.

శ్రీః ౧. వాழிయెతిరాశన్ వాழிయెతిరాశన్,
వాழிయెతిరాశనెనవాழ்త్తువార్, వాழிయెన
వాழ்త్తువార్ వాழிయెనవాழ்త్తువార్,
తాళిణైయిల్ తాழ்త్తువార్ విణ్ణోర్ తలై.

టీక.— ఎతిరాశన్ - ఎమ్బెరుమానార్లు, వాழி - సుఖముగ వర్ధిల్లవలయును, ఎతిరాశన్ వాழி ఎతిరాశన్ వాழி ఎన - అని మూడువిధములుగ అనుసన్ధించి, వాழ்త్తువార్ - మఙ్గళాశాసనముచేయువారలు ఎవరో? వాழிయెన వాழ்త్తువార్ - (వారికి) మఙ్గళాశాసనముచేయు వారలుఎవరో! వాழிయెన వాழ்త్తువార్ - (వారికి) మఙ్గళాశాసనము చేయువారలు యెవరో? (వారియొక్క) తాళిణైయిల్ - శ్రీపాదములజంటయందు, తాழ்త్తువార్ - ప్రణుతిచేయువారలుయెవరో! (వారలు) విణ్ణోర్ - నిత్యసూరులకు, తలై - నిర్వాహకులైనవారగుదురు. లేక, విణ్ణోర్ - నిత్యసూరులు, తలైతాழ்త్తువార్ - నమస్కరింతురు.

తా.— ఎమ్బెరుమానారులు క్షేమముతో సేవసాదింపవలయునని ముమ్మారు మఙ్గళాశాసనము చేయువారలకు, మఙ్గళాశాసనము చేయువారలెవరో, వారియొక్క క్షేమార్థము మఙ్గళాశాసనముచేయు వారలెవరో, అట్టివారియొక్క శ్రీపాదములందు దండముసమర్పించువారలెవరో? వారలు నిత్యసూరి నిర్వాహకులగుదురు, లేక నిత్యసూరులచే నమస్కరింపఁబడుదురని.

౨. ఇరామానుశాయనమవెన్ఱుశిన్దిత్తు,
ఇరామానుశరోడిత్తైప్పొழுదు, ఇరామానుశిన్దిప్పార్, తాళిణైయిల్ శేర్న్దిరుప్పార్,
తాళిణైయైవన్దిప్పార్ విణ్ణోర్గళ్ వాழ்వు.

టీక.— ఇరామానుశాయ - ఉడైయవరులకొఱకు, నమవెన్ఱు - నమస్సుఅని, శిన్దిత్తిరా - అనుసన్ధింపని, మానుశరోడు - మనుష్యులతో, ఇరైప్పొழுదు - క్షణకాలమును, ఇరామాటు - సహవాసముచేయనివిధమును, శిన్దిప్పార్ - చిన్తించువారియొక్క, తాళిణైయిల్ - రెండుశ్రీపాదములందును, శేర్న్దిరుప్పార్ - చేరియుండువారియొక్క, తాళిణైయై - శ్రీపాదములజంటను, వన్దిప్పార్ - నమస్కరించువారు, విణ్ణోర్గళ్ - నిత్యసూరులకు, వాழ்వు - నిత్యసంపదయగుదురు.

తా.— "శ్రీమతేరామానుజాయనమః" అనియనుసన్ధింపని జనులతో సాఙ్గత్యము కూడదు, అనునట్టివారి శ్రీపాదముల ఆశ్రయించిన వారియొక్క పాదద్వయమునకు, దండముసమర్పించువారు నిత్యసూరులకు శాశ్వతసంపద యగుదురని.

౩. తన్దైనల్ తాయ్ తారమ్ తనయర్ పెరుఞ్చెల్వమ్,
ఎన్ఱునక్కునీయే యెతిరాశా, ఇన్దనిలై,
కేట్టారాదవివ్వుడలై యిన్ఱేయకు త్తరుళ,
ప్పారాదయెన్నోప్పగర్.

టీక.—తన్దై - తండ్రియును, నల్ తాయ్ - వాత్సల్యముగలతల్లియును, తారమ్- భార్యయును, తనయర్ - పుత్రులును, పెరుఞ్జెల్వమ్ -మహదైశ్వర్యమును, ఎన్దమక్కు- అస్మదాదులకు, నీయే - దేవరవారే,(అయితిరి) యతిరాశా! యతీంద్రా! ఇన్ద-ఈవిధమైన, నిలైక్కు - నిష్ఠకు, ఏరాద - చేరని, ఇవ్వుడలై-ఈశరీరమును, ఇన్దే-ఇప్పుడే, అఱుత్తు- ఛేదించి, అరుళ - కృపచేయుటకు, పారాదదు - కటాక్షింపకుండునది, ఎన్నో - ఏమి కారణమో? పగర్ - అనతీయవలయును.

తా.— యతిరాజా! తల్లిదండ్రులు భార్యాపుత్రాది సకలైశ్వర్యములును దాసులకు దేవరవారేఅయితిరి,ఇట్టినిష్ఠకనుకూలింపని ఈదేహమును నివర్తించునట్లు కటాక్షింపమికి కారణమేమో అనతీయవలయునని.

౪. ఇన్దవుడల్ శిఱైవిట్టెప్పొழుదుయానేగి,
అన్దమిల్ పేరిన్బత్తుళాగువేన్, అన్దో
విరఙ్గాయెతిరాశా!ఎన్నై ఇనియుయ్క్కై,
పరఙ్గాణునక్కుణర్న్దుపార్.

టీక.— ఇన్దఉడల్ -ఈశరీరమను, శిఱై-కారాగృహమును, విట్టు-విడిచి, ఎప్పొழుదు - ఎప్పుడు, యాన్ - దాసుడను, ఏగి - అర్చిరాది మార్గమందుపోయి, అన్దమ్ - ముగింపు, ఇల్ - లేని, పేరిన్బత్తుళ్ - మహదానన్దమునకు విషయభూతుడను, ఆగువేన్ - అవుదును, అన్దో - అయ్యో! ఇరఙ్గాయ్ - కృపచేయుడు, ఎతిరాశా - యతికులసార్వభౌమా! ఎన్నై - దాసుని, ఇని - ఇకమీదు, ఉయ్క్కై - రక్షించుట, ఉనక్కు - దేవరవారికి, పరఙ్గాణ్ - భారముగదా, ఉణర్న్దు - ఆలోచించి, పార్ - కరుణించిచూడుడు.

తా.— దాసుడెప్పుడు ఈ దేహమును వదిలి పరమపదమందు మహదానన్దమును అనుభవింతును. అయ్యో! కనికరింపుడు యతిరాశా! ఇకదాసుని రక్షింపలసిన భారము దేవరవారిదేగదా ఆలోచింపుడని.

౫. తన్పుదల్వన్కూడామల్ తాన్పుశిక్కుమ్బోగత్తాల్,
ఇన్బమిగుమోతన్దైయెతిరాశా, ఉన్పుదల్వ
నన్దోయానురైయాయాదలాల్,
ఉన్బోగమ్నన్దో!ఎన్నైయొழిన్దనాళ్.

టీక.— తన్ - తనయొక్క, పుదల్వన్ - పుత్రుడు, కూడామల్ - సమీపించియుండనపుడు, తాన్ - తాను, పుశిక్కుమ్ - అనుభవించునట్టి, బోగత్తాల్-ఐశ్వర్యాది

భోగముచే, త న్దైక్కు - తండ్రికి, ఇన్బమ్ - ఆనన్దము, ఉఱుమో - తగియుండునో, అద లాల్ - అందుచే, ఎతిరాశా - ఎంబెరుమానారే, ఉన్ - తండ్రియగు దేవరవారియొక్క, పుదల్వన్ - పుత్రుఁడు, యాన్ - దాసుడను, అన్రో - కాదా? ఉఱైయాయ్ - సాదింపుడు, ఆదలాల్ - కాఁబట్టి, ఉన్ పోగమ్ - దేవరవారియొక్క భోగము, ఎన్నైయొళిన్ద నాళ్ - దాసునివదిలి యున్న దినము, నన్రో - సుదినమగునో? (సరసమైయుండునో).

తా.— తండ్రికి పుత్రుడు దగ్గఱలేనప్పుడు సుఖానుభవము అసమ్మతముగా నుండు నుగదా, ఎమ్బెరుమానారే! దేవరవారికిదాసుడు పుత్రుఁడనుగదా, కనుక దాసుడు దగ్గఱ లేనపుడు, దేవరవారికి సుఖానుభవము రసించునో, రసింపదు కనుక దాసుని అజ్ఞాపించి కరుణచే రప్పించుకొనవలయునని.

౬. వేమ్బుముఱ్ఱక్కైప్పునిగునదుపోల్, వెవ్వినైయేన్,
తీమ్బుముఱ్ఱుమ్ తేగముఱ్ఱిచ్చెల్లుఙ్గాల్, అమ్పరిశాల్
ఏఙ్కు వేశిన్దిత్తెతిరాశా, ఇవ్వుడలై
త్తీర్కు వేయానవళ్ళి శెయ్.

టీక.— వేమ్బు - వేపచెట్టైనది, ముఱ్ఱ - ముదరగముదరగ, కైప్పునిగునదు పోల్ - (ప్రతిదినమును) చేదుఅతిశయించివచ్చునట్లు, వెవ్వినైయేన్ - క్రూరకర్మము గలదాసునియొక్క, తీమ్బు - దుష్కృత్యములచే, ముఱ్ఱుమ్ - అధికముగ, దేగమ్ము ఱ్ఱి - శరీరముముదిరి, శెల్లుఙ్గాల్ - వృద్ధిబొందుచురాగ, అమ్ - అగుననిగుర్తెఱిగి, పరిశాల్ - కృపాగుణముచే, ఏఙ్కు వేశిన్దిత్తు - స్వరూపసత్తిగలుగు విధముగముందు అపేక్షించి చిన్తించి, ఎతిరాశా, యతీశ్వరా! ఇవ్వుడలై - ఈ హేయసముదాయమైన దేహమును, తీర్కు వేయాన - సమాప్తినొందించుటకు (పగిన), వళి - ఉపాయమును, శెయ్ - కృపచే జేయవలయును.

తా.— వేపచెట్టుముదరగముదరగచేదు అధికమైనట్లు, క్రూరకృత్యములుగల దాసునిచేష్టవ్యముఅధికమైదేహము వృద్ధిబొందుచుండగ, కృపచేదాసునిస్వరూపసత్తను గోరిఈదేహమును నివర్తింపఁజేయు నుపాయమును కృపచేయువలయునని.

౭. అన్నై కుడినీర్ఱరున్దిములై యూణ్కుఴవి,
తన్నుడై యనోయై త్తవిరాళో, ఎన్నై
యొనక్కా వెతిరాశా వెల్లామ్నీ శెయ్దాల్,
ఉనక్కదు తాఴ్వో పురై:

టీక.— అన్నై - బిడ్డలయందు మిగులవాత్సల్యముగలతల్లియైనది, కుడినీర రున్ది - (బిడ్డలకేదేనివ్యాధికలిగినక్లైనమనకొదవచేవచ్చినదనితాను) దాహముమొదలగు సర్వమును ఔషధమునకు విరోధింపకుండునట్లుపుచ్చుకొని, ములైయూణ్ కుఴ్హవిక్కున్నోయై - చనుపాలచేజీవించునట్టిబిడ్డయొక్క, నోయై - వ్యాధిని, తవిరాళో - పోగొట్టదో? ఎన్నే!-ఇదేమిఆశ్చర్యము! ఎనక్కా - (తల్లివలెవాత్సల్యముగలిగియుండు దేవరవారియొక్క శిశువైయుండు) దాసునికిగాను, ఎతిరాశా! యతీశ్వరా! ఎల్లామ్నీశెయ్దాల్ - దాసునిచేఅనుష్ఠింపఁదగినవన్నియునుమీరనుష్ఠించిరక్షించినయెడల, ఉనక్కు - దేవరవారికి, అదుతాఴ్వో - అదియవద్యమో? (ప్రకాశకగమైయుండునుగదా) శరైసాదింపుడు.

తా.—. ఓయతిరాజా! చనుపాలచేజీవించు బిడ్డలవిషయమందు తల్లియైనదిపథ్యముతోనుండి బిడ్డలనుగాపాడునట్లు, దాసుడుఅనుష్ఠింపవలసినకృత్యములను దేవరవారు అనుష్ఠించి దాసునిరక్షించితిరని దేవరవారికి అవద్యమగునా?అనతిండు అని.

౮. తన్ కుఴ్హవివాన్ కిణత్తై, చ్చార్ న్దిరుక్క-క్కణ్డిరున్దాళ్,
ఎన్నదన్ఱోవన్నై పழிశేఱుగిన్ఱాళ్, నన్గుణరిల్,
ఎన్నాలేయెన్నాశమేలున్నెతిరాశా,
ఉన్నాలేయామువు ఱవై యోర్.

టీక.—తన్ కుఴ్హవి - తనయొక్కశిశువు, వాన్ కిణత్తై - బావియొద్ద, శార్న్దిరుక్క - చేరియుండగ, కణ్డిరున్దాళ్ - చూచియుండినది, ఎన్ఱపదన్ఱో - అనియేగదా, అన్నై - తల్లి, పழி - అపవాదమును, ఏఱ్కిన్ఱాళ్ - పొందుచున్నది, నన్గుణరిల్ - బాగుగవిచారించినయెడల, ఎన్నాలే - పాపియగునాచేత, ఎన్ - నాయొక్క, అశమ్ - దోషములు, ఏఱుమ్ - నశించినయెడ, ఎతిరాశా - యతీశ్వరా! ఉన్నాలే - దేవరవారిచే, అమ్ - అగునట్టి, ఉఱవై - సంబన్ధమును, ఓర్ - కృపచేవిచారింపుడు.

తా.-- ఐదుసంవత్సరములవరకు బిడ్డయొక్కదుర్మరణమంతయును తల్లియొక్క అజాగ్రతవలనసంభవించునట్లు శాస్త్రమువిధించుటచే, శిశువుబావి యొద్దనుండునపుడు తల్లిచూచిచూడకయుండెనేని ఏదేనికష్టముసంభవించినయెడ తల్లికిఅపవాదము గలుగుచున్నది, అవిధముగ నాయొక్కపాపకర్మముచే నేనునన్ను నశింపఁజేసికొనఁ జూచినను, దానిని నిషేధించిరక్షింపవలసియుండునట్లు, యతీశ్వరులగు దేవరవారితోఁ గలిగియుండు సమ్బన్ధమును దివ్యహృదయమందా లోచింపవలయునని.

౯. కూపత్తిల్ వీఴుమ్ కుఴ్హవియుడన్ కుదిత్తు, అ
వ్వాపత్తెనీక్కుమన్దవన్నైపోల్, పాపత్తాల్

యా ఱ్పిఱప్పే నేలుమ్ఇని యెన్దైయెతిరాశఱ్,
తాఱ్పిఱక్కుమెన్నై యుయ్ప్పదా.

టీక.— కూపత్తిల్ - బావియందు, వీళుమ్ - పడుచున్న, కుழవియుడన్ - శిశువుతోఁగూడ, కుదిత్తు - దుమికి, అవ్వాపత్తై - ఆయాపదను, నీక్కుమ్ - పోఁగొట్టునట్టి, అన్దఅన్నైపోల్ - ఆతల్లివలె, పాపత్తాల్ - దాసుడుచేసినపాపముచే, యాన్ - దాసుడను, పిఱప్పే నేలుమ్ - కొన్నిజన్మములనుఎత్తినవాడనైనను, ఇని - ఇట్లైన వెనుక, ఎన్దై - దాసునికితండ్రియగు, ఎతిరాజన్ - యతీశ్వరులగుఎమ్బెరుమానార్లు, ఎన్నై - దాసుని, ఉయ్ప్పదా - ఉజ్జీవింపఁజేయుటకుగాను, తాన్ - తాము, పిఱక్కుమ్ - కృపచే అవతరింతురు.

తా.— బావిలోపడెడు శిశువుతోఁగూడపడి ఆశిశువునెత్తి సంరక్షించుతల్లివలె, దాసుడుపాపకర్మములచే జన్మములెత్తుచుండినను తండ్రియగు దేవరవారు దాసునియుజ్జీవననిమిత్తమై అవతరింతురని.

౧౦. పూమగళ్ కోన్ తెన్నరఙ్గర్ పూఙ్గழలుక్కుప్పాదుగమాయ్,
తామగిழుమ్ శెల్వచ్చడగోపర్, తేమలర్త్తాళ్ కు
ఏయ్న్దినియపాదుగమామెన్దైయిరామానుశనై,
వాయ్న్దెనదునెఞ్జమేవాழ్.

టీక.— పూమగళ్ - పుష్పమందుపరిమళము ఒకరూపమును బొందియుండు శ్రీమహాలక్ష్మికి, కోన్ - వల్లభుడైన, తెన్నరఙ్గర్ - శ్రీరఙ్గనాథునియొక్క, పూఙ్గழలుక్కు - నిరతిశయభోగ్యమగుపాదారవిన్దములకు, పాదుగమాయ్ - పాదుకలై, తామగిழుమ్ - తామునానన్దించునట్టి, శెల్వ - సాత్త్వికజనసమ్పదయైన, శడకోపర్ - నమ్మాళ్వార్ల యొక్క, తేన్మలర్ - మధువుస్రవించుచుండు పుష్పముఅనఁదగిన, తాళుక్కు - సర్వాతిశయభోగ్యమైయుండు శ్రీపాదములకు, ఏయ్న్దు - పొంది, ఇనియ - ప్రియమైన, పాదుకమామ్ - పాదుకలై, ఎన్దై - దాసునికితండ్రియై దాసునియొక్కస్వరూపసత్తకు కారణభూతులగు, ఇరామానుశనై - ఎమ్బెరుమానారులను, వాయ్న్దు - ఆశ్రయించి,) ఎనదునెఞ్జమే - నాకుస్వాధీనమగుమనసా! వాழ் - ఇట్టిసమ్పదనుపొందిసుఖింపుమా.

తా.— నాకు భవ్యమైనమనసా! శ్రీరఙ్గనాథుని పాదారవిన్దములకు పాదుకలై సాత్త్వికజనసమ్పదయైన ఆళ్వార్లయొక్కమధుస్యన్దియగు శ్రీపాదపద్మములకు ప్రియమైన పాదుకలై, దాసునికితండ్రియును స్వరూపసత్తకు కారణభూతులునునగు ఉడైయవరును ఆశ్రయించి సుఖింపుమని.

౹౯౧౧. ఉన్నై యొழிయవొరు దెయ్వమ్మత్తఱియా,
మన్ను పుగழ் శేర్ వడుగనమ్బి తన్నిలైయై,
యెన్దనక్కునీతన్దెతిరాశా, వెన్నాళు
మున్దనక్కే యాట్కొళ్ ఉగన్దు.

టీక.—ఎతిరాశా - ఎమ్బెరుమానార్లే, ఉన్నై యొழிయ - దేవరవారినితప్ప, ఒరు దెయ్వమ్మత్తఱియా - (దేవరవారికి ఉద్దేశ్యులైన పెరుమాళ్లనున్ను దేవరవారియొక్క అనుభవకైఙ్కర్యాదులకు నిత్యశత్రువుగనిశ్చయించి దేవరవారినితప్ప) వేఱొక పరదేవతనుగుర్తెఱుగని, మన్ను - స్థిరమైన, పుగழ் - కీర్తిని, శేర్ - పొందిన, వడుగనమ్బి తన్ - వడుగనమ్బిగారియొక్క, నిలైయై - చరమపర్వనిష్ఠను, ఎన్దనక్కు - అందపేక్షకలదాసునికి, నీతన్దు - దేవరవారుప్రసాదించి, ఎన్నాళుమ్ - సర్వకాలములందును, ఉన్దనక్కే - దేవరవారికే, (రసావహమగునట్లు) ఉగన్దు - సన్తోషించి, ఆళ్ కొళ్ - కైఙ్కర్యమునుపరిగ్రహింపవలయును.

తా.—యతిరాజా! దేవరవారినితప్ప వేఱొకపరదేవతను గుర్తెఱుగని వడుగనమ్బిగారియొక్కనిష్ఠను దాసునికి దేవరవారు ప్రసాదించి ఎల్లప్పుడును దేవరవారిదివ్యహృదయమునకు సన్తోషకరముగ కైఙ్కర్యమునంగీకరింపవలయునని.

౧౨. తేశన్దిగழுమ్ తిరువాయ్ మొழிప్పిళ్ళై,
మాశిల్ తిరుమలైయాழ்వార్, ఎన్నై ౨ నేశత్తాల్
ఎప్పడియే యెణ్ణినిన్పాల్ శేర్త్తారెతిరాశా,
అప్పడియేనీశెయ్దరుళ్.

టీక.—తేశమ్ - సకలదేశములందును, తిగழுమ్ - ప్రకాశించునట్టిప్రభావముగలవారగు, తిరువాయ్ మొழிప్పిళ్ళై - తిరువాయ్ మొழிతో సంబన్ధము నేతమకునిరూపకముగలవారైనందున, తిరువాయ్ మొழிప్పిళ్ల అనువారును, మాశిల్ - తమయందు ఆచార్యత్వమును ఆరోపించుకొనుట మొదలగుక్రూరనిషిద్ధమగుదోషములేకుండెడు, తిరుమలైయాழ்వార్ - శ్రీశైలనాథులు, ఎన్నై - తమయొక్కదయకు పాత్రులగుదాసుని, నేశత్తాల్ - దయచేపరిపక్వమగు స్నేహముచే, ఎప్పడియేయెణ్ణి - వీకుఏవిధముగనైన ఉజ్జీవించును అనివిచారించి, నిన్పాల్ - ప్రాప్తశేషియైన దేవరవారి శ్రీపాదములలో, శేర్త్తార్ - కరుణచేచేర్చిరో, ఎతిరాశా - యతీశ్వరా అప్పడియే - ఆవిధముగనే, నీ-దేవరవారు, శెయ్దరుళ్ -దివ్యహృదయమందుకరుణించి యుజ్జీవింపచేయవలయును,

తా.—యతిరాజా ! సకలదేశములందును ప్రకాశించునట్టి మహిమగలవారును తిరువాయ్ మొழி తోటిసమ్బన్ధముచే ఆదేతిరునామమును గలవారును దోషరహితులును నగుశ్రీశైలనాథులు, దాసునియందు స్నేహముచేవీడు ఎట్లైన ఉజ్జీవించునని దేవరవారిశ్రీపాదములలో చేర్చిరో, ఆప్రకారముగనే దేవరవారుకృపచే యుజ్జీవింపఁ జేయవలయునని.

౧౩. ఎతిరాశ్ణవాழ்ి యెతిరాశ్ణవాழ்ి,
ఎతిరాశ్ణవాழ்ియెన్ఱెన్ఱేత్తిచ్చదిరాగ
వాழ்్వార్ గళ్ తాళిణైక్కీழ் వాழ்్వార్ గళ్,
పెఱ్ఱిడువర్ ఆళ్వార్ గళ్ తఙ్గళరుళ్.

టీక.— ఎతిరాశ్ణవాழ்ి ఎతిరాశ్ణవాழ்ి ఎతిరాశ్ణవాழ்ి - ముమ్మారుఎమ్బెరుమానార్లకు మంగళముగలుగ వలయును, ఎన్ఱెన్ఱు - అనియనుసన్ధించి, ఏత్తి-స్తోత్రముచేసి, శదిరాగ - సామర్థ్యముగ: వాழ்్వార్ గళ్ - సుఖించువారలయొక్క, తాళిణైక్కీழ் - శ్రీపాదములక్రింద, వాழ்్వార్ గళ్ - సుఖించువారలు, ఆழ்్వార్ గళ్ తఙ్గళ్ - పదుగు రాళ్వార్లయొక్క, అరుళ్ - కృపను, పెఱ్ఱిడువర్ - పరిపూర్ణముగ లభింపగలరు.

తా.— ఎమ్బెరుమానార్లకు ముమ్మారు మఙ్గళాశాసన మొనర్చి స్తుతించిజీవించు వారియొక్క శ్రీపాదములక్రింద జీవించువారలు, పదుగురాళ్వార్లకృపను సంపూర్ణముగ లభింపగలరని.

౧౪. అదిగారముణ్డేల్ అరఙ్గరిరఙ్గారో,
అదిగారమిల్లాదార్కన్ఱో, ఎతిరాశా
నీయిరఙ్గవేణ్డువదు, నీయుమ్ అదికారికళుక్కేయిరఙ్గిల్,
ఎన్ శెయ్వోమ్యామ్.

టీక.— అదికారముణ్డేల్ - జ్ఞానానుష్ఠానపూర్తియగు అధికారమున్నట్లైన, అరఙ్గర్ - శ్రీరఙ్గనాథులు, ఇరఙ్గారో - కనికరింపరో! అదికారమిల్లాదార్కన్ఱో - అట్టియధికారము లేనివారికిగదా, ఎతిరాశా - ఎమ్బెరుమానార్లే! నీ - దేవరవారు, ఇరఙ్గవేణ్డువదు - కనికరించి రక్షింపవలసినది, నీయుమ్ - దేవరవారును, అదికారిగళుక్కే - అధికారసమ్పదకలవారికే, ఇరఙ్గిల్ - కృపచేసి రక్షించినయెడ, యామ్ - అనధికారులుగానుండు మాబోటివారము, ఎన్ శెయ్వోమ్ - ఏయోగ్యతను నిరూపించుకొని యుజ్జీవింపబోవుచున్నాము?

తా.— యతిరాజా! జ్ఞానానుష్ఠానాది సమ్పదయున్నయెడ శ్రీరఙ్గనాథులు కనికరించిరక్షింపరో! జ్ఞానానుష్ఠానాదులు లేనివారినేగదా దేవరవారు కరుణించి రక్షింపవల

సినది, దేవరవారును జ్ఞానానుష్ఠానాది సమ్పదగలవారినే రక్షించితిరేని అస్మదాదులము ఎట్లుజ్జీవింపగలమని.

౧౫. ఎమ్బెరుమానార్ తిరువడిగళేశరణమ్
ఎన్నదువేనావురైక్కుమ్, ఇత్తాల్ ఉన్నన్బర్ పాల్,
ఇప్పొదళవుమ్యానొన్రుమ్కాణ్గిన్రిలేన్,
ఎప్పోదుణ్డావదిని.

టీక.— ఎమ్బెరుమానార్ తిరువడిగళేశరణమ్ - మాస్వామియగు ఉడైయవరుల యొక్క తిరువడిగళేరక్షకము, ఎన్నదువే - అనిచెప్పఁబడు ఈవాచకమునే. నా - నాలుక యైనది, ఉరైక్కుమ్ - ప్రేమలేక పచించుచుండును, ఇత్తాలెన్ - దీనిచే నేమిప్రయోజనము, అన్బు - ప్రేమతోఁగూడినభక్తి, అవర్ పాల్ - వారివిషయమందు, ఇప్పొదళవుమ్ - ఈక్షణపర్యన్తమును, యాన్ - ప్రేమలేని దాసుడను, ఒన్రుమ్కాణ్గిన్రిలేన్ - ఒకటియును చూడలేదు, ఎప్పోదుఇని - ఇప్పుడు లేనిది ఇక నెప్పుడు, ఉణ్డావదు - కలుగఁబోవుచున్నది.

తా.— ప్రేమలేకపోయినను ఎమ్బెరుమానార్ తిరువడిగళేశరణమ్ అనిచెప్పఁబడుతిరునామమును నానాలుక ఉచ్చరించుచుండును, ఇందుచే నేమిఫలముగలుగును వారియందు ప్రేమగర్భమగు భక్తికార్యము నిప్పుడునొకటియును నాయందులేదు ఇక నెప్పుడు కలుగ బోవుచున్నదని.

౧౬. ఆగాదదీదెన్రు తెళిన్దుమ్పిఱర్క్కురైత్తుమ్,
ఆగాదశెయ్వన నాదలాల్, మోగాన్ద
నెన్రెన్నై నైత్తెన్నై యిగళేల్ ఎతిరాశా,
ఎన్రుమ్ఉన్నడిశేర్వేనియాన్.

టీక.— ఆగాదదు - సత్పురుషులచే పరిత్యజింపఁబడు అంశము, ఈదెన్రు - ఇట్టిదని, తెళిన్దుమ్ - విశదముగ దెలిసికొనియు, (ఇట్లు తెలిసికొన్నంత మాత్రమేగాక) పిఱర్క్కు - ఇతరులకు, ఉరైత్తుమ్ - ఉపదేశించియును, ఆగాదదే నిషిద్ధకార్యమునే, శెయ్వన్ - నిత్యానుష్ఠానముగ నడుపుచుందును, ఆదలాల్ - ఇట్లుచెప్పనది యొకటిచేయునది యొకటియగుటచే, మోగాన్దనెన్రు - మోహముచే గ్రుడ్డివాడనని, నినైత్తు - విచారించి, ఎన్నై - దాసుని, ఇగళేల్ - ఉపేక్షింపవలదు, ఎతిరాశా - యతీశ్వరా! ఎన్రు - ఎప్పుడు, యాన్ - దాసుడను, ఉన్ - దేవరవారియొక్క, అడి - శ్రీపాదములను, శేర్వన్ - పొందఁగలవాడను.

తా.— యతిరాజా! కానిది ఇట్టిదని చక్కగ దెలిసియు పరోపదేశముచేసియు కానికార్యమునే ఎల్లప్పుడు చేయుచుందును. ఇట్లుపదేశించుట యొకటియు నడచుట

యొకటియు నగుటచే పామరుడని దాసుని విడువవలదు, ఎప్పుడు దాసుని దేవరవారి శ్రీపాదములలోఁ జేర్చుకొందురని.

౧౭. పొల్లాజ్గనైత్తుమ్ పొదిన్దుకొణ్డు, నన్మైయిల్లొ
న్ఱిల్లా వెనక్కు మెతిరాశా, నల్లార్గళ్
నణ్ణుమ్ తిరునాట్టై నాన్ తరువ నెన్ఱునీ,
తణ్ణెన్ఱిరుక్కిఱ దెన్.

టీక.— పొల్లాజ్గు - చెడుకార్యములు, అనైత్తుమ్ - సమస్తమును, పొదిన్దుకొణ్డు - లోపుకేసనందు చెక్కినట్లుస్థాపింపఁజేసికొని, నన్మైయిల్ - సత్కృత్యములందు, ఒన్ఱిల్లా - కొంచెమయినను లేని, ఎనక్కుమ్ - దాసునికిని, ఎతిరాశా - ఎమ్బెరుమానారే, నల్లార్గళ్ - సత్పురుషులు, నణ్ణుమ్ - పొందదగిన, తిరునాట్టై - పరమపదమును, (మనతోఁగలిగియుండు సమ్బన్ధమూలముగ) నాన్ - మేమే, తరువేన్ - ఇప్పింతుము, ఎన్ఱునీ - అనిసాదించిన దేవరవారు, తణ్ ఎన్ఱిరుక్కిఱదు - ఆలస్యముచేసికొనుచుండునది, ఎన్దాన్ - ఏమికారణము.

తా.— ఎతిరాజా! దుష్కృత్యములకు ఉనికిపట్టై సత్కృత్యములు లేశమైనను లేని దాసునికి పరమపదమును మేముకృపచేయుదుము అనిన దేవరవారు ఆలస్యము చేయుటకేమికారణమని.

౧౮. ఎన్ఱువిడివదెనక్కెన్నా యెతిరాశా,
ఒన్ఱుమఱిగిన్ఱిలేన్ నుయరియాయ్, కున్ఱామల్
ఇప్పడియేయిన్దవుయిరుక్కెన్ఱుమిరుళ్ విళైక్కుమ్
ఇప్పవమామ్నీణ్డవిరవు.

టీక.— ఎన్నాయ్ - దాసునికితండ్రియగు, ఎతిరాశా - యతులకునాథా, ఎన్ఱు - ఎప్పుడు, ఎనక్కు - (అజ్ఞానాంధకారమందు దగులుకొని దారి తెలియక భ్రమఁజెంది యుండు)దాసునికి, విడివదు - రామానుజులు అనునార్యులగు దేవరవారియొక్క దర్శనమునకుయోగ్యమైన మంచియుదయముగలుగునది, ఒన్ఱుమ్ అఱిగిన్ఱిలేన్ - ఈవిషయమున ప్రతిక్రియను ఒకటిని తెలిసికొనలేను, ఉయరియాయ్ - సర్వజ్ఞులగు దేవరవారు దీనికొక మంచియుదయమును కటాక్షించి అనలీయవలయును, కున్ఱామల్ - కొఱతలేక, ఇప్పడియే - ఈప్రకారముగనే, ఇన్దఉయిరుక్కు - ఈయాత్మవస్తువుకు, ఎన్ఱుమ్ - ఏకాలమును, ఇప్పవమామ్ - ఈసంసారమగు, నీణ్డవిరవు - గొప్పదీర్ఘమైనరాత్రి, (కాళరాత్రి) ఇరుళ్విళైక్కుమ్ - అజ్ఞానమను చీకటిచే కలిగించును.

సినది, దేవరవారును జ్ఞానానుష్ఠానాది సమ్పదగలవారినే రక్షించితిరేని అస్మదాదులము ఎట్లుజ్జీవింపగలమని.

౧౫. ఎమ్బెరుమానార్ తిరువడిగళ్ శరణమ్
ఎన్బదువే నావురైక్కుమ్, ఇత్తాల్ ఉన్నన్బర్ పాల్,
ఇప్పోదళవుమ్ యానొన్ఱుమ్ కాణ్గిన్ఱిలేన్,
ఎప్పోదుణ్డావదిని.

టీక.— ఎమ్బెరుమానార్ తిరువడిగళ్ శరణమ్ - మాకుస్వామియగు ఉడైయవరుల యొక్క తిరువడిగళే రక్షకము, ఎన్బదువే - అని చెప్పఁబడు ఈవాచకమునే. నా - నాలుక యైనది, ఉరైక్కుమ్ - ప్రేమలేక పఠించుచుండును, ఇత్తాలెన్ - దీనిచే నేమిప్రయోజనము, అన్బు - ప్రేమతోఁగూడినభక్తి, అవర్ పాల్ - వారివిషయమందు, ఇప్పోదళవుమ్ - ఈక్షణపర్యన్తమును, యాన్ - ప్రేమలేని దాసుడను, ఒన్ఱుమ్ కాణ్గిన్ఱిలేన్ - ఒకటియును చూడలేదు, ఎప్పోదుఇని - ఇప్పుడులేనిది ఇక నెప్పుడు, ఉణ్డావదు - కలుగఁబోవుచున్నది.

తా.— ప్రేమలేకపోయినను ఎమ్బెరుమానార్ తిరువడిగళ్ శరణమ్ అనిచెప్పఁబడుతిరునామమును నానాలుక ఉచ్చరించుచుండును, ఇందుచే నేమిఫలముగలుగును వారియందు ప్రేమగర్భమగు భక్తికార్యము నిప్పుడునొకటియును నాయందులేదు ఇక నెప్పుడు కలుగ బోవుచున్నదని.

౧౬. ఆగాదదీదెన్ఱఱిన్దుమ్ పిఱర్క్కురైత్తుమ్,
ఆగాదదే శెయ్ దనాదలాల్, మోగాన్ద
నెన్ఱునినైత్తెన్నై యిగళ్ వేలెతిరాశా,
ఎన్ఱునుండి శేర్వానియాన్.

టీక.— ఆగాదదు - సత్పురుషులచే పరిత్యజింపఁబడు అంశము, ఈదెన్ఱు - ఇట్టిదని, అఱిన్దుమ్ - విశదముగ దెలిసికొనియు, (ఇట్లు తెలిసికొన్నంత మాత్రమేగాక) పిఱర్క్కు - ఇతరులకు, ఉరైత్తుమ్ - ఉపదేశించియును, ఆగాదదే నిషిద్ధకార్యమునే, శెయ్ దన్ - నిత్యానుష్ఠానముగ నడుపుచుండును, ఆదలాల్ - ఇట్లు చెప్పునది యొకటి చేయునది యొకటి యగుటచే, మోగాన్దనెన్ఱు - మోహముచే గ్రుడ్డివాడనని, నినైత్తు - విచారించి, ఎన్నై - దానుని, ఇగళేల్ - ఉపేక్షింపవలదు, ఎతిరాశా - యతీశ్వరా! ఎన్ఱు - ఎప్పుడు, యాన్ - దాసుడను, ఉన్ - దేవరవారియొక్క, అడి - శ్రీపాదములను, శేర్వన్ - పొందఁగలవాడను.

తా.— యతిరాజా! కానిది ఇట్టిదని చక్కగ దెలిసియు పరోపదేశముచేసియు కానికార్యమునే ఎల్లప్పుడు చేయుచుండును. ఇట్లుపదేశించుట యొకటియు నడచుట

యొకటియు నగుటచే పామరుడని దాసుని విడువవలదు, ఎప్పుడు దాసుని దేవరవారి శ్రీ పాదములలోఁ జేర్చుకొందురని.

౧౭. పొల్లాఙ్గనైత్తుమ్ పొదిన్దుకొణ్డు, నన్మైయిల్లొ
న్ఱిల్లానెనక్కు మెతిరాశా, నల్లార్ గళ్
నణ్ణుమ్ తిరునాట్టైనాఙ్ తరువమెన్ఱునీ,
తణ్ణెన్ఱిరుక్కుమదెన్ఱాఙ్.

టీక.— పొల్లాఙ్గు - చెడుకార్యములు, అనైత్తుమ్ - సమస్తమును, పొదిన్దుకొణ్డు - లోహపుఱేకునందు చెక్కినట్లుస్థాపింపఁజేసికొని, నన్మైయిల్ - సత్కృత్యములందు, ఒన్ఱిల్లా - కొంచెమయినను లేని, ఎనక్కుమ్ - దాసునికిని, ఎతిరాశా - ఎమ్బెరుమానారే, నల్లార్ గళ్ - సత్పురుషులు, నణ్ణుమ్ - పొందదగిన, తిరునాట్టై - పరమపదమును, (మనతోఁగలిగియుండు సమ్బన్ధమూలముగ) నాన్ - మేమే, తరువేన్ - ఇప్పింతుము, ఎన్ఱునీ - అనిసాదించిన దేవరవారు, తణ్ ఎన్ఱుఇరుక్కుమదు - ఆలస్యముచేసికొనుచుండునది, ఎన్దాన్ - ఏమికారణము.

తా.— ఎతిరాజా! దుష్కృత్యములకు ఉనికిపట్టై సత్కృత్యములు లేశమైనను లేని దాసునికి పరమపదమును మేముకృపచేయుదుము అనిన దేవరవారు ఆలస్యము చేయుటకేమికారణమని.

౧౮. ఎన్ఱువిడివదెనక్కెన్దా యెతిరాశా,
ఒన్ఱుమఱిగిన్ఱిలేన్ ఉఱ్ఱైయాయ్, కున్ఱామల్
ఇప్పడియేయిన్దవుయిరుక్కున్ఱిరుళైవిళైక్కుమ్
ఇప్పవమామ్నీణ్డవిరవు.

టీక.— ఎన్దాయ్ - దాసునికితండ్రియగు, ఎతిరాశా - యతులకునాథా, ఎన్ఱు - ఎప్పుడు, ఎనక్కు - (అజ్ఞానాంధకారమందు దగులుకొని దారి తెలియక భ్రమఁజెంది యుండు)దాసునికి, విడివదు - రామానుజులు అనునూర్యులగు దేవరవారియొక్క దర్శనమునకుయోగ్యమైన మంచియుదయముగలుగునది, ఒన్ఱుమఱిగిన్ఱిలేన్ - ఈవిషయమున ప్రతిక్రియను ఒకటిని తెలిసికొనలేను, ఉఱ్ఱైయాయ్ - సర్వజ్ఞులగు దేవరవారు దీనికొక మంచియుదయమును కటాక్షించి అనతీయవలయును, కున్ఱామల్ - కొఱతలేక, ఇప్పడియే - ఈప్రకారముగనే, ఇన్దఉయిరుక్కు - ఈయాత్మవస్తువునకు, ఎన్ఱుమ్-ఏ కాలమును, ఇప్పవమామ్ - ఈసంసారమగు, నీణ్డవిరవు - గొప్పదీర్ఘమైనరాత్రి, (కాళరాత్రి) ఇరుళై విళైక్కుమ్ - అజ్ఞానమను చీకటినే కలిగించును.

తా.— దాసునికి తండ్రియగు యతిరాజా! ఎప్పుడు దాసునికి దేవరవారి దర్శనమునకు దగినయుదయముగలుగునది దీనికి ప్రతిక్రియనొకటిని గుర్తెఱుగను, దేవరవారు ఆనతీయవలయును, సజ్జోక్తిచనులేక ఈవిధముగనే ఈయాత్మవస్తువుకు ఈ సంసారమను కాళరాత్రి ఎప్పుడును అజ్ఞానమను చీకటినే గలిగించుననని.

౧౯. అల్లుమ్పగలుమ్యానాక్కైప్పణియుణ్ణ్,
శెల్లుమదు ఉన్దేశుక్కుత్తీఙ్గన్రో, నల్లార్గళ్
తన్దనయర్నీశర్క్కాళ్శెయ్యచ్చగిప్పరో,
ఎన్దైయెతిరాశావిశై.

టీక.— అల్లుమ్పగలుమ్ - రేయుంబగళ్లును, యాన్ - దాసుడను, ఆక్కైప్పణియుణ్ణ్ - శరీరమార్గమందు సఞ్చరించి దేహకిఙ్కరుడై, శెల్లుమదు - ప్రవర్తించుట, ఉన్దేశుక్కు - దేవరవారి ప్రభావాతిశయమునకు, తీఙ్గన్రో - హానిగదా, (అదెట్లనిన) నల్లార్గళ్ - సత్పురుషులు, తన్దనయర్ - తమపుత్రులు, నీశర్క్కు - మిగులనీచులగువారికి, ఆళ్శెయ్య - నిహీనవృత్తులను జేయుటను, సగిప్పరో - సహింతురో, ఎన్దై - నాకు తండ్రియగు, ఎతిరాశా - యతులకు నాథులైనస్వామీ, ఇశై - దీనిని దేవరవారే ఆనతీయవలయును.

తా.— దాసుడను అహోరాత్రములును దేహకిఙ్కరుడనై ప్రవర్తించుట దేవరవారిమహిమాతిశయమునకు చెఱుపుగదా, (అదెట్లనగ) సజ్జనులు తమపుత్రులు నీచులకు దాస్యవృత్తిచేయుటను సహింతురో, దేవరవారే ఆనతీయవలయునని.

౨౦. పోమ్వழிయైత్తరుమెన్నుమిన్నమెల్లామ్
పొశిత్తువழிపోయ్, అముదవిరశైయాఱ్ఱిల్,
నామ్మరుగ్గిత్తలమన్నిల్లుత్తెళివిశుమ్బై,
నణ్ణినలన్దిగழுమేనిదనై, ప్పెఱ్ఱిల్లు,
త్తామమరర్వన్దెదిర్కొణ్డలఙ్గరిత్తు
చ్చఙ్కిరిప్పశూమణిమణ్డపత్తుచ్చేన్ఱు,
మామలరాళ్కోన్మడియిల్వైత్తుగక్కుమ్
వాழ்వునమక్కెతిరాశనరుళుమ్వాழ்వే.

టీక.— పోమ్వழிయైత్తరుమ్ - పరమపదమునకుబోవు మార్గమును, తిరుమ్ - ఇప్పించును, ఎన్నుమ్ - అనెడు, ఇన్నమెల్లామ్ - ఆమహదానన్దమంతయును, పుశిత్తు - అనుభ

వించి, వళ్ళిపోయ్ - అర్చిరాది మార్గమునఁబోయి, అముదవిరశైయాట్రిల్ - అమృతమయమగు విరజానదియందు, నామ్మూళ్గి - తాపత్రయ దుఃఖమంతయును తీరునట్లు మనము స్నానముచేసి, మలమఱ్ఱు - ప్రాకృతములయిన మలములన్నియునువదలి, తెళి విసుమ్బై - పరిశుద్ధమైన పరమపదమును, నణ్ణి - సమీపించి, నలమ్తిగళ్ మేనితన్నై - స్వరూపగుణములన్నియును ప్రకాశించునట్లు శుద్ధసత్వమయమైన అప్రాకృత దివ్యదేహమును, పెఱ్ఱు - లభించి, అమరర్ తామ్ - నిత్యసూరులు, వన్దు - వేంచేసి, ఎదిర్ కొణ్డు - ఎదుర్కొని, అలఙ్గరిత్తు - బ్రహ్మాలఙ్కారాదులచే అలఙ్కరించి, సర్కరిప్ప - సన్మానింపగ, (వారితోఁగూడ) మామణిమణ్డపత్తుచ్చెన్ఱు - దివ్యనవరత్న ఖచితమగు గొప్పమంటపము నకువెళ్లి, మామలరాళ్ కోన్ - శ్రీయఃపతియగు శ్రీవైకుణ్ఠనాథుఁడు, మడియిల్ - ఒడియందు, వైత్తు - ఉంచుకొని, ఉగక్కుమ్ - శిరస్సును అఘ్రాణించి సన్తోషముతో ఆలిఙ్గనముచేసికొనునట్టి, వాళ్వు - సమ్పద, ఎతిరాశన్ - ఉడైయవరులు, నమక్కు - మనకు, అరుళుమ్ - కృపచేయునట్టి, వాళ్వే - సమ్పదయే.

తా.— ఉడైయవరులు మనకుకృపచేయునట్టి సమ్పదయైనది, ఎట్టిదనిన, పరమపదమార్గము నిప్పింతురను మహదానన్దము ననుభవించి, అర్చిరాది మార్గమునబోయి మనము విరజానదియందు స్నానమొనర్చి ప్రకృతిసంబన్ధమైన మాలిన్యములన్నియును నశించి, పరమపదమును సమీపించి ఆత్మగుణప్రకాశకమగు దివ్యదేహమును బొంది నిత్యసూరులు ఎదుర్కొని సత్కరింపగ, వారితోడ దివ్యనవరత్నఖచితమగు మహామంటపమునకు వెడలి శ్రియఃపతితమయొక్క ఒడియందుంచుకొని ఆలిఙ్గనము చేసికొనునట్టి సమ్పదగదాఅని.

౭౧. తిరుమలై యాళ్వార్,తిరువాయ్ మొళిప్పిళ్ళై శీరరుళాల్,
తరుమదికొణ్డవర్ దమ్మై యుత్తారకరాగ వెణ్ణి
యిరుమనమే, అవర్కాగ వెతిరాశర్ దమ్మైక్కడుగ
ప్పరమపదన్దన్నిల్లేఱ్ఱువర్, ఎన్న పయమ్ నమక్కే.

టీక.—తిరుమలైయాళ్వార్ - శ్రీశైలనాథులు అనునట్టి తిరునామమునుగల, తిరువాయ్ మొళిప్పిళ్ళై - తిరువాయ్ మొళిప్పిళ్లగారియొక్క, శీర్ అరుళాల్ - నిర్హేతుకకృపచేత, తరుమ్ - ప్రసాదించునట్టి, మది - జ్ఞానమును, కొణ్డు - సాధనముగఁగొని, అవర్ దమ్మై - ఇట్లుమహోపకారకులైనట్టి యాతిరువాయ్ మొళిప్పిళ్లగారిని, ఉత్తారకరాగ - సంసారమునుండి తరింపఁజేయువారినిగ, మనమే - ఓమనసా, ఎణ్ణియిరుమ్ - అధ్యవసించియుండుము, అవర్కాయ్ - ఇట్లుమనకు ఆచార్యులగు పిళ్లగారికిగాను, ఎతిరాశర్ - ఎమ్బెరుమానార్లు - ఎమ్మై - స్వాచార్యాభిమానమే ఉత్తారకమనియుండు మనలను, కడుగ -

శీఘ్రముగ, పరమపదత్తిన్నిల్ - పరమపదమందు, ఏత్తువర్ - ఆరోహింపఁజేయుదురు, ఎన్నపయమ్నమక్కే - ఈవిషయముగ మనకేమిభయము.

తా.— ఓమనసా, తిరువాయ్మొழிప్పిళ్లగారియొక్క నిర్హేతుకకృపచే దివ్యజ్ఞానమును లభించిననీవు వారినే ఉత్తారకముగ తలచియుండుము. ఉడైయవరులు ఆచార్యాభిమానమే ఉత్తారకమని తలచియుండు మనలను పరమపదమునకుఁ జేర్పింతురు, ఒకభయమునులేదు. (వక్షమున హస్తములుంచుకొని నిర్భయముగ నిద్రింపనగునని).

౨౨. తీదత్తజ్ఞాన త్తిరువాయ్మొழிప్పిళ్లై శీరరుళాల్,
ఏద త్తైమాత్తుమ్ఎతిరాశర్ తమ్మభిమానమెన్నుమ్,
పోద త్తైయేత్తిప్పవమామ్పుణరిదనైక్కడన్ద,
కోదత్తమాదవన్ పాదక్కరైయైక్కుఱుగువనే.

టీక.— తీదత్త-దోషములేని, ఞాన - ఆత్మగుణములనుగల, తిరువాయ్మొழிప్పిళ్లై - శ్రియఃపతివిషయమగు కవనమైన తిరువాయ్మొழிయందు అత్యన్తాభినివేశము గలిగి ప్రవర్తించుటచే ఆతిరునామమునే గలిగియుండు పిళ్లగారియొక్క, శీరరుళాల్ - నిర్హేతుకకృపచే, ఏదత్తై - కామాదిదోషములను, మాత్తుమ్ - పోగొట్టునట్టి, ఎతిరాశర్తమ్ - యతులకు నాథులైయుండు ఉడైయవరులయొక్క, అభిమానమెన్నుమ్ - అభిమానమనెడు, పోదత్తైయేత్తి - నిరపాయమైన వైష్ణవమను ఓడనురెక్కి, పవమామ్ - సంసారమగు, పుణరిదనై - మహాసముద్రమును, కడన్ద - అతిక్రమించి, కోదుఅత్త - హేయములకు ఎదురైన, (దోషములేని), మాదవన్ - శ్రియఃపతియొక్క, పాదక్కరైయై - శ్రీపాదములుఅనుగట్టును, కుఱుగువన్ - సమీపింపఁగలుగుదును. (ఏ-పాదపూరణము.)

తా.— శమదమాది ఆత్మగుణసమ్పన్నులగు తిరువాయ్మొழிప్పిళ్లగారియొక్క నిర్హేతుకకృపచే, సకలదోషహరములగు ఉడైయవరుల అభిమానమను ఓడనురెక్కి సంసారసాగరమును దాటి, శ్రియఃపతియొక్క శ్రీపాదములు అనుగట్టును సమీపింతునని.

౨౩. అడియార్గళ్ కత్తాజ్ఞైళ్ళగోలక్కమిరుక్క
వానన్దమయమానమామణిమణ్డపత్తు,
పడియాదుమిల్ పడుక్కైయాయిరుక్కుమనన్ద
పణామణిగళ్ ఉన్నినొళిమణ్డలత్తినిడై యిల్,

పడివారుమ్ మామలరాళ్ వలవరుగుమ్ మత్రై
మణ్ మగళుమ్ ఆయ్ మగళుమ్ ఇడవరుగుమిరుక్క,
నడువాగవీత్తిరుక్కుమ్ నారణనై క్కడుగ
నాననుబవిక్కుమ్ వగైనల్ గెన్నెతిరాశా.

టీక.— ఎన్ ఎతిరాశా, యతులకు నాథుడవగు దాసునియొక్క స్వామీ, అడియార్ గళ్ కుళాజ్గళ్ - నిత్యముక్తసమూహములు, అళగు - అలఙ్కారమైన, ఓలక్కమ్ - సభరైయైవరుసక్రమముగ, ఇరుక్క - సేవించియుండగ, ఆనన్దమయమాన - అత్యన్తానన్దమునుబుట్టించునట్టి, మామణిమణ్డపత్తు - శ్రీకరమగుమహత్తైన మణ్టపమునందు, పడియాదుమిల్ - ఉపమానమొకటియైనను లేకుండెను, పడుక్కైయా యిరుక్కుమ్ - దివ్యమైన శయ్యారైయుండు, అనన్దన్ - ఆదిశేషులయొక్క, పణామణిగళ్ తన్నిల్ - పడిగెలయందలిరత్నములయొక్క, ఒళిమణ్డలత్తిన్ ఇడైయిల్ - తేజోరూపమగుమణ్డలముయొక్కమధ్యను, వడివుళవమ్ - సౌన్దర్యముచేతతిశయించిన సౌకుమార్యమునుబట్టిని రూపింపఁదగిన, మామలరాళ్ - శ్రీమహాలక్ష్మి, వలవరుగుమ్ - కుడిపార్శ్వమందును, మత్రై - తదితరులగు, మణ్ మగళుమాయ్ మగళుమ్ - భూదేవియునునీళాదేవియును, ఇడవరుగుమ్ - ఎడమపార్శ్వమందును, ఇరుక్క - సేవించియుండగ, నడువాగవీత్తిరుక్కుమ్ - వీరియొక్కమధ్యమాడు మెఱుపుతీగెలతోఁ గూడినకాళమేఘమువలెనుండి, సకలలోకనాయకుడైరాజ్యపరిపాలనము చేయుచు వేంచేసియుండునట్టి, నారణనై - శ్రీవైకుణ్ఠనాథుని, కడుగ - శీఘ్రముగ, నాన్ - దాసుడను, అనుబవిక్కుంవగై - అనుభవించుప్రకారమును, నల్ గు - ప్రసాదింపవలయును.

తా.—నన్నేలుకొనినవారగుయతిరాజా! అనన్తగరుడవిష్వక్సేన శ్రీపరాఙ్కుశపరకాలయతివరాది నిత్యముక్త వర్గము సేవించుచుండగ అత్యన్తానన్దజనకమునురత్నమయమునగు మహామణ్టపమునందు దివ్యశయ్యయగుఆదిశేషులఫణామణులచే ప్రకాశించునట్టి జ్యోతిర్మణ్డలమధ్యమున సౌన్దర్యసౌకుమార్యాదులచే నిరూపింపఁదగిన శ్రీమహాలక్ష్మియుభూదేవియు నీళాదేవియును పార్శ్వములందు సేవించుచుండగ మెఱుపుతీగెలతోఁగూడినకాళమేఘమువలె సకలలోకనాథుడును ఏకచ్ఛత్రాధిపతియునై పరిపాలించునట్టి శ్రీవైకుణ్ఠనాథుని శీఘ్రమునదాసుడనుభవించువిధమును ప్రసాదింపవలయునని.

౨౮. ఇన్దవుడల్ విట్టిరవిమణ్డలత్తూడేగి
యివ్వణ్డక్కిత్తిడై యిల్లావరణమేళ్ కోయ్,
అన్దమిల్ పాళ్ కడన్దప్పాల్ విరజైదనిల్ కుళిత్తు,
అజ్గమానవనాల్ తీణ్డశ్శోదియుమ్ పెత్తు, అమరర్

వన్దెదిర్ కొణ్డలఙ్గరిత్తువాழ్త్తివழினడత్త
వైగున్దమ్పుక్కుమామణిమణ్డపత్తుచ్చేన్ఱు,
నన్దిరుమాలడియార్ గళ్ కుழாఙ్గళుడన్ కూడుమ్
నాళెనక్కుక్కుఱుగుమ్వగైనల్ గెన్నెతిరాశా.

టీక.—ఎన్ ఎతిరాశా! దాసునికిస్వామియగుయతులకునాధులునగు ఎమ్బెరుమానారే ? ఇన్దవుడల్ - నీచమైనయీస్థూలశరీరమును, విట్టు - విడిచి, ఇరవిమణ్డలత్తూడే - సూర్యమణ్డలమునుదాటియావలికిబోయి, ఇవ్వణ్డమ్ - ఈబ్రహ్మాణ్డమును, కడన్దు - దాటి, ఇడైయిల్ - మధ్యనుండు, ఆవరణమ్ఏழுపోయ్ - సప్తావరణములనుదాటి, అన్దమిల్ - ముగింపులేని, పాழ్ కడన్దు - మూలప్రకృతినిదాటి, అழగార్ - మిగులరమణీయముగనుండు, విరజైతనిల్ - విరజానదియందు, కుళిత్తు - స్నానముచేసి, అఙ్గు - అచ్చట, అమానవనాల్ - అమానవునియొక్కహస్తస్పర్శముచే, ఒళికొణ్డశోదియుమ్ - నిరవధికతేజోరూపమైన దివ్యదేహమును, పెఱ్ఱు - లభించి, అమరర్ - నిత్యసూరులు, వన్దుఎదిర్ కొణ్డు - ఎదుర్కొనివచ్చి, అలఙ్గరిత్తు - సర్వేశ్వరునిఅలఙ్కరించినవిధముగ నలఙ్కరించి, వాழ்త్తి - స్తోత్రముచేసి, వழினడత్త - మార్గమందునడపింపగ, వైకున్దమ్పుక్కు - శ్రీవైకుణ్ఠమహానగరమును ప్రవేశించి, మామణిమణ్డపత్తుచ్చేన్ఱు - రత్నమయమగుమహామణ్టపమును సమీపించి, నమ్ తిరుమాలడియార్ గళ్ - మనకుస్వాములును శ్రియఃపతికి దాసులునగునిత్యసూరులయొక్క, కుழாఙ్గళుడన్ - సమూహములతో, కూడుమ్నాళ్ - చేరునట్టియాదినమైనది, ఎనక్కు - దాసునికి, కుఱుగుమ్వగై - సమీపించువిధమును, నల్గు - కృపచేసిప్రసాదింపవలయును.

తా.—దాసునికి స్వామియగుయతిరాజా ? ఈస్థూలదేహమునువిడిచి, సూర్యమణ్డలము ఈబ్రహ్మాణ్డముసప్తావరణములు అన్తములేని మూలప్రకృతి వీనినన్నిటినిదాటి విరజానదియందు స్నానమొనర్చి, అమానవకరస్పర్శముచే తేజోరూపమైన దివ్యదేహమును బొంది నిత్యసూరులు ఎదుర్కొనివచ్చియలఙ్కరించిస్తుతించి మార్గమునుసాగింపగ శ్రీవైకుణ్ఠమును బ్రవేశించి,నవరత్నఖచితమగుమహామణ్టపమును సమీపించి మనకు పరమపూజ్యులునుభగవద్భక్తులునగు నిత్యసూరులగోష్ఠితోఁ జేరునట్టిదినము దాసునికి సన్నిహితమగు విధమును కరుణించి ప్రసాదింపవలయునని.

౨౫. ఎన్ఱుని రేతుకమాగ,వెన్నైయబిమానిత్తు
యాన్ఱుఙ్గినున్నక్కేయాయిరుక్కుమ్పడిశెయ్ దాయ్,
అన్ఱుముదల్ఇన్ఱళవుమ్ఉనవరదమ్పత్తియే
యడుత్తడుత్తుచ్చెయ్వదనుదవిప్పదిన్నిచ్చెయ్యెన,

ఎన్ఱునై న్నై వన్దిరప్ప దామెన్కొడుమైగణ్డుమ్
ఇగళ్దా దేయిరవుపగల్లడిమై క్కొణ్డుపోన్దాయ్,
ఇన్ఱుతిరునాడుమెనక్కరుళ వెణ్ణుగిన్ఱాయ్,
ఇనిక్కడుగచ్చెయ్దరుళ వేణుమెతిరాశా.

టీక.—ఎతిరాశా ! యతులకునాథులైన ఎమ్బెరుమానారే ! ఎన్ఱు- ఏదినమందు, నిర్హేతుకమాక - నిర్హేతుకముగ, (కారణములేక) ఎన్నై - దాసుని, అభిమానిత్తు - వీడుమనవాడనియభిమానించి, యానుమ్ - దాసుడును, అదఱిన్దు - ఆయభిమానవిశేషమునుగుర్తెఱిగి, ఉనక్కే - దేవరవారికే, ఆయిరుక్కుమ్ - అనన్యార్హశేషమైయుండదగిన, వగై - ప్రకారమును, శెయ్దాయ్ - కృపచేసితిరో ? అన్ఱుముదల్ - ఆదినము మొదలుకొని, ఇన్ఱళవుమ్ - ఈదినమువరకును (పూర్వవాసనవిడువక) అనవరతమ్ - ఎల్లప్పుడును, పిழైయే - అపరాధమునే, అడుత్తడుత్తు - ఎడతెగక, శెయ్వదు - చేసి. (ఇట్లు చేసితిమేయని) అనుతవిప్పదు - అనుతపించుట (పశ్చాత్తాపమునొందుట)ఇని- ఇకమీదు, శెయ్యేనెన్ఱు - చేయజాలనుఅని, ఉన్నై - దేవరవారిని, వన్దుఇరప్పదుఅమ్- వచ్చియాచించునట్టి, ఎన్కొడుమైకణ్డుమ్ - దాసునిక్రూరమైన పనులను కటాక్షించియును, ఇగழాదే - ఉపేక్షింపగ, ఇరవుపకల్ - దివారాత్రములును, అడిమైకొణ్డు - దేవరవారిశ్రీపాదములందుకైఙ్కర్యమునుగొని, పోన్దాయ్ - వచ్చుచుంటిరి, (ఇంతమాత్రమేగాక) ఇన్ఱు - ఇప్పుడు, తిరునాడుమ్ - పరమపదమును, ఎనక్కు - దాసునికి, అరుళ - కృపచేయుటకు, ఎణ్ణుగిన్ఱాయ్ - కృపచేనాలోచించుచున్నారు, (ఇట్లుఅపారకరుణాసమృద్ధిగలవారగుటచే) ఇని - ఇక, కడుగ - శీఘ్రముగ, శెయ్దరుళ్ వేణ్డుమ్ - కృపచేయువలయును.

తా.—యతిరాజా ! ఎప్పుడుదాసుని నిర్హేతుకముగ అభిమానించి దేవరవారికే శేషపడి యుండునట్లు అనుగ్రహించితిరో, దాసుడుఅది తెలిసియుపగలఎల్లప్పుడును అపరాధములనేచేయుచు అనుతపించి, ఇకమీదు అట్లుచేయనని దేవరవారినివచ్చి యాచించునట్టిదాసుని క్రూరకృత్యములను కటాక్షించియు దాసునివదలక రేయుంబగళ్లును కైఙ్కర్యమును అంగీకరించుచూవచ్చుచుంటిరి, ఇంతేగాక దాసునికిపరమపదమును కృపచేయదలచుచున్నారు, ఇట్లుకృపాస్వరూపులగుటచే ఇకఆలస్యములేక పరమపదమును కృపచేయువలయునని.

౫౭ — ౨౩. తెన్నరఙ్గర్ దమక్కామో దేవియర్ గట్కామో
శేనై యర్ కోన్ ముదలాన శూరియర్ గట్కామో,

కణ్డదెల్లామెழுదియవై కఱ్ఱిరున్దుమ్ పిఱర్కు
కాదలుడన్ కఱ్పిత్తుమ్ కాలత్తై కழிత్తేన్,
పుణ్డరీకై కేళ్వనుఱై పొన్నులగుతన్నిల్
పోగనినైవొన్ఱుమిన్ఱిప్పొరున్దియిఙ్గేయిరున్దేన్,
ఎణ్డిశైయుమేత్తుమెతిరాశనరుళాలే
ఎழிల్ విశుమ్బైయన్ఱియిప్పోదెన్ మనమెణ్ణాదే.

టీక.— పణ్డు - పూర్వమందు, పలవారియరుమ్ - అనేకోజ్జీవనము దాసక్తిగల పూర్వాచార్యులందఱును, (ఏకకణ్ఠమై) పారులకోర్ - భూమియందలి సకలచేతనులును, ఉయ్య - ఉజ్జీవించుటకు, పరివుడనే - ప్రేమతో, శెయ్దరుళుమ్ - అనతిచ్చిన, పల్ కలైగళ్ తమ్మై - అనేక ప్రబన్ధములను, కణ్డదెల్లామ్ - చూచినవంతయును, ఎழுది - లిఖించి, అవై - వానిని, కఱ్ఱిరున్దుమ్ - ఆచార్యముఖముగ నభ్యసించియుండియు, పిఱర్కు - ఇతరులకు, కాదలుడన్ - ప్రేమతో, కఱ్పిత్తుమ్ - బోధించియును, కాలత్తై - కాలమును, కழிత్తేన్ - గడపితిని, పుణ్డరీగైక్కేళ్వన్ - కమలవాసినియగు శ్రీమహాలక్ష్మీకివల్లభుఁడగు శ్రీమన్నారాయణుఁడు, ఉఱై - నిత్యవాసము చేయునట్టి, పొన్నులగుతన్నిల్ - నిత్యవిభూతియగు పరమపదమునకు, పోగ - పోవలయునని యెడు, నినైవు - జ్ఞాపకము, ఒన్ఱుమిన్ఱి - కొంచెమైనను లేక, పొరున్ది - పొంది, ఇఙ్గే - ఈ విభూతియం దాశగలవాడనై, ఇరున్దేన్ - ఉంటిని, ఎణ్డిశైయుమ్ - దిగన్తములలో నుండు వారలు, ఏత్తుమ్ - తమ వైభవమును జెప్పి స్తోత్రము చేయునట్టి, ఎతిరాశన్ - ఈ యతివరులయొక్క, అరుళాలే - కృపచేత, ఎழிల్ విశుమ్బైయన్ఱి - విలక్షణమైన పరమపదమునుదప్ప, ఇప్పోదు - ఇప్పుడు, ఎన్ మనమ్ - నాహృదయమైనది, ఎణ్ణాదు - వేఱొకటిని స్మరింపదు.

తా.— పూర్వాచార్యులందఱును ఏకరీతిగ సకల చేతనోజ్జీవనార్థమై ప్రసాదించిన అనేక ప్రబన్ధములను ఆచార్యముఖముగ నభ్యసించియును, చూచినవానినంతయును వ్రాసియు ఇతరులకు బోధించియు, కాలయాపనంబొనర్చుచు పరమపదమును బొందవలయునను జ్ఞప్తికొంచెమైనను లేక ఈలోకమందపేక్షగలిగి ఇచ్చట వసించితిని. దిగన్తములందు సకలచేతనులు స్తుతించునట్టి ఎమ్బెరుమానారుల కృపచే నాహృదయము ఇప్పుడు పరమపదమునుదప్ప వేఱొకటిని స్మరింపదని.

౨౯. శారువాగమదనీఱు శెయ్దు శమణచ్చెడిక్కనల్ కొళుత్తియ
శాక్కియక్కడలైవఱ్ఱువిత్తు మిక్కుశాఙ్గియక్కిరిముఱిత్తిడ

మాఱుశెయ్‌దిడుకణాదవాదియర్‌గళ్ వాయ్‌తగర్త్తఱమిగుత్తుమేల్
వన్దపాశుపతర్ శిన్దియోడుమ్‌వగై వాదుశెయ్‌ద వెతిరాశనార్,
కూఱుమాకురుమద త్తోడోఙ్గియకుమారిలన్ మద మవఱ్ఱిన్ మేల్
కొడియతర్క్కశరమ్‌విట్టపిన్ కుఱుగిమాయవాదియరై వెన్ఱిడ,
మీఱివాదిల్‌వరుపాఱ్కరన్ మదవిలక్కడికొఴుడి యెఱిన్దుపోయ్
మిక్కయాదవమతత్తైమాయ్‌త్తపెరువీరర్ నాళుమ్‌మిగవాఴియే.

టీక.— శాఱువాగమతమ్ - "ప్రత్యక్షమేకఞ్చార్వాకః" = కంటికెదురుగనగుబడునట్టిదాని నొకటినే ప్రమాణముగ నమ్మునట్టి చార్వాకమతమును, నీఱుశెయ్‌దు - స్వసూక్తులనెడు అగ్నిజ్వాలచే భస్మమగునట్లుచేసి, శమణచ్చెడిక్కు - జయినులు అను వృక్షమునకు, అనల్ - అగ్నిని, కొళుత్తి - రగులఁబెట్టి, శాక్కియక్కడలై - శాక్యులుఅను సముద్రమును, వఱ్ఱువిత్తు - తనవాక్కులనెడు కిరణములచే శోషింపఁజేసి, మిగు - అతిశయించియున్న, శాఙ్కియక్కిరి - సాంఖ్యమతముఅను కొండను, ముఱిత్తిడ - వాక్కుఅను వజ్రాయుధముచేత ఛేదించి, మాఱుశెయ్‌దిడు - ప్రతికక్షిగనుండి వాదించునట్టి, కణాదవాదియర్ - కాణాద వాదుల యొక్క, వాయ్ - వాక్కును, తగర్త్తఱ - తనవాక్కుచే భగ్నమగునట్లుచేసి, మిగుత్తు - అతిక్రమించి, మేల్‌వన్ద - పైకొనివచ్చిన, పాశుపతర్ - బాణాసురయుద్ధమందు రుద్రుఁడు తనపరివారముతో పరుగిడినట్లు తనభక్తులగు శివమతస్థులును, శిన్దియోడుమ్‌వగై - చెదరిపరుగిడునట్లు, వాదుశెయ్‌ద - వాదమొనర్చిన, ఎతిరాశనార్ - ఎమ్బెరుమానార్లను, కూఱుమ్ - వదరునట్టి, ఆ - "కురల్" అనువానిధ్వనిగల, కురుమతత్తోడు - ప్రభాకరమతముతో, ఓఙ్గియ - పెరిగియుండునట్టి, కుమారిలన్ మదమవఱ్ఱిన్ మేల్ - భాట్టమతము అనువానిపైగ, కొడియ - క్రూరమైయుండు, తర్క్కశరమ్ - తర్కమను బాణమును, విట్టపిన్ - ప్రయోగించినవెనుక, మాయవాదియరై - మాయావాదులను, కురుగి - సమీపించి, వెన్ఱిడ - జయింపగ, మీఱి - అధికముగా గర్వించి, వాదిల్‌వరుమ్ - వాదమునందువచ్చునట్టి, పాఱ్కరన్ మదవిలక్కడికొఴుడి - భాస్కర మతముఅను వేరుతీగెలు అడ్డపడగ, ఎఱిన్దుపోయ్ - వానినిఛేదించి జ్వలింపఁజేసి యావలికివెడలి, మిక్క - అధికమైన, యాదవమతత్తై - యాదవప్రకాశుని మతమును, మాయ్‌న్ద - నశించునట్లు చేసిన, పెరువీరర్ - మహాపరాక్రమముగల ఎమ్బెరుమానార్లు, నాళుమ్‌మిగవాఴియే - నిత్యాభివృద్ధియగునట్లు క్షేమముతో విజయముచేసి యుండవలయును.

తా.—చార్వాకులు, జైనులు, శాక్యులు, సాంఖ్యులు, కాణాదులు, శైవులు, భాట్టప్రభాకరులు, మాయావాదులు, భాస్కరులు, యాదవప్రకాశుఁడు, మొదలగు మతస్థులను

నశింపఁజేసిన మహాపర్వాక్రమశాలులగు ఉడైయవరులు నిత్యాభివృద్ధితో మఙ్గళకరముగ సేవసాదించుచుండ వలయునని.

30\. శీరారుమెతిరాశర్ తిరువడిగళ్ వాళ్ళి,
తిరువరైయిల్ శాత్తియ శెన్దువరాడై వాళ్ళి,
ఏరారుమ్ శెయ్యవడివెప్పొళుదుమ్ వాళ్ళి,
ఇలఙ్గియమున్నూల్ వాళ్ళియిణైత్తోళ్గళ్ వాళ్ళి,
శోరాదతుయ్య శెయ్యముగచ్చోది వాళ్ళి,
తూముఱువల్ వాళ్ళితుణైమలర్క్కణ్గళ్ వాళ్ళి,
ఈరారుతిరునామమణిన్దవెణ్ణీఱ్ వాళ్ళి,
ఇనిదిరుప్పోడెళిల్ ఞానముత్తిరై వాళ్ళియే.

టీక — శీర్ - కల్యాణగుణములచే, ఆరుమ్ - పరిపూర్ణమైన, ఎతిరాశర్ - ఎమ్బెరుమానార్లయొక్క, తిరువడిగళ్ - శ్రీపాదములు, వాళ్ళి - ఎల్లప్పుడు మఙ్గళముగనుండవలయును, తిరువరైయిల్ - కటిప్రదేశమందు (మొలలో) శాత్తియ - ధరించిన, శెన్దువర్ ఆడై-మిగులఎఱ్ఱనైన కాషాయవస్త్రము, వాళ్ళి .., ఏరారుమ్ - సౌన్దర్యముచే నిండిన, శెయ్యవడివు - ఎఱ్ఱని దివ్యమఙ్గళ విగ్రహము, ఎప్పొళుదుమ్ - సర్వకాలములందును, వాళ్ళి .., ఇలఙ్గియ-వక్షస్థలమందు ప్రకాశించుచున్న, మున్నూల్ - బ్రహ్మసూత్రమును, వాళ్ళి..., ఇణైత్తోళ్గళ్ - బంగారుకల్పవృక్షపు కొమ్మలై మోక్షప్రదములై సంసారిచేతనులను రక్షింప సమర్థములై వకుళతులసీ నళినాక్ష మాలాలంకృతములైన రెండు భుజములును, వాళ్ళి .., శోరాదతుయ్యశెయ్య - అనుభావ్యమై భగవత్సాక్షాత్కారము చేతను సంకోచింపని నిర్మలమై శుభావహమై యుండెడు, ముకచ్చోతి - ముఖముయొక్క కాన్తివిశేషము, వాళ్ళి .., తూముఱువల్ - భగవదనుభవమందును ఆశ్రితరక్షణమందును ఆనన్దముచే పుష్పము వికసించినట్లు ప్రీతిని ప్రకాశింపఁజేసెడు పరిశుద్ధమైన చిఱునగవును, వాళ్ళి - నిత్యమఙ్గళముగ నుండవలయును, తుణైమలర్క్కణ్గళ్ - శ్రీరఙ్గశ్రీనిన్ని శ్రీవైష్ణవ శ్రీనిన్ని కటాక్షించి సన్తోషించునదియై ఆశ్రితులను నిర్మలులగునట్లు చేయునట్టి దర్శనముగలదియు తామరపుష్పములవలె సున్దరమగు నేత్రములు, వాళ్ళి..., ఈరారు తిరునామమ్ అణిన్ద - క్రిందుచెప్పిన వానిన్నిటికిని ప్రకాశమై శ్రీవైష్ణవ శ్రీకివర్ధకమై యుండునదియై స్వర్ణపర్వత సమీపమందంతట తెల్లని తామరపుష్పములు పుష్పించినట్లు ఎఱ్ఱని తిరుమేనుయందు తెల్లని ద్వాదశోర్ధ్వపుండ్రములను ధరించుట చేఁగలిగిన, ఎళిల్ - సౌన్దర్యము, వాళ్ళి..., ఇనిదు ఇరు

పోదు - పద్మాసనస్థులై వేంచేసియున్నయునికితో, ఎళిల్ - ఉభయవేదాన్తార్థప్రకాశకమైయుండునట్టి, ఞానముత్తిరైక్కై - పరతత్వబోధ సూచకమగు శ్రీహస్తము, వాళియే - నిత్యానుభవముగనుండవలయును.

తా.— యతిరాజులవారి శ్రీపాదపద్మములు, వారియొక్క కాషాయవస్త్రము, దివ్యమంగళ విగ్రహము, యజ్ఞోపవీతము, భుజములు, ముఖమణ్డలజ్యోతి, చిఱునగవు, నేత్రకమలములు, ద్వాదశోర్ధ్వపుండ్ర సౌన్దర్యము, పద్మాసనస్థులై సేవసాదించుయునికితోఁగూడిన జ్ఞానముద్ర, మొదలగునట్టి పన్నియును నిత్య శుభముగ నుండవలయునని.

౩౧. అఱుశమయచ్చెడియదనై యడియఱుత్తాన్ వాళియే,
అడర్ న్దువరుమ్ కుదిట్టిగళై యఱత్తులన్దాన్ వాళియే,
శెఱుగలియైచ్చిఱిదుమఱ త్తీర్తు విట్టాన్ వాళియే,
తెన్నరఙ్గర్ శెల్వముత్తుమ్ తిరుత్తివైత్తాన్ వాళియే,
మఱైయదనిల్ పొరుళనైత్తుమ్ వాయ్ మొళిన్దాన్ వాళియే,
మాఱనురై శెయ్దతమిళ్ మఱై వళర్త్తాన్ వాళియే,
అఱమిగునల్ పెరుమ్బూదూర్ వదరిత్తాన్ వాళియే,
అళగారుమ్ యతిరాశర్ అడియిణైగళ్ వాళియే.

టీక.— అఱుశమయచ్చెడియదనై - వేదబాహ్యములగు షణ్మతములు అను వృక్షములను, అడియఱుత్తాన్ - సమూలముగ ఛేదించినవారు, వాళియే - నిత్యముగ సుఖముతో వేంచేసియుండవలయును, అడర్ న్దువరుమ్ - గుంపులుగగూడి పైఁబడివచ్చునట్టి, కుదిట్టిగళై - కుదృష్టిమతస్థులను, అఱత్తులన్దాన్ - సవాసనగ తరుమగొట్టినవారు, వాళియే..., శెఱుకలియై - లోకమంతయును గాఢమై యావరించెడు కఠినమగుకలిని, శిఱిదుమ్ - కొంచమైనను, అఱ - లేకుండునట్లు, తీర్తువిట్టాన్ - పోఁగొట్టినవారు, వాళియే..., తెన్నరఙ్గర్ - సౌన్దర్యపరిపూర్ణులగు పెరియపెరుమాళ్ళయొక్క (శ్రీరఙ్గనాథులయొక్క) శెల్వమ్ముఱ్ఱుమ్ - సకలసమ్పత్తులను, తిరుత్తివైత్తాన్ - (ఆజ్ఞాప్రకారముగ నడుచునట్లు) దిద్దుపాటొనర్చినవారు, వాళియే..., మఱైయదనిల్ - వేదమునందు ప్రతిపాదింపఁబడునట్టి, పొరుళనైత్తుమ్ - సకలార్థములను, వాయ్ మొళిన్దాన్ - శ్రీభాష్యరూపముగ అనతిచ్చినవారు, వాళియే..., మాఱన్ - నమ్మాళ్వార్లు, ఉరైశెయ్ద - అనతిచ్చిన, తమిళ్ మఱై - ద్రావిడవేదమగు దివ్యప్రబన్ధములను, వళర్త్తాన్ - వృద్ధిబొందించినవారు, వాళియే..., అఱమిగు - అందలితాత్పర్యమగు శరణాగతిధర్మము లోకమందు అభివృద్ధియగుటకు, నల్ పెరుమ్బూదూర్ - విలక్షణమైన శ్రీపెరుమ్బూదూరిలో, అవదరిత్తాన్ -

అవతరించినవారు, వాళియే''', అళ్లగారుమ్- సౌన్దర్యాదులచే పూర్ణులైయుండు, ఎతిరా శర్ - ఎమ్బెరుమానార్లయొక్క, అడియిణైగళ్ - సర్వరక్షకమగు శ్రీపాదపద్మములు, వాళియే - నిత్యమఙ్గళముగ నుండవలయును.

తా.— షణ్మతస్థులను కుదృష్టులను నిరసించవవారును కలిదోషమును బోగొట్టిన వారును శ్రీరఙ్గనాథుని సకలసమ్పదలను దిద్దుపాటొనర్చిన వారును వేదార్థములను శ్రీభాష్యమూలముగ అనతిచ్చినవారును ద్రావిడవేదమగు ఆళ్వార్ల దివ్యప్రబన్ధములనువృద్ధిబొందించినవారును శరణాగతిధర్మముయొక్క అభివృద్ధికొఱకై శ్రీపెరుమ్బూదూరిలో అవతరించినవారునగు యతిరాజులవారికిని వారిశ్రీపాదపద్మములకును సదా సకలమంగళములును గలుగుచుండవలయునని.

౩.౨. శఙ్కర, బాఙ్కర, యాదవ బాట్టప్పిర బాగరర్, దఙ్గళ్ మతమ్, [నాళ్,
శాయ్వుఱ, వాదియర్, మాయ్వురు మెన్ఱుశ్, దుమఱై వాళ్న్దిదు
వెఙ్గలి, యిఙ్గినివీఱునమక్కిలై యెన్ఱుమిగత్తళర్, నాళ్,
మేదినిన్నఙ్ఙుమైయాఱుమెనత్తుయర్ విట్టువిళఙ్గియనాళ్,
మఙ్గైయర్, ఆళిప రాఙ్గుశ, మున్నవర్, వాళ్వుముళైత్తిడునాళ్,
మన్నియ, తెన్నరఙ్గాపురిమామలై, మర్ఱువువన్దిడునాళ్,
శెఙ్గయల్, వావిగళ్, శూళ్, వయల్ నాళుమ్, శిఱన్దపెరుమ్బూదూర్,
శీమానిళై, యాళ్వార్, వన్దరుళియనాళ్, తిరువాదిరైనాళే.

టీక.— శఙ్కర - శఙ్కరునిమతము, బాఙ్కర - భాస్కరమతము, యాదవ- యాదవప్రకాశునిమతము, బాట్ట- భాట్టమతము, ప్రబాకరర్ తఙ్గళ్ మతమ్ - ప్రభాకరుని మతము, (ఇవియన్నియును) శాయ్ఁవుఱ - నాశమునుబొందుచుండగ, వాదియర్ - వాదించువారును, మాయ్వురు మెన్ఱు- జయములేకనశింతురని, శదుమఱై - నాల్గువేదములును, వాళ్న్దిదునాళ్ - పుష్కలమైనయర్థములను గలిగిఅభివృద్ధియగుదినము, వెఙ్గలి - క్రూరమైనకలియుగమును, ఇఙ్గిని- ఇక్కడఇకమీదట, వీఱునమక్కిలైయెన్ఱు - మనకు సామ్రాజ్యము చేయుటకుశక్యముగాదని, మిగత్తళర్ నాళ్ - మిగులస్థితిని తప్పిపోవునట్లు చేయునదియగు తిరునక్షత్రము, మేదిని - భూమియును, నమ్మఙ్మై- మనభారము, అఱుమెన- వదలిపోవునని, తుయర్ విట్టు - దుఃఖమునువిడిచి, విళఙ్గియనాళ్ - ప్రకాశించునట్టితిరునక్షత్రము, (ఇకభూమియందుండు అర్చాస్థలములను ఆదరించువారగుటచే) మఙ్గైయరాళి - తిరుమఙ్గైయాళ్వార్లయొక్కయు, పరాఙ్కుశ - నమ్మాళ్వార్లయొక్కయు, మున్న

వర్ - మిగతపూర్వాచార్యులయొక్కయు, వాఴ్వు - సమ్పద, ముళైత్తిడునాళ్ - అఙ్కురించునట్టితిరునక్షత్రము, మన్నియ - నమ్పెరుమాళ్లు (శ్రీరఙ్గనాథులు) నిత్యవాసముచేయునట్టి, తెన్నరఙ్గాపురి - రమ్యమైన శ్రీరఙ్గమహానగరమును, మామలై - గొప్పతిరుమలయును, మఱ్ఱుమ్ - ఇతరమగుదివ్యదేశములును, ఉవన్దిడునాళ్ - ఆనన్దించునట్టి తిరునక్షత్రము, శెఙ్గయల్ వావిగళ్ - ఎఱ్ఱనైరమ్యమైనమత్స్యములనుగలతటాకములచే, శూழ్ - చుట్టంబడియుండు, వయల్ - పంటభూములచే, నాళుమ్ - ఎల్లప్పుడును, శిఱన్ద - నగరాలఙ్కారములనుగలిగియుండు, పెరుమ్బూదూర్ - శ్రీపెరుమ్బూదూరిలో, శీమాన్ - శ్రీమన్తలగు, ఇళైయాழ్వార్ - ఇళైయాழ్వార్ అను తిరునామమును గలిగియుండు ఎమ్పెరుమానార్లు, వన్దరుళియనాళ్ - వచ్చియవతరించినదినము, తిరువాదిరైనాళే - ఆరుద్రాతిరునక్షత్రమేను.

తా.— శఙ్కరభాస్కర యాదవభాట్ట ప్రభాకరులమతస్థులతో వాదించివారిని నశింపఁజేయుటచే, చతుర్వేదములు అభివృద్ధియగుదినమును, కలిదోషములు నివర్తించునట్టిదివసమును, భూదేవి తనభారముతీరి సన్తోషించుదినమును, పరాఙ్కుశపరకాలనాథయామునాది ఆళ్వారాచార్యుల సమ్పదతలయెత్తునట్టి దివసమును, కోవెల(శ్రీరఙ్గము)తిరుమల (తిరుపతి) మొదలగు సమస్తదివ్యదేశములు సన్తోషించు దివసమునునగు ఇట్టివిశేషములతోఁగూడిన దినము శ్రీపెరుమ్బూదూరిలో యతిరాజులవారు అవతరించిన ఆరుద్రానక్షత్రదినమై యున్నదని.

33. ఇన్నమెత్తనై కాలమిన్దవుడమ్బుడన్ యానిరుప్పేన్
ఇన్నపొழுదుడమ్బువిడుమిన్నపడియదుదాన్,
ఇన్నవిడత్తేయదువుమెన్నుమివైయెల్లామ్
ఎతిరాశా! నీయఱిదియాన్నివైయొన్ఱఱియేన్,
ఎన్నైయినియివ్వుడమ్బైవిడువిత్తున్నరుళాల్
ఏరారుమ్వైగున్దత్తేఱ్ఱినినైవున్దేల్,
పిన్నైయవిరైయామల్మఱన్దిరుక్కిఱదెన్ పేశాయ్
పేదైమైతీర్న్నెయడిమైకొణ్డపెరుమానే.

టీక.— ఇన్నమ్ - ఇంకను, ఎత్తనైకాలమ్ - ఎంతకాలము, ఇవ్వుడమ్బుడన్ - హేయమైనయీదేహముతో, యాన్ - దాసుడను, ఇరుప్పేన్ - ఉందును, ఇన్నపొழுదు - ఇట్టికాలమందు, ఉడమ్బు - దేహము, విడుమ్ - వదులును, ఇన్నపడి - ఇట్టివిధమున, అదుదాన్ - ఆదేహవియోగమును, ఇన్నవిడత్తే - ఇట్టిస్థలమందు, ఆదువుమ్

ఆదేహమును విడుచుటయును, ఎన్నువివైయెల్లామ్ - అనిచెప్పఁబడునివియన్నియును, ఎతిరాశా - ఎమ్బెరుమానారే, నీయఱిది - సర్వజ్ఞులైన దేవరవారు తెలిసికొనుదురు, యాన్ - జ్ఞానములేనిదాసుడను, ఇవైయొన్ఱు - వీనిలోకొంచెమైనను, అఱియేన్ - గుర్తెఱుగను, (ఇట్లైనవెనుక) పేదమైతీర్త - అజ్ఞానమునుబోగొట్టి, ఎన్నై-నన్ను, ఆడిమై కొణ్డపెరుమానే-దాసునిగజేసికొన్నస్వామీ! ఎన్నై-ఈదేహముతోనుండు సమ్బన్ధమును వదలియున్నదాసుని, ఇని - ఇక, ఉన్నరుళాల్ - దేవరవారికృపచే, ఇవ్వుడమ్బై - ఈదేహమును, విడువిత్తు - వదులునట్లుచేసి, ఏశారుమ్ - దివ్యాలంకార పరిపూర్ణమైన, వైకున్దత్తు - పరమపదమునకు, ఏఱ్ఱ - ఆరోహింపఁజేయుటకు, నినైవుణ్డేల్ - అభిప్రాయమున్నయెడల, పిన్నై - తర్వాత, విరైయామల్ - త్వరబడక, మఱన్దిరుక్కిఅదునిష్ఫ్రయత్నముగమరచి వేంచేసియుండునది, ఎన్-ఏమికారణము, పేశాయ్ ఆనతిండు.

తా.— యతిరాజా! దాసుడను ఇంకనెంతకాలము ఈదేహముతోనుందును, దేహము ఇట్టిస్థలమున ఈవిధముగ నివృత్తియగును అనునవి యన్నియును దేవరవారికిఁ దెలియును, దాసుడు గుర్తెఱుగను కాబట్టి దాసునియజ్ఞానమునుబోగొట్టి ఏలుకొనినస్వామీ, దేవరవారుకృపచే, ఈదేహమును నివర్తింపఁజేసి దాసుని పరమపదమునకుఁజేర్ప నభిప్రాయమున్నయెడల ఊరకుండుటకేమి కారణము, ఆనతీయుడని.

౩౮. మున్నైవినై పిన్నైవినై యారత్తమెన్ఱు
మూన్ఱువగైయానవినైత్తొగైయనైత్తుమ్, యానే
యెన్నైయడైన్దోర్ దమక్కుక్కళిప్పదెన్నుమరజ్గర్
ఎతిరాశా నీయిట్టవఴక్కన్ఱో శొల్లాయ్,
ఉన్నైయల్లదఱియాద వున్నిన్నవుడ మ్బోడు
ఉఴన్ఱుఴిన్నైప్పయర్ఱా శిక్క వేణ్డువదొన్ఱుణ్డో,
ఎన్నుడైయవిరువినైత్తైయిత్తైప్ఫ్రుదిల్ మాఱ్ఱి
యేరారుమ్వైగున్దత్తేఱ్ఱివిడాయ్ నీయే.

టీక.— ఎతిరాశా-యతీశ్వరా! "మున్నైవినై - మునుపటిపాపములు, పిన్నైవినై - వెనుకటిపాపములు, ఆరత్తమ్ - ప్రారబ్ధము, ఎన్నుమ్ - అనిచెప్పఁబడు, మూన్ఱువగైయాన - మూడువిధములగు, వినైత్తొగై - పాపసమూహములు, అనైత్తుమ్- సమస్తమును, యానే - సర్వజ్ఞత్వసర్వశక్తిత్వములనుగలనేనే, ఎన్నై - వాత్సల్యాదిగుణవిశిష్టుడగునన్ను, అడైన్దోర్ తమక్కు- ఇతరోపాయములనువిడిచి ఆశ్రయించిన ప్రపన్నజనులకు, కఴిప్పదెన్నుమ్-అట్టిసకలపాపములను నిశ్శేషముగపోగొట్టుదునని" యానతిచ్చిన,

అరజ్గర్ - నమ్బెరుమాళ్ళు (శ్రీరఙ్గనాథులు) నీఇట్టవర్షుక్కు అన్రో - దేవరవారికివిధేయులుగదా, శొల్లాయ్-(ఈయర్థము వాస్తవము అనునది దేవరవారే) అనతీయఁవలయును ఉన్నైన్నయల్లదు-(ఇట్లు సర్వేశ్వరుని స్వాధీనముగగలిగిన) దేవరవారినితప్ప, అతియాద-వేఱొకరక్షకులను గుర్తెఱుగని, యాన్ - దాసుడను, ఇన్దఉడమ్బోడు - ఈశరీరముతో, ఉళ్లున్రు - శ్రమపడి, విన్నైప్పయన్ - తత్కార్యమైనపాపఫలమును, పుశిక్క-వేణ్డువదుఒన్రుణ్డో - అనుభవింపవలయును అని యొకనిర్బన్ధముగలదో, ఎన్నుడైయ - దాసునియొక్క, ఇరువిన్నైయై - ప్రబలపాపమును, ఇత్తైప్పొళుదిల్ - క్షణకాలమందు, మాఱ్ఱి - సవాసనగపోగొట్టి, ఏరారుమ్ - సౌన్దర్యపరిపూర్ణమగు, వైకున్దత్తు - శ్రీవైకుణ్ఠమునందు, నీరే - దేవరవారే, ఏత్రివిడాయ్ - ఆరోహింపఁజేయుడు.

తా.-యతీంద్రా? "నన్నాశ్రయించిన ప్రపత్తినిష్ఠులయొక్క పూర్వోత్తరప్రారబ్ధాది సర్వవిధపాపములను నేనేపోగొట్టుదు"నని యానతిచ్చిన శ్రీరఙ్గనాథుడు దేవరవారికి స్వాధీనుడుగదా, దేవరవారినితప్ప రక్షకములేనిదాసుడను శ్రమపడి యీదేహముతో నీపాపములను అనుభవింపవలయునని నిర్బన్ధముగలదో? దేవరవారు ఈపాపములనన్నిటిని క్షణమునందొలగఁజేసి దాసుని పరమపదమునకుఁజేర్పుడని.

3౫. అరుళాలేయడియేన్నైయభిమానిత్తరుళి
యనవరదమ్మడిమైగొళ్ళనినైత్తునీయిరుక్క,
మరుళాలేపులన్పోగవాఞ్జై శెయ్యుమ్మెన్
వల్వినైయైమాఱ్ఱియున్పాల్ మనమ్వైక్కప్పణ్ణాయ్,
తెరుళారుమ్కూరత్తాழ்వానుమవర్ శెల్వ
త్తిరుమగనార్దాముమ్మరుళ్ చ్చెయ్ద తీమై
త్తిరళానత్తనైయుమ్ శేరవుళ్ళవెన్నై
త్తిసత్తియుయ్యక్కొళ్ళుమ్వగై తేరుమెతిరాశా.

టీక.— అరుళాలే - కృపచేత, అడియేన్నై - దాసుని, అభిమానిత్తరుళి-అనన్యార్హునిగనట్లుఅభిమానించి, అనవరతమ్ - ఎల్లప్పుడును, అడిమైకొళ్ళ - నిత్యకైంకర్యము నంగీకరించుటకు, నినైత్తునీయిరుక్క, దేవరవారుతలచియుండగ, మరుళాలే - అజ్ఞానముచేత, పులన్-ఇంద్రియములయొక్క, పోగ - విషయభోగములను, వాఞ్జైశెయ్యుమ్ - అపేక్షించునట్టి, ఎన్ - దాసునియొక్క, వల్ - ప్రబలమైన, విన్నైయై - కర్మములను, మాఱ్ఱి- అవిషయమును వదలునట్లుచేసి, ఉన్పాల్ - దేవరవారివిషయమునందు, మనంవైక్క - హృదయమునుంచునట్లు, పణ్ణాయ్ - కృపచేయవలయును, తెరుళారుమ్-

జ్ఞానపరిపూర్ణులగు,కూరత్తాళ్వానుమ్-శ్రీకూరేశులును,అవర్ శెల్వత్తిరుమగనార్ తాముమ్-వారిగర్భమునందు అవతరించునట్టి సంపదగల శ్రీపరాశరభట్టరును, అరుళిచ్చెయ్ద - తమ నైచ్యములను అనతిచ్చిన, తీమైత్తిరళాన-పాపసమూహములగు, అత్తనైయుమ్-సమస్తమును, శేరవుళ్ల - చేరియుండెడు, ఎన్నై - దాసుని, తిరుత్తి - యోగ్యతగలుగునట్లు దిద్దుపాటొనర్చి, ఉయ్యక్కొళ్ళుమ్ - ఉజ్జీవింపఁజేయునట్టి, వగై - ప్రకారమును, ఎతిరాశా - ఎమ్పెరుమానారే, తేరుమ్ - చిన్తింపుడు.

తా.— యతిరాజా! దాసునియందు కరుణించి యభిమానముతో కైఙ్కర్యము నంగీకరించుటకు దేవరవారు దివ్యహృదయమందు యెంచియుండగ, ఇంద్రియ పరవశునై విషయభోగములనపేక్షించునట్టి దాసునియొక్క ప్రబలకర్మములను మార్చి దేవరవారియందు ప్రావణ్యముగలుగునట్లు కటాక్షింపవలయును, జ్ఞానాధికులగు కూరత్తాళ్వాను వారికొమాళ్లగు శ్రీభట్టరును నైచ్యముతో అనతిచ్చిన పాపపుంజములన్నియును చేరియుండు దాసుని దిద్దుపాటొనర్చి ఉజ్జీవింపఁజేయు విధమును ఆలోచింపవలయునని.

3౬. వాదనై యిల్లా ఉగ్రమో మాళాదవల్ విననై యో,
ఏదెన్ఱఱియేన్ ఎతిరాశా, తీదాగుమ్
ఐమ్బులనిల్ ఆశైయడియేన్ మనమ్దన్నై
వన్బుడనే త్తానడరుమ్ వన్దు.

టీక.— ఎతిరాశా - ఎమ్పెరుమానారే! తీదాగుమ్ - ఈయాత్మకు మిగుల చెడుగైయుండెడు, ఐమ్బులనిల్ - ఇంద్రియము లనుభవించు విషయసుఖములందు, ఆశై-అపేక్షయైనది, అడియేన్ - దాసునియొక్క, మనమ్తన్నై - మనస్సును, వన్బుడనే-బలాత్కారముతో, త్తాన్ వన్దు - తానే పైబడివచ్చి, అడరుమ్ - ఆక్రమించుచున్నది, (ఈరుచికి కారణము) వాదనైయిల్ - బాధించెడు విషయేంద్రియములలో, ఉగ్రమో - ప్రీతియో! మాళాద - ప్రాయశ్చిత్తము లేకున్న యెడల నశింపని, వల్ విననైయో - దాసుని ప్రబలపాపమో! ఏదెన్ఱు - ఎద్దియని, అఱియేన్ - గుర్తెఱుఁగను.

తా.—యతిరాజా! స్వరూపవిరుద్ధమగు విషయానుభవమందలి యిచ్ఛ దాసుని బలాత్కరించుచున్నది, ఇందుకు కారణము బాధకమగు విషయేంద్రియప్రేమయో? ప్రాయశ్చిత్త వినాశ్యమగు దాసుని ప్రబలకర్మమో? ఇట్టిదని గుర్తెఱుఁగనని.

32. ఇన్ఱళవుమిల్లావదికారమ్, మేలుమెన
క్కెన్ఱుళదామ్ శొల్లాయెతిరాశా, కున్ఱా
వినైత్తొడరై వెట్టివిట్టు,
మేలైవైగున్దత్తేనక్కు మగవేల్ ఉగ్రాదదెన్.

టీక.—ఇన్ఱళవుమ్ - ఇదివరకును, ఇల్లాఅదికారమ్ - లేనిఅధికారము, మేలుమ్-పైగ, ఎనక్కు - దాసునికి, ఎన్ఱు-ఎప్పుడు, ఉళదామ్ - కలుగును? (ఇప్పుడులేనిదాఇక మీదుగలుగఁబోవుచున్నది) కొల్లాయ్ - దీనినిదేవరవారు ఆనతీయవలయును, ఎతిరాశా - ఎమ్బెరుమానారే! కున్ఱా - నశింపని, విన్వైత్తొడరై - పాపానుబన్ధమును, వెట్టి విట్టు - ఛేదించి, మేలై - సర్వోత్తమమైన, వైకున్దత్తు -పరమపదమునందు, ఎన్నై-దాసుని, కడుగ - శీఘ్రముగ, ఏల్ త్తాదదు - చేర్పనిది, ఎన్ - ఏమికారణము.

తా.— యతీశ్వరా! ఈవఱకులేని యధికారము ఇకనెప్పుడు దాసునికిఁగలుగును, నశింపనిపాపముఅను తీగెనుఖండించిసర్వోత్తమమగు స్థానమునకుదాసుని చేర్పకుండుటకు హేతువేమి దేవరవారే ఆనతీయవలయునని.

౩౮. అఙ్జిలఱియాదార్ ఐమ్బదిలుమ్ఱామఱియార్,
ఎన్ఱుశొల్ ఎనక్కో వెతిరాశా, నెఞ్జమ్
ఉనదాళొళిన్దవత్రై యేయుగక్క విన్ఱుమ్,
అనుదాపమత్ఱిరుక్కైక్కియాల్.

టీక.—ఎతిరాశా-ఉడైయవరే! నెఞ్జమ్-నీచవిషయములందుఁ దగిలియుండుహృదయము, ఉనదు - ప్రాప్తశేషియగు దేవరవారియొక్క, తాళ్ - నిరతిశయభోగ్యమగు శ్రీపాదములకు, ఒళిన్ద - ఇతరమైన, అత్తైయే - అప్రాప్త విషయములైన వానినే, ఉగక్క - ఇష్టపడుటకు, ఇన్ఱుమ్ - ఇప్పుడును, అనుతాపమ్-నీచవిషయలందుబుద్ధిప్రవేశించుచున్నదేఅను, (పశ్చాత్తాపము) అత్ఱు - లేక, ఇరుక్కైక్కియాల్ - ఉండుటచే, అఙ్జిల్ - తెలివిగలుగుటకుఁదగినఅయిదు సంవత్సరములందు, అఱియాదార్ - గుర్తెఱుగనివారు, ఐమ్బదిలుమ్ - ఏబదిసంవత్సరములవయస్సునందును, తామ్అఱియార్ - వారు గుర్తెఱుగరు, ఎన్ఱుశొల్ - అనిచెప్పునట్టిసామెత, ఎనక్కో - దాసునికో ఱకైగలిగినదో.

తా.—యతిపతీ! ఈనీచహృదయము, దేవరవారిశ్రీపాదములకు ఇతరమైనతగనివిషయములందు యనుతాపములేక ఇష్టపడుచుండుటచే, అయిదుసంవత్సరముల వయస్సునందుసద్బుద్ధిగలుగనివారికి ఏబదిసంవత్సరములవయస్సైనప్పుడునుగలుగదు, అనునట్టి లోకప్రవాదము దాసునిబట్టియేగలిగినదోఅని.

౩౯. వేమ్బుకటియాగవిరుమ్బినార్క్కత్తెన్ఱు,
తామ్బొగడాదేప్పాశిక్కుమ్ఱనైప్పోల్, తీమ్బువివ
నెన్ఱునినైత్తెన్నైయిగళ్ళాదెతిరాశర్,
అన్ఱురిన్దగ్గిరికైక్కియాల్.

టీక.—వేమ్బు - వేపాకును, కతియాగ - కతియముదుగ (కూరగాయలుగ) విరుమ్బినార్ తామ్ - అపేక్షించినతాము, కైత్తతెన్ఱు - చేదుగనున్నదని, పొగడాదే - విడువక, పుశిక్కుమ్ - భుజించెదు, తన్మైపోల్ - స్వభావమువలె, తీమ్బన్ ఇవన్ - దుష్టుడువీడు, ఎన్ఱు - అని, నినైత్తు - విచారించి, ఎన్నై - దాసుని, ఎతిరాశర్ - ఉడైయవరులు, అన్ఱు - (అఙ్గీకరించిన) ఆకాలమందు, అఱిన్దు - (దోషవస్తుడని) గుర్తెఱిగి, అఙ్గీకరిక్కైయాల్ - ఆదోషమునేభోగ్యముగగాని యఙ్గీకరించుటచే, ఇగழార్ - ఉపేక్షింపరు.

తా.—వేపాకునేకరియముదుగ గ్రహించినవారు, వదలకభుజింపవలసినట్లు, ఉడైయవరులు, వీడుదోషవస్తుడని దాసునిగుర్తెఱిగి దోషములనే భోగ్యముగ నెంచియఙ్గీకరించుటచే, ఇకదాసునివిడువరని.

౪౦. అవత్తేపొழுదైయడియేన్ కழித్తు,
ఇప్పవత్తేయిరుక్కుమదువణ్ణో, తివత్తేయాన్
శేరుమ్వగైయరుళాయ్శీరారెతిరాశా,
పోరుమినియివ్వుడమ్బైప్పోక్కు.

టీక.—అడియేన్ - దాసుడను, పొழுదై - దేవరవారి అనుభవకైఙ్కర్యములకుదగినవిలక్షణమైన కాలమంతయును, అవత్తే - వ్యర్థముగ, కழித్తు - పోగొట్టి, ఇప్పవత్తే - విరోధియగునీసంసారమందు, ఇరుక్కుమదు - పొందియుండునది, వణ్ణో - దేవరవారికృపాస్వరూపమునకు చేరియుండునో, తివత్తే - పరమపదమును, యాన్ - దాసుడను, శేరుమ్వగై - చేరునట్టివిధమును, అరుళాయ్ - కృపచేయుడు, శీర్ - సమస్తకల్యాణగుణములచే, ఆర్ - పూర్ణులగు, ఎతిరాశా - ఎమ్బెరుమానారే! పోరుమ్ - సంసారమనుచెఱసాలయందుండునదిచాలును. ఇని - ఇక, ఇవ్వుడమ్బై - ఈశరీరమును, పోక్కు - నివర్తింపఁజేయవలయును.

తా.—సమస్తకల్యాణగుణస్వరూపులగుయతిరాజా! దాసుడనుకాలమంతయును వ్యర్థముగ బోగొట్టి యీసంసారమందుండునది దేవరవారికృపకుచేరునో? పరమపదమునకుదాసుడనుచేరునట్టి విధమునుకృపచేయుడు, సంసారముఅను చెఱయందుండునది చాలును ఇక ఈశరీరమునునివర్తింపఁజేయవలయునని.

౪౧. ఎన్నైప్పోల్పిழை శెయ్వారివ్వులగిలుణ్డో,
ఉన్నైప్పోల్పొఱుక్కవల్లారుణ్డో, అన్నైత్తులగుమ్

వాళ్లప్పిఅన్దవెతిరాశమామునివా,
ఏళ్లైక్కిరఙ్గాయిని.

టీక.—ఎన్నైప్పోల్ - దాసునివలె, పిళ్లై - అపరాధమును, శెయ్వార్ - చేయువారు, ఇవ్వులగిల్ - ఈలోకమందంతయు వెదకిచూచినను, ఉణ్డో - కలరా, ఉన్నైప్పోల్ - దేవరవారివలె, పొఱుక్కవల్లార్ - సహించుకొనువారు, ఉణ్డో - ఇహపరలోకములందుగలరా, అనైత్తులగుమ్ - సకలలోకములును, వాళ్ల - ఉజ్జీవించి సుఖించునట్లు, పిఅన్ద - అవతరించిన, ఎతిరాశ - యతిరాజులనుతిరునామమునుగల, మా - మహనీయులగు, మునివా - యోగిజనాగ్రగణ్యా, ఏళ్లైక్కు - సులభుఁడగు దాసునికి, ఇని - ఇక, ఇరఙ్గాయ్ - కృపయుంచికనికరింపవలయును.

తా.—సకలలోకోజ్జీవనార్థమై అవతరించిన, యతిరాజులుఅను నామాన్తరముగల యోగిజనాగ్రణ్యా! ఈలోకమందెక్కడ వెదకినను దాసుని వంటియపరాధియుండఁడు, ఉభయవిభూతులందును (ఇహపరములరెంటియందును) దేవరవారివలెసహనశక్తిగల వారును లేరు, కనుక ఈనిక్తాతుకుని కనికరించికటాక్షింపవలయునని.

౪౨. ఐమ్బులన్గళ్ మేలిట్టడరుమ్బొళ్లుదు (డ్డ) అడియేన్,
ఉన్పదఙ్గళ్ దన్నై నినైన్దోలమిట్టాల్, పిన్బవై దాన్
ఎన్నైయడరామల్ ఇరఙ్గాయెతిరాశా,
ఉన్నైయల్లాదార్ (శ) ఎనక్కుణ్డో.

టీక.—ఐమ్బులన్గళ్ - పంచేన్ద్రియములు, మేలిట్టు - పైఁబడి, అడరుమ్పొళ్లుదు - ఒక్కొక్కటియును తనతు విషయములను చూపుమనివెంబడించిబాధించునపుడు, అడియేన్ - దేవరవారికి శేషభూతుడగుదాసుడను, ఉన్ - దేవరవారియొక్క, పదఙ్గళ్ తన్నై - పాదారవిన్దములను, నినైత్తు - (శ్రీగజేంద్రునివలె) స్మరించి, ఓలమిట్టాల్ - „రామానుజా” అనిగొప్పధ్వనితోపిలువగా, పిన్బు - తర్వాత, అవై తామ్ - అట్లుబాధించునట్టిఆయిన్ద్రియములైనవి, ఎన్నై - దాసుని, అడరామల్ - సమీపింపకుండునట్లు(బాధింపకుండునట్లు) ఇరఙ్గాయ్ - కనికరింపుడు, ఎతిరాశా- యతీశ్వరా! ఉన్నైయల్లదు- దేవరవారినితప్ప, ఎనక్కుఆర్ - దాసునికిరక్షకులు ఎవరైనను, ఉణ్డో - కలరో? (లేరుకనుకదేవరవారేరక్షింపవలయుననిభావము)„ఉన్ పదఙ్గళ్ తన్నైనినైన్దోలమిట్టాల్” అనువాక్యమునకు, ఎమ్బెరుమానార్ తిరువడిగళేశరణమ్ అనిమనస్సుతోస్మరించివాక్కు చేగొప్పధ్వనితోపిలిచినయెడ అనియుగానచ్చును.

తా.—యతీశ్వరా! పంచేన్ద్రియములు దాసుని బాధించునపుడు దాసుడు దేవరవారి శ్రీపాదపద్మములను, శ్రీగజేంద్రుడు వెయ్యిదేవసంవత్సరములు మొసలి నీటికి పట్టియీడ్వగ తానుగట్టుకు ఈడ్వగ అలమటనొంది, మొసలియొక్క యిష్టసిద్ధికిస్వస్థలమగుటచే బలము అభివృద్ధియగుటచేతను, గజేంద్రునియొక్క అభిమతసిద్ధికిస్వస్థలము కానందుచేబలము క్షయించుటచేతను మహాదాపదనొందిన దశయందు, విరోధినిరసనశీలుఁడగు సర్వేశ్వరుడే మనకు రక్షకుడనియనుసన్ధించి “నారాయణాఓ” అనిమొఱయిడినట్లు స్మరించి, “రామానుజా” అనిమొఱబెట్టగా అయిన్ద్రియములు దాసునిక్రమపఱచకుండునట్లు కనికరింపుడు, దేవరవారినిదప్ప రక్షకాన్తరమును గుర్తెఱుగనిదాసునిరక్షింపవలయునని.

౪౩. ఇన్దవులగిల్ పొరున్దామైరేతుమిల్లై,
అన్దవులగిల్ పోగవాశైయిల్లై, ఇన్దనమక్కు
ఎప్పడియోదాన్ తరువర్ ఎన్దై యెతిరాశర్,
ఒప్పిల్ తిరునాట్టైయుగన్దు.

టీక.—ఇన్దవులగిల్ - కఠినలోకమగు ఈ త్యాజ్యభూమియందు, పొరున్దామై - పొందియుండమి, (అరుచి) ఏదుమిల్లై - కొంచెమైననులేదు, అన్దఉలగిల్ - అప్రాప్య భూమియగు పరమపదమందు, పోగ - పోవుటకు, ఆశై - ప్రావణ్యము, ఇల్లై - లేదు, ఇన్దన మక్కు - ఇట్లుండుమనకు, ఎన్దై - తండ్రియగు, ఎతిరాశర్ - ఎమ్బెరుమానార్లు, ఒప్పు - ఉప మానము, ఇల్ - లేని (వైభవముగల) తిరునాడు - పరమపదమును, ఎప్పడియో తాన్ - ఏప్ర కారముగ, ఉగన్దు - సన్తోషించి, తరువర్ - కృపయుంచియిప్పింతురు.

తా.—దాసునికి ఈలోకమునందు అరుచియులేదు పరమపదమునందు అపేక్ష యును లేదు, ఇట్టివానికి ఉడైయవరులు ఉపమానరహితమగు పరమపదమును ఎట్లు కృపచేతురని.

౪౪. మాగాన్దనారణనార్ వైగుమ్ వగైయఱిన్దోర్కు,
ఏగాన్దమిల్లైయిరుళ్ళిల్లై, మోగాన్దర్
ఇవ్విడమే గాన్దమీదెన్ఱిన్ఱు, వయమ్మర్ శ్రిరున్దు,
శెయ్యేవర్ గళ్ తామ్ పావత్తిఱమ్.

టీక.—మాకాన్ద - లక్ష్మీకాన్తుడగు, నారణనార్ - సర్వేశ్వరుడు, వైగుమ్ వగై - (నారాయణత్వమునుబట్టివచ్చిన సంబన్ధమూలముగ సకలచేతనాచేతనములయందును లోగను బైటను) వ్యాపించియుండు విధమును, అఱిన్దోర్కు - తెలిసినజ్ఞానవన్తులకు, ఏకాన్త

మిల్లైయిరుళిల్లై - ఏకాన్తము లేదు చీకటియును లేదు, (అంతటను ప్రకాశస్వరూపియైశ్రీమన్నారాయణుడు ఉండుటచే, నిషిద్ధప్రవర్తనముల కుపయోగమగు చీకటియు ఏకాన్తమును లేదన్నదనిభావము) మోగాన్దర్ - మోహముచేకన్నుదెలియనివారు, ఇవ్విడమ్ - ఈచోటు, ఏకాన్దమ్ - గుంపులేనిఏకాన్తస్థలము, ఇరుళ్ - చీకటిచోటు, ఎన్రు-అని, పయమ్ - భయము, అన్ఱి - లేక, ఇరున్దు-ఉండి, పావత్తిఱమ్-పాపసమూహములను, శెయ్వర్ గళ్ తామ్ - అజ్ఞులైనతాము చేయుచునుందురు.

తా.—శ్రీమహాలక్ష్మీపతియగు శ్రీమన్నారాయణుఁడు అంతటనిండియుండు విధమును దెలిసినజ్ఞానులకు ఏకాన్తస్థలమును అన్ధకారస్థలమును లేదు, మోహాన్ధులు ఇదిఏకాన్తమును చీకటియునైన స్థలమనిభయముతీరి యుండిపాపకృత్యములనాచరింతురని.

౮౫. నారాయణన్ తిరుమాల్, నారమ్ నామెన్నుమ్ ఉఱవు,
ఆరాయిల్ నెఞ్జే యనాదియన్ఱో, శీరారుమ్
ఆశారియనాలేయన్ఱో నామ్ ఉయ్న్దదెన్ఱు,
కూశామలెప్పొழுదుమ్ కూఱు.

టీక.—తిరుమాల్ నారాయణన్ - లక్ష్మీపతియగువాడు శ్రీమన్నారాయణుడు, నారమ్ నామ్ - జీవాత్మలు మనము, ఎన్నుమ్ -అనునట్టి, ఉఱవు - అ యనాదియగు అయనసంబన్ధము, ఆరాయిల్ - నిరూపించినయెడ, నెఞ్జే - మనసా, అనాదియన్ఱో - పురాతనమైనచ్చునదిగదా? శీరారుమ్ - అట్టిసంబన్ధమునుపదేశించిన జ్ఞానాదిగుణపరిపూర్ణులగు, ఆచారియనాలేయన్ఱో - ఆచార్యులమూలముగనేగదా సంబన్ధజ్ఞానముగలిగి, నామ్-మనము, ఉయ్న్దదెన్ఱు - ఉజ్జీవించినదని, కూశామల్ - లజ్జాభిమానములనువదలి, ఎప్పొழுదుమ్ - ఎల్లప్పుడును, కూఱు - ప్రసిద్ధముగ అనుసన్ధించుకొనుచునుండుము.

తా.— మనసా! నారాయణుఁడు అనునపుడు, నారములు అనగా జీవాత్మలగు మనము, అయనము - ఈజీవాత్మలకు స్థానభూతుడుగానుండువాడు లక్ష్మీపతియగు శ్రీమన్నారాయణుఁడు, అనునట్టి అనాదిసంబన్ధమును మనము, ఆచార్యులమూలముగ గదా గుర్తెఱిగి ఉజ్జీవించినదని, అహంకారమమకారాదులను విడిచి సదా అనుసన్ధించుకొనుచుండుమని.

౮౬. తిరువాయ్ మొழிప్పిళ్ళై తీవినై యోన్దమ్మై
క్కురువాగివన్దుయ్యక్కొణ్డు, పొరువిల్
మదిత్తానళిత్తరుళుమ్ వాழ்వన్ఱో నెఞ్జే,
ఎతిరాశర్క్కాళానోమ్ యామ్.

టీక.—తిరువాయ్ మొழிప్పిళ్లై - భూసురులగు శ్రీవైష్ణవులు మొదలగు సకలచేత నుల కుపయుక్తమగునట్లు అవతరించినతిరువాయ్ మొழிయందు అవగాహించి అందు శబ్దరసము అర్థరసము భావరసమును అనుభవించి తదేకనిష్ఠులై ఇతరశాస్త్రములను తృణమువలె తలచియుండువారగుటచే తిరువాయ్ మొழிతోటి సంబన్ధమునే తమకు నిరూపక నామముగ గలవారై ఆళ్వార్ల తిరువడిగళులో సదా సకలవిధ కైఙ్కర్యములను చేసికొనుచుండు తిరువాయ్ మొழிప్పిళ్లగారు, తీవినైయోమైత్తమ్మై - క్రూరకృత్యములుగల మనలను, కురువాగి - ఆచార్యులై అవతరించి, వన్దు - మనమున్న స్థలమును వెదకివచ్చి, ఉయ్య క్కొణ్డు - ఉజ్జీవించునట్లంగీకరించి, పోరువిల్ - శాస్త్రజ్ఞానమువంటిదిగాక ఉపమానము లేని, మది - తిరుమంత్రముచే గలుగునట్టిజ్ఞానమును, తాన్ - తాము, అళిత్తరుళుమ్ - ఉపకరించునట్టి, వాழ்వన్రో - సమ్పదచేతనేగదా, నెఞ్జే - మనసా! యామ్ - మనము ఎతిరాశరుక్కు! - ఎమ్బెరుమానార్లకు, ఆళానోమ్ - దాసులమైతిమి.

తా.— మనసా! తిరువాయ్ మొழிప్పిళ్లైగారు ఆచార్యులై క్రూరులగుమనల నుజ్జీవించునట్లంగీకరించి శాస్త్రజ్ఞానమువలె కష్టసాధ్యముగాక సులభమును సాటిలేనిదియు నైన తిరుమంత్రజ్ఞానమునుపదేశించి జ్ఞానవన్తునిగఁజేయుటచేతనే గదా మనము ఎమ్బెరుమానార్లకు కైఙ్కర్యమొనర్చునట్లు లభించితిమని.

౪౭. ఇరామానుశాయనమ వెన్ఱిరవుమ్పగలుమ్శిన్దిత్తు,
ఇరామానుశర్గళ్ ఇరుప్పిడన్దన్నిల్ ఇత్తైప్పొழுదుమ్,
ఇరామానుశర్వర్క్కెల్లావడిమైయుమ్ శెయ్యవెణ్ణి,
ఇరామానుశర్ దమ్మై మానుశరా వెన్గొల్ ఎణ్ణువదే.

టీక.—ఇరామానుశాయ - ఎమ్బెరుమానార్లకొఱకు, నమః ఎన్ఱు - నమస్కారముఅని, ఇరవుమ్పగలుమ్ - రాత్రియు పగలును, శిన్దిత్తు - అనుసన్ధించి, ఇరా - ఉండని, మానుశర్గళ్ - మనుష్యులు, ఇరుప్పిడన్దన్నిల్ - వసించెడు స్థలమునందు, ఇత్తైప్పొழுదుమ్ - క్షణకాలమును, ఇరా - ఉండియుండని, మానుశరవర్క్కు - మనుష్యులకు, ఎల్లావడిమైయుమ్ - సర్వవిధకైఙ్కర్యములను, శెయ్యవెణ్ణి - చేయనపేక్షించి, ఇరా - ఉండని, మానుశర్ తమ్మై - కనికరములేని మనుష్యులను, (పశుసమానులగువారిని) మానుశరాగ - మనుష్యులనుగ, ఎన్గొల్ - ఎట్లు, ఎణ్ణువదు - తలచునది, (జ్ఞానము లేనివాడు పశువుతో సమానుడేగదా).

తా.—"శ్రీమతేరామానుజాయనమః" అని దివారాత్రములు అనుసన్ధింపనివారియొక్క వాసస్థలములందు క్షణకాలమును వసింపని కూరత్తాళ్వాన్ వంటిమహనీయులకు సకలవిధకైఙ్కర్యములుచేయనపేక్షింపని మనుష్యులను పశుసమానులుగతలపవలయునని.

౪౮. ఎణ్ణాదెన్నెఞ్జనిశై యాదునావిఱైఞ్జాదుశెన్ని,
కణ్ణానవైయొన్నుమ్‌కాణలుఱ్ఱా, కలియార్‌నలియ
వొణ్ణాదవణ్ణమ్మలగళిత్తోన్ఎతిరాశనడినణ్ణాదవరై,
యరఙ్గేశర్ శెయ్‌దనలమ్‌నమక్కే.

టీక.—కలియార్ - కలియుగమునందలి చేతనులు, నలియవొణ్ణాదవణ్ణమ్- ఆ కలి యొక్క క్రౌర్యముచే పీడింపఁబడకుండునట్లు, ఉలగు - లోకమును, అళిత్తోన్ - రక్షించునట్టివారగు, ఎతిరాశన్ - ఎమ్బెరుమానార్లయొక్క, అడి - శ్రీపాదములను, నణ్ణాదవరై - సమీపించి ఆశ్రయింపనివారిని, ఎన్నెఞ్జమ్ - నాహృదయమైనది, ఎణ్ణాదు - స్మరింపదు, ఎన్నావు - నావాక్కైనది, ఇశైయాదు - స్తుతింపదు, శెన్ని - నాశిరస్సైనది, ఇఱైఞ్జాదు - నమస్కరింపదు, కణ్ణానవై - నానేత్రములైనవి, ఒన్ఱుమ్ - ఒకటినిన్ని, కాణలుఱా - చూడనపేక్షింపదు, అరఙ్గేశర్ - (అన్తఃకరణము మొదలగు కరణములనిప్పించిన) శ్రీరఙ్గనాథుఁడు, శెయ్‌దనలమ్‌నమక్కే - ఆకరణములు అన్య శేషపడకుండువట్లు మనకుచేసిన మేలుగదా. (కలియార్ నలియవొణ్ణాదవణ్ణమ్ ఉలకళిత్తోనెతిరాశన్) అనుస్థలమందు, కలియార్ - కలియైనది, నలియవొణ్ణాదవణ్ణమ్ తన యొక్క క్రౌర్యముచే బాధింపకుండునట్లు, ఉలకళిత్తోన్ - లోకమును రక్షించిన, ఎతిరాశన్-ఎతిరాజులు, అనియు అర్థముగావచ్చును.)

తా.—ఈకలికాలమందు చేతనులకు కలియుగమువలని బాధ లేకుండునట్లు చేసిన ఉడైయవరులయొక్క శ్రీపాదముల నాశ్రయింపని చేతనులను నాహృదయము మొదలగు సకలేంద్రియములును అపేక్షింపదు, సకలేంద్రియ ప్రధాతయగు శ్రీరఙ్గనాథుడు ఈకరణములను అన్యశేషపడకుండునట్లు చేసినదిగొప్ప మేలుకదాఅని.

౪౯. నన్దానరగత్తళున్దామైవేణ్డిడిల్‌నానిలత్తీర్,
ఎన్దాదైయానవెతిరాశనై,నణ్ణుమ్, ఎన్ఱుమవన్,
అన్దాదిదన్నైయనుశన్దియుమ్మవన్తోణ్ణరడిక్,
శిన్దాకులఙ్గెడచ్చేర్న్దిరుమ్ ముత్తిపెఱ్ఱిత్తిక్కే.

టీక.—నన్దా - ఒకప్పుడును అనుభవించి ముగింపని, నరకత్తు - సంసారమను నరకమందు, అళున్దామై - అణగకుండుటను, వేణ్డిడిల్ - అపేక్షితమైనయెడ, నానిలత్తీర్ - నలువిధములగు భూమియందుండు వారలారా, ఎన్ - దాసునికి, తాదైయాన - తండ్రియైన, ఎతిరాశనై-ఎమ్బెరుమానార్లను, నణ్ణుమ్ - ఆశ్రయింపుఁడు, ఎన్ఱుమ్-సర్వకాలములందును, అవన్ అన్దాదితన్నై - మోక్షైకహేతువైయుండు వారితిరునామ

మును ప్రతిపాశురమందును చెప్పఁబడునదియై ప్రపన్నజనగాయత్రియైయుండు రామానుజనూఱ్ఱన్దాదిని, అనుసన్దియుమ్ - అనుసన్ధింపుడు, అవర్ తొణ్డరడక్కె - వారిశ్రీపాదములందు ప్రావణ్యముగల శ్రీవైష్ణవులతో, శిన్దాకులమ్ - ఇతరసహవాసముచేగలిగిన మనోదుఃఖమంతయును, కెడ - నశించునట్లు, శేర్ న్దిరుమ్-జలము రీతిగ చేరియుండుడు, పిన్ - ఇట్లైనవెనుక, ముత్తి-మోక్షమైనది, శిత్తిక్కుమ్ - సన్దేహములేక సిద్ధించును.

తా.—ఒకప్పుడును నశింపని సంసారమను నరకమందు అణిగియుండ నపేక్షలేని చేతనులారా, దాసునికి తండ్రియైన ఉడైయవరుల నాశ్రయింపుడు, ఎల్లప్పుడును వారి తిరునామప్రతిపాదకమగు రామానుశనూఱ్ఱన్దాదిని అనుసన్ధింపుడు, వారిభక్తులతో మనోవ్యాకులమంతయును నశించునట్లు చేరియుంటిరేని పరమపదము సిద్ధించునని.

౫౦. అవత్తేయరుమన్దకాలత్తైప్పోక్కి, యఱివిన్మైయాల్
ఇప్పవత్తేయుழల్ గిన్ఱ పావియర్ గాళ్, పలకాలమ్నిన్ఱు,
తవత్తేముయల్ బవర్దజ్గళుక్కుమ్మెయ్దవొణ్ణాద, వన్ద
త్తివత్తేయుమ్మైవెక్కుమ్శిన్దియుమ్నీరెతిరాశనెన్ఱే.

టీక.— అరుమన్దకాలత్తై - తిరునామమును అనుసన్ధించుటకు యోగ్యమైయుండెడు శ్లాఘ్యమైనకాలమును, అవత్తే - వ్యర్థముగ, పోక్కి - పోగొట్టి, అఱివిన్మైయాల్ - అజ్ఞానముచే, ఇప్పవత్తై - ఈసంసారమందు, ఉழల్ గిన్ఱ - మిగుల భ్రమించుచుండు, పావియర్ గాళ్ - పాపాత్ములారా, పలకాలుమ్ - సర్వకాలములందును, నిన్ఱు - ఐక్యమైయుండి, తవత్తే - తపస్సును, ముయల్ పవర్ తజ్గళుక్కుమ్ - చేయుచుండు వారికిని, ఎయ్దవొణ్ణాద - పొందఁగూడని యట్లుండు, అన్దదివత్తే - ఆపరమపదమందు, ఉమ్మై - నిత్యసంసారులగు మిమ్మును, వైక్కుమ్ - నిత్యసూరుల గోష్ఠితోఁ జేర్చియుంతురు, నీర్ - మీరు, ఎతిరాశరెన్ఱు - యతిరాజా అని, శిన్దియుమ్ - మనస్సున చిన్తింపుడు. (యత్నము అల్పమై ఫలము అధికమైయుండును.)

తా.—తిరునామానుసన్ధానమునకు తగినకాలమును వ్యర్థపఱచి అజ్ఞానముచేసంసారమందు పరిభ్రమించుచుండు పాపులారా! యతిరాజా, అని, ఉడైయవరుల తిరునామమునను సన్ధింపుడు, తపస్సమ్పన్నులకును పొందగూడని పరమపదమునుబొందుదురని.

౫౧. ఎన్ఱుళన్నీశనుయిరుమన్ఱేయుణ్డెక్కాలమెల్లామ్,
అన్ఱుళవాగప్పుழుదేకిన్దదిరువిన్మైయాల్,
ఎన్నళవిన్ఱియిరుక్కుమెన్నెఞ్జమిరవుపగల్
నిన్ఱుతవిక్కుమ్, ఎతిరాశానీయరుళ్ శెయ్దవిన్నే.

టీక.—ఈశన్ - నియమించువాడగు సర్వేశ్వరుఁడు, ఎను - ఎప్పుడు, ఉళన్ - ఉన్నాడో, ఉయిరుమ్ - నియామ్యుడగు చేతనుడును, అన్ద్రే - అప్పుడే, ఉణ్డు - కలిగి యున్నాడు, ఇక్కాలమెల్లామ్ - ఈయనాదికాలమునుండి, ఇన్ఱళవాగ - ఇదివఱకు ను, ఇరువినైయాల్ - పుణ్యపాపరూపమగు ప్రబలకర్మముచే, పఱ్ఱులే - వ్యర్థముగ, కழిన్దదెన్ఱు - జరిగినదని, ఇవ్వళవిన్ఱి - ఇట్లు జరిగినదినములకు అనుతపింపక, ఇరుక్కుమ్ - ఉండునట్టి, ఎన్నెఞ్జమ్ - దాసునిహృదయము, ఎతిరాశ - ఎమ్బెరుమానారే, నీ-దేవర వారు, అరుళ్ శెయ్దపిన్నే - విశేషకటాక్షముచేసినవెనుక, ఇరవుపగల్ - అహో రాత్రములును, నిన్ఱు - దీనియందు స్తబ్ధమైనిలిచి, తపిక్కుమ్ - పరితపించుచుండును.

తా.—నియామకుడగు సర్వేశ్వరుఁడున్నపుడు నియామ్యుడగు చేతనుడును ఉన్నాడు, యతిరాజా! ఈవఱకునుకాలము వ్యర్థమై పోయినదేయనిపరితపింపని దాసునిహృదయము దేవరవారి కృపాకటాక్షములభించినవెనుక దివారాత్రములును ఈవిషయమైపరితపించుచుండునని.

౪౨. కనకగిరిమేల్ కరియముగిల్ పోల,
వినత్తై శిఱువన్ మేల్కొణ్డు తనువిడుమ్బోదు,
ఏరారరఙ్గర్ ఎతిరాశర్క్కాగ, వెన్బాల్
వారా మున్నిఱ్పర్ మగిழ்న్దు.

టీక.—కనకగిరి మేల్ - బంగారుమయమైనమహామేరు పర్వతముమీదు, కరియము గిల్ పోల్ - (ఇమిడియుండు) నీలమేఘమువలె, వినదై - వినతయనుస్త్రీయొక్క, శిఱువన్ - పుత్రుడగు వైనతేయుని, (గరుత్మంతుని) మేల్ కొణ్డు - వాహనముగఁగొని, తను - దేహము, విడుమ్బోదు - విడుచునట్టిసమయమందు, (తల్లిముఖము చూపునట్లు), ఏర్ - సౌన్దర్యాదులచే, ఆర్ - పూర్ణులగు, అరఙ్గర్ - శ్రీరఙ్గనాథులు, ఎతిరాశర్క్కాగ - ఎమ్బెరుమానారులకుగాను, ఎన్బాల్ వారా - దాసుడున్నస్థలమునకువచ్చి, మగిழ்న్దు - సన్తోషించి, మున్నిఱ్పర్ - ముందుగనిలుతురు.

తా.—స్వర్ణపర్వతముపైనుండునీలమేఘమువలె సౌన్దర్యయుక్తులగు శ్రీరఙ్గనాథులు గరుడవాహనారూఢులై దాసునిదేహావసానమందు ఉడైయవరులకుగాను దాసునియొద్ద కుసన్తోషముతోవచ్చిప్రత్యక్షముగ సేవసాయింతురని. (దీనిచేనాకపేక్షితమైన ,, ముఖమునుచిఱునగవును" చూపియనుభవింపఁజేతురు; ఇదినిశ్చయమనిభావము).

౪౩. ఇదత్తాలే తెన్నరఙ్గర్ శెయ్గిఱదెన్ఱఱిన్దే
యిరున్దాలుమ్ తక్కాల వేదనై యిక్కాలత్తాల్,

పదైత్తా!వో! వెన్నిన్దప్పావవుడమ్బుడనే
పలనోవుమ్మనుబవిత్తిప్పవత్తిరుక్కప్పోమో,
మదత్తాలేవల్వినై యిన్వళియుళన్ఱుతిరిన్ద
వల్వినై యేన్తన్నై యునక్కా-ళాక్కి-క్కొణ్డ,
ఇదత్తాయుమ్తన్దై యుమామెతిరాశా వెన్నై
యినిక్కడుగవిప్పవత్తినిన్ఱుమెడుత్తరుళే.

టీక.—ఇదత్తాలే - హితబుద్ధిచే, తెన్నరఙ్గర్-శ్రీరఙ్గనాధులు, శెయ్గిఱ దెన్ఱు - కృపాఫలముగ దుఃఖములను అనుభవింపఁజేయుచున్నారని, అఱిన్దే - గుర్తెఱిగియే, ఇరున్దాలుమ్ - ఉన్నను, తప్పాలవేదనైయిన్ - తత్కాలమందుగలిగినబాధయొక్క, కనత్తాల్ - అతిశయముచే, పదైత్తు - తత్తఱపాటునొంది, ఆ!వో!ఎన్నుమ్ - సహింపఁజాలమిచే, హా!హా!అనునట్లుశబ్దించుచున్న, ఇన్దప్పావుడమ్బుడనే - ఈపాపశరీరముతో, పలనోవుమ్ - బహుదుఃఖములను, అనుబవిత్తు- అనుభవించి, ఇప్పవత్తు - ఈసంసారమందు ఇరుక్కప్పోమో - ఉండుటశక్యమగునో, మదత్తాలే - దేహమదముచే, వల్వినైయిన్- ప్రబలకర్మముయొక్క, వళి - మార్గమునందు, ఉళన్ఱు - శ్రమపడి, తిరిన్ద- సంచరించిన, వల్వినైయేన్తన్నై - మహాపాపియగుదాసుని, ఉనక్కు - సత్పురుషులకు ఆశ్రయణీయులైయుండు దేవరవారికి, ఆళాక్కి-క్కొణ్డ - దాసునిగజేసికొనిన, ఇదత్తాయుమ్ - హితముసజేయునట్టితల్లియును, తన్దైయుమాయ్ - తండ్రియునైయుండెడు, ఎతిరాశా-ఎమ్పెరుమానారే! ఇని - దేవరవారిసంబన్ధమునుగుర్తెఱిగినవెనుక, ఎన్నై - దాసుని, కడుగ - శీఘ్రముగ, ఇప్పవత్తినిన్ఱుమ్ - ఈసంసారమునందుండి,ఎడుత్తరుళ్ - ఎత్తిగట్టు జేర్పవలయును ; (విడువఁగూడనిసంబన్ధమూలముగ నేగదాతరింపఁ జేయుదురనిభావము.)

తా.—శ్రీరఙ్గనాధులు హితబుద్ధితో దుఃఖములననుభవింపఁ జేయుచున్నారని గుర్తెఱిగియున్నను, అధికబాధచేత తత్తఱపడుచున్న ఈపాపపుదేహముతో నానాశ్రమములననుభవించుచునుండుటకు శక్యమగునా ? మదాతిశయముచే ప్రబలకర్మముల వెంబడితిరుగుచు శ్రమపడుచున్న మహాపాపియగు దాసుని, దేవరవారికి దాసునిగఁజేసికొనిన తల్లియునుదండ్రియునైయుండు యతిరాజా! ఇక దాసుని త్వరలో ఈసంసారమందుండి దరిజేర్పవలయునని.

౫౪. ఇన్నమెత్తనై నాళిన్దవుడమ్బుడనిరున్దునోవుపడక్కడవేనెదో,
ఎన్నైయిదినిన్ఱుమ్విడువిత్తునీ శెన్ఱదాక్కుతిరునాట్టినుళ్ శేర్ ఱువీర్,

అన్నైయుమ్మత్తనుమల్లాదశుఱ్ఱముమాగియెన్నైయళిత్తరుళ్
ఎన్నిదత్తైయిరాప్పగలిన్ఱియేయేగమెణ్ణుమెతిరాశవళ్ళలే. [నాదనే,

టీక.—ఇన్నమ్ - ఇకను, ఎత్తనైనాళ్ - ఎంతకాలము, ఇవ్వుడమ్బుడనే - ఈదేహముతో - ఇరున్దు - ఉండి, నోవు - శ్రమము, పడక్కడవేన్ - పడఁగలను, ఐయో - అయ్యో, ఎన్నై-దాసుని, ఇదినిన్ఱుమ్ - బన్ధకమైనయీ దేహమునందుండి, విడువిత్తు - విడిపించి, నీర్ - మీరు, ఎన్ఱుదాన్ - ఎప్పుడు, తిరునాట్టినుళ్ - పరమపదమందు, ఏఱ్ఱువీర్ - ఆరోహింపఁజేయుదురు, అన్నైయుమ్ - ప్రియమునుజేయు తల్లియును, అత్తనుమ్ - హితమునుజేయుతండ్రియును, అల్లాదశుఱ్ఱముమ్ - ఇతరమగుసమస్తబన్ధువర్గమంతయును, ఆగి - అయి, ఎన్నై - దాసుని, అళిత్తరుళ్ - రక్షించునట్టి, నాదనే - స్వామీ! ఎన్ - దాసునియొక్క, ఇదత్తై - సుఖమును, ఇరాప్పగలిన్ఱియే - రేయిపగలనిలేక, ఏకమెణ్ణుమ్ - ఒకవిధముగచిన్తించెడు, ఎతిరాశవళ్ళలే- పరమోదారులైయతులకునాథులైనఎమ్బెరుమానారే! (దీనినియానతీయవలయును).

తా.—అయ్యో! ఇకనెంతకాలము ఈదేహముతో బాధపడుదును, దేవరవారుదాసుని, ఎప్పుడుపరమపదమునకుఁ జేర్తురు, తల్లిదండ్రులును సమస్తబన్ధువులునై దాసునిరక్షించునట్టిస్వామీ! దాసునికిహితమును సదాచిన్తించునట్టి పరమోదారులగు యతిరాజా! దీనినియానతీయవలయునని

౫౫. తెన్నరఙ్గర్, శీరరుళుక్కిలక్కాగప్పెఱ్ఱోమ్,
తిరువరఙ్గమ్ తిరుప్పదియేయిరుప్పాగప్పెఱ్ఱోమ్,
మన్నియశీర్మాఱన్ కలైయుణవాగప్పెఱ్ఱోమ్,
మదురకవిశొన్నపడియేనిలైయాగప్పెఱ్ఱోమ్,
మున్నవరాన్ఙురవర్మొழிగళుళ్ళప్పెఱ్ఱోమ్,
ముழுదుమ్నమక్కవైపొழுదుపోక్కాగప్పెఱ్ఱోమ్,
పిన్నైయొన్ఱుదనిల్నెఞ్జుపేరామఱ్పెఱ్ఱోమ్,
పిఱర్మినుక్కమ్పొఱామైయిల్లాప్పెరుమైయుమ్పెఱ్ఱోమే.

టీక.—తెన్నరఙ్గర్ - మనోజ్ఞులగు శ్రీరఙ్గనాథులయొక్క, శీరరుళుక్కు - నిర్హేతుకకృపకు, ఇలక్కాగ - లక్ష్యముగ, పెఱ్ఱోమ్- లభించితిమి, తిరువరఙ్గమ్తిరుప్పదియే- సమస్తదివ్యదేశప్రధానమగుశ్రీరఙ్గస్థలమును, ఇరుప్పాగ - నిత్యవాసస్థలముగ, పెఱ్ఱోమ్ - లభించితిమి, మన్నియశీర్ - పరభక్త్యాదికల్యాణగుణములుపొందియుండునట్టి, మాఱన్ - నమ్మాళ్వార్లయొక్క, కలై - దివ్యప్రబన్ధమును, ఉణవాగ - ఆహారముగ,

పెఱ్ఱోమ్ - భుజింపలభించితిమి, మదురకవి - మదురకవియాళ్వార్లయొక్క, శొల్ పడియే - దివ్యసూక్తిప్రకారముగ, నిలైయాగప్పెఱ్ఱోమ్ - చరమపర్వనిష్ఠయేనిష్ఠయగు నట్లులభించితిమి, మున్నవరామ్నంగురవర్ - మనపూర్వాచార్యులయొక్క, మొழிగళ్ - దివ్యసూక్తులగురహస్యములను, ఉళ్ళప్పెఱ్ఱోమ్ - ఆన్తర్యముగఅనుసన్ధింపలభించితిమి, ముழுదుమ్నమక్కవై - మనకుఇతరవిషయమందు ప్రొద్దుపుచ్చక పూర్ణముగవానినే, పొழுదుపోక్కాగ - కాలక్షేపముగ, పెఱ్ఱోమ్ - లభించితిమి, పిన్నై - ఇట్లైనవెనుక, ఒన్డదనిల్ - తదితరగ్రంథములోకటియందును, నెఞ్జు - హృదయము, పేరామల్ - చలింపకదీనియందేప్రతిష్ఠితమగునట్లు, పెఱ్ఱోమ్ - లభించితిమి, పిఱర్ మినుక్కమ్ - పరులఅతిశయమును చూచినయెడల, పొఱామైయిల్లా - సహింపమి లేని, పెరుమైయుమ్ - గొప్పతనమును, పెఱ్ఱోమే, లభించితిమే, ఇదొకమహాలాభముకదాఅని ఆశ్చర్యపడు చున్నారు. (ఉళ్ళుదల్ - విచారించుట).

తా.—శ్రీరఙ్గనాథుల నిర్హేతుకకృపకు పాత్రులగునట్లును, శ్రీరఙ్గస్థలమునందు నిత్యవాసముచేయునట్లును, ఆళ్వార్లదివ్యప్రబన్ధములను జీవనముగను, మధురకవియాళ్వార్లానతిచ్చిన చరమపర్వనిష్ఠను, మనపూర్వాచార్యదివ్యసూక్తిరహస్యములను చర్చించునట్లును, పూర్ణముగక్రిందు చెప్పినవానితోనే కాలయాపనము చేయునట్లును, ఇతరవిషయములందుమనస్సుచలింపకుండునట్లును, ఇతరాతిశయమును జూచిసహింప కుండుటను లేనిగొప్పతనమును లభించితిమని.

౫౬. ఉన్దనభిమానమేయుత్తారకమెన్ఱు,
శిన్దై తెళిన్దిరుక్కచ్చెయ్దనీ, అన్దో!
ఎతిరాశా నోయ్గళాలెన్నై నలక్కామల్,
శదిరాగనిన్ఱిరుత్తాళ్ తా.

టీక.—ఎతిరాశా - ఎమ్బెరుమానారే! ఉన్దన్ అభిమానమే - దేవరవారియొక్క అభిమానమే, ఉత్తారకమ్ఎన్ఱు - ఈయాత్మకు ఉత్తారకమని, శిన్దై - హృదయము, తెళిన్దిరుక్క - నిర్మలమైయుండునట్లు, శెయ్దనీ - ఉపకరించినదేవరవారు, అన్దో - అయ్యో! నోయ్గళాల్ - వేదనలచే, ఎన్నై - దాసుని, నలక్కామల్ - బాధింపక, శదిరాగ - సామర్థ్యముగ, నిన్ తిరుత్తాళ్ - దేవరవారిశ్రీపాదములను, తా - కరుణచే ప్రసాదింపవలయును.

తా.—యతీశ్వరా! దేవరవారియభిమానమే వీనికితరణోపాయమని మనస్సుతేటనొందునట్లుకృపచేసితిరి, ఇకసామర్థ్యముతోదాసునికి శ్రమగలుగకుండునట్లు దేవరవారిశ్రీపాదములను ప్రసాదింపవలయునని.

౫౭. తేశిగర్గళ్ పోర్ట్రుమ్ తిరువాయ్మొழிప్పిళ్ళై,
వాశమలర్త్తాళ్ అడైన్దవత్తువెన్ను, నేశత్తాల్
ఎన్పిழைగళ్ కాణావెతిరాశరే,
యడియేన్ పున్పగర్వైక్కేళుమ్ పొఱుత్తు.

టీక.— (ఆచార్యకులమునకు మూలపురుషులగు ఆళ్వార్లయొక్క సర్వవిధకైఙ్కర్యములయందును ఆసక్తులై ఆదేయాత్రగాఁజేసి కొనుచువచ్చుటచేత) తేశికర్గళ్ - ఆచార్యులచే, పోర్ట్రుమ్ - మఙ్గళాశాసనము చేయఁబడునట్టి, తిరువాయ్మొழிప్పిళ్లై - మాహాత్మ్యముగల తిరువాయ్మొழிప్పిళ్లగారియొక్క, వాశమలర్ తాళ్ - సౌన్దర్యసౌకుమార్యములతోఁగూడిన తిరువడిగళను, అడైన్ద - ఆశ్రయించిన, వత్తువెన్ను - శేషత్వముగల వస్తువని, నేశత్తాల్ - స్నేహముచే, ఎన్పిழைగళ్ - దాసునియొక్క దోషములను, కాణా - చూడని, (ఆశ్రితదోషములనుగుర్తెఱుగని) ఎతిరాశరే - ఎమ్బెరుమానారే! అడియేన్ - దాసునియొక్క, పున్పగర్వై - అల్పవార్తలను, పొఱుత్తు - (కోపగింపక) సహించి, కేళుమ్ - (ఆదరముతో కరుణించి) వినుడు.

తా.— సకలాచార్య మఙ్గళాశాసనార్హులగు తిరువాయ్మొழிప్పిళ్లగారి పాదారవిన్దముల నాశ్రయించిన శేషత్వజ్ఞానవస్తువని, దాసునిదోషములందు దృష్టియుంచని యతికులసార్వభౌమా! దాసుని యల్పవచనములను క్షమించి ఆకర్ణింపుడని.

౫౮. ఎన్దై తిరువాయ్మొழிప్పిళ్ళై యిన్నరుళాల్,
ఉన్దనుఱవైయునర్త్తియపిన్, ఇన్దవుయి
ర్కెల్లావుఱవుమ్ నీయెన్ఱెతిరాశా,
నిల్లాదదున్నో వెన్నెఞ్జు.

టీక.—ఎన్దై- "గురుఃపితా" అన్నట్లుదాసునికి తండ్రియగు, తిరువాయ్మొழிప్పిళ్లై- తిరువాయ్మొழிప్పిళ్లగారియొక్క, ఇన్నరుళాల్-నిర్హేతుకకృపచేత, ఉన్దనుఱవై - దేవరవారిశ్రీపాదములందు సర్వవిధబన్ధుత్వమును, ఉణర్త్తియపిన్ - తెలియపఱచిరక్షించిన వెనుక, ఇన్దఉయిర్కు - ఇట్టిసంబన్ధజ్ఞానమును గుర్తెఱిగిన ఈయాత్మకు, ఎల్లావుఱవుమ్ - మంత్రమందు చెప్పఁబడు నవవిధసంబన్ధమును, నీయెన్ఱే- దేవరవారేయని, (అధ్యవసించి) ఎతిరాశా - ఎమ్బెరుమానారే! ఎన్నెఞ్జు - దాసునిహృదయము, నిల్లాదదున్నో - స్థిరము నొందకయుండునో.

తా.— యతిరాజా! తిరువాయ్మొழிప్పిళ్లైగారి నిర్హేతుకకృపచే దేవరవారి తిరువడిగళు సంబంన్ధమును గుర్తెఱిగిన ఈయాత్మకుసకలవిధబన్ధుత్వమును దేవరవారితోనే అని నట్టిస్థిరహృదయము గలుగకుండునా అని.

* నవవిధసమ్బన్ధము. ౧ - పితాపుత్రసమ్బన్ధము - ౨ - రక్ష్యరక్షకసమ్బన్ధము - ౩ - శేషశేషిసమ్బన్ధము, ౪ - భర్తృభార్యాసమ్బన్ధము, ౫ - జ్ఞాతృజ్ఞేయ సమ్బన్ధము, ౬ - స్వస్వామిసమ్బన్ధము, ౭ - శరీరశరీరిసమ్బన్ధము, ౮ - ఆధారాధేయసమ్బన్ధము, ౯ - భోక్తృభోగ్యసమ్బన్ధము.

౫౯. ఎన్దైతిరువరఙ్గర్ఏరార్ కరుడన్మేల్,
వన్దుముగఙ్గాట్టివழிనడత్త, చ్చిన్దై శెయ్దు;
ఇప్పొల్లావుడమ్బుదన్నై ప్పోక్కువదెన్నాళ్ కొలో,
శొల్లాయెతిరాశా శూழ்న్దు.

టీక.—ఎన్దై - దాసునికి తండ్రియు తల్లియునైన, తిరువరఙ్గర్ - పెరియపెరుమాళ్లు (శ్రీరఙ్గనాథులు), ఏరార్ - నిండుచక్కదనముగల, గరుడన్మేల్ - గరుత్మంతునిమీదు, వన్దు - వేంచేసి, ముగమ్ కాట్టి - ఈ దేహమును విడుచునపుడు దాసునికిష్టముగు కస్తూరితిరునామమును చిఱునగవుగల దివ్యముఖమునుజూపి, వழிనడత్త - అర్చిరాది మార్గమూలముగ నడిపించుకొనిపోవుటకు, శిన్దై శెయ్దు - మననముచేసి, ఇప్పొల్లావుడమ్బుదన్నై - ఈనీచమైన దేహమును, పోక్కువదు - నివర్తింపఁజేయునది, ఎన్నాళ్ కొలో - ఏదివసమో, ఎతిరాశా - ఎమ్బెరుమానారే, శూழ்న్దు - (దాసుడు ధైర్యముతో నుండునట్లు) విచారించి, శొల్లాయ్ - ఆనతీయవలయును.

తా.— యతిరాజా! దాసునికి తండ్రియును తల్లియునైయుండు పెరియపెరుమాళ్లు గరుడవాహనారూఢులై సేవసాదించి అర్చిరాది మార్గముగ వెంటబెట్టుకొనిపోవ చిన్తించి యానీచ దేహమును పోగొట్టువది ఏదినమో అనతీయవలయునని.

౬౦. ఇన్దవరఙ్గత్తినిదిరునీయెన్ఱరఙ్గర్,
ఎన్దై యెతిరాశర్కీన్దవరమ్, శిన్దై శెయ్యిల్,
నమ్మదన్ఱోనెఞ్జమే, నల్ ఱ్రాదై శొమ్బుదల్వర్,
తమ్మదన్ఱోతాయముఱై దాన్.

టీక.— అరఙ్గర్ - పెరియపెరుమాళ్లు, ఇన్దవరఙ్గత్తు - ఈశ్రీరఙ్గధామమందు, ఇనిదు ఇరునీయెన్ఱు - (“శ్రీరఙ్గేసుఖమాస్వ”) మీరుసుఖముగ నుండుడని, ఎన్దై ఎతిరాశ

ర్కు - దాసునితండ్రియగు ఎమ్బెరుమానార్లకు, ఈన్దవరమ్ - ప్రసాదించిన వరమును, శిన్దైశెయ్యిల్ - విచారించునెడ, నెఞ్జమే - ఓమనసా! నమ్మదన్ఱో - మనదిగదా, (అదెట్లనిన) నల్ తాదై - నిరుపాధికుడగు తండ్రియొక్క, శొమ్ - సొత్తులు, తాయము పైఱ్దార్ - దాయాదుల భాగక్రమమున, పుదల్వర్ తమ్మదన్ఱో - పుత్రుల కొఱకై గదా ఉండునది.

తా.— ఓమనసా! శ్రీరఙ్గనాథులు తమస్థలమందు మీరు సుఖముగ నుండుడని మనకు నిరుపాధిక తండ్రియగు ఉడైయవరుల కిప్పించిన వరమును ఆలోచించి చూచిన యెడ పుత్రులగు మనకును దాయక్రమముగ బాధ్యతగలదుగదా యని.

కాఁబట్టి మనప్రాప్తికి మనము యత్నింపఁబనిలేదు,సమస్తమును సిద్ధముగనున్నది,ఇక మనభారముసర్వము యతిరాజులవారిది,ఎట్లనిన;ఉభయవిభూత్యైశ్వర్యమును, పెరియపెరుమాళ్లచే(శ్రీరఙ్గనాథులచే)లభించినవారై,దానిచే శ్రీవిష్ణులోకమణి మణ్టపమార్గ దాయిరులై ప్రపన్నజన కూటస్థులైయుండు ఎమ్బెరుమానార్ల పాదారవిన్దములందు రుచికార్యముగ యతీంద్రప్రవణులైన మణవాళమామునులు చేసికొనిన ప్రాప్యప్రార్థనయైనది, వారియభిమానములో నొదిగియుండు వారికందఱికిని గలదై, దానిచే ఉడైయవరుల యనుగ్రహము లభించి పరమపదమందు భగవదనుభవ కైఙ్కర్యాసక్తులై సుఖింపఁగలుగు దురనియానతిచ్చి సంపూర్ణము చేసిరి.

పెరియజీయర్ తిరువడిగళేశరణమ్.

ఆర్తిప్రబన్ధము సంపూర్ణము.

---

శ్రీమతేరామానుజాయనమః.

## శ్రీ అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్ జీయర్ వైభవము.

శ్రీమద్యతిరాజసార్వభౌములగు ఉడైయవరులు ఇతరమత నిరసనపూర్వకముగ స్వమతస్థాపనంబొనర్చుచు వచ్చునపుడు, యజ్ఞమూర్తియను నొక అద్వైత సన్యాసిస్వామి యొద్దకువచ్చి మన మిరువురమును అద్వైత విశిష్టాద్వైత మతములను గుఱించి వాదించి పదునెనిమిది దినములలో ముగింపవలయును. ఈ సంవాదమునందు జయించిన వారికి అపజయమునొందినవారు శిష్యులై వారిచిహ్నదులను ధరించునట్లు ప్రతిజ్ఞచేసికొని సంవాదమున కుపక్రమించిరి. అవ్విధమున పదునేడు దినములు కడచినవి. పదునేడవ దినమున యజ్ఞమూర్తి అడిగిన కొన్నిపశ్నములకు ఉడైయవరులకు ప్రత్యుత్తరము సాదింప యోచన స్ఫురింపనందున నాటిరాత్రి తమమత తిరువారాధనమగు దేవప్పెరుమాళ్ల (వరదరాజుల) సన్నిధిని, ఆళ్వార్ల కాలము మొదలుకొని శ్రీమన్నాథమునులు యామునాచార్యులు మొదలగువారి కాలమంతయు అభివృద్ధితో జరుగుచూవచ్చినవిశిష్టాద్వైత సిద్ధా

త్తమునకు దాసునికాలమందు విచ్ఛిన్నము సంభవించుటయేగాక దాసుడును నొకఅద్వై తికి శిష్యుడనై అద్వైత మతమందుఁ బ్రవేశింపవలసిన దశకు వచ్చునట్టాయెనేయను నీకొఱతను విన్నపించి విషాదముతో శయనింపగ, స్వప్నమున తేవప్పెరుమాళ్లు, మీరేల చిన్తనొందెదరు, మీయంతశిష్యుని మీకు సంపాదింప నిట్లుచేసితి నిప్పుడేమికొఱత “శ్రీ యాళవందార్లు సాదించిన మాయావాది ఖండనమను గ్రన్థమును, ప్రణవార్థను౯ అను ప్రబలోపనిషద్వాక్యమును మఱిచితి రోయనిన”; సన్తోషమునొంది యుదయమున, నట్టి యంశములను జ్ఞప్తికి దెచ్చుకొని అత్యుల్లాసముతో సభకు నేతెంచి యజ్ఞమూర్తితో పదునెనిమిదవ దినమున వారిప్రశ్నముల కన్నిటికిని ప్రత్యుత్తరముసాదించి జయమును బొందిరి, అనంతరము ఉడైయవరుల తిరువడిగళందు యజ్ఞమూర్తి ఆశ్రయించుటయును వారికి పంచసంస్కారాదులు సాదించునప్పుడు, అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్లు అని దాస్యనామంబొసంగి శిష్యశ్రేష్ఠునిగ నఙ్గీకరించిరి. తేవప్పెరుమాళ్లకు అరుళాళప్పె రుమాళ్ అని నామధేయముగలదు, అట్టివారికృపచే విలక్షణులగుటవలన, వారి నామధే యమును ప్రథమమందుంచి ఈయజ్ఞమూర్తిస్వాచార్యుల తిరునామమును అపేక్షించుటచే అంతమందు, ఎమ్బెరుమానార్ జీయర్ అను తిరునామముంచి, అరుళాళప్పెరుమాళెమ్బె రుమానార్ జీయర్ అని అనతిచ్చినవారైరి. ఈయరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్లు స్వా చార్యుల యనుమతిని నొకమఠమునందువసించియుండిరి.ఆట్టి కాలమున పశ్చిమ మందుండి కొందఱు శ్రీవైష్ణవులు కోవెల (శ్రీరఙ్గధామమున) కేతెంచి ఎమ్బెరుమానారుల మఠ మెక్కడయని యడుగగ, అచ్చటివారలు ఏ యెమ్బెరుమానారుల మఠమనియడుగగ ఈదర్శనమునకు ఇరువురు ఎమ్బెరుమానారులు గలరోఅనిన; అరుళాళప్పెరుమాళెమ్బెరు మానార్లుఅని మఱియొకరున్నారనగ, ఈసఙ్గతినిఈ దేవరాజగురువులు గుర్తెఱిగి, ఎమ్బె రుమానారుల కెదురు తట్టైతినాయని, అనుతాపమునొంది, తత్క్షణమే తమమఠమును రూపులేకచేసి,యతిరాజులవారి పాదపద్మ సన్నిధిని సేవచేసికొనుచు వారి మఠమునందే నివసించియుండిరి.

శ్లో॥ రామానుజార్యసచ్ఛిష్యమ్ వేదశాస్త్రార్థసమ్పదమ్ ।
చతుర్థాశ్రమసమ్పన్నమ్ దేవరాజమునింభజే ॥

అరుళాళప్పెరుమాళెమ్బెరునార్లు అనతిచ్చిన జ్ఞానసారమునకు,

తనియన్.

తెరుళార్ కరుఙ్గుళ్ తొఙ్గైయర్ వేల్ విఙ్జియిల్ తువళుమ్,
మరుళామ్వినై కెడుమ్మార్కమ్ పెఱ శ్రేణ, మత్తై నానుమ్శొన్న
పొరుళ్ ఙానసార త్తైప్పన్దియిల్ తన్దవర్, పొఙ్గొళిశేర్
అరుళాళమామునియమ్బెఱుమానార్ గళడై న్దపిన్నే.

టీక.— మఱైయినాన్గమ్ - నాలుగు వేదములును, శొన్న - వచించిన, పొరుళ్ - అర్థవిశేషములయొక్క, జ్ఞానసారత్తై - జ్ఞానసారాంశమును, ఉళ్ళత్తినిల్ తనదివ్యహృదయమునుండి, (జ్ఞానసారమను ప్రబన్ధముగ) తన్దరుళ్ - కరుణచే నిష్పించినవారగు, పొఙ్గు - అతిశయించిన, ఒళిశేర్ - జ్ఞానప్రకాశముగల - అరుళాళమామని - అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్లయొక్క, అమ్ - రమ్యమును, పొన్ - శ్రేష్ఠములైన, కళ్ళ్ గళ్ - శ్రీపాదములను, అడైన్దపిన్ - ఆశ్రయించినవెనుక, కురుళ్ ఆర్ - అల్లికగలిగియుండు, కరుఙ్కుళ్లల్ - నల్లనితలవెండ్రుకలుగల, తోగైయర్ - నెమళ్లవంటిస్త్రీలయొక్క, వేల్ - వేల్ అనుఆయుధమువలెక్రూరమైన, విళియిల్ - నేత్రములందు, తువళుమ్ - లోంబడునట్టి, మరుళ్ అమ్ - భ్రమనుగలుగఁజేయు, విన్నై - పాపకర్మము, కెడుమ్ - నశించునట్టి, మార్కమ్ - త్రోవను, పెఱ్ఱేన్ - లభించితిని. (మరుళ్ మిరుళ్ - అనిపాఠమైనయెడ, ఇరుళ్ - అజ్ఞానమనుచీకటియనిఅర్థము).

తా.—నాలుగువేదముల సారాంశమును జ్ఞానసారమను ప్రబన్ధముగఅనతిచ్చిన అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్ల (యజ్ఞమూర్తి) యొక్కశ్రీపాదములనాశ్రయించిన వెనుక అందకత్తెలగుస్త్రీలయందలియుపేక్షవదలునట్టిమార్గమును బొందితిని.

## గ్ర న్థా వ తా రి క.

ఎమ్బెరుమానార్ల శ్రీపాదములనాశ్రయించి సకలవేదశాస్త్ర తాత్పర్యార్థములను వారానతీయగవిని, దివ్యమైన స్వరూపజ్ఞానముగలవారై మతీయొకదైవమునుగుర్తెఱుగనని వారిపాదపద్మములందు నిత్యకైఙ్కర్యమొనర్చుచు సేవించుచుండిన అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్లు, తమపరమకృపచే ఈయర్థవిశేషముల నందఱును గుర్తెఱిగి యుజ్జీవింపవలయునని, సకలవేదశాస్త్ర సారాంశములను స్త్రీలకునుపామరులకును దెలియునట్లు, ద్రావిడభాషయందు ఈప్రబన్ధమూలముగ అనతిచ్చుచున్నారు, కాఁబట్టిదీనికి జ్ఞానసారమని తిరునామముగలిగినది.

# జ్ఞా న సా ర ము.

———:0:———

ప్రతిపదార్థమును, శ్రీమణవాళమామునులు అను గ్రహముతోఁజేర్చిన జ్ఞానసారశ్లోకములును.

అవతారిక.— ౧, పా-సకలవేదాన్తతాత్పర్యభూమియై, సంసారిచేతనుల ఉజ్జీవనమందిచ్చగలసర్వేశ్వరునిచేప్రకాశింపఁజేయఁబడినదై, ఉపదేశపరంపరా ప్రాప్తమైనను పూర్వాచార్యులకుపరమధనమై నిత్యానుసన్ధేయమైగదా రహస్యత్రయముండునది, అర

హస్యత్రయమునందునద్వయమునే ప్రధానముగగదా మనపూర్వాచార్యులు అనుసన్ధించుచువత్తురు, ఆద్వయమునందుపూర్వవాక్యముచేప్రతిపాదింపఁబడుచున్న ప్రపత్తియైనది ఆర్తప్రపత్తిఅనియుదృప్తప్రపత్తిఅనియు ద్వివిధమైగదా ఉండునది. వానియందు, ఆర్తప్రపత్తిముఖ్యమైదృప్తప్రపత్తిగౌణమైయుండును. ఆయార్తప్రపత్తివేషమును, ఈమొదటిపాశురమందానతిచ్చుచున్నారు.

౧. ఊనవుడల్చిఱై నీత్తొణ్ కమలై కేళ్వనడి,
త్తేనుగరుమాశై మిగుశిన్దైయరాయ్, తానే
పళుత్తాల్ విళుఙ్గనిపోల్ పత్తఱ్ఱు వీళుమ్,
విళుక్కాడే తానరుళుమ్ వీడు.

టీక.—ఊనమ్ - మాంసమయమైన, ఉడల్ - శరీరమను, శిఱై - చెఱసాలను, నీత్తు - పోగొట్టి, ఒణ్ - ప్రకాశముగల, కమలై - శ్రీమహాలక్ష్మికి, కేళ్వన్ - నాయకుడగు శ్రీమన్నారాయణునియొక్క, అడి త్తేన్ - శ్రీపాదారవిన్దములందుండు తేనె, నుగరుమ్ - భుజించునట్టి, ఆశై - ప్రేమము, మిగుమ్ - అతిశయించిన, శిన్దైయరాయ్ - హృదయముగలవారై, తానే - తనంతటతానే, పళుత్తాల్ - పండినతోడనే, విళుమ్ - క్రిందుపడునట్టి, కనిపోల్ - పండువలె, పత్తు - ఇతరవిషయసమ్బన్ధము, అఱ్ఱు - విడిచి, వీళుమ్ - ఆశ్రీపాదములందుఁబడునట్టి, విళుక్కాడే - శరణాగతియే, (ప్రపత్తియే) తాన్ - సర్వేశ్వరుఁడు, అరుళుమ్ - ఇప్పించునట్టి, వీడు - మోక్షమగును.

తా.— శ్రియఃపతియొక్క పాదారవిన్దములందు ప్రావణ్యముగలిగి శరణాగతి చేసి, ఈదేహముతో, ఈవిభూతియందుండుట దుస్సహముకాగ, సర్వేశ్వరుఁడుతన శ్రీపాదములను అనగా మోక్షమునుకృపచేయునని.

సనత్కుమారసంహితాయామ్ = యదాపరానన్వయిభిర్దుశ్శకస్స్వాత్మభిర్వినా, తేనతత్పురతఃపాతస్సాప్రపత్తిస్తదాభవేత్॥

అవ.— ౨.పా, పరభక్తిజనించినవారియొక్క విధమును అనతిచ్చుచున్నారు.

౨. నరగుమ్ శువర్కముమ్ నాణ్ మలరాళ్ కోనై,
ప్పిరివుమ్ పిరియామైయుమాయ్ తురిశఱ్ఱు,
చ్చాదగమ్ పోల్ నాదన్ఱనదరుళే పార్త్తిరుత్తల్,
కోదిలడియార్ గుణమ్.

టీక.—నరగుమ్ - నరకమును, శువర్క్కముమ్ - స్వర్గమును, నాళ్ - ఎల్లప్పుడును(క్రొత్తదియగు, మలరాళ్ - పుష్పవాసినియగు శ్రీమహాలక్ష్మియొక్క, కోనై - నాయకుడగు శ్రీమన్నారాయణుని, పిరివుమ్ - విశ్లేషించియుండుటయును, పిరియా మైయుమ్అయ్ - విశ్లేషింపకుండుటయునై, తురిశుఅల్లు - (ఇతరాపేక్ష) అనుదోషమునువిడిచి, చాదగమ్పోల్ - (దప్పిచేనాలుకయెండిననుభూమియందలిజలమునుపానముచేయకవర్షజలమునేయపేక్షించు)చాతకపక్షివలె, నాడ్క-తనదు-సర్వేశ్వరునియొక్క, అరుళే- కృపనే,పార్త్తిరుత్తల్ - ఎదురుచూచుండునది, కోదుఇల్ - దోషములేని, అడియార్ - దాసులయొక్క, కుణమ్ - స్వభావముఅగును.

తా.— భగవద్భక్తులయొక్క స్వభావము, సర్వేశ్వరుని విశ్లేషము నరకమును, సంశ్లేషము స్వర్గమునై,చాతకపక్షివర్షధారనుకోరునట్లు,సర్వేశ్వరుని కృపనునిరీక్షించునట్టిదియైయుండునని.

రా-అ-౩౦-౧౮ = యస్త్వయాసహసస్వర్గోనిరయోయస్త్వయావినా। ఇతిజానన్పరాంప్రీతిం గచ్ఛరామమయాసహ॥ (ప్రపన్నశ్చాతకోయద్వత్ప్రవృత్త్యాకపోతవత్ । రక్ష్యరక్షకయోరేతల్లక్ష్యంలక్షణమేతయోః॥

అవ-౩-పా, పరమభక్తిజనించినవారియొక్కస్థితిని అనతిచ్చుచున్నారు.

౩. ఆనైయిడర్కడిన్దవాళియజ్జైయమ్మ్యత్తాళ్,
కోనైవిడిల్నీరిఱుక్కుదిత్తెళున్దమీనెనవే,
ఆక్కైముడియుమ్పడిపిఱత్తలన్నవన్తాళ్,
నీక్కమిల్లావన్బర్నిలై.

టీక.—ఆనై - గజేంద్రాళ్వానుయొక్క, ఇడర్ - ఆపదను, కడిన్ద - నివర్తింపజేసిన, ఆళ్రియై - శ్రీసుదర్శనమును, అమ్కై - సుందరమైనహస్తమందుగల, అమ్మ్యత్తాళ్కోనై - శ్రీమహాలక్ష్మికివల్లభుడగువానిని, విడిల్ - ఎడబాసినయెడ, నీరిల్ - జలమునందుండి, కుదిత్తుఎళున్ద - ఎగిరబైటఁబడిన, మీన్ఎననే - మత్స్యమువలెనే, ఆక్కై - శరీరము, ముడియుమ్పడి - సమాప్తినొందునట్లు, పిఱత్తల్ - అవస్థగలుగుట, అన్నవన్తాళ్ - ఆసర్వేశ్వరునియొక్క శ్రీపాదములను, నీక్కమ్ఇల్లా - విశ్లేషములేని, అన్బర్ - భక్తిగలవారియొక్క, నిలై - స్వభావమగును.

తా.—సద్భక్తునియొక్కస్థితి, శ్రీగజేంద్రునిశ్రమను బోగొట్టిన శ్రియఃపతిని యెడబాసినయెడజలమునెడబాసిన మత్స్యమువలెనె జీవమును బొందునని.

రా-అ-౫౩-౩౧.=నచసీతాత్వయాహీనానచాహమపిరాఘవ। ముహూర్తమపిజీవావోజలాన్మత్స్యావివోద్ధృతౌ॥

అవ.—పా. క్రిందుమూడుపాశురములచే ద్వయమందలిపూర్వవాక్యముచే ప్రతిపాదింపఁబడు ప్రపత్తియొక్క ముఖ్యవేషమును, ఆర్తాధికారియొక్క పరభక్తిదశలయొక్కస్థితినిన్ని అనతిచ్చిరి. ఇక ఉత్తరవాక్యముచే ప్రతిపాదింపఁబడు కైఙ్కర్యముయొక్కలక్షణమునుగుర్తెఱిగి, అన్యప్రయోజనసంగమును వదలిస్వరూపానురూప విషయమందు నిష్ఠగలవారియొక్కవైభవమును అనతిచ్చుచున్నారు.

౪. మఱ్ఱొన్ఱైయెణ్ణాదేమాదవనుక్కాట్చెయలే,
ఉఱ్ఱదువెన్ఱుళన్దెళిన్దు, పెఱ్ఱ
పెరుమ్పేఱ్ఱిఱ్కే మేలుళదో పేఱెన్ఱిరుప్పార్,
అరుమ్పేఱువానత్తవర్క్కు.

టీక.—మఱ్ఱొన్ఱై - ఇతరవిషయలాభములను, ఎణ్ణాదే - చిన్తింపక, మాదవనుక్కు - శ్రియఃపతికి, ఆళ్ శెయలే - కైఙ్కర్యముచేయుటయే, ఉఱ్ఱదుఇదుఎన్ఱు - స్వరూపానురూపమైనకైఙ్కర్యముఇదేయని, ఉళ్లమ్ తెళిన్దు - హృదయముతేటనొంది, పెఱ్ఱ - తానులభించిన, పెరుమ్పేఱ్ఱిఱ్కు - గొప్పలాభమునకంటెను, మేల్ - హెచ్చిన, పేఱు - లాభము (పురుషార్థము) ఉళదో - కలదో, ఎన్ఱు - అని, ఇరుప్పార్ - ధైర్యమునొందియుండువారలు, వానత్తవర్క్కు - పరమపదమందుండు నిత్యసూరులకు, అరుమ్ పేఱు - లభించుటకుదుర్లభమైన పురుషార్థభూతులు అగుదురు.

తా.—ఇతరాపేక్షలేక శ్రియఃపతియొక్క కైఙ్కర్యమేఉత్తమపురుషార్థమనియుండుమహనీయులు నిత్యసూరులకు అరుదైన పురుషార్థమువంటివారగుదురని.

(శ్రీశాస్త్రే) = యేబ్రహ్మన్ భగవద్దాస్య భోగైకనిరతాస్సదా। తేప్రియాతిథయః ప్రోక్తాశ్శ్రీవైకుణ్ఠనివాసినామ్॥

అవ.—పా, పూర్వవాక్యముచే ప్రతిపాదింపబడునట్టి సిద్ధోపాయవరణము ఇతరోపాయపరిత్యాగమును అంగముగగలిగియుండునను దానినిచరమశ్లోకముచే గుర్తెఱిగి, ఉపాయరూపప్రవృత్తులందు సంబన్ధమును వదలిస్వరూపానురూపముగ వానియందు భారముంచినవారియొక్కప్రకారమును స్వనిష్ఠానురూపముగఅనతిచ్చుచున్నారు.

౫. తీర్త్తమువన్దాడువదుమ్ శెయ్దవజ్గళ్ శెయ్వనవుమ్,
పార్త్తనై మున్ కాత్తపిరాన్ పార్ప్పదన్మున్, శీర్త్తవరై
మున్నడియోమెన్నుమ్ వాఴ్వినమక్కేన్దదన్ఱే,
ఎన్నకుఱై వేణ్డుమిని.

టీక.— ముయన్ఱు - ప్రయత్నపడి, తీర్థమ్ ఆడువదుమ్ - గంగానదిమొదలగు పుణ్యతీర్థములందు స్నానముచేయుటయును, శెయ్ - చేయఁదగిన, తవఙ్గళ్ - తపస్సులను, శెయ్వనవుమ్ - చేయుటయును, మున్ - పూర్వమందు, పార్త్తఱ్కు - అర్జుననిని, కాత్తపిరాన్ - భగవద్గీతనారంభించి చరమశ్లోకమానతిచ్చిరక్షించిన ఉపకారకుడగు గీతాచార్యుడు, పార్వతక్కముమ్ - తన్నుకటాక్షించుటకుముందు అగును, శీర్-శ్లాఘ్యతగల, తువరై- ద్వారకాపురికి, మన్నన్ - అధిపతియగుస్వామికి, అడియోమ్ఎన్నుమ్ - దాసభూతులనిచెప్పఁబడు, వాళ్వు - జీవనమును, నమక్కు - మనకు, ఈన్దదన్పిన్ - కృపచేసియిప్పించినవెనుక, ఇని - ఇకమీదు, ఎన్నకుఱై - ఎట్టికొఱతయైనది, వేణ్డుమ్ కావలయును? (ఏకొఱతయును లేదనిభావము).

తా.— అర్జునుని రక్షించిన శ్రీకృష్ణమూర్తి మనలను కటాక్షించుటకుమునుపు సకల పుణ్యకార్యములనుచేయవలసియుండును, అట్టిద్వారకానాథుఁడగు శ్రియఃపతికటాక్షించినవెనుక మనకేకొఱతయునులేదని.

శ్రీవిష్ణుధర్మే= తావద్గచ్ఛేత్తుతీర్థానిసరితశ్చసరాంసిచ। యావన్నాభూచ్ఛభూపాలవిష్ణుభక్తిపరంమనః ॥ ఇతిహాససముచ్చయే,కింతస్యదానైః॥ కింతీర్థైఃకింతపోభిఃకిమధ్వరైః। యోనిత్యంధ్యాయతేదేవం నారాయణమనన్యధీః ॥

అవ.— ౬-పా, భగవద్దాస్యరసము నెఱిగినవారు, బ్రహ్మపదమునైనను అపేక్షింపరు, అట్టి ఐశ్వర్యాదులు వీరిహృదయమును కలతనొందింపదనుచున్నారు.

౬. పుణ్డరీకై క్కేళ్వనడియార్, అప్పూమిశై యోర్

అణ్డమొరుపొరుళావాదరియార్, మణ్డి

మలఙ్గవొరుమీన్ పురణ్డమాత్తిరత్తాల్, ఆర్తు

క్కలఙ్గిడుమో మున్నీర్క్కడల్.

టీక.— పుణ్డరీకై - కమలవాసినియగు శ్రీమహాలక్ష్మికి, కేళ్వన్ - నాయకుడగు సర్వేశ్వరునియొక్క, అడియార్ - దాసులగువారు, అప్పూమిశైయోన్ - ఆనాభీకమలమందుబుట్టిన చతుర్ముఖబ్రహ్మయొక్క, అణ్డమ్ - అష్టైశ్వర్యమును, ఒరుపొరుళా - ఒక వస్తువుగ, ఆదరియార్ - అపేక్షింపరు, (అయైశ్వర్యము వీరిహృదయమును చలింపఁజేయదోయనిన;) ఒరుమీన్ - ఒకమత్స్యమైనది, మణ్డి - బలముగొని, మలఙ్గ - చలించునట్లు, పురణ్డమాత్తిరత్తాల్ - పొర్లినంతమాత్రమున, ఆర్తు - దుఃఖించి, మున్నీర్ - ఏటిజలము, ఊటజలము, వర్షజలము, అనెడు మూఁడుజలములతోఁగూడిన, కడల్-సముద్రమైనది, కలఙ్గిడుమో - కలతనొందునో? (చలింపఁజాలదు).

తా.— ఒక గొప్పమత్స్యము పాల్లినంతమాత్రమునసముద్రము కలతనొందనట్లు, భగవద్భక్తుల హృదయము బ్రహ్మాణ్డైశ్వర్యమునుజూచి కలతనొందదు. (అనగా ఎట్టిమహ దైశ్వర్యమును అపేక్షింపరని.)

॥బ్రహ్మాణ్డమణ్డలీమాత్రంకింలోభాయమనస్వినః। శఫరీస్ఫురితేనాబ్ధేఃక్షుబ్ధతా నైవజాయతే॥ (భాగవ-౧౦-౨౦-౧౫=గిరయోవర్షధారాభిర్హన్యమానానవివ్యథుః। అభిభూయమానావ్యసనైర్యథాధోక్షజచేతసః ॥)

అవ.—౭-పా. సర్వేశ్వరుని సౌన్దర్యమునందు వ్యామోహమునుబొంది వాని కైఙ్కర్యమునందు ప్రవేశించినవారు అన్యవిషయములను ఆదరింపరనుచున్నారు.

౭. తోళార్ శుడ ర్త్తిగిరిశఙ్గుడై యశున్దరనుక్కు
అళానార్, మఱ్ఱొన్ఱిలన్బుశెయ్యార్, మీళా
ప్పారువరియవిణ్ణాట్టిల్ పోగమ్నుగర్వార్క్కు,
నరగన్త్తేవిన్దిరన్ఱనాడు.

టీక.— శుడర్ - ప్రకాశముగల, తిగిరి - శ్రీసుదర్శనమును, శఙ్గు - శఙ్ఖము (శ్రీపాఞ్చజన్యమును) ఉడైయ - ధరించియుండు, తోళ్ ఆర్ - భుజములుగల, శున్దరనుక్కు - సున్దరుఁడగు సర్వేశ్వరునికి, ఆళ్ ఆనార్ - శేషభూతులగువారు, మఱ్ఱొన్ఱిల్ - మఱియొకవిషయమునందు, అన్బు - ప్రీతిని, శెయ్యార్ - చేయరు, (స్వర్గాది భోగములయందు అపేక్షయుంచరోఅనిన;) మీళా - మరల తిరిగిరానట్టి, పారువరియ - సమానములేని, విణ్ నాట్టిల్ - పరమపదమందలి, పోగమ్ - సుఖానుభవమును, నుగర్వార్క్కు - అనుభవింప నిచ్ఛగలవారికి, ఇన్దిరన్ఱన్నాడు - ఇంద్రునికి భోగస్థానమైన స్వర్గలోకము, నరగుఅన్త్తే - నరకప్రాయమేఅగునుగదా.

తా.— భగవద్భక్తులై పరమపదాపేక్ష గలిగియుండువారు దేవేంద్రభోగస్థానముగు స్వర్గలోకమును నరకమువలె తలంతురని.

బ్రహ్మాణ్డపురాణే=తత్పదంప్రాప్తుకామాయే విష్ణోస్తేషాంమహాత్మనామ్। భోగాఃపురన్దరాదీనాంతే సర్వేనిరయోపమాః ॥

అవ.—౮-పా- అత్యన్తభక్తి సమ్పన్నులగువారుసర్వేశ్వరునివిషయమందు కైఙ్కర్యమునుఏదేనిఅత్యల్పముగఁజేసినను, అట్టివానిని సన్తోషించిశిరసావహించుననుచున్నారు.

౮. ముఱ్ఱప్పవనమెల్లాముణ్డముగిల్ వణ్ణన్,
శెఱ్ఱైత్తుత్తాయ్ శేర్కళ్ళలన్ఱి, మఱ్ఱొన్ఱై

యిచ్చియావన్బర్ తనక్కెజ్జనే శెయ్‌దిడినుమ్,
ఉచ్చియాలేఱ్కునుగన్దు.

టీక.— ముఱ్ఱ - పూర్ణముగ, భువనమ్ఎల్లామ్ - లోకములనన్నిటిని, ఉణ్డ - ప్రళయాపదయందుభుజించి గర్భమందుంచికాపాడిన, ముగిల్‌వణ్ణ - మేఘచ్ఛాయగల సర్వేశ్వరునియొక్క, కమ్రై - చిగిరించియుండు, తుఱాయ్‌శేర్-తిరుత్తుళాయిని (తుల సిని) గల, కళ్లల్అన్ఱి - శ్రీపాదములనుగాక, మఱ్ఱొన్ఱై - వేఱొకవస్తువును, ఇచ్చి యా - సమ్మతింపని, అన్బర్ - దాసులు, తనక్కు - ఆసర్వేశ్వరునికి, ఎజ్జనేశెయ్‌దిడు నుమ్ - కైంకర్యమును క్రమముగనో అక్రమముగనోచేసినను, ఉగన్దు - సన్తోషించి, ఉచ్చియాల్ - శిరస్సుచే, ఏఱ్కుమ్ - వహించును.

తా.— జగద్రక్షకుని శ్రీపాదములందుతప్ప యితరమందపేక్షలేనిభక్తులు ఆస ర్వేశ్వరునికి కైంకర్యమును క్రమముతప్పిచేసినను సన్తోషముతో శిరసావహించునని.

భార-మో.౧౬౧.॥ యాఃక్రియాస్సంప్రయుక్తాస్స్యు రేకాన్తగతబుద్ధిభిః। తాస్స ర్వాశ్శిరసాదేవః ప్రతిగృహ్ణాతివై స్వయమ్ ॥

౯. అళిలరుళాలనైత్తులగుఙ్గాత్తళిక్కుమ్,
వాశమలరాళ్ మణవాళ, తేశుపాలి
విణ్ణాట్టిల్ శాలవిరుమ్బుమే, వేఱొన్ఱై
యెణ్ణాదార్ నెఞ్జత్తిరుప్పు.

టీక.— అఖుఇల్ - దోషములేని, అరుళాల్ - తనయొక్కకృపచేత, అనైత్తు ఉలగుమ్ - సమస్తలోకములను, కాత్తుఅళిక్కుమ్ - అనిష్టములనుబోగొట్టికాపాడి అభీ ష్టములనిప్పించునట్టి, వాశమ్ - సువాసనగల, మలరాళ్ - కమలవాసినియగు శ్రీమహా లక్ష్మికి, మణవాళన్ - నాయకుడగు శ్రీమన్నారాయణుడు, వేఱొన్ఱై - వేఱొకప్ర యోజనమును, ఎణ్ణాదార్ - తలచనివారియొక్క, నెఞ్జత్తు -హృదయమందు, ఇరుప్పు - ఉండుటను, తేశుపాలి - స్వయంప్రకాశముగల, విణ్‌నాట్టిల్ - నిత్యముక్తులతోఁగూడి యుండు పరమపదమునకంటెను, శాల - విశేషముగ, విరుమ్బుమ్- ప్రీతిచేయును.

తా.— సకలచేతనులకు అనిష్ట నివృత్తిపూర్వకముగ మనోభీష్టముల నిప్పించునట్టి శ్రియఃపతి, పరమపదమందుండుటకంటెను ప్రయోజనాన్తరాపేక్షలేనివారి హృదయ మందు మిగుల ప్రేమతోనుండ నిష్టపడునని.

యేనన్యమనసశ్శుద్ధాః యేదాన్యైకమనోరథాః । తేషాం మేహృదయంవిష్ణోర్న్యాను తాత్పరమంపదమ్ ॥

౧౦. నాళుములగైనలిగిన్ఱ వాళరక్కన్,
తోళుముడియుమ్తుణిత్తవన్ఱన్ తాళిల్,
పోరున్దాదారుళ్ళత్తిల్ పూమడన్దై కేళ్వన్ ఇరున్దాలుమ్,
ముళ్మేలిరుప్పు.

టీక.— నాళుమ్ - ఎల్లప్పుడును, ఉలగై - లోకములోనుండువారిని, నలిగిన్ఱ - శ్రమపఱచుచున్న, వాళ్ - అంపమునుగల, అరక్కన్ - రావణునియొక్క, తోళుమ్ - ఇరువదిభుజములనున్ను, ముడియుమ్ - పదితలలను, తుణిత్తవన్ఱన్ - ఛేదించినవాని యొక్క, తాళిల్ - శ్రీపాదములందు, పోరున్దాదార్ - పొందియుండనివారియొక్క, ఉళ్ళత్తిల్ - హృదయమునందు, పూమడన్దై - కమలవాసినియగు శ్రీమహాలక్ష్మికి, కేళ్వన్ - నాయకుడగు శ్రీమన్నారాయణుడు, ఇరున్దాలుమ్ - ఉన్నప్పటికిని, ముళ్మేల్ ఇరుప్పు - ముండ్లమొనయందుండునట్లు ఉండును.

తా.— సదా లోకబాధకుడైయున్న రావణునిసంహరించిన స్వామియొక్కసా దారవిన్దములందన్వయములేని వారిహృదయమందు శ్రియఃపతివ్యసనముతోనుండునని.

బ్రహ్మాణ్డపురాణే॥ భగవచ్చరణద్వన్ద్వేభక్తిర్యేషాంనవిద్యతే । తేషాంహృదిస్థితో దేవః కణ్టకాగ్రఇవస్థితః ॥

౧౧. తన్పొన్నడియన్ఱి మఱ్ఱొన్ఱిల్ తాళ్పువుశెయ్యా,
అన్బర్ఉగన్దిట్టదణువెనిలుమ్, పొన్పిఱఙ్గుమ్
మేరువాయ్క్కొళ్ళుమ్విరైయార్ దుళాయలఙ్గల్,
మారిమాక్కొణ్డల్ నిగర్మాల్.

టీక.— విరైయార్ - సువాసనపొందియుండు, తుళాయ్అలఙ్గల్ - తిరుత్తుళాయ్ (తొలసి) మాలికనుధరించియుండు, మారి - వర్షముగల, మా - గొప్ప, కొణ్డల్నిగర్ - మేఘముతోసమానుడగు, మాల్ - సర్వేశ్వరుడు, తన్ - తనయొక్క, పొన్ - రమ్యమైన, అడిఅన్ఱి - శ్రీపాదములనుదప్ప, మఱ్ఱొన్ఱిల్ - వేఱొకప్రయోజనమందు, తాళ్పుశెయ్యా - నమ్రములుగాని, (ప్రావణ్యముచేయని), అన్బర్ - ప్రేమముగలభక్తులు, ఉగన్దు - ప్రీతిపూర్వకముగ, ఇట్టదు - సమర్పించినది, అణుఎనినుమ్ - అల్పమేఅయినను, పొన్ - బంగారుమయముగ, పిఱఙ్గుమ్ - ప్రకాశించుచుండు, మేరువాయ్ - మహామేరువుగ, కొళ్ళుమ్ - అఙ్గీకరించును.

తా.—కాళమేఘమువంటి సర్వేశ్వరునిపాదారవిన్దములందు దప్పతదితరమందాసక్తిలేని ప్రేమయుక్తులగు భక్తులుప్రీతిప్రేరితులై ఏదేనియణుమాత్రముసమర్పించినను శ్రియఃపతిమహామేరువుగనంగీకరించునని,

పౌష్కరసంహితాయామ్= భక్తైరణ్వప్యుపానీతం ప్రేమ్ణాభూర్యేవ మేభవేత్ । భూర్యప్యభక్తోపహృతం న మే తోషాయకల్పతే॥ (భ-గీ-౯-౨౬= పత్రంపుష్పంఫలంతోయంయో మే భక్త్యాప్రయచ్ఛతి । తదహంభక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః ॥ భార-ఉద్యో-౯౯-౧౩=అన్యత్పూర్ణాదపాంకుంభాదన్యత్పాదావనేజనాత్ । అన్యత్కుశల సంప్రశ్నాత్ నచేచ్ఛతిజనార్దనః॥)

౧౨. మాఱాయినైన్దమరుదమఱత్తవణ్ణ,
శేఱారరవిన్దచ్చేవడిక్కే, వేఱాగ
వుళ్ళాదార్ కొణ్డిదిఱైయీన్దిడినుమ్, తానుగన్దు
కొళ్ళాన్ మలర్మడన్దైకోన్.

టీక.— మాఱాయ్ - తనకుయెదిరియై, ఇణైన్ద - ఒకటితోనొకటిచేరినిలిచియున్న, మరుదమ్ - రెండుమద్దిచెట్లను, అఱత్తవణ్ణ - విఱిగిపడునట్లు దోగాడుచుచనిన, శేఱార్ - స్వచ్ఛలమగు ఆడుసునందుండు, అరవిన్దమ్ - తామరపువ్వునుబోలియుండు, శేవడిక్కే - ఎఱ్ఱని శ్రీపాదములను, వేఱాగ - తమకు పరమప్రయోజనముగ, ఉళ్ళాదార్ - తలపనివారు, ఒళ్ నిదిఱై - శ్లాఘ్యమైననిక్షేపమును, ఈన్దిడినుమ్ - సమర్పించినను, మలర్మడన్దైకోన్ - కమలవాసినియగు శ్రీమహాలక్ష్మికి నాయకుఁడగు శ్రీమన్నారాయణుఁడు, తానుగన్దు - తానుసన్తోషించి, కొళ్లాన్ - అఙ్గీకరింపఁడు.

తా.— శ్రీబాలకృష్ణుడు తనకు శత్రువులైనిలిచియున్న యమళార్జునములను విఱిగిపడునట్లు ప్రాకుచుచనిన పాదారవిన్దములందు, ప్రావణ్యములేనివారు మహానిక్షేపమును సమర్పించినను శ్రియఃపతి అంగీకరింపడని.

॥పృథివీంరత్నసంపూర్ణాం యఃకృష్ణాయప్రయచ్ఛతి। తస్యాప్యన్యమనస్కస్యసులభోనజనార్దనః ॥

౧౩. వణ్డేయుయిరనైత్తుమ్‌పఙ్గయత్తాళ్ నాయగఱ్కు,
తొణ్డామెనత్తెళిన్దదూయ్‌మనత్తర్కు, ఉణ్డో
పలకలైయుమ్‌తమ్ముడమైప్పార్త్తబిమానిక్కుమ్,
ఉలగత్తవరోడుఱవు.

టీక.—వణ్డే - ఆనాదిగనే, ఉయిర్ అనైత్తుమ్ - జీవాత్మవర్గమంతయును, పఙ్గయత్తాళ్ నాయకఱ్కు - కమలవాసినియగు శ్రీమహాలక్ష్మికి నాయకుడగువానికి, తొణ్డు

అడియర - దాసభూతులుఅయినవారుఅని, తెళిన్ద - తేటనొందిన, తూయ్ మనత్తర్క్కు - పరిశుద్ధమైన హృదయముగలవారికి, పలకలైయుమ్ - నానావిధములగు శాస్త్రములనునే ర్చియుండియును, తమ్ఉడమ్బై - వర్ణాశ్రమములకన్నిటికిని ఆశ్రయమైయుండు తమశ రీరమును, పార్త్త - చూచి, అభిమానిక్కుమ్ - గర్వించునట్టి, ఉలగత్తవరోడు - లోక ములోనిచేతనులతో, ఉఱవు - సమ్బన్ధము, ఉణ్డో - కలిగియుండునో.

తా.— సకలాత్మలును శ్రియఃపతికి దాసభూతులనెడు జ్ఞానవిశేషముగల పరిశు ద్ధులగువారికి, బహుశాస్త్రములనుజదివియు వర్ణాశ్రమాధారమగు దేహమునుజూచి గర్వించునట్టి సంసారులతో సమ్బన్ధముండునాయని.

విల్లిపుత్తూర్పగవర్ వార్తై.= విష్ణుదాసావయం యూయం బ్రాహ్మణావర్ణధర్మిణః| అస్మాకందాసవృత్తీనాం యుష్మాకంనాస్తిసఙ్గతిః ॥ నాస్తిసఙ్గతిరస్మాకం యుష్మాకఞ్చపరస్ప రమ్ । వయన్తుకింకరావిష్ణోఃయూయమిన్ద్రియకింకరాః ॥ అద్యప్రభృతి హేలోకాఃయూ యంయూయంవయంవయమ్ । అర్థకామపరాయూయం నారాయణపరావయమ్ ॥ (అవిద్యఃప్రాకృతః ప్రోక్తఃవైద్యోవైష్ణవఉచ్యతే । అవిద్యేనసకేనాపి వైద్యః కించిత్స మాచరేత్ ।)

౧౪. పూదఙ్గళైన్దుమ్పొరున్దుడలినాల్పిఱన్ద,
శాదఙ్గళ్నాన్గినొడుమ్శఙ్గదమామ్, పేదఙ్గొ
ణ్డెన్నపయఞ్పెఱువీరెవ్వుయిర్క్కుమిన్దిరై కోన్,
తన్నడియేకాణుమ్శరణ్.

టీక.— పూదఙ్గళ్ ఐన్దుమ్ - పృథివి అప్పు తేజస్సు వాయువు ఆకాశము అను పఞ్చభూతములును, పొరున్ద - కూడిన, ఉడలినాల్ - శరీరముచే, పిఱన్ద - ఏర్పడిన, శాదఙ్గళ్ నాన్గినొడుమ్ - బ్రాహ్మణజాతి మొదలగు నాలుగుజాతులతో, శఙ్గదమ్ఆమ్ - సమ్బన్ధపడినట్టిదగు, పేదమ్కొణ్డు-ఎక్కువతక్కువయను భేదముంచుకొని, ఎన్నపయఞ్ - ఏమిప్రయోజనమును, పెఱువీర్ - పొందుదురు, (ఒకటియును లేదు) ఎవ్వుయిర్క్కుమ్ - సకలాత్మలకును, ఇన్దిరైకోన్ తన్నడియే - శ్రియఃపతియొక్క శ్రీపాదములే, శరణ్ - స్వ రూపానురూపమైన ఉపాయమని, కాణుమ్ - తెలిసికొనుడు.

తా.— భూమి, జలము, అగ్ని, గాలి, ఆకాశము, అను నీయయిదింటిచే నేర్ప డిన బ్రాహ్మణాది దేహములలో జాతిభేదముంచుకొన్నందున ప్రయోజనమేమియున్నది, సకలాత్మలకును శ్రియఃపతియొక్క శ్రీపాదములేసుమీ ఉపాయమని. (రక్షకమని).

పరమైకాన్తిధర్మ.=దేహాత్మజ్ఞానకార్యేణవర్ణభేదేనకింఫలమ్ । గతిస్సర్వాత్మనాం శ్రీమన్నారాయణపదద్వయమ్ ॥

౧౫. కుడియుఙ్కులముమెల్లామ్కోకనగై క్కేళ్వన్,
అడియార్కవనడియేయాగుమ్, పడియిన్మేల్
నీర్కొఴువునాఱుగళిన్ పేరుమ్నిఱముమెల్లామ్,
ఆర్కలియైచ్చేర్న్దిడమాయ్న్దఱ్ఱు.

టీక.— పడియిన్మేల్ - భూమిమీఁదు, నీర్కొఴువుమ్-జలసమృద్ధిగల, ఆఱుగళిన్ - నదులయొక్క., పేరుమ్ - నామమును, నిఱముమ్ - వర్ణమును, ఎల్లామ్-ఇతరమైనవియన్నియును, ఆర్కలియై - సముద్రమును, శేర్న్దిడ - చేరినమాత్రముచే,మాయ్న్దఱ్ఱు - పేరు చాయ అన్నియునుపోయినట్లు, కుడియుమ్ - గ్రామమును, కులముమ్-గోత్రమును, ఎల్లామ్ - (చరణసూత్రాదులు) అన్నియును, కోకనగైక్కేళ్వన్- కమలవాసినియగు శ్రీమహాలక్ష్మికి నాయకుఁడగు శ్రీమన్నారాయణునియొక్క, అడియార్క-దాసులకు, అవన్ అడియే - ఆశ్రియఃపతి శ్రీపాదములనుగొని నిరూపింపవలసినదియే, ఆగుమ్ - అగును.

తా.— నదులపేళ్లను వర్ణముమొదలగునవి యన్నియును సముద్రమందుగలియగానే స్థిరములేకపోయినట్లు భగవద్భక్తులకు గ్రామకులాదినామములన్నియును స్థిరముగాక శ్రియఃపతి శ్రీపాదములనుగొనియే నిరూపింపవలసినదియగునని.

పరమైకాన్తిధర్మే.=ఏకాన్తీవ్యపదేష్టవ్యోనైవగ్రామకులాదిభిః। విష్ణునావ్యపదేష్టవ్య స్తస్యసర్వంసఏవహి ॥ నద్యాస్తస్యైవనామాని ప్రవిష్టాయాయథార్ణవమ్। సర్వాత్మనాప్రపన్నస్య విష్ణుమేకాన్తిన స్తథా ॥

౧౬. తేవర్మనిశర్తిరియక్కుత్తావరమామ్,
యావైయుమల్లేనిలగుముయిర్, పూవిన్మిశై
ఆరణఙ్గిన్ కేళ్వనమలనఱి వేవడివామ్,
నారణన్ఱాళ్క్కు యడిమైయేన్.

టీక.— ఇలగుమ్ - ప్రకాశించుచున్న, ఉయిర్ -ఆత్మయైనవాఁడు, తేవర్ - దేవతలు, మనిశర్ - మనుష్యులు, తిరియక్కు - మృగములు, తావరమ్ఆమ్- పర్వతము వృక్షములగు, యావైయుమ్ - ఇవియొకటియును, అల్లన్ - కాదు, (అగుటచే) పూవిన్మిశై - తామరపుష్పముమీఁదనుండు, అరణఙ్గిన్ - శ్రీమహాలక్ష్మియొక్క, కేళ్వన్ - నాయకుఁడై, అమలన్ - పరిశుద్ధుఁడై, అఱివే - జ్ఞానమే, వడివుఆమ్ - రూపముగగలవాఁడగు, నారణన్ - శ్రీమన్నారాయణునియొక్క, తాళ్కు- శ్రీపాదములకు, నాన్ - నేను, అడిమై - దాసభూతుఁడగుదును.

తా.— ఈయాత్మ సురనర తిర్యక్ స్థావరములలో నేదియునుగాడు, కాబట్టి శ్రియఃపతియును నిర్మలజ్ఞానస్వరూపుడగు శ్రీమన్నారాయణునికి దాసభూతుడనగుదునని.

॥నాహం దేవో న మర్త్యో వా న తిర్యక్స్థావరో౽పి వా। జ్ఞానానన్దమయస్త్వాత్మా శేషోహి పరమాత్మనః ॥ (నాహం విప్రో న చ నరపతిర్నాపి వైశ్యో న శూద్రో నో వా వర్ణీ న చ గృహపతిర్నో వనస్థో యతిర్వా। కిన్తు శ్రీమద్భువనభవన స్థిత్యపాయైక హేతోర్లక్ష్మీభర్తుర్నరహరితనో ర్దాసదాసస్య దాసః॥)

౧౭. ఒన్ఱిడుగవిణ్ణవర్ కోన్ శెల్వమొళిన్దిడుగ,
ఎన్ఱుమిఱవాదిరున్దిడుగ, ఇన్ఱే
యిఱక్కక్కళిప్పుక్కవర్పు, మివన్ఱాల్
పిఱక్కుమో తన్నై తెళిన్దపిన్.

టీక.—తన్నై తెళిన్దపిన్ - తన్ను ఇట్టివాడనిగుర్తెఱిగిన వెనుక = (స్వస్వరూపజ్ఞానముగలిగిన వెనుక) విణ్ణవర్ కోన్ - దేవతలకు నాయకుడగు ఇంద్రునియొక్క, శెల్వమ్ - ఐశ్వర్యమైనది, ఒన్ఱిడుగ - తానేవచ్చిచేరునుగాక, (లేక) ఒళిన్దిడుగ - తన్ను విడిచిపోవునుగాక, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, ఇఱవాదు - మరణములేక, ఇరున్దిడుగ - ఉండునుగాక, ఇన్ఱే - ఇప్పుడే, ఇఱక్క - మరణమగునుగాక, ఇవన్ఱాల్ - వీనిచేత, కళిప్పుమ్ - సన్తోషమును, కవర్వుమ్ - దుఃఖమును, పిఱక్కుమో - కలుగునో?

తా.— స్వస్వరూపజ్ఞానముదయించిన (తన్ను తాను తత్త్వముగ గుర్తెఱిగిన) యెడ, ఎట్టిసుఖదుఃఖములకును ఈచేతనుడు చలింపఁబనిలేదని.

॥ఆగచ్ఛతు నరేన్ద్రత్వం నిత్యత్వం వాద్య వా మృతిః। తోషం వా౽త్ర విషాదం వా నైవగచ్ఛన్తి పణ్డితాః॥

౧౮. ఈనమిల్లావన్బ రెన్నాలు మెయ్దిలా
మానిడరై, యెల్లావణ్ణత్తాలుమ్, తానఱియ
విట్టారై ళియఱవిడాదార్క్కు అవరియఱ్,
మట్టార్ తుళాయలఙ్గల్ మాల్.

టీక.— మట్టుఆర్ - సువాసనపొందియున్న, తుళాయ్అలఙ్గల్ - తిరుత్తుళాయ్ మాలికనుధరించియుండు, మాల్ - సర్వేశ్వరుఁడు, అన్బర్ - తనభక్తులు, ఈనమ్ - కొఱత (నీచము) ఇలార్ - లేనివారలు, ఎన్నాలుమ్ - అనినను, ఎయ్దిలా - భగవద్భాగవతవిషయములందు సమ్బన్ధములేకతిరిగెడు, మానిడరై - మనుష్యులను, ఎల్లావణ్ణత్తాలు

ళు - సకలవిధములచేతను, తాన్ - సర్వేశ్వరుఁడు, అఱియ - తెలిసికొనునట్లు, విట్టార్క్కు - విడిచినవారలకు, ఎళియన్ - సులభుఁడైయుండువాఁడును, విడాదార్క్కు - (అట్లు) వారినివిడువనివారికి, అఱివరియన్ - సమీపింపఁగూడనట్లు, (తెలిసికొనఁగూడనట్లు) దుర్లభుఁడైయుండును.

తా.— భగవద్భక్తులు, భగవద్భాగవత సంబన్ధములేక సంచరించెడు చేతనులను హీనులని వచింపకున్నను, సర్వేశ్వరుఁడు అట్టివారిని విడిచినవారికి సులభుఁడును విడువనివారికి దుర్లభుఁడునైయుండునని.

॥భక్తోపివాసుదేవస్యశార్ఙ్గిణః పరమాత్మనః। లోకేషణావినిర్ముక్తోముక్తోభవతినాన్యథా॥

౧౯. నల్లపుదల్వర్ మనైయాళ్ నవైయిల్ కిళై,
యిల్లమ్నిలమ్మాడివై యనైత్తుమ్, అల్లలెన
త్తోన్ఱ ఎరియెరిదీయిఱ్సుడుమేల్,
అవర్క్కెళిదామ్ఏన్ఱరుమ్వైగున్ద త్తిరుప్పు.

టీక.— నల్లపుదల్వర్ - మంచిపుత్రులు, మనైయాళ్ - భార్య, నవైయిల్ కిళై - దోషములేనిబన్ధువులు, ఇల్లమ్ - గృహము, నిలమ్ - క్షేత్రమును, మాడు - చక్కఁగ పాలనిచ్చుపశువులు, ఇవైఅనైత్తుమ్ - ఈసర్వమును, అల్లల్ఎన - దుఃఖములనిచ్చునవి యని, తోన్ఱి - తనకుతోఁచి, ఎరితీయిల్ - జ్వలించుచున్నయగ్నివలె, సుడుమేల్ - తాపమునుగలుగజేసెనేని, అవర్క్కు - అట్టివారికి, ఏన్ఱరుమ్ - పొందుటకరుదైన, వైకున్దత్తు - వైకుణ్ఠమునందు, ఇరుప్పు - ఉండుట, ఎళిదుఆమ్ - సులభమగును.

తా.— గృహక్షేత్రపుత్రకళత్రబన్ధుపశ్వాదులు సర్వమును అగ్నిజ్వాలవలెదుఃఖప్రదమని తోఁచినవారికి పొందనరుదైన శ్రీవైకుణ్ఠస్థితి సుఖలబ్ధమగునని.

బ్రహ్మాణ్డపురాణె శ్రీహస్తిగిరిమాహాత్మ్యే.— క్షేత్రాణిమిత్రాణిధనానినాథ పుత్రాశ్చదారాఃపశవోగృహాణి। త్వత్పాదపద్మ ప్రవణాత్మవృత్తేర్భవన్తిసర్వేప్రతికూలరూపాః॥

౨౦. విరుప్పురినుమ్తొణ్డర్క్కు వేణ్డుమిదమల్లాల్,
తిరుప్పాలిన్దమ్మార్బ నరుళ్ శెయ్యార్, నెరుప్పై
విడాదేకుళ్విళ్ళవరున్దినాలుమ్,
తడాదేయొళియుమో తాయ్.

టీక.— తాయ్ - తల్లియైనది, కుళ్ళవి - తనబిడ్డ, నెరుప్పై - అగ్నిని, విడాదే - వదలక, విళ్ళ - అందుపడుటకై, వరున్దినాలుమ్ - ప్రయత్నపడినను, తడాదే - అడ్డగిం

పక, ఒఴ్ఴియుమో-పోవునో (అవిధముగ) తిరు-శ్రీమహాలక్ష్మి, పొలిన్ద-వేంచేసియుండు, మార్వన్ - వక్షస్థలముగలసర్వేశ్వరుఁడు, తొణ్డర్కు- తనదాసులకు, వేణ్డుమ్-కావలసి యుండు, ఇదమ్అల్లాల్ - హితవిషయములేగాక, (వారలు) విరుమ్పుఉఱినుమ్ - అనేక మును అపేక్షించినప్పటికిని, అరుళ్ శెయ్యాన్ - ఇప్పింపడు.

తా.— తల్లియైనది తనబిడ్డ అగ్నిలోపడగోరినను పడనీయనట్లు, శ్రీనివక్షస్థల ముందుగల సర్వేశ్వరుఁడు, తనభక్తులు అనేకవిషయములనుగోరినను హితవిషయములందు తప్ప అహితవిషయములందు ప్రవేశింపనీయడని.

॥యాచితోపిసదాభక్తై ర్నాహితంకారయేద్ధరిః।బాలమగ్నౌపతన్తంతుమాతాకింన నివారయేత్॥

౨౧. అరప్పెరున్దుయరేశెయ్దిడునుమన్బర్గళ్ పాల్,
వేరిచ్చరోరుగైకోన్ మెయ్న్నలమామ్ తేరిల్,
పొఱుత్తఱ్కరిదెనిలుమ్మైన్దనుడఱ్పుణ్ణై,
అఱుత్తక్కైత్తాదైయఱ్ఱు.

టీక.— తేరిల్-విచారించినయెడ, పొఱుత్తఱ్కు - సహించుటకు, అరిదెనుమ్- అశక్యమైనను, మైన్దన్ - తనపుత్రునియొక్క, ఉడల్ - శరీరమందుండు, పుణ్ణై - వ్రణ మును, అఱుత్తఱ్కు - కోయుటకు, ఇశైశై-సమ్మతించిన, తాదైఅఱ్ఱు - తండ్రివలె, వేరి- వాసనగల, శరోరుగై - కమలవాసినియగు శ్రీమహాలక్ష్మికి, కోన్ - నాయకుఁడగుసర్వేశ్వ రుఁడు, అన్బర్గళ్ పాల్ - తనభక్తులవిషయమందు, అర్-పూర్ణముగ, పెరుమ్తుయరే- అధికదుఃఖములనే, శెయ్దిడునుమ్ - చేసినప్పటికిని, (అది) మెయ్-వాస్తవమైన, నలమ్- స్నేహకార్యమే, ఆమ్ - అగును.

తా.— ఆలోచించిచూడగ పుత్రునిదేహమందలి వ్రణబాధశమించుటకై సహిం పఁగూడని కృత్యమైనను వ్రణమును కోయుటకు సమ్మతించినతండ్రివలె శ్రియఃపతి తన భక్తుల విషయమున అధికముగ శ్రమములను గలుగఁజేసినను ప్రేమకార్యమేయగునని.

॥హరిర్దుఃఖానిభక్తేభ్యోహితబుద్ధ్యాకరోతివై। శస్త్రక్షారాగ్నికర్మాణి స్వపుత్రాయ యథాపితా॥

౨౨ ఉడఱ్కైమినోనెన్ఱుముడైయానుయిర్కై,
వడమదుగైవన్దిత్తానెన్ఱుమ్, తిడమాగ
అఱిన్దవవనాళ్ళిలడైన్దవర్కుమ్మణ్ణో,
పిఱిన్దుపడుమ్నీళ్ తుయరమ్పిఱ.

టీక.— నాన్ - దాసుడను, ఉడమైఎన్ఱుమ్ - సొత్తుయనియును, ఉడైయవన్-సొత్తుకధిపతియైనవాడు, అవన్ ఎన్ఱుమ్ - ఆసర్వేశ్వరుడనియును, (వాడు) వడమదురై-ఉత్తరమధురయందు, వన్దు - వచ్చి, ఉదిత్తాన్ - అవతరించినాడు, ఎన్ఱుమ్-అనియును, తిడమ్ఆగ - దృఢమగునట్లు, అఱిన్దు-తెలిసికొని, అవన్ తాళిల్ - ఆసర్వేశ్వరుని శ్రీపాద మూలందు, అడైన్దవర్కుమ్ - ఆశ్రయించినవారికిని; పిన్ - అటువెనుక, పిఱన్దు-భూమి యందుజన్మించి, పడుమ్-అనుభవించునట్టి, నీళ్-దీర్ఘమైన, తుయరమ్-దుఃఖము, ఉణ్డో-కలుగునో. (లేదనియర్థము)

తా.— దాసుడు సొత్తు,ఈసొత్తుకధిపతి శ్రీకృష్ణమూర్తియగు సర్వేశ్వరుడు అని తెలిసి, వానిపాదములనాశ్రయించినవారికి పిమ్మటజననాది దుఃఖములు కలుగవని.

శ్రీవిష్ణుధర్మే.—స్వత్వమాత్మనిసఞ్జాతం స్వామిత్వంబ్రహ్మణిస్థితమ్। ఉభయోరేషస మ్బన్ధోనపరోఽభిమతోమమ॥

౬3. ఊఴ్విని క్కఞ్జి యుమ్బ రొట్టరువ రెన్ఱఞ్జి,
ఏఴై మనమే యినిత్తళరేల్, ఆఴివణ్ణన్
తన్నడిక్కీఴ్ వీఴ్న్దు శరణెన్ఱిరున్దొరుకాల్,
శొన్నదఱ్పిన్నుణ్డోతుయర్.

టీక.— ఊఴ్ - పురాతనమైన, వినై - పాపములగు, కుఱుమ్బర్ - యుద్ధము చేయువారు, ఒట్టరువర్ - పరుగిడివత్తురు, ఎన్ఱు - అని, అఞ్జి - భయపడి, ఏఴై - జ్ఞాన హీనతగల, మనమే - ఓ మనసా! ఇని - ఇకమీదు, తళరేల్ - శైథిల్యము నొందవలదు, ఆఴివణ్ణన్ తన్ - సముద్రమువలె, గంభీరస్వభావముగల (లేకసముద్రమువలె శ్రమహార మైనరూపముగల) సర్వేశ్వరునియొక్క, అడిక్కీఴ్ - శ్రీపాదములక్రిందు, వీఴ్న్దిరున్దు-పడియుండి, శరణ్ ఎన్ఱు - దేవరవారే, రక్షకము (ఉపాయము) అని, ఒరుకాల్ - ఒకపర్యాయము, శొన్నదన్ పిన్ -అనుసన్ధించినవెనుక, తుయర్ -దుఃఖము, ఉణ్డో- కలదా.

తా.—తెలివిలేనిమనసా! సముద్రమువలె గమ్భీరస్వభావము లేక శ్రమహారమైన రూపముగల సర్వేశ్వరునితిరువడిగళే రక్షకమని యనుసన్ధించినవెనుక దుఃఖమునశించును గాబట్టి పురాతనకర్మములు అను దుష్టులుపైబడుదురని భీతినొంది ఇకచలింపవలదని.

శ్రీముకున్దమాలాయామ్.— మాభీర్మన్దమనోవిచిన్త్యబహుధా యామీశ్చిరంయాత నానామీనఃప్రభవన్తిపాపరిపవస్స్వామీనను శ్రీధరః।ఆలస్యంవ్యపనీయ భక్తిసులభంధ్యా యస్వనారాయణం లోకస్యవ్యసనాపనోదనకరోదాసస్య కింనక్షమః॥

౬౪. వణ్ణుపడిత్తుళబమార్ బనిడై చ్చేయ్దపిఴై,
ఉణ్ణుపల వెన్ఱుళన్దళరేల్, తొణ్డర్ శెయుమ్

పల్లాయిరమ్పిழైగళ్ పా_ర్తిరున్దుమ్,
కాణుఙ్కణ్ణిల్లాదవన్నాణిత్తై.

టీక.— పణ్ణుపడి - తుష్మెదలు వ్రాలియుండునట్టి, తుళబమ్ - తిరుత్తుழாయ్ (తొలసీ) మాలికను ధరించియుండు, మార్బన్ ఇడై - వక్షస్థలముగల సర్వేశ్వరుని విషయమందు, శెయ్దపిழై - మనముచేసిన యపచారములు, పల - అనేకములు, ఉణ్డు ఎన్ఱు - కలదుఅని, ఉళమ్ - మనసా! తళరేల్ - చలింపవలదు, ఇవై - ఆసర్వేశ్వరుఁడు, తొణ్డర్ - తనభక్తులు, శెయ్యుమ్ - చేయునట్టి, పల్ఆయిరమ్ - అనేకవేల సంఖ్యగల, పిழైగళ్ - అపచారములను,పా_ర్తిరున్దుమ్ - చూచియుండియును, కాణుంకణ్ - ఆయపచారములను జూచుటకుదగిన నేత్రములు, ఇల్లాదవన్ - లేనివాఁడు, ఎన్ఱు - అని, కాణ్ - తెలిసికొందువుగాక.

తా.— ఓమనసా! సర్వేశ్వరుని విషయమందు మనము మిగుల అపచారపడియున్నామని చలింపకుము, శ్రియఃపతి తన భక్తుల యపచారములందు దృష్టియుంచువాఁడుకాఁడని తెలిసికొమ్మని.

॥అవిజ్ఞాతాహి భక్తానామాగస్సుకమలేక్షణః। సదాజగత్సమస్తఞ్చపశ్యన్నపిహృదిస్థితః॥

౨౫. అల్ లమురైక్కినఱ్ఱైన్దవర్ పాలమ్మురైయోకోన్,
కుల్ లమునర్న్దిగழுమ్కోళ్ గైయనో, ఎన్ నే!తన్
కన్ఱినుడమ్బినవழுవన్ఱోకాదలిప్పదు,
అన్ఱదనైయీన్ఱుగన్దవా.

టీక.—ఎన్నే - ఏమిఆశ్చర్యము, తన్ కన్ఱిన్ - తనదూడయొక్క, ఉడమ్బిన్ - శరీరమందుండు, వழு - మాలిన్యమును, అన్ఱు - అప్పుడు, అదనై - ఆదూడను, ఈన్ఱు- ఈని, (కనుకొని) ఉగన్ద - సన్తోషించిన, ఆ - పశువైనది, కాదలిప్పదుఅన్ఱో - సన్తోషించి భుజించుచున్నది గదా, (అవిధముగనే) అల్ లమ్ - పరమార్థవిషయమును, ఉరైక్కిల్ - చెప్పినయెడ, అమ్బురై - కమలవాసినియగు శ్రీమహాలక్ష్మికి, కోన్ - నాయకుఁడగు సర్వేశ్వరుఁడు, అడైన్దవర్ పాల్ - తన్నాశ్రయించినవారి విషయమందు, కుల్ లమ్ - వారిదోషములను, ఉణర్న్దు - గుర్తెఱిగి, ఇగழுమ్ - విడుచునట్టి (అనాదరించునట్టి) కోళ్ గైయనో - స్వభావముగలవాఁడా? (అనగా, కాఁడనిఅర్థము).

తా.— పశువైనది అప్పుడీనిన దూడయొక్క దేహమందలి మాలిన్యమును భుజించి శుద్ధపఱచినరీతిగ, శ్రియఃపతి తన్నాశ్రయించిన భక్తుల దోషములను భోగ్యముగ గ్రహించి పరిశుద్ధునిఁగఁజేయునని. దీనికే "వాత్సల్యము" అనిపేరు.

॥ప్రపన్నాతమాథవ స్సర్వాన్ దోషేణ పరిగృహ్యతే। అద్యజాతంయథా వత్సందోషేణసహవత్సలా॥

౨౯. తప్పిల్ కురువరుళాల్ తామరైయాళ్ నాయగన్ఱన్,
ఒప్పిలడిగళ్ నమక్కుళ్ళత్తు! వైప్పెన్ఱు,
తేఱియిరుప్పార్ గళ్ తేశుపొలివైగున్దత్తు,
ఏఱియిరుప్పార్ పణిగళ్కేయ్న్దు.

టీక.— తప్పుఇల్ - దోషములేని, గురు - ఆచార్యులయొక్క, అరుళాల్ - కృపచేత, తామరైయాళ్ - కమలవాసినియగు శ్రీమహాలక్ష్మికి, నాయకన్ తన్ - నాయకుడగు సర్వేశ్వరునియొక్క, ఒప్పు - సమానము, ఇల్ - లేని, అడిగళ్ - శ్రీపాదములైనవి, నమక్కు - మనకు, ఉళ్ళత్తు - మనస్సునందుండు, వైప్పుఎన్ఱు - నిక్షేపము అని, తేఱి - తేటనొంది, ఇరుప్పార్ గళ్ - ఉండువారలు, పణిగళ్ కు - కైంకర్యములకు, ఏయ్న్దు - సమ్మతించి, తేశుపొలి - తేజస్సు అతిశయించియుండు, వైకున్దత్తు - శ్రీవైకుణ్ఠమునందు, ఏఱియిరుప్పార్ గళ్ - పోయినివసింతురు.

తా.— విలక్షణులగు నాచార్యుల (ఉద్ధారకుల) యొక్క కృపచే శ్రియఃపతి యొక్క శ్రీపాదములు మనకు నిక్షేపమని జ్ఞానపరిపక్వము నొందియుండువారలు శ్రీవైకుణ్ఠమునకుబోయి ప్రేమతో కైంకర్యము లొనర్చుచు నుందురని.

॥ఆచార్యస్యప్రసాదేనమమసర్వమభీప్సితమ్। ప్రాప్స్యతీతివిశ్వాసోయస్యాస్తిసనుఖీభవేత్ ॥

౩౦. నెఱియఱియాతారుమఱిన్దవర్ పాల్ శెన్ఱు,
శెఱిదల్ శెయ్యాత్తీమనత్తర్ తాముమ్, ఇఱైయురైయై
త్తేఱాదవరుమ్, తిరుమడన్దైకోనులగత్తు,
ఏఱాతిడర్ ఉழున్దువార్.

టీక.— నెఱి - సంసారమును నివర్తింపఁజేయునట్టి యుపాయమును, అఱియాదారుమ్ - తెలిసికొననివారును, అఱిన్దవర్ పాల్ - దానిని తెలిసికొన్న వారియొద్దకు, శెన్ఱు - పోయి, శెఱిదల్ శెయ్యా - నమస్కారప్రశ్న సేవాదులను చేయని, తీమనత్తర్ తాముమ్ - దుష్టహృదయులగు తామును, ఇఱై - గీతోపనిషదాచార్యుఁడగు సర్వేశ్వరుఁడు, ఉరైయై - (అనతిచ్చిన) చరమశ్లోకార్థమును, తేఱాదవరుమ్ - తెలిపి విశ్వసింపని వారును, తిరుమడన్దై - శ్రీమహాలక్ష్మికి, కోన్ - నాయకుఁడగు శ్రీమన్నారాయణుని

యొక్క, ఉలగత్తు - పరమపదమునందు, ఏఱార్-ఆరోహింపఁజాలరు, ఇడర్-సంసారదుఃఖమందు, అళున్దువార్ - మణిగి శ్రమపడుదురు.

తా.—సంసారనివృత్తికి నుపాయమును దెలియక, తెలిసినవారియొద్దకు చని పరిచర్యాదులొనర్చి తెలిసికొనని దుష్టహృదయులును, గీతాచార్యుఁడగు సర్వేశ్వరుని చరమశ్లోకార్థమును విశ్వసింపనివారును, పరమపదమునకుఁ బోజాలరు దుఃఖమగ్నులగుదురని.

శ్రీభగవద్గీతాయామ్-౪-౪౦.॥ అజ్ఞశ్చాశ్రద్ధ ధానశ్చసంశయాత్మా వినశ్యతి। నాయంలోకో ౽స్తినపరోనసుఖంసంశయాత్మనః॥

౭౫. శరణాగతిమఱ్ఱోర్ శాదనత్తైప్పఱ్ఱిల్,
అరణాగాదఞ్జనైర్తన్ శేయై,మురణ్ళియ
క్కట్టియదువేఱోర్ కయిఱుకొణ్డార్పదన్మున్,
విట్టపడై పోల్ విడుమ్.

టీక.—శరణాగతి - సర్వేశ్వరునే ఉపాయముగ నాశ్రయించునట్టి ప్రపత్తియైనది, మఱ్ఱువోర్ - వేఱొక, శాదనత్తై - ఉపాయమును (సాధనమును) పఱ్ఱిల్ - ఆశ్రయించినయెడల, అరణ్ - రక్షకము, ఆగాదు-కాదు, అఞ్జనైతన్ - అంజనాదేవియొక్క, శేయై - పుత్రులగు ఆఞ్జనేయులను, మురణ్ - బలము, అళియ - చెడునట్లు, కట్టియదు - బన్ధించినది, వేఱోర్ - వేఱొక, కయిఱుకొణ్డు - దారమునుగొని, ఆర్పదన్ మున్ - కట్టుటకమునుపే, విట్ట - విడిచిపోయిన, పడైపోల్ - బ్రహ్మాస్త్రమువలె, విడుమ్ - విడిచిపోవును.

తా.— ఇంద్రజిత్తు ఆంజనేయులను బ్రహ్మాస్త్రముచేబన్ధించి దానియందునమ్మకములేక వేఱొకదారమునుగట్టగ బ్రహ్మాస్త్రమువిడిచిపోయినట్లు, ప్రపత్త్యుపాయమందు నమ్మకములేక వేఱొకయుపాయమును పట్టినయెడ ప్రపత్తిఫలింపదని.

సనత్కుమారసంహితాయామ్.॥ ప్రపత్తేఃక్వచిదప్యేవంపరాపేక్షానవిద్యతే। సాహిసర్వత్రసర్వేషాం సర్వకామఫలప్రదా॥ సకృదుచ్చారితాయేనతస్యసంసారనాశినీ । రాక్షసానామవిస్రంభాదాఞ్జనేయస్యబన్ధనే ॥ యథావిగళితాసద్యస్స్వమోఘాప్యస్త్రబన్ధనా। తథాపుంసామవిస్రంభాత్ప్రపత్తిఃప్రచ్యుతాభవేత్॥ తస్మాద్విస్రంభయుక్తానాం ముక్తిం దాస్యతిసాచిరాత్ ॥

౭౬. మన్దిరముమీన్దగురువుమ్, అమ్మన్దిరత్తాల్
శిన్దనైశెయ్గిన్ఱతిరుమాలుమ్, నన్దలిలాదు
ఎన్నుమరుళ్పురివర్ యావర్,అవరిడర్గై
వెన్నుకడిదడైవర్ వీడు.

టీక.—మన్దిరముమ్ - తిరుమంత్రమును, ఈన్ద - ఆమంత్రమునుపదేశించిన, గురువుమ్ - ఆచార్యుడును, అమ్మన్దిరత్తాల్ - ఆమంత్రముచేత, శిన్దనైశెయ్గిన్ఱ - అనుసన్ధిం

పందగిన, తిరుమాలుమ్ - శ్రియఃపతియును, నన్దల్ - చెడుగు, ఇల్లాదు - లేక, ఎన్రుమ్ - ఎల్లప్పుడును, అరుళ్ పురివర్ - అనుగ్రహింపఁదగినవారు, యావర్ - ఎవరో, అవర్ - వారు, ఇడర్ై - దుఃఖములను, వెన్రు - జయించి, వీడు - మోక్షమును, కడిదు-శీఘ్రముగ, అడైవర్ - లభింపఁగలుగుదురు.

తా.— మంత్రముయొక్కయు మంత్రప్రదుఁడగు ఆచార్యునియొక్కయు మంత్రప్రతిపాద్యుఁడగు శ్రియఃపతియొక్కయు అనుగ్రహమునకు పాత్రులెవరో వారుదుఃఖవిహీనులై మోక్షమును బొందగలుగుదురని.

పురాణసారసముచ్చయే॥ మూలమన్త్రమాహాత్మ్యే.॥ దేవతాయాగురోశ్చైవ మన్త్రస్యైవప్రసాదతః। ఐహికాముష్మికాసిద్ధిర్ద్విజస్యాస్తినసంశయః॥

॥మంత్రేతద్దేవతాయాంచతథామంత్రప్రదేగురౌ। త్రిషుభక్తిస్సదాకార్యాసాహిప్రథమసాధనమ్॥

౩౦. మాడుమ్మనైయుమ్కిళైయుమ్మఱైమునివర్,
తేడుముయర్వీడుమ్శెన్నెఱియుమ్, పీడుడైయ
ఎట్టెழుత్తుమ్తన్దవనేయెన్రిరాదార్ఉఱవై,
విట్టిడుగైకణ్డీర్విది.

టీక.—మాడుమ్ - పశువులును, మనైయుమ్ - గృహమును, కిళైయుమ్ - బన్ధువులును, మఱై - వేదసంబన్ధముగల, మునివర్ - మననశీలులును, తేడుమ్ - అపేక్షించి వెదకెడు, ఉయర్వీడుమ్ - ఉన్నతమైనమోక్షమును, శెల్నెఱియుమ్-పోఁదగిన అర్చిరాదిమార్గమునులేక ఆమోక్షమును లభించుటకు దగిన యుపాయమును,పీడు-మహిమ, ఉడైయ - కలిగియుండు, ఎట్టెழుత్తుమ్ - తిరువష్టాక్షరిమంత్రమును, తన్దవనేయెన్రు - ఉపదేశించిన ఆచార్యుడేయని ధైర్యమునొంది, ఇరాదార్ - లేనివారియొక్క, ఉఱవై - సంబన్ధమును, విది - నియతముగ, విట్టిడుగ - విడుటురుగాక,కణ్డీర్ - దీనిని చూచుకొనుడు.

తా.—చేతనులారా, మంత్రప్రదులగు ఆచార్యులే ఇహపర లోకైశ్వర్యములు అనెడు జ్ఞానవిశేషములేనివారితో సమ్బన్ధమును విడువుడని.

॥ఐహికాముష్మికంసర్వం గురురష్టాక్షరప్రదః | ఇత్యేవంయేనమన్యన్తేత్యక్తవ్యాస్తేమనీషిభిః।

౩౧. వేదమొరునాన్గినుట్పొదిన్దమెయ్ప్పొరుళుమ్,
కోదిల్మనుముదల్నూల్కూఱువదుమ్, తీదిల్

శరణాగతితన్దతన్ని త్తైవన్తాళే,

అరణాగుమెన్నుమదు.

టీక.—వేదమ్ఒరునాన్గినుళ్ - నాలుగు వేదములందును, పొదిన్ద- అణగియుండు, మెయ్ప్పారుళుమ్ - వాస్తవమైన యర్థవిశేషములును, కోదుఇల్ - కోపములేని, మను ముదల్ నూల్ - మనుధర్మశాస్త్రము మొదలగు శాస్త్రములు, కూఱువదుమ్ - చెప్పట యును, తీదుఇల్ - చెడుగులేని, శరణాగతి - సర్వేశ్వరుని శ్రీపాదములందు ప్రపత్తి చేయువిద్యను, తన్ద - ఉపకరించిన, తన్ ఇఱైవన్ - తన ఆచార్యునియొక్క, తాళే శ్రీపాదములే, అరణ్ - రక్షకము, ఆగుమ్ - అగును, ఎన్నుమదు - అని ధైర్యము నొందియుండునది.

తా.—సర్వేశ్వరుని శ్రీపాదములందు శరణాగతి విద్యనుపదేశించిన తన ఆచార్యుని శ్రీపాదములే రక్షకమగును అను విషయమునే సకల వేదములును మన్వాది ధర్మశాస్త్రము లును వచించునదియని.

సాత్త్వికతన్త్రే ద్వయప్రసఙ్గే.॥ గురురేవపరంబ్రహ్మ గురురేవపరాగతిః । గురురేవ పరావిద్యాగురురేవపరంధనమ్ - గురురేవపరఃకామోగురురేవపరాయణమ్ । యస్మాత్తదు పదేష్టాసౌతస్మాద్గురుతరోగురుః॥ (అర్చనీయశ్చవన్ద్యశ్చకీర్తనీయశ్చసర్వథా । ధ్యాయేజ్జ పేన్న మేద్భక్త్యాభజేదభ్యర్చయేన్సదా ॥ ఉపాయోపేయభావేనతమేవశరణంవ్రజేత్ । ఇతిసర్వేషు వేదేషుసర్వశాస్త్రేషుసమ్మతమ్॥ ఏవంద్వయోపదేష్టారం భావయేద్బుద్ధిమాన్ ధియా॥

3౭. మానిడవనెన్ఱుమ్కురువై మలర్మగళ్కోన్,

తానుగన్దకోలములోకమెన్ఱుమ్, ఈనమదా

వెణ్ణుగిన్ఱనీశరిరువరుమే, యెక్కాలుమ్

నణ్ణిడువర్కీళ్ఱామ్నరగు.

టీక.— కురువై - తనఆచార్యులను, మానిడవన్ ఎన్ఱుమ్ - మనుష్యుడనియును, మలర్మగళ్ - పుష్పమందవతరించిన శ్రీమహాలక్ష్మికి, కోన్ - నాయకుఁడగు సర్వేశ్వ రుఁడు, తాన్ - తాను, ఉగన్ద - సన్తోషముతో నంగీకరించిన; కోలమ్ - విగ్రహమును ఉలోగమ్ఎన్ఱుమ్ - లోహమనియును, ఈనమదు అ - తక్కువయైనదిగ, ఎణ్ణుగిన్ఱ - తలచుచున్న, నీశర్ ఇరువరుమ్ - నీచులైనఇద్దఱును, ఎక్కాలుమ్ - సర్వకాలములందు ను, కీళ్ ఆమ్నరగు - తక్కువయైన నరకమును, నణ్ణిడువర్ - పొందుదురు.

తా.— ఆచార్యులు మనుష్యులేగదా, కోవెలల (దేవస్థానముల) యందును విలక్షణ గృహమఠాదులందును ఆరాధింపబడుచుండు విగ్రహములు లోహమేగదా, అని కేవలనీచముగ తలచునట్టి వీరిరువురును నరకమును తప్పక పొందుదురని.

బ్రహ్మాండపురాణే ॥ విష్ణోరర్చావతారేషులోహభావంకరోతియః । యోగురౌమానుషంభావముభౌనరకపాతినౌ ॥ (అర్చ్యేవిష్ణౌశిలాధీర్గురుషునరమతిర్వైష్ణవేజాతిబుద్ధిర్విష్ణోర్వావైష్ణవానాంకలిమలమథనే పాదతీర్థేఽమ్బుబుద్ధిః । శ్రీవిష్ణోర్నామ్ని మన్త్రే సకలకలుషహేశబ్దసామాన్యబుద్ధిః శ్రీశేసర్వేశ్వరే తేతదితరసమధీర్యస్యవానారకీసః॥)

33. ఎట్టవిరున్దకురువై యిఱైయన్ఱెన్ఱు,
విట్టోర్ పరనై విరుప్పుఱుదల్, పొట్టెనత్తన్,
కణ్ శెమ్బళి త్తిరున్దు కైత్తురుత్తినీర్ దూవి,
అమ్బుదత్తైప్పా త్తిరుప్పానొ ప్పు.

టీక.— ఎట్టవిరున్ద - సమీపమందున్న, కురువై - ఆచార్యులను, ఇఱై - తనకుస్వామి, అన్ఱెన్ఱు - కాచాలరని, విట్టు - విడిచి, ఓర్ - అద్వితీయుడగు, పరనై - సర్వేశ్వరుని, విరుప్పుఱుదల్ - ప్రీతిచేయుట, పొట్టెన - తటాలున, తన్ - తనయొక్క, కణ్ శెమ్బళి త్తిరున్దు - కండ్లనుమూసికొనియుండి, కై -హస్తమందుండు, తురుత్తి - పాత్రమందుఁ జేర్చిపెట్టుకొన్న, నీర్ - జలమును, తూవి - పాఱబోసి అమ్బుదత్తై - (ఆకాశమందుండు) మేఘమును, పార్త్తిరుప్పాన్ ఒప్పు - ఎదురుచూచుచున్న వానివలెనగును.

తా.— ఆత్మోజ్జీవన విషయమై సమీపమందున్న ఆచార్యులను విడిచి సర్వేశ్వరుని ఆశ్రయించడమైనది, ఒకమనుష్యుఁడు ఉన్నట్టుండి తనచేతనున్న తీర్థమును పాఱబోసి వర్షజలము నెదురుచూచినట్లుయని.

పురాణసముచ్చయే ఆచార్య మాహాత్మ్యప్రకరణే ॥ చక్షుర్గమ్యంగురుంత్యక్త్వా శాస్త్రగమ్యన్తుయస్స్మరేత్ । కరస్థముదకంత్యక్త్వాఘనస్థమభివాఞ్ఛతి॥

3౪. పఱ్ఱుగురువైప్పరననెన్ఱిగఴ్న్దు,
మఱ్ఱోర్ పరనై నయప్పదుదల్, ఎఱ్ఱే! తన్
కైప్పొరుళ్ విట్టారేనుఙ్గళినియిల్ తామ్పుదైత్త,
అప్పొరుళ్ తేడి త్తిరివానొప్పు.

టీక.—ఎఱ్ఱే - ఏమి ఆశ్చర్యము, పఱ్ఱు - తానాశ్రయించిన, కురువై-ఆచార్యులను పరన్ - ఉత్కృష్టుడు, అన్ఱెన - కాదని, ఇగఴ్న్దు - అవమానపఱచి,

మఱ్ఱు ఓర్ - కండ్లకువిషయముగాని వేఱొకడగు, పరనై - ఈశ్వరుని, పఱ్ఱిప్పదు దల్ - అనువర్తించుట, తన్ - (ఒకమనుష్యుఁడు) తనయొక్క, కై - హస్తమందుండు, పొరుళ్ - ద్రవ్యమును, విట్టు - పాఱవైచి, అరేనుమ్ తాన్ - ఎవరైననొకరు, కాళినియి ల్ - భూమికిలోఁగ, పుదైత్త - పూడ్చియుంచిన, అప్పొరుళ్ - అద్రవ్యమును, తేడి - వెదకికొనుచు, తిరివానఱ్ఱు - తిరిగినవిధముగనున్నది.

తా.—ఇదేమి ఆశ్చర్యము, తన ఆచార్యులు శ్లాఘ్యులు కారని వదిలి కండ్లకగుప డని ఈశ్వరుని అనువర్తించుట, ఒకమనుష్యుడు చేతనున్న సొత్తును పాఱవైచి భూమియం దెవరో ద్రవ్యమును పూడ్చిపెట్టియున్నారని వెదకుచున్న వానివలె, అయివున్నదని.

॥సులభం స్వగురుం త్యక్త్వా దుర్లభం యఉపాసతే। సిద్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్త మన్వేషతి క్షితౌ॥

౩౫. ఎన్ఱుమనైత్తుయిర్కు మీరఙ్గొయ్‌నారణనుమ్,
అన్ఱుమ్‌తన్నారియన్బాలన్బొழியిల్,
నిన్ఱపునల్ పిరిన్దపఙ్గయత్తైప్పొఙ్గుశుడర్,
వెన్ఱిఅనలుమిழ్న్దుతానులర్త్తియఱ్ఱు.

టీక.—ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, అనైత్తు ఉయిర్కుమ్-సమస్తాత్మలకును, ఈరం శెయ్ - కృపచేయునట్టి, నారణనుమ్ - సర్వేశ్వరుఁడును, తన్ - ఒకడు తనయొక్క, ఆరియన్‌పాల్ - ఆచార్యవిషయమందు, అన్బు ఒழியిల్ - ప్రీతిలేని వాడైయున్న యెడల, అన్ఱుమ్ - చెయివిడుచును, (ఎట్లనిన) నిన్ఱ - తానుపుట్టి నిలిచియున్న, పున ల్ - జలమును, పిరిన్ద - ఎడబాసిన, పఙ్గయత్తై - తామరపుష్పమును, పొంగు - అధిక రించిన, శుడర్ - ప్రకాశముగల, వెన్ఱి తాన్ - సూర్యుఁడు, అనల్ - అగ్నిని, ఉమిழ్న్దు - క్రక్కి, ఉలర్త్తియఱ్ఱు - వాడిపోవునట్లు చేసినవిధముగనున్నది.

తా.—సూర్యుఁడు తామరపుష్పమును నీటినెడబాసినయెడ నశింపఁజేసినవిధము గ, సకలాత్మ సంరక్షకుఁడగు సర్వేశ్వరుఁడు, ఒకచేతనుఁడు తన ఆచార్యవిషయము నందు ప్రేమలేనివాడైయుండెనేని నశింపఁజేయునని.

॥నారాయణోపివికృతిం యాతిగురోః ప్రచ్యుతస్యదుర్బుద్ధేః। కమలంజలాదపేతం శోషయతిరవిర్న తోషయతి॥

౩౬. విల్లార్‌మణికొழிక్కుమ్ వేఙ్గడప్పొఱ్ఱుమదల్,
శెల్లార్‌పొழிల్‌శూழ్ తిరుప్పదిగళ్ శెల్లామ్,
మరుళామిరుళోడమత్తగత్తుత్తన్తాళ్,
అరుళాలేవైత్తవవర్.

టీ.—విల్ ఆర్ - ప్రకాశముగల, మణి - రత్నములను, కొళిక్కుమ్ - సెలయేళ్లఅలలు గట్టునందు చేర్పునట్టి, పొన్ - రమ్యమైన, వేజ్గడమ్ ముస్తమదల్ - వేఙ్కటాచలము (తిరుమల) మొదలుకొని, శెల్ ఆర్ - మేఘములు పొందియుండు, పొళి ల్ - తోటలచే, శూళ్ - చుట్టఁబడియుండు, తిరుప్పదిగళ్ ఎల్లామ్ - దివ్యదేశములన్నియును, మరుళ్ ఆమ్ - భ్రిమనుగలుగఁజేయు, ఇరుళ్ - అజ్ఞానమను-చీకటిని,ఓడపరుగి డునట్లు, మత్తగత్తు - తనయొక్క తలయందు, తన్ దాళ్ - తనయొక్క శ్రీపాదములను, అరుళాలే - కృపచేత, వైత్తఅవర్-ఉంచి కృపచేసిన ఆచార్యులే అగుదురు.

తా.—శ్రీవేఙ్కటాద్రి (తిరుమల) మొదలుకొని సమస్తదివ్యదేశములును, ఈ చేతనునికి జ్ఞానమను నేత్రమునిచ్చి అజ్ఞానమను చీకటిని బోగొట్టి రక్షించిన ఆచార్యులే అగుదురని.

॥యేనైవ గురుణాయస్యన్యాస విద్యాప్రదీయతే | తస్యవై కుణ్ఠదుర్గాభి ద్ద్వారకా స్సర్వఏవసః॥

౩౭. పొరుళ్మయిరుముడమ్బుమ్ పుగలుమ్,
తెరుళుమ్కుణముమ్శెయలుమ్,అరుళ్పురిన్ద
తన్నారియర్కాపొరుట్టాచ్చజ్గఱ్పఞ్జెయ్బవర్ నెఞ్జు,
ఎన్నాళుమాలుక్కిడమ్.

టీక.—పొరుళుమ్- తనయొక్క సమ్పదయును, ఉయిరుమ్-ప్రాణమును, ఉడమ్బుమ్ - తనయొక్క దేహమును, పుగలుమ్ - తనయొక్కగృహమును, తెరుళుమ్-తనయొక్కజ్ఞానమును, కుణముమ్ - తనయొక్క శమాదిగుణములును, శెయలుమ్ - తనయొక్కనడవడిక మొదలగు సర్వమును, అరుళ్ పురిన్ద - తనవిషయమై కృపచేసిన, తన్ ఆరియర్ పొరుట్టాయ్ - తనయొక్క ఆచార్యుని నిమిత్తముగ, శజ్గఱ్పమ్- సంకల్పము, శెయ్బవర్ - చేయువారియొక్క, నెఞ్జు - హృదయమైనది, మాలుక్కు - శ్రియఃపతికి, ఎన్నాళుమ్ - ఎల్లప్పుడును, ఇడమ్ - వాసస్థానమగును.

తా.—సర్వేశ్వరుఁడు, తనఅర్థప్రాణాదులు సర్వమును నిర్హేతుకకృపచే,తన్నంగీకరించి రక్షించిన ఆచార్యులకొఱకేయని తలచువారియొక్కహృదయమందు వసించునని.

జయసంహితయందు-శ్రీవరాహ నాయనారుఅనతిచ్చినది॥ శరీరం వసువిజ్ఞానంవాసః కర్మగుణానసూన్ |గుర్వర్థంధారయేద్యస్తు సశిష్యోనేతరస్మృతః॥(జయసంహితాయామ్ ॥గుర్వర్థం స్వాత్మనః పుంసః కృతజ్ఞస్యమహాత్మనః | సుప్రసన్నస్సదావిష్ణుర్హృదితస్య విరాజతే॥

౩౯. తేనార్కమలత్తిరుమామగళ్కొழுనన్,
తానేకురువాగి,త్తన్నరుళాల్,మానిడర్కా-
ఇన్నిలత్తేతోన్ఱుదలాల్,
యార్క్కుమవన్తాళిణైయైయున్నువదేశాలవురుమ్.

టీక.— తేన్ఆర్ - తేనె పొందియుండు, కమలమ్ - తామరపుష్ప మందుండు, తిరుమామగళ్ కొழுనన్ తానే- శ్రియఃపతితానే,కురుఆగి- ఆచార్యులై,తన్ అరుళాల్ - తనయొక్క కృపచేత, మానిడర్క్కు - మనుష్యులకని, ఇన్నిలత్తే - ఈభూమియందు, తోన్ఱుదలాల్ - అవతరించుటచే, అవన్ - ఆయాచార్యులయొక్క, తాళ్ ఇణైయై - శ్రీపాదములను రెంటిని, ఉన్నువదే - ధ్యానించుటయే, యార్క్కుమ్-అందతికిని, శాలఉఱుమ్ - మిక్కిలి స్వరూపమునకు చేరియుండును.

తా.—శ్రియఃపతియే ఈభూమియందలి చేతనులకొఱకై ఆచార్యులై అవతరించుటచే ఆయాచార్యశ్రీపాదధ్యానమే అందతికిని స్వరూపానుగుణమైనదని.

జయాఖ్యసంహితయందు- శాణ్డిల్యుడువచించినది॥ సాక్షాన్నారాయణోదేవః కృత్వామర్త్యమయీంతనుమ్। మగ్నానుద్ధరతేలోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా। తస్మాద్భక్తిర్గురౌకార్యాసంసారభయభీరుణా।)

౩౯. అలన్గైములై శువైత్తార్క్కన్బరడిక్కన్బర్,
తిలదమెన,త్తిరివార్తమ్మై, ఉలగర్పழி
తూశ్శిల్ తుదియాగుమ్, తూశ్శాదవరివరై,
ప్పేశ్శిలదుపున్మైయేయామ్.

టీక.—అలన్గై - పూతనయొక్క, ములై - విషమిశ్రమైన స్తన్యమును, శువైత్తార్క్కు - తననోటిచే నాస్వాదించిన సర్వేశ్వరునికి, అన్బర్ అడిక్కు - భక్తులైనవారియొక్క శ్రీపాదములకు, అన్బర్ - భక్తులై, తిలదమ్ఎన - లోకమునకు తిలకమువలె, తిరివార్తమ్మై - సఞ్చరించువారిని, ఉలగర్ - లౌకికజనులు, పழி - నింద్యమగు వచనములచే, తూశ్శిల్ - దూషించిరేని, తుది - స్తోత్రము, ఆగుమ్ - అగును, తూశ్శాదు - అట్లుదూషింపక, అవర్ - ఆలౌకికులు, ఇవరై - ఈభక్తులను, పేశ్శిల్-స్తుతించిరేని, అదు - ఆస్తుతి, పున్మైయే - చెడుగే,(నిన్దయే) ఆమ్ - అగును.

తా.—పూతనయొక్క విషముతోఁ గలిసిన చనుపాలను ద్రాగిన సర్వేశ్వరుని యొక్క భక్తులకు భక్తులైనవారిని, లోకులు దూషించినయెడ స్తోత్రమును, స్తుతించినయెడ నిన్దయునగునని.

॥ వ్యాసవిద్యైకనిష్ఠానాం వైష్ణవానాం మహాత్మనామ్ । ప్రాకృతాభిష్టుతిర్నిన్దా నిన్దాస్తుతిరితిస్మృతా॥

౪౦. అల్లిమలర్ప్పావైక్కన్బరడిక్కన్బర్,
శొల్లుమవిడుశురుదియామ్, నల్ల
పడియామ్మనునూర్క్కవర్ శరిదై,
పార్వై శెడియార్ వినైత్తొగైక్కుత్తీ.

టీక.—అల్లిమలర్-తామరపుష్పవాసినియగు, పావైక్కు-శ్రీమహాలక్ష్మియొక్క, అన్బర్ - ప్రీతికి విషయభూతుడగు సర్వేశ్వరునియొక్క, అడిక్కు - శ్రీపాదములకు, అన్బర్ - భక్తులగువారు, శొల్లుమ్ - వచించునట్టి, అవిడు - వినోదవార్త, శురుదిఆమ్- వేదమువలె నిర్దోషమగును, మనునూల్ క్కు - మనుధర్మశాస్త్రమునకు, అవర్ శరిదై- ఆభక్తులవైభవమైనది, నల్ల పడియామ్ - మంచిమూలమైయుండును, పార్వై - వారి కటాక్షమైనది, శెడి ఆర్ - పొదవలెనుండెడు, వినైత్తొగైక్కు - పాపసమూహమున కు, తీ-అగ్నియగును.

తా.—భగవద్భక్తులు వేడుకగా నొకవార్త అనతిచ్చిరేని అది వేదవాక్యమువంటిది అగును, ఆభక్తులయొక్క వైభవము మనుధర్మశాస్త్రమునకు మూలమై యుండును, వారికటాక్షము పాపరాశికి అగ్నియగునని.

॥ వేదశాస్త్రరథారూఢాః జ్ఞానఖడ్గధరాద్విజాః । క్రీడార్థమపియద్బ్రూయుస్సధర్మః పరమోమతః॥' , వాసుదేవంప్రపన్నానాం యాన్యేవచరితానివై । తాన్యేవ ధర్మశాస్త్రాణి త్యేవంవేదవిదోవిదుః॥ ' ' నశుద్ధ్యతి తథాజన్తుస్తీర్థవారిశతైరపి । లీలయైవయథాభూప వైష్ణవానాంహివీక్షణైః॥

అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్ తిరువడిగళేశరణమ్.

జ్ఞానసారమ్ సంపూర్ణము.

---

శ్రీమతేరామానుజాయనమః.

# ప్రమేయసారము.

తనియన్.

నీళ్గామ లెన్నుమ్నినైత్తుత్తొయ్యుమినిగళ్ నీణిల త్తీర్,
పాజ్గాగనల్లప్పిరమేయసారమ్పరిన్దళిక్కుమ్,

పూఙ్గావళమ్పొழిల్ శూழ్ పుదై వాழுమ్పుదుప్పూళిమన్,
ఆఙ్గారమఱ్ఱ అరుళాళమామునియమ్బదమే.

టీక.— నీళ్ నిల త్తీర్ - గొప్పభూలోకమందుండువారలారా! పాఙ్గు అన-స్వరూపమునకుదగిన, నల్ల - హితరూపమైన, పిరమేయసారమ్ - ప్రమేయసారమనుప్రబన్ధమును, పరిన్దు - ప్రీతిపూర్వకముగ, అళిత్త - కృపచేసాదించిన, పూమ్కా - పుష్పపుతోటలును, వళమ్పొழிల్ - సమృద్ధముగునితరమైనతోటలును, శూழ் - చుట్టియుండెడు, పుదై - స్థానమందు, వాழுమ్ - వాసముచేయుచుండు, పుదుప్పూళిమన్ - పుదుప్పూళి అను నగరమునకు నిర్వాహకులై, అఙ్గారమ్ - అహఙ్కారమనునది, అఱ్ఱ - కొంచెమైనను లేని, అరుళాళమాముని - అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్లయొక్క, అమ్-సున్దరమైన, పదమ్ - శ్రీపాదపద్మములను, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, నీఙ్గామల్ - ఎడబాయక, నినైత్తు - తలచి (ధ్యానించి), తొழுమిన్గళ్ - నమస్కరింపుడు.

తా.— ఓచేతనులారా! ఆత్మహితమైన ప్రమేయసారము అను ప్రబన్ధమునుఅనుగ్రహించినవారును "పుదుప్పూళియను నగరమందు నివసించుచు ఆనగరమునకు నిర్వాహకులును, లేశమైనను అహఙ్కారమనునది లేని అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్లయొక్క శ్రీపాదపద్మములనుధ్యానించి నమస్కరింపుడని.



## అవతారిక.

సకలశాస్త్రనిపుణులై స్వరూపజ్ఞులలో నగ్రగణ్యులై సంసారిచేతనోజ్జీవనకాములై, తమ్మఙ్గీకరించిన ఎమ్బెరుమానార్లపాదారవిన్దములందు చిరకాలము సేవయొనర్చుచు సకలార్థములను చరమపర్వపర్యన్తముగ వారానతీయగవిని తన్నిష్ఠులైయుండు అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్లు, తమపరమకృపచే సకలశాస్త్రసంగ్రహమగు తిరుమంత్రముచేప్రతిపాదింపఁబడు ప్రమేయములలోని సారాంశమును సంగ్రహించి ప్రమేయసారముఅను నీగ్రంధమును అనతిచ్చిరి.

———:0:———

౧-పా-అ— తిరుమన్త్రమునకు సంగ్రహమగు ప్రణవముచే ప్రతిపాదింపఁబడునట్టి ప్రమేయమందలి సారాంశమును అనతిచ్చుచున్నారు.

౧ శ్రీః అవ్వానవరుక్కుమవ్వానవరెల్లామ్,
ఉవ్వానవరడిమైయెన్ఱురైత్తార్, ఇవ్వాఱు
కేట్టిరుప్పార్కాళెన్ఱుకణ్డిరుప్పార్, మీట్చియల్లా
నాట్టిరుప్పారెన్ఱిరుప్పన్నాన్.

టీక.— అఆనవరుక్కు-అకారముచేఁజెప్పఁబడు సర్వేశ్వరునికి, మ ఆనవరెల్లా మ్ - మకారముచేఁజెప్పఁబడు జీవాత్మలంతయును, అడిమైయెన్ఱు - దాసులని, ఉ అన వర్ - ఉకారవాచ్యసంబన్ధముగల ఆచార్యులు, ఉరైత్తార్ - ఆనతిచ్చిరి, ఇ ఆఱు-ఈ విధమును, కేట్టు - విని, ఇరుప్పార్కు - తన్నిష్ఠులైయుండువారికి, ఆళ్ ఎన్ఱు -దాసులు అని, కణ్డు - తమ్మును గుర్తెఱిగి, ఇరుప్పార్ - ఉండువారలు, మీట్చియిల్లా - మరల జన్మాదులులేని, నాట్టుఇరుప్పార్ - పరమపదమందు ఉందురు, ఎన్ఱు - అని, నాఞ్-దా సుడను, ఇరుప్పేన్ - ఉందును.

తా.— అకారవాచ్యుడగు సర్వేశ్వరునికి మకారవాచ్యులగు జీవాత్మలు దాస భూతులని ఉకారవాచ్యురాలును ఘటకురాలునునగు శ్రీమహాలక్ష్మియొక్క తిరువడి సమ్బన్ధముగలిగిఘటకులునైయుండు ఆచార్యులు ఆనతిచ్చిరి. ఈపద్ధతినివిని ఈనిష్ఠయందు నిలిచియుండువారికి తమ్మును దాసభూతులనియెంచియుండు మహనీయులు పునరావృత్తి లేని పరమపదమందు నివసింతురని దాసుడు తలచియుండునని.

౨. కులమొన్ఱుయిర్ పలతజ్గుళ్ నల్వినైయాలిట్ట,
కలమొన్ఱుకారియముమ్ వేఱామ్, పలమొన్ఱు
కాణామైకాణుమ్కరుత్తార్ తిరుత్తాళ్ గళ్,
పేణామైకాణుమ్పిழை.

టీక.—కులమ్ - భాగవతకులము, ఒన్ఱు - ఒకటియేయగును, ఉయిర్ - జీవా త్మలు, పల - అనేకమగును, తమ్కుళ్ నల్వినైయాల్ - తాముచేసిన పుణ్యపాపరూపకర్మముల చే, ఇట్ట-ఈశ్వరుఁడుంచియున్న, కలమ్ఒన్ఱు - శరీరములన్నియును ఒక్కప్రకృతిచేతనే గలిగినవి, కారియముమ్ వేఱుఆమ్ - చేయునట్టికార్యములు భేదమునొందినవియైయుం డును, ఫలమ్ - ప్రయోజనము, ఒన్ఱు - ఒకటినిన్ని, కాణామై - ఎదురుచూడక, కా ణుమ్ - శిష్యునికటాక్షించునట్టి, కరుత్తార్ - దివ్యహృదయముగల ఆచార్యునియొక్క, తిరుత్తాళ్ గళ్ -శ్రీపాదములనుగూర్చి, పేణామై-భక్తిచేయకుండుటయే,పిழை-అపచారము (దోషముఅని) కాణుమ్ - తెలిసికొనుడు.

తా.— కులమంతయును భగవత్సంబన్ధముగలది ఒకటియే, జీవాత్మలు అనేకము లు, చేతనులుచేసిన పుణ్యపాపరూపకర్మములచే ఈశ్వరుడిప్పించిన దేహములన్నియును పంచభూతాత్మకములేఅగును, కర్మానుగుణముగచేయునట్టి కార్యములును వ్యత్యస్తము లైయుండును, ఫలాపేక్షలేక శిష్యునికటాక్షించునట్టి దివ్యహృదయముగల ఆచార్య శ్రీ పాదములందు భక్తిలేకుండుట దోషమని తెలిసికొనుడని.

3. పలజ్గొణ్డుమీళాదపావముళదాగిల్,
కులజ్గొణ్డుకారియమేణాకూఱీర్, తలజ్గొణ్డ
తాళిణై యానన్తేతనై యొళ్ఱిన్దయావరైయుమ్,
ఆళుడై యానన్తేయవర్‌.

టీక.— అవర్ - ఆసర్వేశ్వరుఁడు, తలమ్ - భూమిని, కొణ్డ - కొలిచి స్వాధీనముచేసికొనిన, తాళ్ ఇణైయాన్ అన్తే - రెండుశ్రీపాదములుగలవాడుగదా, తన్నైయొళ్ఱిన్ద - తన్నుదప్ప, యావరైయుమ్ - సకలాత్మలను, ఆళ్ ఉడైయాన్ అన్తే - తనకుశేషభూతులనుగగలవాడుగదా, (ఇట్లుండగ) పలమ్ - అల్పప్రయోజనములను, కొణ్డు - అపేక్షించుకొనుచు, మీళాద - ఆయపేక్షలోనుండితిరుగని, పావమ్-పాపవిశేషములు, ఉళదు ఆగిల్ - ఒకనికి ఉన్నట్టాయెనేని, కులంకొణ్డు-వాడుప్రపన్న కులమందున్నమాత్రముచేత, కారియమ్ ఎన్ - ప్రయోజనమేమియగును, కూఱీర్ - దీనిని జెప్పుడు.

తా.— ఆసర్వేశ్వరుఁడు త్రివిక్రమావతారమున తమతిరువడిగళుచే ఈభూమినంతయును కొలిచి స్వాధీనపఱచుకొనుటచే వాఁడే సర్వశేషియని ఈ చేతనులకు దెలిసి వానితిరువడిగళులో ప్రపత్తి చేసియును సామాన్యవిషయములందపేక్షవదలకుండిరేని ఫలమేమియున్నది వచింపుడని.

౪. కరుమత్తాల్ ఞానత్తాల్ కాణుమ్వగై యున్డే,
తరుమత్తాలన్ది యిణైతాళ్గళ్, ఒడుమత్తాల్
మున్నీర్ కడైన్దానడైత్తాన్ముదల్ పడైత్తాన్,
అన్నీరమర్న్దానడి.

టీక.— ఇణైతాళ్గళ్ - సర్వేశ్వరుని శ్రీపాదములందు, తరుమత్తాల్ అన్ది - చేయునట్టి శరణాగతి ధర్మముచేత నేతప్ప, ఒరుమత్తాల్ - మందరపర్వతమను ఒకకవ్వముచే, మున్నీర్ - (ఏటిజలము ఊటజలము వర్షజలము) అను మూడువిధములైన జలములుగల సముద్రమును, కడైన్దాన్ - మథనముచేసినవాఁడును, అడైత్తాన్ - కొండలనుగొని సేతువునుగట్టినవాఁడును, ముదల్-సృష్టికాలమందు, పడైత్తాన్ - సృష్టించినవాఁడును, అన్నీర్ - ఆజలమునందు, అమర్న్దాన్ - శయనించియుండు సర్వేశ్వరునియొక్క, అడి - తిరువడిగళను, కరుమత్తాల్ - కర్మయోగముచేనైనను, ఞానత్తాల్-జ్ఞానయోగముచేనైనను, కాణుమ్- చూచునట్టి, వగై - ప్రకారము, ఉన్డే - కలదా.

తా.— సముద్రమును సృష్టించినవాడును మథనముచేసినవాఁడును, సేతుబన్ధనముచేసినవాఁడును, అందు శయనించియుండువాడునగు, సర్వేశ్వరునియొక్క తిరువడిగ

కను ప్రపత్త్యుపాయముచేత తప్ప కర్మాద్యుపాయములచేత సేవించునట్టివిధము సకలవిధముల ప్రయాసకరమును స్వరూపవిరుద్ధమును అయినదని.

౫. పఱ్ఱియావదొన్ఱెన్ఱాల్ మఱ్ఱవైయుమ్మఱ్ఱుమ్,
మొఱ్ఱియావదొన్ఱిన్ఱాలోమెన్ఱిఱ్ఱియాదే,
ఇత్తలైయాలేదుమిల్లైయెన్ఱిరున్దదుదాన్,
అత్తలైయాల్ వన్దవరుళ్.

టీక.—పఱ్ఱియావదు - ఉపాయమైనది, ఒన్ఱెన్ఱాల్ - ప్రపత్త్యుపాయమగునది ఒకటిరే అగుననినను, మఱ్ఱవైయుమ్మఱ్ఱుమ్ - ఇతర ఉపాయములగు కర్మజ్ఞానభక్తులనన్నిటిని, ఒఱ్ఱియ - పరిత్యజించి, అదు - ఆప్రపత్త్యుపాయమైనది, ఒన్ఱెన్ఱాల్ - చేతనులయొక్క స్వీకారమందు ఉపాయబుద్ధినిన్ని సహింపగూడనివిధముగ అద్వితీయమనిన, ఓమ్‌ఎన్ఱు - సమ్మతించి, ఇఱ్ఱియాదే - అందుప్రవేశింపక, ఇత్తలైయాల్ - ఈచేతనులచే, ఏదుమ్ - ఒకమేలును, ఇల్లైయెన్ఱు - లేదని, ఇరున్దదుదాన్ - తననిర్హేతుకస్థితిని అనుసన్ధించుకొనుచున్న ఆయునికిరయే, అత్తలైయాల్ - ఆసర్వేశ్వరునిచే, వన్ద - నిర్హేతుకముగవచ్చిన, అరుళ్ - కృపాఫలమగును.

తా.— ప్రపత్త్యుపాయము ఒకటియే ఉజ్జీవనమునకుచాలునని ఇతరోపాయములనన్నిటిని పరిత్యజించి, ఆప్రపత్త్యుపాయమునందును ఉపాయబుద్ధిగూడదనిన; అట్టిబుద్ధినివదిలి, ఈచేతనుడు తనయందు గుణలేశములేదని తన ఆకిఞ్చన్యమును అనుసన్ధించునట్టిదశ గలిగినేని అది ఆసర్వేశ్వరునియొక్క కృపాఫలమని.

౬. ఉళ్ళపడియుణరిలొన్ఱునమక్కుణ్డెన్ఱు,
విళ్ళవిరగిలదాయ్‌విట్టదే, కొళ్ళ
క్కుఱైయేదుమిల్లాక్కుఱ్ఱమఱ్ఱవర్గళ్ కొళ్ళార్,
ఇఱైయేదుమిల్లాదయామ్.

టీక.— ఉళ్లపడి - స్వరూపముయొక్కవాస్తవస్థితిని, ఉణరిల్ - తెలిసికొన్నయెడ, నమక్కు - మనకు, ఒన్ఱుఉణ్డెన్ఱు - పురుషార్థమునకు సాధకమగునది యొకటిగలిగియున్నదని, విళ్ల - తలచుటకు, విరగు - మార్గము, ఇలదు ఆయ్‌విట్టదే - లేకపోయినదే, కొళ్ల - ఇతరులయొద్దనుండి తాను గ్రహింపవలసినట్లు, కుఱైఏదుమ్ - కొఱతయేదియు, ఇల్లార్‌క్కు - లేనివాడై నిరపేక్షుడైనవానికి, ఇఱైయేదుమ్ ఇల్లాదయామ్ - కొంచెమైనను (మనదిఅనుటకు) ఒకటియును లేనిమనము, కూఱువదు - చెప్పునది, ఎన్ - ఏమియున్నది, కొళ్లీర్ - దీనిని గుర్తెఱిగి చెప్పుదురుగాక.

తా.— స్వరూపస్థితిని గుర్తెరిగినయెడ మనకు పురుషార్థమునకు సాధక మొకటియు నులేదు. ఇతరులయొద్దనుండి తాను పుచ్చుకొనవలసినకొఱత యేదియులేనివానికి ఆకిఞ్చన్యులగు మనము చెప్పవలసినది ఏమియున్నది చెప్పుడని.

౭. ఇల్లైయిరువర్కు మెన్ఱిఱైయై వెన్ఱిరుప్పార్,
ఇల్లైయోఁదారువర్కెట్టుమదో, ఇల్లై
కుఱ్ఱైయుడై మైదానెన్ఱుకూఱినారెల్లామ్,
మఱ్ఱైయుడై యమార్క్కత్తేకాణ్.

టీక.— ఇరువర్కుమ్ - చేతనేశ్వరులిద్దఱికిని, ఇల్లైఎన్ఱు - ఒక లేమిడిగలదని అనుసన్ధించి, ఇఱైయై - సర్వేశ్వరుని, వెన్ఱుఇరుప్పార్ ఇల్లై - స్వతంత్రతనువిడిచి పరతంత్రుడైవచ్చి నిలుచునట్లుజయించియుండువారలేరు. అంఁదు - ఆయనుసన్ధానము, ఒరువర్కు - ఒకరికి, ఎట్టుమదో - అందునో (అతిదూరమనిభావము), ఇల్లైకుఱ్ఱైయుడైమైతాన్ ఎన్ఱు - ఈశ్వరునికిచేతనునియొద్దనుండి పుచ్చుకొనవలసియుండునట్టికొఱతయేదియునులేదు, చేతనుడు ఈశ్వరునికి ఇచ్చునదియొకటియునులేదు అని, కూఱినార్ఎల్లామ్ - చెప్పినవారినందఱిని, మఱైఉడైయమార్క్కత్తే - వేదమార్గమునందు, కాణ్ - చూచుకొనుము.

తా.— ఈచేతనేశ్వరుల కిద్దఱికిని ఒకలేమిడిగలదని అనుసన్ధించి, సర్వేశ్వరుని జయించినవారలేరు అనునది ఒకచేతనునికి సులభముగదెలియనగునో, ఈశ్వరునికిఒకకొఱతయును లేదు, ఈశ్వరునికిచ్చుటకు చేతనునికి తనదియనియొకటియును లేదు, అనిచెప్పుటయంతయును వేదమార్గమునుపట్టియే చూడుడని.

౮. పిత్తమిఴవిన్బమ్తున్బమ్నోయ్వీకాలమ్,
తత్తమిఱై యేతలై యళిక్కుమ్, అత్తైవిడీర్
ఇచ్చియానిచ్చియాదేత్తవెళ్గిల్ వానత్తు,
ఉచ్చియానుచ్చియానామ్.

టీక.— పిత్తమ్ - ధనము, ఇఴవు - (అది) నశించుట, ఇన్బమ్-సుఖము, తున్బమ్ - దుఃఖము, నోయ్ - వ్యాధి, వీకాలమ్ - శరీరముయొక్క వినాశమునగువీనిని, తత్తమఱైయే - తమతమకర్మమే, తలైఅళిక్కుమ్ - అధికారియైయుండి యిప్పించును, అత్తైవిడీర్ - ఆకర్మమునువిడువుడు, ఇచ్చియాన్ - ప్రయోజనాన్తరములను ఇష్టపడనివాడు, ఇచ్చియాదు -ఒకఫలమునుగోరక, ఏత్త-స్తోత్రముచేయగ (ఆచేతనుడు) ఎళ్గిల్-

రమ్యమైన, వానత్తుఉచ్చియార్ - పరమపదమునందలి ఉన్నతస్థానమందుండు సర్వేశ్వరునియొక్క, ఉచ్చియార్ అమ్ - శిరస్సుచేవహింపదగినవాడగును.

తా.— ఐహికమగు సుఖదుఃఖములు సర్వమును కర్మానుగుణమగుటచే అకర్మమును విడువుడు, అన్యప్రయోజనాపేక్షలేనిచేతనుఁడు ఫలాపేక్షలేక భగవన్తునిస్తుతింపగ అశ్రీవైకుణ్ఠనాథునిచే మిగుల నాదరణీయుడగునని.

౯. తత్తమిత్తైయిన్వడివెన్తుతాళ్ణైయై,
వైత్తవవరైవణఙ్గియిర్గాప్పిత్తరాయ్,
నిన్దిప్పార్కృణ్డెత్తానీళ్నిరయమ్, నీదియాల్
వన్దిప్పార్కుణ్డిళియావాన్.

టీక.— తాళ్ ఇణైయై - తిరువడిగళను, వైత్తఅవరై - తమశిరస్సునందుంచిన ఆచార్యులను, తత్తమ్ - తమతమయొక్క, ఇత్తైయిన్ - దైవముయొక్క, వడివు ఎన్తు - స్వరూపము అని, వణఙ్గియిరా - వన్దనమొనర్చియుండని, పిత్తరాయ్ - చిత్తచాంచల్యముగలవారై, నిన్దిప్పార్కు - దూషించువారికి, ఏత్తా - గట్టుయొక్కటకు వల్లపడని, నీళ్ - గొప్పదైన, నిరయమ్ - నరకమైనది, ఉణ్డు - కలుగును, నీదియాల్ - క్రమపద్ధతిచే, వన్దిప్పార్కు - స్తోత్రముచేయువారికి, ఇళియా - జననమరణాది దుఃఖములకై మరలరాని, వాన్ - పరమపదము, ఉణ్డు-కలుగును.

తా.— స్వాచార్యులను తమదైవస్వరూపమని పూజింపక, చపలచిత్తులై దూషించువారికి ఏనాటికినిసద్గతికి దారిలేని క్రూరనరకము సంభవించును, సక్రమముగస్తుతించు వారికి పునరావృత్తిలేని పరమపదము గలుగునని.

౧౦. ఇత్తైయుమ్మయిరుమిరువర్కుముళ్ళ
ముత్తైయుమ్, ముత్తైయేమొళ్ళియుమ్, మత్తైయు
మణర్త్తువార్ల్లానాళొన్త్తల్ల, అన
వుణర్త్తువారుణ్డానపోదు.

టీక.— ఇత్తైయుమ్ - సర్వేశ్వరుఁడును, ఉయిరుమ్ - జీవాత్మయును, ఇర్వర్ కుమ్ ఉళ్ల - (అయినట్టి) ఇరువురికినిగలిగియుండు, ముత్తైయుమ్ - సమ్బన్ధము ముత్తైయే - ఆసంబన్ధమును క్రమముగ, మొళియుమ్ - ప్రతిపాదించునట్టి, మత్తైయుమ్ - వేదరూపమగుతిరుమంత్రమును, ఉణర్త్తువార్ - తెలియఁజేయువారు, ఇల్లనాళ్ - లేనిదినమైనది, ఒన్తుఅల్ల - ఒకదినముగలెక్కింపఁబడదు, ఉణర్త్తువార్ - తెలిపెడువారు, ఉణ్డానపోదు - కలిగినదినము, అన - ఒకదినము అగును. సులభగ్రాహ్యమగు

తా.— జీవాత్మపరమాత్మలును శేష శేషి భావమును తదుభయసంబన్ధమును అసంబన్ధమును ప్రతిపాదించునట్టి తిరుమంత్రమును, తెలియపఱచునట్టి ఆచార్యులుగలిగియున్న దినమేదినముగాని తదితరకాలము వ్యర్థమని.

ప్రమేయసారము సంపూర్ణము.

ఆరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్ తిరువడిగళేశరణమ్, జీయర్ తిరువడిగళేశరణమ్.

---

శ్రీమతేరామానుజాయనమః.

విళాన్‌శోలైప్పిళ్లైఅనతిచ్చిన

# సప్తగాధ.

తనియన్.

వాழ్షినలన్దిగழுనారణతాదర్అరుళ్,
వాழ்షి, యవన్నముదవాయ్‌మొழிగళ్, వాழ్షియే,
ఏழுతిరువుడైయాన్నెన్నుముల గారియన్‌శొల్,
తేழுతిరువుడైయాన్‌శీర్.

టీక.— నలమ్ - ఆనన్దము, తిగழுమ్ - ప్రకాశించుచున్న, నారణతాదర్ - నారాయణదాసులయొక్క, అరుళ్ - కృపయైనది, వాழ్షి - సుఖముగవర్ధిల్లవలయును అవన్ - వారియొక్క, అముదమ్ - అమృతమువంటి, వాయ్‌మొழிగళ్ - వచనవిశేషములు, వాழ్షి..., ఏழு - అభివృద్ధినొందునట్టి, తిరు - భగవద్భాగవతాచార్యగుణానుభవకైఙ్కర్యరూపసంపద, ఉడైయాన్ - కలవారై, ఎన్నుమ్ - ఎల్లప్పుడును, ఉలగారియన్‌శొల్ - పిళ్లైలోకాచార్యులయొక్క శ్రీసూక్తులను, తేழு - సన్దేహవ్యత్యాసములు లేక, గుఱ్తెఱిగియుండు, తిరు - ఆచార్యాభిమానమను సమ్పదను, ఉడైయాన్ - కలిగియుండువిళాన్ శోలైప్పిళ్లగారియొక్క, శీర్ - వైభవము, వాழ்షి - సుఖముగవర్ధిల్లవలయును.

తా.— మిక్కిలి ప్రకాశించుచుండు జ్ఞానానన్దములుగలిగి నారాయణదాసులు అను తిరునామముగల విళాంశోలైప్పిళ్లగారియొక్క కృపయైనది వర్ధిల్లవలయును, వారియమృతవచనములును, అభివృద్ధినిబొందుచుండు భగవత్సంబన్ధాది సమ్పదగలిగి (సదా) పిళ్లైలోకాచార్యులసన్నిధిని సంశయవ్యత్యాసములులేక సమస్తార్థవిశేషములను గుఱ్తెఱిగి

ఆచార్యాభిమాన సమ్ప్రదాయము గలిగియుండు విళాంఞ్చోలైప్పిళ్లగారియొక్క వైభవమును నిత్యాభివృద్ధితో నుండవలయునని.

## అవతారిక.

సకలలోకములకును ప్రాణభూతుడగు సర్వేశ్వరుఁడు (శ్రీరఙ్గనాథుఁడు) సహితము జ్ఞానియైనవానిని తనకు ప్రాణస్థానముగ, అనతిచ్చినవిధముగ, మిగులధారకులైయుండి సకలమైనవారును ఉజ్జీవించునట్లు హస్తిగిరినాథుడగు తేవప్పెరుమాళ్లయొక్క అనుమతిపూర్వకముగ ప్రబన్ధీకరించి కృపచేసిన శ్రీవచనభూషణప్రముఖ నిఖిలరహస్యప్రబన్ధముల మూలముగ చరమప్రమాణప్రమేయ ప్రమాతృవైభవములను పరమకృపచే అనతిచ్చిన పిళ్లైలోకాచార్యులయొక్క తిరువడిగళనాశ్రయించి అవతార విశేషమగువారియొక్క కటాక్షముచే భగవద్విషయాది సకల రహస్యతాత్పర్యార్థములను సంశయవిపర్యయములు లేకుండునట్లు అధికరించి కృతార్థులై, ఉడైయవరులకు పిళ్లైయురంగావల్లిదాసుల వలె పిళ్లైలోకాచార్యులకు ఆత్మసములును ప్రాణసములును దృష్టిసములును బాహుసములును ఆభరణసములును పాదరేఖాసములునైనవారై (భ్రంశసంభావన) తక్కువస్థితికిపోవుదురని భావింపవలసినది లేని, ఉత్కృష్టజన్మమునందు అవతరించునట్లు లభించుటచే సహజదాస్యమునుగలవారై, తిరువాయ్‌మొళిప్పిళ్లగారు సహితము తమయొద్దకు వేంచేసి చరమార్థవిశేషములను లభించునట్లు మిక్కిలి సర్వజ్ఞులై, యాగానుయాగోత్తర వేదులయందు కాయాన్నస్థలశుద్ధియొనర్చిన వృద్ధాచారమును గుర్తెఱిగియుండు మహనీయులచే సర్వకాలములందును మంగళాశాసనముచేయఁబడువారై స్వాచార్యులగు పిళ్లైలోకాచార్యులయొక్క చరమదశయందు శరీరావసానమువఱకు మీరు తిరువనన్దపురమందు నివసింపుడని నియమించుటచే వారినియమనప్రకారముగ అచ్చటికిపోయి,ఆళ్వార్లు "నడమినోన మర్ గళుళ్లీర్" భగవద్భక్తులగు వారు తిరువనన్దపురమునకు పొండని నియమించిన నియమనమునకు లోబడినవారిలో ప్రధానులు అను అతిశయముతో చగ అనన్తపద్మనాభస్వామియొక్క ముఖనాభీపాదములను ద్వారత్రయమూలముగ సేవించి అనుభవించి "వాళమే కమళుఞ్చోలై"సువాసన పరిమళించుచుండుతోటలు అనఁబరగిన ఒకతోటకులోగ నేకాన్తమైయుండు నొకదివ్యదేశవిశేషమందుండి పిళ్లైలోకాచార్యులను పాదాదికేశాన్తముగ ధ్యానించుకొనుచు శ్రీవచనభూషణాద్యఖిల రహస్యతాత్పర్యసారతమార్థ విశేషములనే సర్వకాలమును పరమపదానుభవమువలె ననుభవించుకొనుచుండు విళాంఞ్చోలైప్పిళ్లైవకు శభూషణశాస్త్రసారమై చరమరహస్యమైయుండు శ్రీవచనభూషణ దివ్యశాస్త్రమందు సవిస్తరముగ నానతిచ్చిన అర్థవిశేషములనన్నిటిని సకలమైనవారికిని సులభగ్రాహ్యముగ

నట్లు తమపరమకృపచే సప్తగాథయను ప్రబన్ధరూపముగ నానతిచ్చుచున్నారు. నమ్మాళ్వార్లు ప్రథమపర్వమును "తిరువాశిరియమ్" అను ప్రబన్ధమునందు ఏడుపాశురములచేఁ బ్రకాశింపఁజేసినట్లు వీరును చరమపర్వమును ఈప్రబన్ధమునందుఁ ఏడుపాశురములచే బ్రకాశింపఁజేయుచున్నారు. మఱియును, "సిద్ధిర్భవతివా నేతి సంశయోచ్యుత సేవినామ్- భగవన్తునికిపరిచర్యయొనర్చువారికి మోక్షసిద్ధివిషయమై సన్దేహముండును," అని యానతిచ్చి, "నసంశయస్తుతద్భక్తపరిచర్యారతాత్మనామ్, భగవద్భక్తులకు, పరిచర్యయొనర్చువారికి మోక్షసిద్ధియందు సన్దేహముండదని యానతిచ్చుటచే, తిరువాశిరియముకన్నను సప్తగాథఆధిక్యముగలదై, శ్రీమధురకవులును వడుగనంబియును చరమపర్వమును ఉక్త్యనుష్ఠానములచే విశదపఱచిన విధముగనున్నది.

మొదటిపాశురమునందు తిరుమంత్రము నుపదేశించినవారే సదాచార్యులగుదురని ఆనతిచ్చుచున్నారు.

స ప్త గా థ.

౧. ✿ అమ్పొన్నరఙ్గర్క్కుమావిక్కుమ్, అన్తరఙ్గ -
శమ్బన్దజ్ఞాట్టి తడై గాట్టి, ఉమ్బర్ -
దివమెన్నుమ్ వాழ்వుక్కు చ్చేర్న్ద నెఱిగాట్టుమ్,
అవనన్ఱో వాశారియన్.

టీక.— అమ్ - రమ్యమైన, పొన్ - బంగారుమయముగనుండు, అరఙ్గర్క్కుమ్ - శ్రీరఙ్గధామమందలి సర్వేశ్వరునికిని (శ్రీరఙ్గనాథునికిని) ఆవిక్కుమ్ - ఆత్మలకును, అన్దరఙ్గసమ్బన్ధమ్ - అన్తరఙ్గమైయుండు (వాడు శేషి మనము శేషభూతులము అనునట్టి) నిత్యమైనసమ్బన్ధమును, కాట్టి - తెలియపఱచి, తడై - అసంబన్ధమును తెలియకుండునట్లు చేయువిరోధినిన్ని, కాట్టి - తెలియపఱచి, ఉమ్బర్ - ఉన్నతస్థానవాసులగు నిత్యసూరులయొక్క, దివమ్ఎన్నుమ్-పరమపదమందలి కైఙ్కర్యమని చెప్పఁబడు, వాழ்వుక్కు - సమ్పదకు, శేర్న్ద - తగియుండునట్టి, నెఱి - ఉపాయమును, కాట్టుమ్ - తెలియపఱచునట్టి, అవన్ అన్ఱో - వారుగదా, ఆచారియన్ - ఆచార్యులగుదురు.

తా.— సర్వేశ్వరుఁడగు శ్రీరఙ్గనాథునికిని ఈజీవునికిని, వాడుస్వామి వీడుసొత్తు అను నవవిధ సమ్బన్ధమును ఈసంబన్ధజ్ఞానమునకు ఆటంకముగనుండు విరోధినిన్ని పరమపదమందలి కైఙ్కర్యసమ్పదకు అనుగుణమైన ఉపాయమును, తెలియపఱచినవారు, (అనగా) అర్థపంచకప్రతిపాదకమగు తిరుమన్త్రార్థము నుపదేశించినవారు ఆచార్యులగుదురని.

౨. అఞ్జుపొరుళుమ్మళి త్తవన్బాలన్బిలార్,
నఞ్జిల్ మిగక్కొడియర్నామ్శొన్నోమ్, నఞ్జుదా-
నూనై ముడిక్కుమిఴ్ఞ్జయిరై ముడిప్పరెన్ఱు,
ఈనమిలార్శొన్నారివై.

టీక.— అఞ్జుపొరుళుమ్ - (స్వస్వరూప, పరస్వరూప, పురుషార్థస్వరూప, ఉపాయస్వరూప, విరోధిస్వరూపములగు) అయిదు అర్థములను, అళిత్తవర్బాల్ - ఉపదేశించిన ఆచార్యులవిషయమందు, అన్బిల్లార్ - భక్తిలేనివారు, నఞ్జిల్ - విషముకంటెను, మిగ - మిక్కిలి, కొడియర్ - క్రూరులు అని, నామ్శొన్నోమ్ - మేము చెప్పితిమి, (అయినను) నఞ్జుదాన్ - విషమైనది, ఊనై - శరీరమును, ముడిక్కుమ్-చంపును, ఇవర్ - ఆచార్యవిషయమందు ప్రావణ్యములేనివీరు, ఉయిరై - ఆత్మస్వరూపమును, ముడిప్పర్ - నశింపఁజేయుదురు, ఎన్ఱు - అని, ఇవై - ఈయర్థములను, ఈనమ్ ఇలార్ - తక్కువలేని శిష్టులు, శొన్నార్ - అనతిచ్చిరి.

తా.— అర్థపంచక జ్ఞానమును గలుగఁజేసిన ఆచార్యవిషయమందు ప్రేమలేనివారు విషముకంటె నతిక్రూరులు, విషము దేహనాశకము, ఆచార్యవిషయమందు ఉపకారస్మృతిలేనివారు ఆత్మనాశకులని శిష్టజనులు వచింతురని.

3. పార్త్తకురు విన్కళవిల్పరివిన్ఱి,
శీర్త్తమిగుఞానమెల్లామ్శేర్న్దాలుమ్, కార్త్తగడల్ -
మణ్ణిన్మేల్, తున్బుఱ్ఱుమజ్గుమ్మేతేజ్గామల్, -
నణ్ణుమేకీళ్గానరగు.

టీక.— పార్త్త - తన్నుకటాక్షించిన, కురువిన్ అళవిల్ - ఆచార్యవిషయమందు, పరివుఇన్ఱి - ప్రేమములేక, శీర్త్త - భగవద్విషయమును గుర్తెఱుగుటకు సర్వమును శ్లాఘ్యమునైయుండు, మిగు - అతిశయించిన, ఞానమెల్లామ్ - జ్ఞానమంతయును, శేర్న్దాలుమ్ - ఒకడు లభించినను, కార్త్త - నల్లనిరంగుగల, కడల్ - సముద్రముచే జుట్టఁబడిన, మణ్ణిన్ మేల్ - భూమిమీఁదు, తున్బుఉఱ్ఱు - దుఃఖములనుబొంది, మజ్గుమ్ - నశించును, తేజ్గామల్ - తప్పక, కీళ్ఆమ్ - నింద్యమైన, నరగు - నరకమును, నణ్ణుమ్ - పొందును.

తా.— ఒకచేతనుఁడు భగవద్విషయమును గుర్తెఱుగుటకుదగిన విశేషజ్ఞాన సమ్పన్నుఁడైయుండినను ఆచార్యప్రావణ్యములేనివాఁడయ్యెనేని, ఈభూమియందువ్యసనాక్రాంతుఁడై నశించుటయేగాక తప్పక నరకమును జెందునని.

